# జా టో పెక్

(మేరథాన్ వీరుడు)

రచయిత:

ఫ్రాంటిసెక్ కోజక్

నవోదయ పబ్లిషర్సు, గుడివాడ.

# పరిచయం

ఎమిల్ జటోపెక్‌నుగురించి సాధికారంగా వ్రాయగల్గిన విదేశీ పత్రికా రచయిత ఎవరైనా వున్నాడంటే, అలాంటివాణ్ణి నేనొక్కడినే సని ఘంటాపథంగా చెప్పగలను. ఎందుకంటే మిగతా విదేశీ పత్రికా విలేఖరు లందరికన్నాకూడా నేను ఆయనతో ఎక్కువ సన్నిహితంగా మెలిగాను. ఆయనలోని గుణగణా లన్నింటిని సమగ్రంగా పరిశీలించాను. నా ఆప్త మిత్రులలో జటోపెక్ ఒకడు. ఎన్నో గంటల తరబడి ఆట పాటలను గురించి మే మిద్దరం చర్చించాం. అందువల్ల నాయీ రచన పాఠకుల హృదయాలను గిలిగింతలు పెట్టుతుందనడంలో నా కెట్టిసందేహం లేదు.

అనేక ప్రపంచ రికార్డులను అధిగమించిన జటోపెక్ పరుగెత్తుతుంటే ప్రతివారు ఆ పరుగును నిజంగా స్వయంగా చూసి తీరవలసిందే.

మానవుణ్ణి, కాలాన్నీకూడా జయించిన జటోపెక్ అపూర్వ నైపుణ్యం వర్ణనాతీతం. 1948 లో లండన్‌లో జరిగిన ఒలింపిక్ ఆటల పోటీలలో జటోపెక్ ప్రదర్శించిన అపూర్వ ప్రతిభను ఎవరు మరచిపోగలరు ?

1952 లో హెల్సింకీలో జరిగిన ఒలింపిక్ పోటీలను తిలకించటానికి వేలాది జనానీకం అరుదెంచారు. మేరథాన్ పోటీలో పాల్గొనేందుకు క్రీడాస్థలానికి జటోపెక్ వస్తున్నాడనగానే ప్రేక్షకుల ముఖాలలో ప్రదర్శితమైన ఆతురత, ఉత్సుకత ఇంతా అంతా కాదు. అప్పనుమరి, ఆటల పోటీల చరిత్రలోనే అదొక మహోజ్జ్వల ఘట్టం.

ఒకే వారంలో, జటోపెక్ మూడు ఒలెంపిక్ బంగారు పతకాలను గెల్చుకొన్నాడు. క్రీడారంగ చరిత్రలోనే యిది అద్వితీయం. ప్రపంచ చరిత్రలో జటోపెక్ పేరు చిరస్థాయిగా వెలుగొందక మానదు !

అంతేకాదు.

జటోపెక్ భావాలేమిటి? ఆయన ఆశలూ, ఆశయాలూ ఎలాంటివి? ఆయన గుణగణా లేమిటి? వాటన్నిటిగురించి తెలుసుకోవాలని మీరు తహతహ లాడుతుంటారు. ఇవన్నీకూడా ఈ పుస్తకంలో వివరంగా ప్రస్తావించబడ్డాయి.

చివరకు ఒక్క మాట!

ఛాంపియన్ జటోపెక్‌కన్నా కూడా మానవుడు జటోపెక్ మహోన్నతుడన్న అభిప్రాయం ఈ పుస్తకం చదివిన తర్వాత మీకే కలుగుతుంది.

చదవండి!

ఆర్మర్ మిల్న్,
(ప్రసిద్ధ బ్రిటిష్ క్రీడారంగ వ్యాఖ్యాత).



ఎమిల్ జాటోపెక్

# తొలి రోజులు

అది జులై 27, 1952, ఆదివారం. హెల్సింకీలో 15 వ ఒలింపిక్ ఆటల పోటీల వారపు ఆఖరుదినం.

ఆఖరుసారిగా స్టేడియమ్‌లో ప్రేక్షకస్థానాలన్నీ అమ్ముడయిపోయినవి. ఆశ్చర్యమేమీలేదు. ఎందుచేతనంటే, యీ నాడు మేరథాన్ పందెపు ప్రారంభదినము. శారీరకోర్మిని పరీక్షించు యీమేటి పరుగుపందెపు దూరము 42 కిలోమీటర్ల 195 మీటర్లు (అంటే 26 మైళ్ళ 385 గజాలు); ప్రపంచ ఖ్యాతి పొందిన వారీ పోటీలో పాల్గొందురు; దాదాపు 3 గంటల పరిమితిగల యీ పోటీలో, పరుగెత్తేవారిలో రాజెవరో నిర్ణయమవుతుంది. ఈసారి యీ పోటీ పూర్వపు పోటీలకన్న ఎక్కువ ఆనందోత్సాహాలను కలిగించునదిగా ఉండుననుటకు సందేహములేదు. దానికి ముఖ్యకారణం ఈ పోటీలో పాల్గొంటున్న 68 మందిలో ఎమిల్ జటోపెక్ ఒకరు; ఈతడు 8 రోజులలో మూడో స్వర్ణ పతాకముకొరకు పోటీలో పాల్గొంటున్న మేటి వీరుడు. ఇట్టి దూరపు పందెములలో యీయన పాల్గొంటున్నది యిదే మొదటి సారి అనే విషయం యథార్థము; అయినా యిటువంటి వీరుడు, యీ పందెములో పాల్గొంటున్నాడన్న విషయం, అందరిలో ఒక నూతన మానసికానుభవమును రేకెత్తించగలదు.

వేలకువేలు వీధులలో గుమిగూడుతున్నారు. అందులో అనేకులు మొన్న మొన్నటివరకు జటోపెక్‌లో ఎక్కువగా నమ్మకమున్నవారు కారు. ఆయన మొదటి రికార్డుపరుగు వారి అనుమానాలను నిర్మూలంచేసినా, ఆయన పూర్వపు విజయాలు స్వాభావిక సామర్థ్యఫలితాలని వారి విశ్వాసము. ఒక యంత్రంవలె ఆయన శరీరం పనిచేయగలుగుటే ఆయన విజయాల ఆంతర్యమని వారు భావించారు; ఆ కారణం వల్లనే, ఆయన ప్రతికక్షుల విజయానికి ఎక్కువ అవకాశము లున్నవని వారి భావన. ఆయనయొక్క ఆశ్చర్యజనిత ద్వితీయవిజయం ఆయనమీదనుండే అవిశ్వాసాన్ని అణచివేసినది. పోటీలో ఆయన ప్రదర్శించే సాహసం, అచంచలమైన సౌహార్దం, క్రీడా

లోకాన్ని ముగ్ధులనుచేసినది; హెల్సింకీ అనే బహుభాషల 'జేబిలాన్'లో సమావేశమైన క్రీడావినోదప్రియుల హృదయాలను జటోపెక్ తన వశం చేసికొన్నాడు.

ఆటలలో అభిమానంగల ప్రతివ్యక్తీ యీ వీరుని "ఎమిల్" అని ఎంతో ఆప్యాయంగా పిలుస్తారు. ఈగోజు అతని అద్భుతమైన రెండు విజయాల అనంతరం, యీ 'మేరథాన్'లో ఎమిల్ కూడా పోటీచేస్తున్నాడని తెలిసిన తర్వాత, యీ పందెము చూచుటకు రానివ్యక్తి లేదు. జటోపెక్ యీ మూడవ విజయాన్ని సాధించగలిగితే, క్రీడల చరిత్రలో వేరొక అద్భుతఘట్టముండ నేరదని అందరూ ఏకగ్రీవాభిప్రాయాన్ని తెలియజేశారు. ఈ విధంగా అన్ని ప్రా మభిలషిస్తూన్న ఆశీర్వాదాలయొక్క బలంతో యీ వీరాధివీరుడు పోటీకి విజయోత్సాహంతో బయలుదేరినాడు.

ఆ వీరుని ఉత్సాహాన్ని యినుమడింపజేయుటకు ఆ ప్రేక్షక సమూహంలో ఆయన దేశీయులు కొద్దిమందే ఉండుట విచారించవలసిన విషయం. అయినా మేమంతా హృదయపూర్వకంగా ఆయన పరుగుల పోటీలను చూచినవారమే; ఆయన మాటలను విన్నవారమే; ఆయన తన దేశములోనూ, బయటా గడించిన విజయస్తోత్రాలను విన్నవారమే. ఎమిల్ ఏ ప్రజా సమూహంనుండి జన్మించాడో, ఆ ప్రజకే పూర్తిగా చెందినవాడు. ఆ ప్రజకొరకే ఎమిల్ పోటీలలో పాల్గొంటూ పాటుపడుచున్నది; విజయాలను సాధించుచున్నది. అందుచేతనే యువకులు ఆయనలో తమ ఆదర్శ ప్రతిఫలాన్ని వీక్షిస్తున్నారంటే, ఆశ్చర్యంలేదు.

ఆ జులై ఆఖరు ఆదివారంనాడు 'లౌడ్‌స్పీకర్ల' లోనుండి వచ్చే ప్రతిమాటను ఎంతో ఆతృతతో వింటున్నాను. ఆ మధ్యాహ్నం, ప్రారంభ వార్తలకొరకు, రేడియో 'డయల్'మీదనే మా వ్రేళ్లు; కాలం నడుస్తున్నట్లు లేదు. మా ఆందోళనకు మేరలేదు. ఒక అనిశ్చిత వాతావరణం మమ్ముల నావరించి నట్టయింది; పట్నాలలో, పల్లెలలో, యంత్రాలదగ్గర పనివారు, ఫ్యాక్టరీలలో పనివారు, బ్యారక్సులలో సోల్జర్లు, ఆటస్థలాల్లో చిన్నపిల్లలు, సెలవు దినాలను వినోదాలతో నింపుకొన్న విలాసప్రియులు, పొలాలగట్లమీద, నదీప్రాంతాలలోవున్న అందరికీ ఒకటే ఆతృత, ఆందోళన.

బయటిదేశాలలో వార్తలకొరకు అనేకులు వేచివున్నారు. హెల్సింకీనుండి వచ్చే వార్తల ప్రకటనకొరకు ప్రపంచంలోని ప్రతి వార్తాపత్రికలోని క్రీడలకు సంబంధించిన ఎడిటర్లు తయారౌవుతున్నారు. పోటీదార్లలో ఎవరికి విజయాని కెక్కువ అవకాశాలున్నవని, ప్రజలు తమలో తాము చర్చలు సాగించుచున్నారు. అనుమానాలతో నిండినవారెంతమంది ఉన్నా, కొత్తరికార్డుల కవకాశముందనేవారు అంతకంటె యెక్కువ మంది ఉండటంమాత్రం నిజం.

మూడున్నరయింది. పందెపు ప్రారంభానికి 68 మంది పోటీదార్లూ సమావేశమవుతున్నారు; 'కారబెరా' తన లండన్ విజయాన్ని మరల ప్రదర్శించుటకు, తన

అట్టహాసమైనా పరివారంతో హాజరు అయ్యారు. ఆస్ట్రేలియన్లు, జపానువారు, బెల్జియన్లు, డచ్చివారు, అమెరికన్లు, ఇంగ్లీషువారు వారి అభిమాని 'ఫేవరుు'తో వచ్చారు. ఎర్ర బనియనుతో, 903 వ నెంబరుతో జెకొస్లొవక్ పోటీదారు ప్రవేశించాడు. ఆతనికి యీ పోటీదార్ల సమూహం క్రొత్త అనిపించింది. అతను వినయంతో తోటి పోటీదార్లలో విశిష్టులను తనతో పోల్చుకొనుటకు ప్రారంభించాడు. ఆ పోల్చుకొనుటలో యిలాంటి "మేరథాన్" పోటీలలో వారికున్న అనుభవమునందు తానొక ప్రారంభకునివలె భావించాడు. నిజమే; యిటువంటి పోటీలలో పాల్గొనుట తన కిది మొదటిసారి. ఇది మామూలు "ట్రాక్" పోటీవంటిది కాదు. "మేరథాన్" "ట్రాక్" పోటీదారు ఎప్పుడూ ఆలోచించుటకు వీలుకాని సందిగ్ధావస్థలు "మేరథాన్" పోటీలో ఆకస్మికంగా బయలుదేరుతాయి. అంతవరకు కనబడని ఒక చిన్న పొరపాటు, సరిపడని పట్టు, యింకా యిలాంటి చిన్నవిషయాలు, అనుభవంగలిగి, విజయం తథ్యమనుకున్న పోటీదార్లు మధ్యరంగంలో మానివేయుటకు కారణా లవుతూవుంటాయి. పోటీ ప్రారంభానికి ముందు తన ప్రతిపక్షుల పేర్లన్నీ కంఠస్థంచేయుట 'ఎమిల్' చేసిన మంచిపని; ఆ హడావిడిలో తన దారిని తాను జ్ఞప్తిలో నుంచుకొనుటకు యిది వుపయోగపడుతుంది.

హఠాత్తుగా తా నొంటరిగా, అందరిచేత విసర్జింపబడినట్లు, ఏదో ఒక విధమైన భయము ఎమిల్ ముఖమును ఆవరించింది. తన మిత్రబృందం అంతా ఒక్కసారి, అక్కడ తన చెంతనుంటే, ఎంతో ఆనందంగా ఉండేదే! ఆ "ఆస్ట్రావా" ట్రాక్ మీద పరుగెత్తడ మెంత సులభం; అలాగే ఆ 'హుస్టకా' అనేవి స్టేడియంలో; ఆ ప్రేగ్ 'స్ట్రెహోవ్' స్టేడియంయొక్క నీడలలో! తన అద్భుత ప్రదర్శనల విజయాలకు తన నుత్సాహపరచిన ఆ మిత్రులంతా యీనాడిక్కడుంటే; కర్మాగారాల్లో పనివారు, ఫ్యాక్టరీలలో పనిచేసేవారు, ఆఫీసులలో గుమాస్తాలు, విద్యాలయాల్లోని వారు, సోల్జర్లు, తన క్లబ్ సహవాసులు, స్త్రీలు, పురుషులు, యువకులు, యువతులు, చిన్నపిల్లలు, "ఎమిల్! మేమంతా ఇక్కడున్నాము, మళ్ళీ ఎప్పటిలాగే నీకు సహాయంచేయుటకే, మమ్ములను నమ్ము" అని ప్రేమకంఠాలతో ఎలుగెత్తి ఉత్తేజితం చేసేవారు.

అయినా యిక్కడ, యీ పరదేశంలో ప్రేక్షకలోకమంతా ఆతనిపేరే ఉచ్చరిస్తూంది. అతి కొద్దిగానున్న స్వదేశీయులే కాదు, వేలకొలదిగా ఉన్న ఫిన్లు, వేలకువేలు ప్రపంచపు టన్నిమూలలనుండి సమావేశమైనవారు కూడా, "విజయం గొప్పది; కాని అందరి స్నేహం అంతకన్నా గొప్పది" అనే ఆదర్శాన్ని మూర్తీభవించిన "ఎమిల్" యొక్క ఉత్కృష్ట సందేశాన్ని అందరూ అర్థంచేసుకున్నారు.

జెకోస్లొవక్ సైన్యంలో పనిచేస్తున్న 30 సంవత్సరాల ఆఫీసర్ ఎమిల్ జటోపెక్ పందెపు ప్రారంభస్థలంలో నిలుచున్నాడు. ఆయన శరీరం బిగిసివుంది; సన్నని పొడవరి. ఆ ముఖంలో దీక్ష, నిశ్చయం తాండవిస్తున్నాయి. ఆయన పేరు, అంతకు

మున్ముందే సంపాదించిన రెండు ఒలింపిక్ విజయాల ప్రతిష్టాపరిమళాలను వెదజల్లుతున్నది. అయినా, ఆయనలో ఆ విజయాలకు సంబంధించిన గర్వమేమీ కనబడదు. వినయంతో, నిరాడంబరంగా, స్వాభావికంగా ఆ వినోద ప్రతిపక్షబృందం మధ్య తన సహజ సస్నేహభావంతో అదృశ్యమైపోయాడు.

ప్రారంభపు గీతవెనుక, అందరు పోటీదారులు నిలబడుట మొదలయినది. నాలుగు వరుసల్లో వారు నిలబడ్డారు. తమ స్థానాలనుండి ప్రేక్షకులు, ఎంతో ఆతృతతో ఆఖరు ఏర్పాట్లను ఏదేక దీక్షతో పరికిస్తున్నారు. ఈ పోటీదార్లలో అందరికన్నా బలవంతుడు, అందరికన్నా సాహసి, అందరికన్నా ఓపికకలవాడు ఎవరని ఆలోచిస్తున్నారు.

మరొక్క క్షణంలో పందెం ప్రారంభమవుతుంది. పట్టుదల, కండబలం, దీక్ష, గుండెనిబ్బరం విజయానికి సాధనాలు. 26 మైళ్ళ దూరం మేర యీ పోటీ అనుక్షణం జరుగుతూ, చివరకు ఫలితాన్ని తెలియ చేస్తుంది. అన్ని బాధల కోర్చి, అన్ని ఆయాసాలను అతిక్రమించ గలిగిన మనోదీక్ష కలిగినవానికే యీ విజయ కిరీట ప్రాప్తి.

అందరూ తమ విన్యాసాలను నెరవేరుస్తున్నారు: ప్రారంభకుడు పందెపు ప్రారంభపు సౌజ్ఞను తెలియజేస్తున్నాడు. అందరూ తమ గడియారములను సరిదిద్దుకుంటున్నారు.

ఎమిల్ జటోపెక్, మైత్రితో పందెపు స్థలాన్ని పలకరిస్తున్నట్టు, కాలు ముందుకు జరిపి, తలదించి, ముందుకు సారించి, సిద్ధమయ్యాడు.

ఆతడు వేచి ఉన్నాడు; సిద్ధంగా ఉన్నాడు.

ఆజ్ఞ యిచ్చుటకు, తుపాకీ ప్రేలుటకు మధ్య ఎంత ఎడముంటుందో చెప్పుట కష్టము. ఎమిల్‌కు కావలసింది ప్రారంభపు సంజ్ఞలకి మధ్యనుండే యీ క్షణిక కాలం కాదు; ఈ కష్టమైన పందెములో ప్రారంభమయ్యే యీతని జీవితనడక, యీతని శరీరపటుత్వంమీద ఆధారపడినదై మరింత పట్టుదల కలుగచేసినది. ఆతని నుత్సాహపరచిన విజయాలు, ఆతనికి మనోవికాసము కలిగించిన ఆతని అపజయాలు, తా నతిక్రమించవలసిన లోపాలు, జీవితంలో తన అనుభవాలు, తాను నేర్చుకున్న పాఠాలు, ఎన్నో కష్టాలమధ్య పొందిన శిక్షణ, వానలో, మంచులో, ఎండలో, వెన్నెల్లో, దీపపు వెలుతురులో, వేలకొలది మైళ్ళు తన డ్యూటీ అయిన వెంటనే సర్వీసు బూటుతో నడచిన నడకలు అన్నీ ఎమిల్‌కు దృష్టిపథంలో తిరిగి తొంగి చూస్తున్నాయి.

ఆ సైన్యంలో దీక్షతో తాను పనిచేయుట, అందువల్ల సంపాదించిన మన స్థైర్యం, కష్టాలకు తన శరీరాన్ని అలవరచుకొనుట అన్నీ ఎమిల్‌కు జ్ఞాపకమున్నాయి. తనకొరకు తమ సౌఖ్యాలను వదలి, త్యాగంచేసి, తన జీవితాన్ని సుఖప్రదంచేయుటకు, తన తలిదండ్రులు తనపై చూపిన వాత్సల్యం, అతని దృష్టిని వీడ

లేదు. ఇంక ప్రజలు! తన స్వదేశంలో, యిక్కడ ఫిన్‌లాండులో, తాను దర్శించిన అన్ని స్థలాల్లో ఎంత సౌజన్యంతో ప్రవర్తించారు! మానవులంతా ఒక్క కుటుంబంగా, ప్రేమతో, శాంతిగా కలిసి జీవించలేరు?

ఎమిల్ అలాంటి వ్యక్తి; మానవుడుగా, పందెపు పోటీదారుగా! అట్టి ఎమిల్ యిప్పుడు పోటీకి సిద్ధంగా ఉన్నాడు.

అదిగో ప్రారంభపు శబ్దము. అంతా మరపు! ప్రతి పోటీదారు తన శక్తిని సంపూర్ణంగా వినియోగించే దీక్షలో, అంతా మరుగుపడింది.

తన జీవిత పందెపు పోటీని ప్రారంభించాడు ఎమిల్ జటోపెక్.

# మొదటి పోటీ

ఎమిల్ జటోపెక్ తన మొదటిపోటీని ప్రారంభించినది జిలిన్ అనే పట్నంలో; ఆ పట్నంయొక్క అన్ పృష్ట మది. అది మే 15, 1941.

ఉత్తర మొరావియాలో 'కోప్రివినిస్న' అనే చిన్న గ్రామం ఎమిల్ జన్మస్థానం. జిలిన్ నగరంలో ఎమిల్ యువకుడుగా ఉద్యోగంకోసరు ప్రయత్నించాడు. పూర్వపు బాటాజోళ్ళ కంపెనీవారి 'టెక్నికల్' స్కూలులో ప్రవేశ పరీక్షలో కృతార్థుడై, జిలిన్‌పట్నంలో జీవనం ప్రారంభించాడు. ఫ్యాక్టరీలో పగలు పనిచేస్తూ సాయంత్రం స్కూలుకు హాజరయ్యేవాడు. అప్పటికే కెమిస్ట్రీ ఉపన్యాసాలలో శ్రద్ధచూపేవాడు.

బాటా కర్మాగారంలో వేలకొలది జోళ్ళు తయారయ్యేవి. వాటి విక్రయం నిమిత్తం ప్రచారం అవసరమయింది. దానికి సాధనంగా ఆటల నుపయోగించవలసిన అవసరం ఏర్పడింది. ఫుట్‌బాల్ ఆటగాళ్ళే కాకుండా, యితర వ్యాయామ ప్రవీణులు కూడా ప్రదర్శనాల్లో బలవంతంగా పాల్గొనవలసివచ్చింది. స్కూలు విద్యార్థులు నిర్బంధంగా ప్రతిసంవత్సరం 'జిలిన్' వీధులలో ఒకర్ని తరుముతూ ఒకరు 'బాటా' చిహ్నాలను షర్టులకు తగిలించుకొని, పరుగు పందేలలో పోటీచేసేవారు.

యుద్ధసమయంలోకూడా యీ వీధి పరుగు పోటీలు జరుగుతూండేవి; వీటికి బాటా ఫ్యాక్టరీ నిర్వాహకులు ప్రోత్సాహమిస్తూండేవారు.

కాని విద్యార్థులుమాత్రం వీనినిగూర్చి వేరే అభిప్రాయం కలిగివుండేవారు. ఈ ప్రచారపు పోటీలలో ఎమిల్ జటోపెక్ ఏమీ ప్రత్యేకపు టాసందాన్ని

వెలిబుచ్చేవాడు కాదు. ఈ పోటీలనే ఒక అవకాశంగా తీసుకొని, దానినుండే ఆనందాన్ని అనుభవిస్తున్న అతని సహచరులు యీ పోటీలలో పాల్గొనమని ఎమిల్‌ను ఎంతో ప్రోత్సహించిరిగాని, వ్యర్థమనోరథులైరి. ఆ రోజుల్లో ఎమిల్ క్రీడలమీద తన మనస్సు పోనీయలేదు. అందుచేత యీపోటీలనుండి దూరంగా ఉండుట అతని కంత కష్టమనిపించలేదు.

కాని యీ క్రీడా విసర్జన, విముఖత్వం ఆట్టేకాల ముండలేదు. విద్యార్థి వసతి గృహాధికారి ఒకసారి ఎమిల్‌ను మందలించాడు.

"ఆదివారం నీవు పరుగెత్తుతున్నావా ?"

"నాకు పరుగెత్తుటలో ప్రావీణ్యము లేదండి."

"ఫరవాలేదు. నువ్వు మొదటివాడుగా వస్తావో, ఆఖరువాడుగా వస్తావో అది నీ వ్యవహారం. నీవు పరుగెత్తవలసిందే" అన్నాడు అధికారి.

ఆ హాస్టల్లో యినపశిక్షణ. శిక్షణను ధిక్కరిస్తే బయటకు పోవలసిందే. అందుచేత ధిక్కరించుటకుముందు దెవరైనా దీర్ఘంగా ఆలోచించవలసిందే. ఎందుచేతనంటే, సాంకేతిక విద్యాలయం విడిచి, పరీక్షలో ఉత్తీర్ణులవగానే, ప్రతివానికి జోళ్ళ ఫ్యాక్టరీలో ఉద్యోగం లభించుట కవకాశముంది. అయినా, ఎమిల్ అందులోనుండి తప్పించుకొనుటకే ప్రయత్నం చేస్తున్నాడు. వైద్య పరీక్ష సమయంలో మోకాలుకు దెబ్బతగిలిందని అబద్ధమాడినాడు. ఒక గోడదూకడములో దెబ్బతగిలిందన్నాడు. దెబ్బ నిజమని రుజువుచేయుటకు కుంటుట మొదలుపెట్టాడు. కాని, డాక్టరు అంత సునాయాసంగా మోసపోలేదు. దెబ్బతగిలిందన్న స్థలంలో పట్టిచూచి, ఏమీ ప్రమాదం జరగలేదని, నిక్షేపంగా ఉన్నాడని డాక్టరు తెలియజేశాడు.

"అదేమీ ప్రమాదం చేయదు ! నీవు సురక్షితంగా పరుగెత్తగలవు!" ఫ్యాక్టరీ నిర్వాహకులు యీ పందెములలో ఎక్కువ సంది పాల్గొనాలని ఆతృతకనబరుస్తూ న్నట్టు ఆతనికి తెలుసు. కాని, ఎమిల్ పరుగు పందెములోనుంచి తప్పించుకొనవలె ననే ప్రయత్నం విరమించలేదు. ఆ ఆదివారం ఉదయంకూడా అందరికన్నాముందే లేచి దుస్తులు ధరించి, పుస్తకం చేతపుచ్చుకొని, పఠనమందిరంలోనికి నిశ్శబ్దంగా దారి తీశాడు.

"బహుశా ఎవరూ తనను చూచివుండరు అనుకుంటూ పుస్తక పఠనంలో నిమగ్నుడయ్యాడు. ఆ రోజుల్లో రసాయన పరిశోధనాలయంలో కృత్రిమ వస్తువుల ఉత్పత్తికి సంబంధించినపని చేస్తూండటంవల్ల 'ఏసిటోన్'ను గూర్చిన సూత్రాలు అతని మెదడులో పరిభ్రమిస్తున్నవి.

తర్వాత అతని భావాలు యింటివైపు, తన తల్లి, తండ్రి, అక్కచెల్లెళ్ళవైపు పరుగెత్తసాగాయి. ఆ ఫ్యాక్టరీ జీవితపు ఊపిరాడని వేగంలో యీలాంటి భావాలకు చోటులేకుండాపోయేది, ఆదివారాలలోకూడా.

పందేలలో పాల్గొనే ఎమిల్‌నుగూర్చి అతని తండ్రి ఏమనుకుంటాడు? తండ్రి ఫ్యాక్టరీకి వెళ్లిన దిదే సమయము. ఫ్యాక్టరీలో వడ్రంగిపని చేస్తున్నాడాయన. అలాంటి గట్టిపడిన ఎముకలతో నున్న చేతులుగలవారింకెవరైనా ఉన్నారా? అతని తండ్రి తప్ప! మరి, ఎంత శ్రద్ధతో, తెలివితేటలతో ఆ ఆరుగురు పిల్లల జీవితాలను చక్కగా దిద్ది, ఆ కుటుంబాన్ని ఎంతిసామర్థ్యంతో నడుపుతున్నారాయన!

"ఎమిల్! శాంతంగా, నిశ్శబ్దంగా ఒక్కనిమిషం ఊరుకుండలేవూ! ఏదైనా పని చేయాలంటే, ఆ తోటలోకి పోయి, పనికిరాని మొక్కలను తీసివేసి శుభ్రపరచు" అనేవాడు తండ్రి.

ఎమిల్ అక్క మేరీ అభిప్రాయంకూడా యిదే: "నిన్ను ఎమిల్, ఒక మతి చెడినవానివలె రోడ్డుమీద పరుగెత్తాడు. బీటుదుంపమాదిరిగా ఎర్రగా అయిపోయి, గుర్రంలాగా ఒగరుస్తూవున్నాడు". ఎమిల్ యొక్క ఆ సన్నని ముఖంవైపు తండ్రి కఠినంగా చూడసాగాడు. అదృష్టంకొద్దీ, యీసారి ఎమిల్‌ను యింటికి పంపింది ఉపాధ్యాయుడు, "సాసేజి" తీసుకురమ్మని. ఆ రోజుల్లోకూడా, క్లాసులో వేగంగా పరుగెత్తగలిగింది ఎమిల్ ఒక్కడే.

"అయితే" తండ్రి అన్నాడు:"ఇట్లు అంతవేగంగా పరుగెత్తిరావడానికి యిదొక కారణమా? మామూలుగా నడచిరాలేకపోయావా? నీవు అసలు నడవలేవా" అని తండ్రి మందలిస్తూ యుండేవాడు.

అంతపెద్ద కుటుంబాన్ని పోషించవలసిన వడ్రంగి జటోపెక్‌కు పరుగెత్తడమంటే, ఫుట్‌బాల్ ఆడడమంటే ఏమిటో బోధపడదు. బోధపడకపోతే ఆశ్చర్యం లేదు. కరచు కరువుకాటకాలు. ప్రతి "పెన్నీ" జాగ్రత్తగా వాడుకోవాలి. అందుచేత, ఒకజోడు చిరిగిందంటే, ఆ వారపు జమాఖర్చుల పట్టికలో ఒడుదుడుకు తప్పవన్నమాటే. ఎమిల్, పదేళ్ల పిల్లవాడైనా జీవిత సమస్యలనుగూర్చి, తండ్రిపడే బాధలను గూర్చి పూర్తిగా అవగాహన చేసికొనేవాడు. అందువేత తన ఆటలకు అంతరాయం కలిగినా, తండ్రి చేసే కఠినమైన మందలింపులను ఎమిల్ నిరసించేవాడుకాదు.

"ఆటలతో కాలం వృథాచేయవద్దు. నీకేమీ పనిలేకపోతే, ఆ నదిఒడ్డుకు పోయి యీ నా తేనెటీగలకు ఆహారం తీసుకొని రా" అనేవాడు తండ్రి.

ఆ పొలాల్లో, ఆ నదీతీరాలలో నిశ్చింతగా విహరించిన నాటి ఆ మధుర స్మృతులు, ఆ అద్భుత అనుభవాలు హృదయాన్ని ఆనందమయం చేస్తాయి. ఆ నది ఒడ్డున ఆ పల్లని ఉదయభానుని కిరణాలకు మెల్లగా కరిగి నీరైపోయే మంచుకునకలు, మెత్తని ఆ గడ్డిదుంబళ్లమీద అక్కడక్కడ చిగిర్చే "ఏటిక" మొక్కలు వసంతాగమనాన్ని సూచిస్తున్నాయి. వసంతి వాయువులు చిన్నపిల్లల్ని కొత్తకొత్త ఆటలకు పురికొల్పి, క్రీడోన్మత్తుల్ని చేస్తున్నవి. కోతికొమ్మచ్చాడుకుంటూ, నదీ తీరాల్లో గంతులు వేస్తూ ఆటలాడే పిల్లలు! చూపరులకు ఆహ్లాదం కలుగజేయుచున్నవి.

"తండ్రీ, మేము యీతలాడడానికి వెళ్ళవచ్చా?" అని అడిగినప్పుడు, "వెళ్ళొచ్చు! కాని యింటికిమాత్ర మాలస్యంగా రాకండి, తోటలో చేయుట కెంతో పనుంది" అనేవాడు తండ్రి.

అప్పుడు ప్రతివానికి తొందరే; తొందరగా నదికి వెళ్ళడం, ఎవరు ముందని పందెం; నది అట్టేదూరం లేదు. అయినా మూడుకిలోమీటర్లుంది. సాధారణంగా "టైము" సంగతి అందరికి మరపే; అందుకే చివరకంతా మరల తొందరే; నాలుగు గంటలకల్లా తండ్రి ఫ్యాక్టరీనుండి తిరిగి వచ్చేస్తాడు. తండ్రికి సంతృప్తి కలిగించడమే అందరి ఆశయం; ఎంత త్వరగా యింటికి చేరుకోవడమనే కోరిక వారి నందర్నీ తొందరపెట్టేది.

అయితే, ఆ చిన్నతనపు దినాల్లోని ఒక పందెం ఎమిల్‌కు బాగా జ్ఞాపక మున్నది.

రోడ్డుకు సమీపంలో ఒక పెద్ద యిళ్ళవరస ఉంది. పిల్లలు దాగుడుమూతలాడే స్థలమది. ఆ పిల్లల్లో పదేళ్ళ ఎమిల్ జటోపెక్ ఒకడు.

"ఈ యిళ్ళను చుట్టుముట్టి మళ్ళీ యీ స్థలానికి ఎవరు ముందు చేరుకుంటారో, పరుగెత్తుదాం" అని నిర్ణయించారు పిల్లలందరూ.

ఇళ్ళను చుట్టుముట్టి రావడం ఒక మైలుదూరం. ఆ చిన్నపిల్లలందరూ ఒకసారి చుట్టూ తిరిగి, మొగాలు కందగడ్డలై, రోజుకుంటూ, యింతటి ఘనకార్యం చేశామన్న సంతృప్తితో పొంగిపోతున్నారు. కాని ఆ పిల్లల్లో ఒక్కడుమాత్రం యింకా ఆగకుండా పరుగెత్తుతూనేయున్నాడు. అతడే జటోపెక్. తక్కినపిల్ల లింకా పూర్తిగా ఆయాసంనుండి తేరుకోలేదు, జటోపెక్ రెండవసారి పరుగెత్తు పూర్తి చేశాడు. అత డింకా ఆగలేదు. పరుగెత్తుతున్నాడు. తోటిపిల్లల ఆశ్చర్యానికి అంతు లేదు. ఏదో అసాధారణ ప్రజ్ఞను ప్రదర్శించడాని కన్నట్టుగా, అత డటుల విరామం లేకుండా పరుగెత్తుతున్నాడు.

ఇంక యిది నవ్వులాట కాదు. ఇదొక అద్భుతమైన ప్రదర్శనమని అందరూ గుర్తించారు. తమలో ఒకడు యీ అద్భుతాన్ని ప్రదర్శించినందుకు పిల్లలందరూ గర్వించి, అతని ప్రజ్ఞలో తామూ భాగస్వాములవలె, అవ్యక్తానందాన్ని అనుభ వించారు. ఎమిల్ మూడవసారి ప్రదక్షిణం పూర్తిచేసి, ఆయాసంతో ఆ గడ్డిమీద కూలబడేసరికి, అతని చెక్కిళ్ళను తడి జేబురుమాలుతో తుడిచేవారు కొందరు; అతని ముఖంమీద స్వేదబిందువులను కడిగేవారు కొందరు; నెమ్మదిగా అతడు కాళ్లమీద నిలబడే ఓపిక కలిగేవరకు, అతనికి ఉపచారాలు చేస్తూయుండేవారు అందరూనూ.

"నిజంగా నీవొక గొప్ప పందెగాడివి" అని ప్రశంసాపూర్వకంగా అందరూ అతన్ని పొగడేవారే.

"అదొక తెలివితక్కువపని చేసింది" అని ఆ పతనాలయంలో "కోల్‌టార్" వ్యుత్పత్తినిగూర్చి తదేక దృష్టితో ఆలోచిస్తూ, ఎమిల్ అనుకుంటాడు. కాని అతడికి

క్షణంలో మతి చెదిరిపోయేది. మానసికంగా ఆ కార్మిక గృహాలమధ్య తోటిపిల్లలతో ఆడిన ఆటల స్మృతులమధ్యకు పోయాడు ఎమిల్. ఫుట్ బాల్ కూడా బాగా ఆడే వాడు ఎంతో శ్రద్ధతో. "బంతి ఎక్కడుంటే అక్కడ ఎమిల్ కూడా ఉన్నాడన్న మాటే!" అని అనేవారు అందరూ. కాని తన కా ఆటలో నైపుణ్యముందనుకొనేవాడు కాదు ఎమిల్. పరుగెత్తడంలో, ఎవరైనా వెంటాడడంలో ఎక్కువగా అతని కభిమానం. ఎందుకంటే అందులో అతన్ని మించిన ప్రజ్ఞావంతులు అరుదుకాబట్టి.

ప్రక్కవీధిలోని పరుగు ప్రవీణుడు, ఎమిల్ మిత్రుడు 'గాల్', ఎమిల్ యొక్క ప్రావీణ్యంగూర్చి విని, అతన్ని సవాలు చేశాడు: "అదుగో, ఆ పొలాల్లోని పెద్దఓక్ వృక్షంవరకు, అక్కడనుంచి వెనక్కు పందెం" అన్నాడు.

ఎమిల్, పాపం వీరోచితంగా ప్రయత్నించాడు; కాని తనకన్న వయసులో పెద్దవాడైన 'గాల్' చేత కొద్దిలో మాత్రమే ఓడింపబడ్డాడు. అల్లా చిన్నతనంలోనే పరుగెత్తడానికి కావలసిన ఉత్కృష్ట లక్షణాలన్నీ ప్రదర్శించాడు ఎమిల్. కాని ఒక పుంతలో పరుగు పందేలు నడుపుతారన్న విషయం, అప్పటికి ఎమిల్ కు తెలియదు. అయినా ఆ విషయం తెలిసిన తర్వాతకూడా, అతని మదిఆకర్షించలేదు.

కాని, అతనిని ఆకర్షించినది మాత్రం ప్రకృతి. పరిసర అటవీ ప్రదేశాలలోనికి తోటిపిల్లలతో ఆతడు తరుచు వెళ్తూవుండేవాడు. అక్కడి పిల్లలతో, గడ్డిపరకలతో చిన్నయిళ్లు కట్టేవారా పిల్లలందరు. సెలవులారంభం ఎంతో ఆనందంతో వారందరూ ఉత్సవంగా జరుపుకుందామనుకున్నారు. దానికొరకా అడవిలో రాత్రంతా గడుపుటకు నిశ్చయించారు. అర్ధరాత్రి తర్వాత ఆ పిల్లల తలిదండ్రులు లాంతర్ల సహాయంతో వారిని వెదకి, అందర్నీ యిళ్లకు తీసుకువెళ్లటం జరిగేది.

తండ్రితో దగ్గరనున్న పర్వతాల మధ్యకు వాహ్యాళిపోవుట అతనికి ప్రీతియమున్న చిన్ననాటి మధుర స్మృతులలో ఆనందదాయకమైనది. వారిద్దరు "బెస్కీడ్" పర్వతపంక్తిలో విహరిస్తూ, ఎత్తైనశిఖరాలన్నీ అధిరోహించేవారు. మిత్రులతో ఆ పర్వతాలోయల్లో వారు కలిసి నిద్రించేవారు. అక్కడ త్రాగిన పచ్చిపాల మధురుచులు, తాము పరుండిన ఆగడ్డిమేట్లవాసనలు యిప్పటికికూడ అతడు మరువలేదు.

స్కూల్లో పాఠాలు బాగా చదివేవాడు; ఇంటివద్ద ఆ పాఠాలు శ్రద్ధగా మననం చేసేవాడు. అతని ఉపాధ్యాయుడాతని నెంతో మెచ్చుకొనేవాడు; అతని చురుకుతనానికి చకితుడయ్యేవాడు.

"నువ్వెప్పుడూ అబద్ధమాడవు; అదే నీలో నే నెక్కువగా యిష్టపడేది" అనేవాడా ఉపాధ్యాయుడు.

వ్యాకరణ విద్యాలయంలో చదువు పూర్తికాగానే, ఉపాధ్యాయ శిక్షణాలయానికి ఎమిల్ ను పంపుటకు మొదటనిశ్చయించబడింది. కాని ఆనాటిఉపాధ్యాయుల శిక్షణాలయాల్లోవున్న అఖండపోటీలలో ఎమిల్ కు అవకాశం లేదనిపించింది. అందుచేత వేలకొలది యితరవిద్యార్థుల అడుగుజాడల్లో ఆతడుకూడా జిల్నిలోని 'బాటా' కర్మాగారంలో ప్రవేశించవలసివచ్చింది.

అక్కడ, ఆతనికి బ్రదుకుబాటలోని కష్టపరంపర అనుభవంలోనికి రాసాగింది. తన తలిదండ్రులను కష్టపెట్టుట యిష్టంలేక, యింటివద్దకు తన బాధలను మోసుకు పోలేదు. తన చుట్టుప్రక్కల ప్రపంచంలోని కాఠిన్యాన్ని స్వయంగా ఎదుర్కొనే శక్తిని తనలో విజృంభింప చేసుకొన్నాడు. అలాగా చాలాకష్టాలతో కాలం వెళ్ళ బుచ్చాడు. ఆత్మశక్తిమీద నిలబడడం కష్టమయిపోయే దిక్కడ. ఈ కష్టాలు, యీ ప్రయాసలు రసాయనశాస్త్రంమీద తనకుండే అభిమానంమూలంగా సునా యాసంగా మరచిపోగలిగేవాడు. ఫ్యాక్టరీలోని రబ్బరుశాఖలో యీ రసాయశాస్త్రం సం దభిరుచి నలవరచుకున్నాడు. వీలైనంత శాస్త్రప్రావీణ్యం సంపాదించుకోవటకు నిశ్చయించాడు. అందుచేత పందేలలో, పోటీలలో పాల్గొనే అభిలాషకు వేళ లేదు. తెరచిన పుస్తకంవైపు చూస్తూవుంటే అన్ని పూర్వస్మృతులూ పటాపంచలయ్యేవి. కాని ఆట్టే కాలం యీలాగు సాగేదికాదు. దీక్ష చెదురుతూవుండేది.

"అదుగో" మిత్రుడనడం వినబడేది. "ఎమిల్! త్వరగా రా, నీకోసం అరగంట నుంచి చూస్తున్నాం. వెంటనే పందెపు ప్రారంభానికి పోవాలి."

ఆశాభంగముతోను, నిరుత్సాహంతోను పుస్తకం మూసేవాడు ఎమిల్. ఇంక దీక్షారంభం. ఆతృతతో పిల్లలవెంబడి పడిపోయేవాడు. వారుకూడా అంత ఉత్సా హాన్ని కనబరచేవారుకారు.

జటోపెక్, ఆతని స్నేహితులు పందెపు టారంభానికి, ఆఖరు నిమిషంలో చేరుకున్నారు. సుమారు నూరుమంది అక్కడ అప్పుడే బారులుతీరి నిలబడ్డారు.

పారిపోవడానికి ఎమిల్ చేసిన ప్రయత్నం విఫలమయింది. ఈనాడు ఆనాటి ఆ విఫలప్రయత్నం జ్ఞప్తికి వచ్చినప్పుడు, తనకు పట్టిన అదృష్టాన్ని తానే ప్రశం సించుకుంటాడు. ఎందువల్లనంటే, ఆనాడుకనక తాను పరుగుపందెంలో పాల్గొనక పోయినట్టయితే, కలకాలం ఆతనిలోని సహజమైన శక్తులు నిబిడీకృతమై ఉండి పోయేవి. కేవలం అనుకోకుండా, అప్రయత్నంగా ఎంతమంది ఉత్తమ ఆటగాండ్రు ప్రాశస్త్యాన్ని సంపాదించారు! కాని అవకాశాలులేక, పరిస్థితుల వత్తిడివల్ల, ఎంత మంది ప్రావీణ్యం కలవారు ప్రతిష్ఠలేక అణగారిపోలేదు!

దేవుని దయవల్ల ఎమిల్ జీవితంలో ఆ ప్రప్రథమ పందెపు ప్రారంభశబ్దం ఒక నూతన అధ్యాయాన్ని ప్రారంభించింది. ఆ క్షణంలో క్రీడా ప్రపంచంలో ఒక క్రొత్తతార వెలిసి, వెలిగింది.

ఆ పరుగెత్తే గుంపులోనుండి ఎమిల్ యీడుకు పోయాడు. ఇందులో పాల్గొన వలసిందేనా, తాను? ఈ పోటీనిగూర్చి ఆతని తండ్రి ఏమంటాడు? కాని, ఆతని తండ్రి కొక అభిమాన సామెతుంది. "ఏదయినా చేయవలసివుంటే చేసేది చేయదగి నదిగా వుండాలి."

ఎమిల్ తన కాళ్ళ ననుసరించి పరుగెత్తాడు. ఆ వేగం ఆతనిలో ఆవేశం కలిగిం చింది. ఆ నిర్బంధపుపోటీ అవివేకమనే అభిప్రాయం దూరమయిపోయింది. ఆ

ప్రాథమిక అనుమానాలు, బాధలు, దూరమయినవి. కొంత విశ్రాంతితో పరుగెత్తే మొదలు పెట్టాడు. ఆ పరుగెత్తుటలో అలవరచుకున్న ఒక విధమైన మనురాలాపన ఆతని కాత్మానందాన్ని కలిగించినది. బరువు, బాధ సడలింది. ఆ పరుగెత్తుటలో ఒక ఆనందానుభూతిని పొందాడు.

కుడి ప్రక్కనుండి, కొందరు పోటీదార్లు తన నతిక్రమించినారు. అట్లా జరగడానికి వీలులేదు! తన తండ్రినుంచి తాను వంశానుక్రమంగా పొందిన మనోదీక్ష ఆతన్నావరించింది. తండ్రి చెప్పుతూవుండే ఆ సామెత "ఏదైనా చేయవలసివుంటే చేసేది చేయదగినదిగా ఉండాలి" తన్నావహించింది.

ఎమిల్ అడుగు ముందుకు సాగించి వేగ మధికంచేశాడు. వెంటనే ఒకడు, తర్వాత మరొకడు తనను వెనుకబడ్డారు. ఇంకా వేగముగా పరుగెత్తుట కాకస్మికంగా తీర్మానించినాడు. ఇప్పటివరకు తన స్నేహితులను వెనుకనుండి చూస్తూవున్నాడు. ఇక నిప్పుడు వారందరికి తన వీపు కనబరచినాడు. ఆ క్షణంలోనే ఎంతమంది తనతో పోటీచేస్తున్నవారు కష్టంగా సాగగలుగుతున్నారో, ఎంతమంది ఊపిరి కొరకరలాడిపోతున్నారో ఎమిల్ కనిపెట్టగలిగినాడు. విరామం లేకుండా, ఆయాసాన్ని తట్టుకుంటూ అతను పరుగెత్తవలసి వచ్చింది. అతనికి అంతకష్టమని పించలేదు. సులువుగానే కనబడినది. అప్పుడప్పుడు విశ్రాంతికూడ తీసుకోగలుగుతున్నాడు. ఇంకా వేగంగా పరుగెత్తగలడు. పరుగెత్తు మొదలుపెట్టినాడు. ముందుకు సాగిపోతూవున్నాడు. వీధుల ప్రక్కల బారులుతీర్చి నిలబడిన ప్రజాసమూహం, ఆశ్చర్యంతో యితనివైపు చూడ ప్రారంభించారు. ముందుకు అంతత్వరితంగా సాహసంగా సాగిపోయే ఆ కుర్రవాడెవరు? ఇప్పటికిప్పుడే ఎంతోమందిని వెనుక్కు త్రొక్కి ముందుకుపోయిన ఎమిల్‌కు ఎదుట ఒకే ఒక్క పోటీదారు కనబడుతూవున్నాడు. అప్పుడాతనిని గుర్తించినాడు. తన మిత్రుడు 'కృపీకా' ఎన్నాళ్ళనుండో కృషి చేస్తూ వున్నాడు. ఈనాడు విజయం సాధించడాని కవకాశం చిక్కినదనుకున్నాడు ఎమిల్.

మరొక మలుపు, కొంత నిదానపుమార్గం, తర్వాత గమ్యస్థానం. "బాగాపరుగెత్తావు ఎమిల్, నువ్వు రెండోవాడుగాఉన్నావు, శెభాష్!" అనే ప్రజల ఉత్సాహపరిచేమాటలు ఎమిల్ చెవుల్లో పడ్డాయి.

విజయం సాధించిన మిత్రుడు 'కృపీకా' యింకా ఆయాసపడుతూనే ఉన్నాడు. ఎమిల్ చేతిని పట్టుకొని, ఊపిరి వేగంగా తీసుకుంటూ, ఈ మాత్రం అనగలిగాడు: "అయితే, ఎమిల్! యిది ఆశ్చర్యంగాఉందే, నువ్వసలు ఈ పోటీలో చేరడానికే యిష్టం కనబరచలేదే మొదట?"

ఎమిల్ ఆనందించాడు. కాని విజయగర్వం తలకెక్కలేదు. ద్వితీయుడుగా వచ్చాడు. అంతా బాగున్నది; సంతోషించదగినదే. మొత్తంమీద చూస్తే, తనకున్న యితర బాధలమధ్య యీ విషయం చాల చిన్నది. పోటీలోచేరి తన విధ్యుక్తాన్ని

నెరవేర్చుకున్నాడు. ఇప్పుడది అయిపోయింది. ఏమీ ఆతృత కనబరచకుండా, తన స్నేహితులొక్కొక్కరే గమ్యస్థానము చేరుకొనుట ఆరంభమయింది.

"నీకు బహుమానముగా ఒక ఫౌంటెన్ పెన్ యిస్తారు" అని ఎవరో అతనికి తెలియజేసినారు. అదికూడా ఆతనిని కదపలేదు. తన దుస్తులను తొడిగి, యింక అక్కడనుండి వెళ్లుటకు నిశ్చయించినాడు ఎమిల్.

"జటోపెక్" అని పిలిచాడు, ఆనందంతో ఆతని ఉపాధ్యాయుడు; వచ్చేవారం "రిలేరేసు"కు నువ్వవసరం. అప్పుడే జట్టును నిర్ణయించేశారు.

ఇందుకు ఎమిల్ తన అయిష్టతను కనబరుస్తూ "ఈవిధంగా నే నింక పరుగెత్త లేను" అంటూన్న సమయంలో, ఆతనిమిత్రుడు 'క్రుపీకా' ఆతనిదగ్గరకు వచ్చాడు మరొకసారి. తన విజయంకంటే, ఎమిల్ యొక్క ద్వితీయస్థానం అతనికెక్కువానందాన్ని కలిగించింది. "ఎమిల్! నీ పరుగునైపుణ్యము పుట్టుకతోనే వచ్చిందనుకుంటూ, మంచి శిక్షణతో యింకనూ రాణింపగలవు. నాతోకూడ శిక్షణపొందుదువు గాని, రా" అన్నాడు.

ఎమిల్ కు తన మిత్రుడు తనపట్ల జూపిన అభిమానానికి ఆనందం కలిగింది. కాని ఆతని మనోనిశ్చయాన్ని మాత్రం సడలింపలేకపోయింది.

"నువ్వు రెండోవాడుగా వచ్చేవు ఎమిల్" అన్నాడు క్రుపీకా.

"ఓ, అదా, అది మరేంలేదు. ఏదైనా నాకొక్కటే. ఏమైనా, యిదే నా ఆఖరు పోటీ. మీ అభిమానానికి కృతజ్ఞత" అన్నాడు ఎమిల్.

## ట్రాక్ మీద

జ్లిలిన్‌లో రోజులు అతిత్వరగా గడిచిపోతాయి. ఇక్కడ, కాలానికి, ధనానికి చాలా సంబంధం. ఇక్కడ కాలం అంటేనే ధనమన్న మాట. వేగంగా పనిచేయాలి ఎవరైనా. అంతేకాదు, చాలాచురుకుగా, కళ్లు రెండూ పూర్తిగా తెరచి పనిచేస్తూ ఉండాలి. ఫ్యాక్టరీలో "కన్వేయర్ బెల్టు"కు, పెట్టుబడిదారులైన యజమానులకు కనికరమనేదేమో తెలియదు. ఎవరిచేతిలో ఏ వస్తువు పాడయినా, ఆ కార్మికుని వేతనములోనుండి, ఆ వస్తువు ఖరీదు రాబట్టుట తథ్యం. ఎవరైనా చురుకుగా పనిచేయక వెనకబడినా, పని ఎవరివల్లనైనా నిలబడిపోయినా ఆతనికి జరిమానా తప్పదు.

రసాయన పరిశోధన శాఖలోనివారు "కన్వేయరు బెల్టు"కు సమీపములో పని చేయరు అదృష్టవశాత్తూ. అక్కడే ఎమిల్ పని. అయితే యిక్కడ పనిచేసేవాడు తన తెలివితేటలను, చురుకుదనాన్ని, ప్రావీణ్యాన్ని ప్రదర్శించాలి.

"సెల్యులోస్" తయారుచేయడం ఎమిల్ పని. అప్పటికి కొంత అనుభవం సంపాదించినాడు. ఒక కెమిస్ట్రీ ప్రొఫెసర్ చేయగలిగినంత సామర్థ్యంతో పనిచేయ గలడు. ఆ తేనెరంగు ద్రావకాన్ని పైపులగుండా పంపిస్తూ, ఆ తీగెలను యంత్రం మీద త్రిప్పినప్పుడు ఎమిల్ అనుభవించే ఆనందం అపరిమితం.

కృత్రిమ సిల్కు తయారుచేయుటలో ఎమిల్ చూపే నేర్పరితనానికి, ప్రధానాధికారి ఆనందించేవాడు. ఎంతో ఉజ్వలభవిష్యత్తు ఉన్నదితనికి అనేవాడు. ఈలాంటి ప్రశంసలు ఎమిల్ పరిశోధనాసక్తిని యినుమడింపజేసేవి. సాంకేతిక విద్యాలయాలకు మధ్యాహ్నం, సాయంత్రంకూడా హాజరయ్యేవాడు ఎమిల్.

ఆ రసాయన పరిశోధనాగారంలో పరిస్థితులు భరింపగలిగినవిగానే ఉండేవి. జిలిన్‌లోని ఆ ప్రారంభదశలో అనుభవించిన యిబ్బందులుమాత్రం అతను మరువ లేకపోయాడు. పరీక్ష లయినతర్వాత, వైద్య పరిశీలనలో కృతార్థుడయి ఫ్యాక్టరీలో ప్రవేశించినతర్వాత ఎంతో గర్వముగా ఉండేది. మొట్టమొదటిసారి "వర్కర్స్ కార్డు" తన చేతిలోనికి రాగానే ఎంతో సంతోషపడ్డాడు! ఆ కార్డుమీదే తన పేరు ముద్రవేసి ఉండేది. ఆ ఆకురాలు కాలంలో ఎంతో ఆత్మవిశ్వాసం కలిగిన దతనికి.

ఆ ఫ్యాక్టరీలో ఆతని మొదటి అడుగులు, మొదటి నెల్లు ఆతని ఆశాజ్వాలల్ని చల్లబడజేశాయి. జోళ్ళ రబ్బరు అడుగులకు సంబంధించినపని అతనిది. ఎంతప్రయత్నించినా, యితర పనివాళ్లకు వెనకబడేవాడు. అంత త్వరగా పనిచేయడమనేది ఆతనికాశ్చర్యము కలగజేసినది. తన చేతకానితనానికి బాధపడ్డాడు. ఇంకా ప్రక్కన జరిగేదంతా ఏదో కష్టంకలిగించే దతనికి. ఆ అమానుష వేగానికి, అందరికి వెనకై పోతున్నానన్న ఆందోళనకి తట్టుకోలేకపోయాడు. ఇవ్వవలసిన జరిమానాసొమ్ము తనకు రావలసిన వేతనంకంటె సాధారణంగా ఎక్కువైపోయేది. ఒకసారి ఒక సమ్మెకూడా జరిగింది. ఉదయం 7 గంటలనుండి 12 గంటలవరకు, మధ్యాహ్నం 2 గంటల నుండి 5 గంటల వరకు పని చేస్తూవుండాలి. కాని, సాధారణంగా, పని కొంచెం ముందుగానే ప్రారంభమయ్యేది. అందుచేత యింకా పూర్తిగా భోజనం చేయకుండానే మధ్యాహ్నం పనికి హాజరవ్వవలసివచ్చేది.

పనికూడ చాలాకష్టంగా ఉండేది. ఎమిల్ ఎప్పుడూ పనిలో వెనక బడిపోయేవాడు కాబట్టి, ఎమిల్‌కు మరొకపని అప్పజెప్పేరు. ఇది కొంత సులువుఅయిన దే అయినా, ఎమిల్ మాత్రం యీ వేగానికికూడా ఆగలేకపోయాడు.

ప్రారంభకుడుగా, ఆతడు సంపాదించేదే తక్కువ. ఏమయినా తనబాధ్యత యింకొకరియందు వుంచకుండా వుండాలంటే పనిచేయకతప్పదు. ఎంతశ్రద్ధగా పని చేస్తున్నా ఫోర్‌మన్ చేత చీవాట్లుమాత్రం తప్పటంలేదు.

మధ్యాహ్నం ఫ్యాక్టరీనుండి రాగానే, ఎమిల్ స్కూలుకు పోయేవాడు. సాయంత్రం 6½ నుండి 9½ వరకు స్కూలు పాఠాలు సాగుతూండేవి. కన్నుమూతలుపడి పోయేవి; ఆ స్కూలు డస్కుమీదే తలవాల్చి నిద్రపోయేవాడు. అయినా చదవడం తప్పదు, జీవితంలో సుఖం సాధించడానికి.

చాలా రోజుల తర్వాత క్రిస్మస్ సెలవులకు, ఎమిల్ స్వగ్రామం వచ్చేసరికి, ఏదో భయం అనిపించింది. తన కలల్లో, తన స్మృతుల్లో అక్కడి ఆట స్థలాలను గూర్చి ఊహించినకంటె అవి చిన్నవిగా కనుపించాయి. అక్కడి ఆ నిశ్శబ్దత, ప్రశాంతత ఎంత అద్భుతంగా తోచాయి ఎమిల్‌కి.

కాని యిప్పుడు కెమికల్ యంత్రాలతో పనిచేస్తూన్నప్పుడు అతని భావాలు మార్పు చెందినవి.

"ఆరోజులలో జీవితం దుర్భరంగా ఉండేది. యువకులనేకమంది మధ్య లోనే పని వదిలేసి పోయేవారు. ఎన్నోవిధాల ఎమిల్‌కు అద్భుతమైన అనుభవం కలిగింది. గ్రామ ప్రాంతాల్లో ఎవరికి వారే తమ జీవితాలను సరిదిద్దుకొనేవారు. కాని యిక్కడ పరిస్థితుల ననుసరించాలి. సంఘ జీవితానికి అలవడాలి. మన ప్రకృ వానికున్న నైపుణ్యాన్ని సంపాదించాలి. మన కిష్టమైనా కాకపోయినా మనల నావరించిన ప్రమాదాల మధ్య, భూమిమీద గట్టిగాకాలూని ప్రరోగమించాలి. కష్టాలను అతిక్రమించే సాధనల నలవరచుకుంటేనే కష్టమైన పనులను సాధించగలుగుతాము. వేగంగా, సక్రమంగా, నిర్దిష్టంగా మన మనోనిశ్చయా లేర్పడుతాయి."

కెమికల్ శాఖకు మార్చబడినప్పుడు ఎమిల్ ఎక్కువగా సంతోషించాడు. తన తెలివితేటలను చూపించగల అవకాశము యిక్కడున్నది. సమస్య లన్నిటిని అవగాహనచేసుకునేవాడు. అనుభవాన్ని సంపాదించాడు. ఆ కుళ్లు పండ్లగాముతో, ఆ 'ఏసిడ్ల' మరకలవస్త్రంతో, ఆ రసాయనాల కంపుల్లోమధ్య, రబ్బరు శాఖలోకన్నా శతాధికానందము పొందగలిగాడు ఎమిల్.

1939 మార్చి విషాదచ్ఛాయలు వెదజల్లిన మాసం. ఎమిల్ ఫాసిస్టుసైన్యాలు దిగడంచూచాడు. ఫ్యాక్టరీ ఆవరణలో హిట్లరు బంట్లు ఒకరినొకరు ఆలింగనంచేసికొనుట చూచాడు. 'జిలన్' వీధులలో స్త్రీలు, పిల్లలు మొరలుపెట్టడం విన్నాడు. రాబోయే భీకరపరిస్థితిని తలచుకొని అందరి హృదయాలూ స్థంభించిపోయినవి.

ఫాసిస్టులు ఫ్యాక్టరీని వశపరచుకున్నారు. ఫ్యాక్టరీ పని పరిమితం చేయబడింది. పరిశోధన లాపుచేయబడ్డవి. పరిశోధనాలయంలో ఉన్నవారందరూ, 'జెక్కు'వారే కాబట్టి, ఎమిల్ నిశ్చింతగా తన చదువు సాగించాడు; పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు; తన పనిలో నిమగ్నుడై కాలం గడుపుతున్నాడు.

తనకు బాధకలిగించినవి ఈ ఆటలు. 'బాటా' విద్యార్థులు పాఠశాలల ఆటల పోటీలలో పాల్గొనేందుకు 'బ్రూనో' నగరం వెళ్ళారు. ఎమిల్‌కూడా వెళ్ళవలసి వది. ఒక క్రీడల వార్తాపత్రిక జయం సంపాదించిన జట్టుకు ఒక 'వెండి

హారం' బహూకరించింది. 1500 మీటర్ల పందెములో ఎమిల్ ద్వితీయుడుగా వచ్చాడు. అప్పటికప్పుడే, మిత్రుడు 'కృపీకా'ను ఓడించాడు. జిలన్ నుండివచ్చిన జట్టుకు బహుమానము లభించినది.

మళ్లీ, తన పనిలో నిమగ్ను డయ్యాడు. 'బ్రూనో'లో జరిగిన విద్యార్థి పోటీలను గురించి తలచుకున్నప్పుడల్లా నవ్వు ఆపుకోలేకపోయేవాడు. నిజంగా, అంతా ఆనందంగా గడిచింది. ఆ పోటీలు, ఆ ప్రజల అభిమానం, తాను పరుగెత్తునప్పుడు, తన తోటి విద్యార్థులు ఉత్సాహపరుస్తూ అరచిన అరుపులు, నల్లటి మొత్తుకలుగల ఒక బొమ్మను ఎత్తి చూపించి, తన్నుత్సాహంలో నింపిన వారి నినాదాలు - ఒక ఘట్టం పూర్తికాగానే 'అలారం క్లాక్'తో శబ్దం చేసేవారి ఆనందం- ఇంత ఉత్సాహంమధ్య తన బాధ్యతను మరవలేకపోయేవాడు. ఏదో వ్యర్థభావం అతన్నావరించేది. ఆ భావం అతనిని దిగనారజేసేదా, గలపరచేదా ? "నువ్వు యింకా శిక్షణ పొందాలి ఎమిల్" అన్నా రందరూ.

"నా కాళ్లు బలంగానే ఉన్నాయి. కాని నా చేతులు నీరసంగా ఉన్నాయి. నా చేతులకు బలం సంపాదించాలి" అనేవాడు తను.

ఆ ఉపాధ్యాయుల్లో, క్రీడా శాఖకు నాయకుడైన ఒకరుమాత్రం ఎమిల్ అంటే ఎక్కువ అభిమానం చూపేవాడు. ఎమిల్ కిది సంతోషం కలిగించేది, ఆనందంలేని ఆ పట్టణపు వాతావరణంలో.

ఆ ఆకురాలు కాలంలో చెలరేగే గాలుల మధ్య ఆటలకు అవకాశము లేదు. మళ్లీ వసంతంకోసం ఎదురుచూస్తూ ఆటగాళ్లంపెరూ ఒకరివద్ద నొకరు సెలవు తీసుకొన్నారు.

"వచ్చే సంవత్సరంవరకు సెలవు, జటోపెక్"అన్నారు మిత్రులు.

"సెలవు" అన్నాడు ఎమిల్, వచ్చే సంవత్సరం యింకా ఆటలకూ, తనకూ మరేమి సంబంధం అన్నట్లుగా, అమాయకంగా.

"పరుగెత్తడమా ! ఎందుకుకూడదు." కాని ఆత్మానందం కొరకు, సాయంత్రం వేళల్లో, చీకటిపడ్డ తర్వాత, ఆ అడవుల్లోకి పరుగెత్తుకు పోయేవాడు. కాని పరుగు పోటీలవిషయం ఎంతమాత్రం వినదలచుకోలేదు.

అనుకోకుండా, 1942 వసంతాగమనంతో సమరజీమూతాలు చెదిరిపోతున్నాయి. ఆ నిరాశా వాతావరణంలో ఆశాకిరణాలు ఆనందానికి దారితీయ మొదలుపెట్టాయి. అధికారంలోనున్న వారు, విద్యార్థుల హాస్యాలకు గురిఅవడం ప్రారంభమయింది. జీవితంలోకి ఒక నూతన ధైర్యం ప్రవేశించింది. ప్రజలు చైతన్యంతో ఊగిసలాడడం మొదలైనది. ఏదో పనిచేయాలన్న కుతూహలం బయలుదేరింది ప్రజా హృదయంలో. శత్రు వింకా ప్రవేశించనిది క్రీడాశాఖ ఒక్కటే. ఆటస్థలాల్లో నిర్భయంగా సమావేశమయి సంభాషించుకుంటూ, సంతోషంగా కాలం గడపడాని

కవకాశమున్నది. అందుచేత, యువకులు క్రీడాస్థలాలలో గుమిగూడడం ప్రారంభమయింది; ఆటలు యువకులను ఆకర్షించాయి.

అప్పుడే సాంకేతిక విద్యాలయం, 'బాటా' హాస్టల్‌తో పందెములోనికి దిగినది.

"ఎమిల్! నువ్వు పరుగెత్తాలి" అన్నారాతని మిత్రులందరూ. ఏదో సాకు కోసం వెదికాడు ఎమిల్. 'బ్రూనో'లో తాను చూపిన సామర్థ్యం తర్వాత కూడా, తనకు చేతకాదంటే నమ్మేదెవరు? తనకన్న వేగముగా పరుగెత్తగలవారనేకు లున్నారన్నాడు. వ్యాయామ శిక్షణానంతరం ప్రతి ఉదయం స్నేహితులతో చిన్న పరుగు పందేలలో వెనకపడేవాడు బుద్ధి పూర్వకంగా; ఇంక నేనెందు కీపోటీలలో అనేవాడు.

కాని ఎమిల్‌ను తోటి స్నేహితులంతా బాగా ఎరుగుదురు. "ఏం, ఫరవాలేదు. ఎలాగో ఆతన్ని అంగీకరింపచెయ్యవచ్చు; ఎవరైనా ఏమైనాకోరితే, కాదన లేదు, ఎమిల్" అనుకున్నారు స్నేహితులు.

భవిష్యత్తులో, ఎప్పుడైనా తన స్వీయచరిత్ర చెప్పవలసినప్పుడు, యీ బలహీనాన్ని గూర్చి ఆతడు చెప్పితీరాలి. ఈ బలహీనతే, యీతని ఉత్తమ సాధనకు ఉపకరించుట విధికృతము.

తన బాధ్యతను గుర్తెరుగకుండా, సోమరిగా జీవితాన్ని గడపినట్టయితే అప్పుడు యీ ప్రయత్నమే విరమించుకొనేవాడు. కాలగర్భంలో అడుగునపడిపోయేవాడు. ఏదో కాలం గడుపుతూండేవాడు. ఎప్పుడూ విజయాలు సాధించలేని సోమర్లను గూర్చి ఆలోచించే దెవరు?

అందుచేత, తన అదృష్టానికి తానే కర్తగా పరిణమించాడు. సాధిద్దామనే సాహస స్వభావం, అతని సహజ మనోప్రవృత్తి అతనికి అండగా నిలచాయి. పోటీల్లో దిగినతర్వాత తన యావచ్ఛక్తినీ ఉపయోగించేవాడు; అప్పుడే ప్రతిపక్షులను అజేయుడు. ఈసారికూడా అదేపరిస్థితి; 1500, 3000 మీటర్ల పందెపు పోటీలు సునాయాసంగా గెలిచాడు.

మొదటిసారి తన స్నేహితుల సుహృద్భావంతో తన విజయాన్ని సాధించగలిగానని ఆతను ఒప్పుకొన్నాడు. ఈ విజయమును ఆతడు గర్వకారణంగా భావించలేదు; అయినా తాత్కాలికానందాన్ని మాత్రం ఆతనికి గలగజేసినది.

ఆ ఆదివారం మరొక విస్మయసంఘటన జరిగింది. "ఎమిల్, తొందరపడు" అన్నాడొక స్నేహితుడు. " 'ఆలీ' నీతో మాట్లాడుతానంటున్నాడు."

ఆ రోజుల్లో "ట్రాక్ రేస్"లలో 'ఆలీ' అద్భుత ఖ్యాతి గన్నవాడు. ఒక్క జిలిన్ నగరంలోనే కాదు, జెకోస్లావేకియా మొత్తంమీద ఆతని ప్రతిష్ఠ వ్యాపించింది. సోమవారం ఉదయపు వార్తాపత్రికల్లో ఆతని పేరు తప్పక కనిపిస్తుంది. దూరపు పరుగు పందేలలో ఆతనిని మించినవారు లేరని అంటారు. జిలిన్‌లో ప్రతి పిల్లవాడూ అతన్ని గుర్తిస్తాడు; అతనంత ప్రజాదరణపొందిన వ్యక్తి.

"నాతో మాట్లాడా లన్నాడా!"

ఎమిల్ నమ్మలేకపోయాడు. అయినా వెంటనే 'ఆలీ'ని కలియడానికి మిత్రులతనిని తీసుకుపోయారు. ఈసారి యిష్టంగానే, 'ఆలీ'ని కలియడానికి ఎమిల్ వెళ్ళాడన్న విషయం గమనించదగినది. కొంత భయం, కొంత ఆందోళన; కాని ఆనందం కూడ లేకపోలేదు; ఏమో, ఏం ప్రమాదం జరగనున్నదో!

అక్కడ, 'ఆలీ' కెదురుగా నిలబడ్డాడు ఎమిల్; 'ఆలీ' పొడగరి; అందమైన జుట్టు, ఆకర్షించే ముఖం.

"అయితే నువ్వేనా! ఎమిల్ వి. నువ్వు బాగానే పరుగెత్తుతావే? ఈపోటీలలో ఈ వ్యాయామాలలో ఎన్నాళ్ళబట్టి నీ కనుభవం" ప్రశ్నించాడు ఆలీ.

ఎమిల్ ఏదో గొణిగాడు; ఏం చెప్పాలో తెలియలేదు. ఆలీ యిది వినిపించకపోయినా, "నీకిష్టమయితే రేపు సాయంత్రం స్టేడియంవద్దకు రా! ఇద్దరం కలిసి శిక్షణ సాగిద్దాం" అన్నాడు.

ఒక్కక్షణంకూడా ఆలోచించలేదు ఎమిల్. అంగీకరించినట్టు తలూపాడు. మర్నాడు 'స్టేడియం' దగ్గర హాజరు.

"రావోయి మొదట మనమిద్దరం కొంచం పరుగెత్తుదాం." అసలు శిక్షణ ప్రారంభమయింది. ఆలీ నడకతీర్లు చూపించాడు. ఎమిల్ అనుసరించడానికి ప్రయత్నించాడు. శరీరం విరిచాడు, సాగతీశాడు; కాళ్ళ, చేతుల విన్యాసం కనబరచాడు ఆలీ; ఎమిల్ కూడ అదేవిధంగా చేశాడు ఆలీని గురువుగా భావిస్తూ. ఆ ఆట స్థలంలో తదేకదీక్షతో, తన గురువుని అనుసరిస్తూ కొత్త విషయాలను ఆసక్తితో నేర్చుకున్నాడు. గురువు, శిష్యుని చూచి సంతోషించాడు; మెచ్చుకున్నాడు.

"అదుగో ఆ గమ్యస్థానానికి 300 మీటర్ల దూరం. ఇక్కడనుండి పరుగెత్తి చూద్దాం" అన్నాడు గురువుగారు.

ఎమిల్ పరుగెత్తాడు. కాళ్లు వేగంతో విసురుతూ, చేతుల సహాయంతో శరీరాన్ని నిడివిగాచేసి పరుగెత్తాడు. గురువు ఏమనుకుంటున్నాడో అనే ఆతని దృష్టి; తన పూర్తిబలాన్ని వినియోగించుట ఎంతకష్టమో, ఎమిల్ మొదటిసారి గ్రహించాడు. గమ్యస్థానంనుండి నిమ్మళంగా నడుచుకు వచ్చాడు. ఆలీ తన దగ్గరున్న "స్టాప్ వాచి"ని దీర్ఘంగా చూస్తున్నాడు. ఎంతసేపు తాను పరుగెత్తాడో తెలిసికోవడానికి ఎమిల్ ఎంతో ఆతృతపడ్డాడు. ఆలీ "వాచీ"ని మూసివేసి, ఏమీ మాట్లాడలేదు. "ఇదంతా శిక్షణాపద్ధతి కాబోలు; ఎంత 'టైము'లో నేను పరుగెత్తానో నేనే తెలిసికోకూడదు కాబోలు, అనుకున్నాడు అమాయకుడు ఎమిల్. అడగడానికి ధైర్యం చాలలేదు.

ఇంటికి పోతూకూడ ఆలీని గూర్చే ఆలోచిస్తున్నాడు. ఆతని మనస్సులోని భావా లేమిటోఅనే ఆందోళన. "నేను సరిగ్గా పరుగెత్తలేదనే నా ఉద్దేశం. నా మీద అనవసరంగా ఆశలు పెట్టుకున్నందుకు ఆలీ విచారిస్తూంటాడు" అని అనుకున్నాడు.

ఉదయమే ఆఫీసు. "అదే మంచిపని. నన్నింక యీ ఆటల జోలికి రానీయరు."

"జటోపెక్! నీ కోసం టెలిఫోన్" అని ఎవరో పిలిచారు.

ఎవరై ఉంటారు? ఏమీ ప్రమాదం కాలేదుకదా అనుకుంటూ ఎమిల్ "రిసీవర్" అందుకున్నాడు, ఆత్రుతగా.

"మాట్లాడేది ఆలీ" అని వినబడ్డది. "నీ వెలాగు నిద్రపోయావు?"

"బాగానే నిద్రపట్టింది. వందనాలు" అన్నాడు ఎమిల్ వణకే గొంతుకతో. ఎలా నిద్రపట్టిందనే ప్రశ్న తన్నుఉద్దేశించి ఎవరైనా అడగడానికి అదే మొదటిసారి.

"నిన్ను గురించే ఆలోచిస్తున్నా; సహజంగా నిన్నుగూర్చి నేను తెలిసికో వలసింది, నీ ఆహార వ్యవహారాలు అలవాట్లను గూర్చి. నీ వెక్కడ ఎలాగని నివసిస్తు న్నావు? నీ ఉదయపు భోజనానికి ఏం తీసుకుంటావు" అని అడిగాడు ఆలీ.

ఒకసారి గట్టిగా నవ్వుదా మనిపించింది వెంటనే అతని నయనాలు అశ్రుపూరితా లయినాయి. తన తండ్రికూడా ఎప్పుడూ, 'ఎలా నిద్రపోయావు, ఏం తింటున్నావ'ని అడగలేదు. ఎమిల్ ఏదో సమాధానం చెప్పడాని కాలోచిస్తున్నాడు.

"నన్ను నమ్ము, యిదంతా శరీర వ్యాయామానికి అవసరం. అయితే 'హొసెక్' విషయం ఏమంటావు," అన్నాడు ఆలీ. క్రీడలనుగూర్చిన వార్తల నింకా ఎమిల్ చదవ లేదు. ఎవరెవరి వేగమెంతో పోల్చి చూడలేదు.

"1500 మీటర్ల పరుగు పందెం 4 నిమిషాల 6 సెకండ్లలో 'హొసెక్' పూర్తి చేశాడు. ఆ విషయం ఏమంటావు" అని ఆలీ అందిచ్చాడు.

"అద్భుతం" అన్నాడు ఎమిల్ ఆశ్చర్యం తెలియజేస్తూ.

తన 4 నిమిషాల 20 సెకండ్లతో పోల్చిచూచుకొని ఆశ్చర్యం కనబరచాడు.

"అవును, ప్రారంభదశ కష్టదశ. 'హొసెక్'కూడా ప్రారంభంలో కష్ట పడ్డాడు. వచ్చే 3000 మీటర్ల పందెంలో మనం పోటీచేయుటవిషయంలో నీ అభి ప్రాయం ఏమిటి" అని అడిగాడు ఆలీ.

"నేనా, నేనుకూడానా?" తన చెవులను తనే నమ్మలేకపోయాడు ఎమిల్.

"అవును నువ్వు. నువ్వు నాతో పరుగెత్తుతావు. అయితే శిక్షణమాత్రం ఆపు చేయుటకు వీలులేదు. ఈ రోజు వస్తున్నావా?"

"తప్పకుండా, తప్పకుండా" అని వాగ్దానం చేశాడు.

'రిసీవరు' అంతతో వదలి, ఎమిల్ లేబొరేటరీకి వెళ్ళినాడు. సంతోషంతో గాలిలోకి ఎగిరిపోదా మనుకున్నాడు. పరవశుడయ్యాడు. ఏదో కొంత సాధించా డన్నమాట. తన్నింక వదలరన్నభావం కలిగింది. ఆరసాయనాల గొడవ త్వరగా ముగిస్తే బాగుండు ననుకున్నాడు. ఈ రోజు గంటలు నిమిషాలయితే సంతోషించే వాడు. ఎందుచేత? ఈ రోజు మళ్లీ శిక్షణకు గురువుదగ్గరకు వెళ్ళాలి.

# వీరుల అడుగు జాడల్లో

'జిలిన్' ఆటస్థలానికి యెదురుగానే విద్యుచ్ఛక్తి కర్మాగారం. ధూళి, పొగ, ఆ ఫ్యాక్టరీ గొట్టాలనుండి నిరంతరంవచ్చి ఆటగాళ్ళకళ్ళల్లోనే వుండేది. ఈ ధూళి ధూసరిత వాయువులనుండి రక్షించుకోవాలంటే ప్రతివానికి కనీసం సులోచనాలు అయినా కావాలి. అయినా ఎమిల్‌కు యీ ఆటస్థలమంటే యిష్టం. ఈ గాలితోనే తన ఊపిరితిత్తులను నింపుకొని ఆనందించేవాడు. తాను పనిచేసే స్థలంలోని వాయువుల కంటే యిక్కడ స్వచ్ఛమైన గాలిని పీల్చుటయే అతనికి సంతృప్తి నిచ్చేది.

ఒక చిన్న అవాంతరంవల్ల ఎమిల్‌ను మరొక శాఖకు మార్చుట జరిగింది. "సిలికా" పొడి చేయడం యిక్కడి పని. పిండిమిల్లులోనివానివలె వంటినిండా తెల్లని ధూళి. ముడిపదార్థాల సరఫరా యుద్ధంవత్తిడివల్ల తగ్గిపోయింది. ప్రత్యామ్నాయ పదార్థాలు ఎక్కువ అయినవి. 'జిలిన్' కర్మాగారానికి కొత్తపనులు ఒప్పగించబడ్డాయి. సహజంగా, జెక్ సాంకేతిక ప్రవీణులు ఎక్కువగా కష్టించుటలేదు. కాని వారిచేత పనిచేయించుటకు పర్యవేక్షణమాత్రం గట్టిగా జరుగుతూండేది. సాంకేతిక విద్యాలయంలో ఆఖరు పరీక్షకు ఎమిల్ సిద్ధమవుతున్నాడు. అయినా, ఆ "సిలికా" ధూళిలోమాత్రం పనిచేయుట తప్పిందికాదు. ఆ ధూళి ఊపిరితిత్తులలో స్థావరం ఏర్పరచుకొనే ప్రమాదం వుంటుంది. అందులో ముఖ్యంగా ఊపిరితిత్తులు పరిశుభ్రంగా వుండవలసిన పందెగానికి యిది మరీ ప్రమాద హేతువు. ఒక కొత్త ఉద్యోగం కొరకు దరఖాస్తు పెట్టేడు ఎమిల్ ఒకసారి. ఉద్యోగస్తుల శాఖాధికారికి యీ విషయం తెలిసింది. అధికారినుంచి ఎమిల్‌కు హుకుం జారీ అయింది.

" 'లేబర్ క్యాంపు'కు పోవాలని ఉందా నీకు" అని అడిగాడు అధికారి. ఎమిల్ మారుమాటాడకుండా వుండవలసివచ్చింది. ఉన్నదానితో సంతృప్తిపడవలసి వచ్చింది. ఈ కారణంవల్ల ఆటస్థలంలో ఎక్కువకాలం గడుపుతూ, పాడవుతూన్న తన ఊపిరి తిత్తులకు కొంత రక్షణ కలిగించుకునేవాడు ఎమిల్.

పందెమునకు ముందుగాని, పందెం తర్వాతగాని అనామధేయుడుగా ఉండే రోజులు పోయినవి ఎమిల్‌కు. గురువు తన్ను సవాలుచేసిన 3 కిలోమీటర్ల పందెంలో, గురువుకు అతి సన్నిహిత ద్వితీయుడుగా రాగలిగాడు. ఆతడి 9 నిముషాల 12 సెకండ్లు, గురువుగారి కాలంకంటె 3 సెకండ్లే అధికం.

"నీవు వార్తాపత్రికలు చూశావా ? నీ పేరు అందులోవుంది తెలుసా" అని స్నేహితు లతనిని పలుకరించిన వెంటనే, ఎమిల్ వార్తాపత్రిక కొన్నాడు.

"జటోపెక్ ఉత్తమ పరుగు ప్రదర్శనం" అని చదివాడు ఎమిల్; ప్రక్కన పడేశాడు పత్రిక; వెంటనే మరు పత్రిక తీశాడు; మళ్లీ చదివిందే చదివాడు:"జటోపెక్ ఉత్తమ పరుగు ప్రదర్శనం".

ఈ విషయం పత్రికలో ప్రచురించిన మొదటి సంపాదకు డెవరో, ఆ భగవం తునికే తెలుసు. పదిసార్లయినా యీ సంతోషం కలిగించే వార్తను పత్రికలో చదువుకొని ఉంటాడు. ఎందుచేతనంటే తన భవిష్యత్తును దిద్దగల సంఘటన యిది. ఆ పిన్న హృదయంలో ఆశలు చిగురించాయి. విజయవంతులైన ఆటగాళ్ళ ప్రఖ్యాత కుటుంబంలో చేరేడు ఎమిల్. ఎమిల్ వ్యక్తిజీవితానికి స్వస్తి; ఆతని జీవితం ప్రజా హితైషజీవితంలో అంతర్భాగమైపోయింది.

'జేటవ్' ప్రాంతంలో 1500 మీటర్ల పరుగు పందెంలో ఎమిల్, ఆలీ పాల్గొన్నారు. ఆలీ 4 నిమిషాల 14.2 సెకండ్లలో పరుగు పూర్తిచేశాడు; జటో పెక్‌కు 4 నిమిషాల 14.4 సెకండ్లు పట్టింది. 21 సంవత్సరాల వయసుగల జటోపెక్ నకు అదే అద్భుతమైన ప్రదర్శనం.

ప్రతి కొత్త పందెము, ప్రతివేగపు పరుగు ఆతనిని యీ పోటీలకు బంధించి వేసినవి. 'జిలిన్' పట్నపు పరుగు పందేలలో పాల్గొన్న యువకులలో శ్లాఘించి శిక్షణపొందుతూన్నవానిగా పేరు సంపాదించాడు. పూర్వం రసాయనశాస్త్రంలో ఎంత అభిమానం చూపించాడో, యిప్పుడు ఎమిల్ ఆటలలోఅంత వుత్సాహం చూపిస్తు న్నాడు. అనుభవంగల పరుగు పందెగాండ్ర సలహాలపరంపరను పూర్తిగా విని యోగించుకొనుటకు ఎమిల్ నిశ్చయించుకొన్నాడు. దూరపుపరుగు పందేల ప్రవీణుడు 'టోమస్ సేవ్' "ట్రాక్" మీదకు రాగానే, ఎమిల్ తన కళ్ళను అప్పగించి శ్రద్ధతో చూసేవాడు; ఆతనినుండి నేర్వవలసినదంతా నేర్చుకొనేవాడు, గౌరవపురస్సరంగా అనుభవైకవేద్యాల కథల నాలించేవాడు. కాని వారి దీక్ష చకితునిచేసేది ఎమిల్‌ని. ఎందుచేత? ఆటస్థలం ఆనందానికి యువకుల హృదయావేశానికి నిలయమని ఆతని అభిప్రాయం.

"నువ్వు చిన్న పిల్లవాడివి" అనేవారు అనుభవం సంపాదించిన పెద్దలు ఈర్ష్యతో ముఖాలు ముడుచుకొని, ప్రక్కనుండి పరుగెత్తుకుపోతూ. వారివలెనే ముఖంలో ఒక తీవ్రతను అలవరచుకొనుట మొదలుపెట్టేడు ఎమిల్ వారికి జవాబుగా. కాని ఆ తీవ్రత కా ముఖంలో ఆట్టేకాలం స్థానముండేది కాదు. ఒక్క నిముషం అలా వుండేవాడు. మరు నిమిషం అతని ముఖారవిందం విప్పారేది; ఆనందం తొణికిసలాడేది.

శిక్షణ కెవరు పిలిస్తే వారితో కలసిపోయేవాడు. సహనం, ఓర్మి, వేగం ఇవి అలవరచుకొనడానికి ఆతృతతో వుండేవాడు. అయినా వాటినిగూర్చి ఎక్కువగా ఆలోచించేవాడు కాదు. ఇదేకాక, అనేక విధాలయిన వ్యాయామ శిక్షణకు లోను జేస్తూండేవాడు తన శరీరాన్ని.

ప్రజల అభిరుచుల ప్రకారం నడవటమంటే ఎంతో యిష్టపడేవాడు; జంతువు లనుకూడా యెప్పుడూ బాధపెట్టే స్వభావం కాదతనిది. ఎప్పుడూ నవ్వాలి, నవ్వించాలి; యిదీ అతని స్వభావం. ఇతరులవల్లకూడ ఆనందాన్ని ఆశించేవాడు

ఎమిల్. పగలు, లేబరేటరీలో కాలం వెళ్లబుచ్చేవాడు. కాని, ఆటస్థలానికి రాగానే ఆఫీసు బాధలను మరచేవాడు. పందెపుదుస్తులు తొడగగానే ఆ యువకునిలో ఆనందం పొంగి కట్లు తెగిపోయేది. ఆటలు అతనికి సంతోషం, సుఖం కలిగించేవి. అయినా కృత్రిమ ఆశాసౌధాలను నిర్మించుకునే తత్వం కాదతనిది.

జటోపెక్ అలా అనుదినం శిక్షణపొందేవాడు. తనలో అభివృద్ధి లక్షణాలు కనబడ్డప్పుడు సంతోషించేవాడు. ప్రేక్షకులు లేని ఆ స్టేడియం ఆవరణలో తన వేగాన్ని వృద్ధిచేసికొనుటకు తన్ను తాను పరీక్షించుకొనేవాడు. క్రమంగా తన ఆయాసాన్ని క్షీణింపచేసికోగలిగానని సంతోషించేవాడు.

తన గురువు ఆలీతోసహా ఎప్పుడూ పందేలలో ప్రవేశించేవాడు. ఎవ రేమన్నా, ఎమిల్ పట్టించుకొనేవాడుకాదు.

"ఆలీ వుండగా, నీ వెప్పుడూ ద్వితీయుడవే; యితర ప్రదేశాలలో నీ అంతట నువ్వు పందేలలో ప్రవేశించు; ను వ్వప్పుడు ప్రథముడుగా విజయాన్ని పొందుతావు. ఆ పరుగువేళల నొక్కసారి పరీక్షించు. అనేక పందేలలో, నీవు రెండవవానిగా వచ్చుటకు పడిన బాధ కెన్నో రెట్లు గెలుపొందిన వ్యక్తి బాధపడ్డట్లు గుర్తించగలవు" అనేవారు కొందరు. కాని, ఎమిల్ జవాబు చిరునవ్వుమాత్రమే. "అయితే ఏమంటారు? గెలుపొందడంకాదు నా లక్ష్యం; నాకు నేర్చుకోవడమే ప్రధానం" అనేవాడు వొక్కొక్కప్పుడు.

అలాగే ఓపికగా శిక్షణపొందేవాడు. ఎంతో ఆప్యాయంగా, ఆనందంగా పరుగు పందెములలో ప్రవీణులు చెప్పిన మాటలను, సలహాలను ఆచరణలో పెట్టి పరుగెత్తేవాడు; కొత్త అనుభవాలను సంపాదించేవాడు. అంతకంతకు తన వేగం అధిక మవుతూవచ్చింది; తనకు నేర్పిన గురువు లొక్కొక్కరిమీద తనశక్తి ప్రయోగం చేయగానే, ఒకరి తర్వాత ఒకరు అతని వెనుకపడిపోయారు; ఎమిల్ పురోగమిస్తున్నాడు.

ఆ రోజులలో దూరపు పరుగు పందేలలో ప్రవీణులు జిలన్‌లో అసంఖ్యాకులుగా ఉండేవారు. ఒక "రిలే రేస్" లో పాల్గొనడానికి మొట్టమొదటిసారి వారితో ప్రేగ్ పట్టణానికి ప్రయాణమయ్యాడు ఎమిల్. 'సేల్', 'ఆలీ', కుంట్ లతో ఎమిల్ కూడా ఉన్నా, జిలన్ జట్టు 4 × 1500 మీటర్ల పందెం గెలిచింది. అప్పుడు ఎమిల్ మీద ఎవరికీ ప్రత్యేకదృష్టిలేదు. తనమట్టుకు తనకే జాయింట్‌గా ఆ కీర్తిని పొందడానికి అర్హత సంపాదించికూడా, ధైర్యంగా తానా ప్రతిష్టకు భాగస్వామిగా పరిగణించుకోవడానికి సిగ్గుపడేవాడు.

అది 1942 వ సంవత్సరం. ప్రేగ్‌లో ఆ సంవత్సరం జరిగిన జాతీయ ఆటల పోటీలలో ప్రప్రథమంగా ఎమిల్ పాల్గొన్నాడు. ఆటలలో వయసుమళ్ళినవారు తగ్గి, యువకులు ముందుకువచ్చిన మొదటి సంవత్సరమది. కొత్తపేర్లు వినబడుతున్నాయి. ఏదో భయంభయంగా కొత్తవారు వెనక వెనక నిలబడుతూవచ్చేరు, కాని అతివేగంగా, తమ ప్రజ్ఞాప్రాభవాలను ప్రజ్వలింపచేశారు.

1500 మీటర్ల పందెంలో పోటీదార్ల పేర్ల పట్టీ అద్భుతంగా వుంది. ఆర్నీ విజయుడు; జటోపెక్ 5 వ వానిగా వచ్చాడు; 4 నిమిషాల 13.9 సెకండ్లు పట్టింపతనికి; 11 వ వాడొక నూతనుడు : ఆతని పేరు 'సివోనా'. 1948 ఒలింపిక్సులో 4 వ వాడు.

"సెలవుల్లో ఎక్కడకు పోతున్నావు ఎమిల్" ఆఫీసు మేనేజరు ప్రశ్నించాడు.

"పరుగు పందెంలో పాల్గొంటున్నానండి."

వినోదాలంటే ఇష్టపడని మేనేజరు "నువ్వు పరుగెత్తుదా మనుకుంటున్నావా? స్టేషన్‌లో 'లిమనేడ్సు' అమ్ముతూ పరుగెత్తడమా? కదూ!" అన్నాడు వ్యంగ్యంగా.

"కాదు; ఆటస్థలంలో! పరుగు పందెం ఒకటి జరగబోతూంది" అన్నాడు ఎమిల్ అమాయకంగా.

ఈవిధమైన వినోదాలంటే ఆ ఉద్యోగస్థుల మేనేజరు కెంత కోపమో చెప్పలేం; నిజమైన ప్రతి ఆటగానికి అటువంటి ప్రవర్తన ఆగ్రహం కలిగిస్తుందనడానికి సందేహంలేదు. ఆటలలో ప్రవేశమున్నవాడు, ప్రవేశం లేనివానంత మంచిపనివాడు కానట్టుగా శిక్షణపొందేవాడు. తనకున్న విరామమంతా శిక్షణకు వినియోగించాలి, కష్టపడాలి, విశ్రమించడానికి వీలులేదు; ఊరికే బాధ్యతల నుండి తప్పించుకోవడమే పరమావధి కాకూడదు; అలాంటప్పుడు శిక్షణలో ఆనందమే లేదు. అసలే కష్టమైన నీ పనిని కష్టతరం చేసే ప్రభువుంటే, నీ ప్రశ్నను హేళనచేసేవారుంటే నీవు ప్రాప్తించే విజయాలకల్ల, నీకు కలిగే సంతోషమేపాటి?

ఈలాంటి భావాలు ఎమిల్ మనసును బాధిస్తూండేవి. అయినా, ఆటలలో తన మనస్సు లోతుగా పాతుకుపోవడంవల్ల, ఏవిధమైన ఆటంకాలు అతని కవరోధాలు కాలేకపోయాయి. ఆ అధికారి కాఠిన్యం అతనిని చలించనీయలేదు.

1943 వసంతంలో, 'విట్కోవిస్' రోడ్డు పందెంలో ఎమిల్ పాల్గొన్నాడు. పందెపు వీరుడు 'సేల్'తో పోటీచేస్తున్నప్పుడు, ఆతనికి ప్రోత్సాహమిస్తూన్న ప్రేక్షకులకు, అసలీ పోటీలో ప్రవేశించుటకు ముందు, ఎమిల్ ఏ అవాంతరాలను ఎదుర్కోవలసి వచ్చిందో తెలియదు. ఎట్టి అనారోగ్య వాతావరణంలో అతను పనిచేసేవాడో, అతని ఆఫీసు మేనేజరు ఏవిధంగా అతనిని దైన్యపరచాడో. ఎవరికీ తెలియదు.

వసంతాగమనం ప్రతి ఆటగాని హృదయంలో కొత్త ఆశలను రేకెత్తించింది. ఎమిల్‌కూడా అందరితోపాటే చలికాలంలో బాగా ట్రెయినింగయ్యాడు. ప్రతిరోజు రోడ్డుమీద ప్రక్కనున్న గ్రామానికి 8 కిల్లోమీటర్ల (5 మైళ్ళు) దూరం పరుగెత్తడం, మిత్రులతో కూడా వెనక్కి రావడం. స్నేహితు లెవరికీ మనస్కరించకపోయినా, తా నొంటరిగా పరుగెత్తేవాడు. మంచి తయారీలో ఉన్నట్లు విశ్వాసం కలిగింది. కాని ఏవిధంగా పోటీలలో నెగ్గగలడో ఊహించలేకుండా ఉన్నాడు. చలికాలంలో వ్యాయామం శరీరాన్ని బలంగా ఉంచుతుంది; కాని ట్రెయినింగు సరిగా జరగకపోతే ప్రమాదం కూడా ఉంది. 'విట్కోవిస్'లోని పందెం తన శక్తిని తనకు తెలియజేయగలదు; ఆ పందెములో ఎన్నో జయాలను

సంపాదించిన 'సేలు'తో పోటీ. ఆ పోటీలో 'సేలు' మంచి తయారీలో వున్నా' ఎమిల్ యొక్క ధైర్యాన్ని చూచి జడిసేడు; అందుచేత చివరవరకు ఎమిల్‌ను ముందుపోనిచ్చాడు. ఆలోచించి వేసిన ఎత్తు; చివరిభాగంలో ఒక్కసారి వేగం అధికంచేశాడు, వెంట్రుకవాసిలో మాత్రమే గెలవగలిగాడు; ఎందుచేతనంటే ఎమిల్ కూడా తరుణంలో తన యావచ్ఛక్తిని ఉపయోగించాడు.

ఈ పందెంలో చూపిన ప్రజ్ఞవల్ల, తోటివారిలో యితనికి గౌరవం హెచ్చింది. క్లబ్బులో యీతనికి మర్యాద ఎక్కువైంది; సహృదయుల సలహాలుకూడా ఎక్కువయ్యాయి.

కాని ఎమిల్ గర్వించలేదు. శిక్షణ అలా సాగిస్తూనే ఉన్నాడు. ఇదివరకు లాగే, ఎవరైనా సవాలుచేస్తే పోటీకి దిగేవాడు; వెనుకంజవేయలేదు. పరుగెత్తుట ఆతని కానందం కలుగజేసేది. అంతకంతకు అభివృద్ధిగాంచాలన్న కాంక్ష అతనిలో ఎక్కువైంది. తన క్లబ్బు స్నేహితులుమాత్రం జాగ్రత్తగా ప్రవర్తించేవారు; పోటీ దార్లెవరో తెలిసికొని, తమ విజయాని కవకాశంలేమో గమనిస్తూండేవారు.

"1500 మీటర్ల ఛాంపియన్‌షిప్పులో పోటీచేయకు; 'సేల్' నిన్ను ఓడిస్తాడు" అని సలహా యిచ్చారు, ఎమిల్‌కు ఆతని స్నేహితులు.

ఎమిల్ నవ్వేడు.

"అయితే ఏమయింది; దానిలో తప్పేముంది."

1500 మీటర్ల పందెంలో పరుగెత్తాడు; ప్రథమస్థానానికి ధైర్యంగా పోరాడాడు; రెండవవాడుగా వచ్చాడు, కాలం 4 నిమిషాల 07.4 సెకండ్లు. సేల్ వల్ల ఓటమి; కాని ఆలీని ఓడగొట్టాడు.

జిలన్‌కు తిరిగివచ్చాడు ఎమిల్; ట్రెయినింగు అవుతూనేవున్నాడు. స్టేడియం వద్ద రోజూ ఎమిల్ హాజరు; ఎంతో కష్టపడ్డాడు. తనకన్నా ప్రజ్ఞావంతులైన తన క్లబ్బు మిత్రులను గమనించేవాడు వారెంత సంతుష్టులై ఉన్నారోఅని. వారు యిదివరకు సంపాదించిన కీర్తి నీడలలో సుఖంగా ఉండడం గమనించాడు.

కాని అది తనకాదర్శం కారాదు.

"అలా ఆత్మ సంతుష్టితో ఆగిపోకూడదు" అనుకున్నాడు. "ఎప్పుడూ అంతకంతకు మించే కష్టమైన కార్యాలు సాధించడానికి పూనుకోవాలి; ఎప్పుడూ నేను వినయంగా ఉండాలి, నేను చిన్నవాణ్ణనే అనుకోవాలి."

గెలుపొందిన ప్రతివ్యక్తి తన ప్రజ్ఞ, కీర్తి మీద స్వాభిమానాన్ని నిర్మించుకొనేవాడు. కాని జటోపెక్ అసంతుష్టితో బాధపడేవాడు. ఆయన శిక్షణ పొందుతున్నాడు, నిర్విరామంగా.

"నీకు పిచ్చిపట్టిందా! ఏదో ప్రమాదం తెచ్చుకుంటావు."

"నేనింకా వెనకపడి ఉన్నా; వేగాన్ని సాధించాలి."

తనకన్నా ప్రజ్ఞావంతుల ట్రెయినింగులోని మంచి అంశాలను కనిపెట్టి, వాని మీద దీక్షచూపేవాడు. ఏదో చిన్నచిన్న దూరాలు పరుగెత్తడంతో తృప్తిపడుటలేదీ

రోజుల్లో. ఓర్మిని అలవరచుకోడానికనే ట్రెయినింగవడం యింక వదలిపెట్టేడు. వేగం సాధించడమే ఆతని పరమావధి యిప్పుడు. అదే తన అభివృద్ధికి మార్గం అని భావించాడు. 'టి. సెట్టు' యొక్క శిక్షణ సిద్ధాంతాలు కూడా అవే. ఆ రోజుల్లో ఆ సిద్ధాంతాలకే చలామణి. అలాగే జటోపెక్ పురోగమించాడు అతి వేగంగా.

ఆ వసంత ప్రారంభంలో 800 మీటర్ల పందెం 2 నిమిషాల 01.2 సెకండ్లలో పరుగెత్తాడు. తర్వాత ఆకురాలుకాలంలో ఆదూరం 1 నిమిషం 59 సెకండ్లలో సాధించాడు. అక్టోబరులో 1500 మీటర్లు 4 నిమిషాల 06.6 సెకండ్లలో పూర్తి చేశాడు. 4×1500 మీటర్ల ఛాంపియన్‌షిప్‌లలో జిలన్ జట్టును ఓటమినుండి రక్షించాడు. బొహీమియా-మొరేవియా మధ్య పందెంలో 1500 మీటర్ల పోటీలో, 4 నిమిషాల 0.1 సెకండ్లలో పరుగు పూర్తిచేశాడు. అదొక మహత్తరమైన పందెం. కొత్తగా ఆతడు సంపాదించిన వేగం, త్వరితంగా ఒక నిశ్చయానికి రాగలిగినశక్తి ఆతని విజయానికి కారణాలు.

మధ్యరకపు పందేలలో ప్రవీణులైన జెక్ దేశస్థులందరు కలసి, 'సేల్'ను ఓడగొట్టాలని ఒక పన్నుగడపన్నారు. పందెంలో మొదటినుంచీ వేగంగా పరుగెత్తి 'సేల్'కు తమకు మధ్యనుండే దూరం ఎక్కువ చేశారు వీరందరూ. ఒక్కసారి ఇంత దూరం పరుగెత్తిగాని, ముందున్నవారిని ఓడించలేరు కదా అనే నిస్పృహ ఆతని నావహించి, ఆతని ఓటమికి కారణమయింది.

కాని యింకా జటోపెక్ ఒకడున్నాడన్న సంగతి వారు మరచారు. జటోపెక్, సేల్ యొక్క అడుగుల్లోనే పరుగెత్తుతున్నాడు. కాని మొదటిలోనే ఓడిపోవడానికి తయారుకాలేదు. సేల్‌ను దాటి, యింక తక్కినవారితో పోటీకిదిగాడు. ముందున్న ముగ్గురిలో ఒకనిని వెనక్కి పంపేడు. కాని యింకా తనకు ముందు ఇద్దరున్నారు. గమ్యస్థానం 200 మీటర్లుందనగా ఆఖరు పరుగు ప్రారంభించాడు. ఇది సాధారణంగా ప్రవీణుల పద్ధతికాదు. ఆఖరు పరుగు బాగా తక్కువదూరంలోనే ప్రారంభిస్తారు.

ఈ అంత్య పోరాటంలో తన శక్తినంతా వినియోగించాడు ఎమిల్. ఎన్నాళ్ళో బట్టి ప్రేగ్ పందేలలో యింతశక్తి నుపయోగించిన దృశ్యం ప్రజలు చూడలేదు. ప్రేక్షకులు నిలబడిపోయారు; ఆకాశం బ్రద్దలైపోయింది వారి కేకలతో; ఆ సాహసికి జోహార్లు మిన్నుముట్టాయి. ఎమిల్ అందర్నీ వెనక్కి త్రోసేడు. అగ్రస్థానంలో ఉన్నాడు; అయినా పోటీదార్లు నిరుత్సాహులు కాలేదు. ఇంకా ఎక్కువ వేగంగా పరుగెత్తగలనన్న ధైర్యం ఎమిల్‌ను ఉత్సాహపరుస్తూంది. చివరి క్షణాలలో ప్రతి కక్షులు తన్నోడిస్తారా! లేదు. ఎమిల్ గమ్యస్థానపు 'టేప్'ను తన ఛాతీతో తాకి తన గెలుపును ప్రకటించాడు.

ఊపిరి బిగబట్టి పరికిస్తూన్న ప్రేక్షక సమూహం, ఒక్కసారి ఊపిరి తీసుకున్నారు; అమితానందం పొందారు. అనేక సంవత్సరాల తర్వాత విజయంకోసం సర్వశక్తుల నుపయోగించే వీరుడొక డవతరించాడు. అనేకమంది పరుగెత్తే వారున్నారు

మన కాశ్చర్యం కలగజేయగలిగిన సామర్థ్యమున్నవారు; కాని వారందరూ ఎప్పుడూ ఆశాభంగం కలగజేసేవారే. ఫలితాన్ని నిర్ణయించే ఆఖరు సమయంలో గుండె నిబ్బరం, మనోనిశ్చయం సడలేవి. 'స్లావు'జాతికుండే ఆ పట్టుదల గల వ్యక్తి యిప్పుడు యీపందేలలో ప్రవేశించాడు. పోరాటాలకు వెనుకాడడు, సంశయించడు. ఎదిరి గొప్పతనం ఆతనిలో గుండెవడ కలిగించదు. ఆందోళనలేదు; ఏ విధమైన బాధ లేదు. తన మనసుకు, తన శరీరానికి తానే అధికారి. పరవశుడు కాడు; వివశుడు కాడు; క్రీడాచరిత్రలో యిట్టి వ్యక్తులు కానరావడం కష్టం. అయితే ఆతని వయసు ఇరవయ్యొక్క సంవత్సరాలే !

# ప్రథమ విజయాలు

ఆరురాలుకాలమంతా ఎమిల్ ట్రెయినింగును వీడలేదు. చలికాలంలోకూడా ట్రెయినింగు విరామం లేకుండా సాగించడానికే నిశ్చయించాడు. పరుగెత్తడమంటే ఎమిల్‌కు ఎంతో ఆనందం కలిగించేది. ఏరోజూ పరుగెత్తకుండా ఉండలేకపోయే వాడు. అయినా తన శిక్షణ, విజయానికి అనవసరపు ప్రాముఖ్య మివ్వలేదు. తన దేశం యొక్క భావి, ప్రపంచ భవిష్యత్తు యుద్ధభూమిలో నిర్ణయమవుతూన్నప్పుడు, ఈ పందేలకన్నా ముఖ్యమైన సమస్యలు ప్రజల నెదుర్కొంటున్నాయని ఎమిల్ గ్రహించాడు.

**1944** వ సంవత్సరం అంత ఆశాజనకంగా ప్రారంభము కాలేదు. తన ఫుట్ బాల్ జోళ్ళతోటే పరుగెత్తుటవల్ల పాదాలు పుళ్ళయిపోయాయి; ఆసుపత్రిలో **14** రోజులు గడపవలసివచ్చినది. తిరిగి వచ్చేసరికి పరుగెత్తడానికి కాళ్ళకు జోళ్లులేవు. యుద్ధం ముగింపుకు వస్తూన్న ఆగోజుల్లో, జోళ్ళ ఫ్యాక్టరీలో పనిచేసే ఉజ్వల భవి ష్యత్తుగల జటోపెక్‌వంటి యువక ఆటగాడు కూడా, ఆటలను వదలివేయవలసిన పరిస్థితి ఏర్పడినది. అదృష్టంకొలది, ఆలీ, సేల్‌వంటి స్నేహితులతనికి కలరు. వారా తని కెలాగో 'టెన్నిసు' జోళ్ళను సంపాదించి పెట్టడంవల్ల, మళ్లీ పరుగెత్తడం ప్రారంభింపగలిగేడు.

ఉపాధ్యాయులకు వ్యాయామ శిక్షణ నిచ్చే స్కూలులో, జనవరి నెలలో ప్రవేశించాడు. అక్కడ, దూరపుపరుగు పందెములలో శిక్షణనిచ్చే ఉపాధ్యాయు లలో ప్రప్రథముడుగా కీర్తి గడించిన 'జోసెఫ్ హారన్' పరిచయం కలిగినది ఎమిల్‌కు. పరుగు పందెగాళ్ళకు తానిచ్చే ప్రత్యేక శిక్షణను పొందుటకు

మే నెలలో రమ్మని ఎమిల్‌ను 'హారవ్' ఆహ్వానించాడు. అనుభవం గలిగిన యీ ఉపాధ్యాయునివద్ద ఎన్నో విషయాలు గ్రహించాడు ఎమిల్. అందులో తాను ఏసిద్ధాంతాలను, సూత్రాలను స్వయంకృషివల్ల అలవరచుకున్నాడో, అవే విషయాలైనవని గ్రహించగానే ఆత ననుభవించిన ఆనందానికి అంతులేదు.

5000 మీటర్ల పందెంలో యిదివరకు 'రికార్డు'ను అధిగమిస్తానని వాగ్దానం, హారవ్ ఆతనిచేత చేయించాడు. పోయినసంవత్సరం యీ దూరం 16 నిమిషాల 25 సెకండ్లలో పరుగెత్తగలిగాడు. ఈ సంవత్సరం 15 నిమిషాల 38 సెకండ్లలో పూర్తిచేయగలిగాడు. అప్పటికున్న 15 నిమిషాల 14 సెకండ్ల రికార్డును భగ్నంచేసే అవకాశం కండ్లయెదుట కనిపిస్తుంది. ఇలాంటి 'రికార్డు' ప్రదర్శనాల విజయం, అదృష్టంమీదగాని, శారీరక బలప్రయోగంవల్లగాని చేకూరవని, ముందుగా పొందిన కఠినమైన శిక్షణమీద ఆధారపడుతుందని ఎమిల్‌కు బాగా తెలుసు.

ఎంతో ఆతృతతో, నూతనోత్సాహంతో తయారుకావడం ప్రారంభించాడు. పందెగాళ్ళ గుండె లదిరేట్లు 'ప్రాక్టీసు' కొనసాగించాడు.

"ఏమిటిదంతా! మళ్లీ స్వల్పదూరాల పందేలలో దిగబోతున్నావా" అన్నారు స్నేహితులు.

ఎమిల్ తన పద్ధతులను వదలలేదు. చిన్నచిన్న దూరాలలో వేగంగా పరుగెత్తడం, వంకలలో, మలుపులలో అతి త్వరగా పరుగెత్తడం, నెమ్మదిగా పరుగెత్తి, పరుగెత్తి ఒక్కసారిగా వేగంగా పోవడం యీ పద్ధతులలో 'ప్రాక్టీసు' చేశాడు. 200 మీటర్లు అతివేగంగా పరుగెత్తేవాడు; వెంటనే అంతేదూరం నెమ్మదిగా పరుగెత్తేవాడు.

ఈ పద్ధతులేమీ తోటివారికి భోధపడేవికావు. అంతమందీ హేళనచేసేవారు; ఎమిల్ అంటే ఎంతో అభిమానం కలవారుకూడా అతని పద్ధతులను నిరసించుటకు ఆరంభించారు.

"ఎమిల్! నీవంత కష్టపడకూడదు; నీ శక్తి అంతా ఒక్కసంవత్సరంమాత్రమే వినియోగించాలనా ? ఆ తర్వాత ఏమవదలచుకున్నావు; పందేలపోటీ మానేస్తావా?"

వార్తాపత్రికల అభిప్రాయాలను, అతనికెత్తి చూపించారు. ఫలితాలను వారు ప్రశంసించినా, పద్ధతినిమాత్రం వారు విమర్శించారు. సనాతన పద్ధతులకు వ్యతిరేకమైన అతని పరుగుపద్ధతులకు విమర్శకులు తల పంకించారు. ఇంత ఎక్కువగా, అనవసరంగా శ్రమించకపోతే, భవిష్యత్తులో, ఆతడు అద్భుతమైన విజయాలను సాధించగలుగుతాడని వారి అభిప్రాయము. ప్రస్తుత పద్ధతిలో తన శక్తినంతా అతి త్వరగా వృధాచేసికుంటున్నాడన్నారు.

ఇలాంటిఅభిప్రాయాలకు, విమర్శలకు ఎమిల్ ఏమీ విలువనీయలేదు. అతిదూరపు పరుగుపందెగాళ్ల 'స్టైల్' వ్యక్తిగత విషయమని ఆతని అభిప్రాయము. తన శరీరంలోని శక్తులను గూర్చి తనకు బాగా తెలుసునన్నాడు. అతడు విన్న విమర్శలలో ఆతని

కోసగిన సలహాలలో ఆతనికి నచ్చిం దొక్కటే; స్వానుభవమే మార్గదర్శిగా భావించాలన్నదది.

"చూడు ఎమిల్! నువ్వు ప్రధానంగా ఎక్కువదూరం పరుగుపందెగాడివి. అందుచేత, ఎక్కువ నిబ్బరాన్ని సాధించే పద్ధతి నవలంబించాలి. పందెంలో పాల్గొన్నప్పుడు, ఎలా పరుగెత్తాలో ఆ పద్ధతిని అలవరచుకోవాలి. తేలికగా పెద్దడుగుల పరుగుపద్ధతిని నేర్చుకో" అనేవారు.

కాని ఎమిల్‌కు యీ సలహా ఎంతమాత్రం నచ్చలేదు. ఎంతసేపూ దూరపు పందేలను సాధించే పద్ధతినే అనుసరిస్తే, వేగం సాధించే మనస్తత్వం అణగారిపోతుం దంటాడు. ఎమిల్ 'రికార్డు'ను భగ్నం చేయాలంటే, పరుగువేళ తగ్గించాలంటే వేగప్రగతి అధికం కావాలి.

ఎమిల్‌కున్న అభిప్రాయాలతో ఎవరూ ఏకీభవించరని అతనికి అర్థమయింది. అయినా వాటిలో మార్పుకు అంగీకరించలేదు.

"అతి త్వరగా వేగంగా నేను పరుగెత్త గలిగినంతకాలం, పందెపు చివరి భాగంలో నాకు ఫలితాలెక్కువ లభిస్తాయి. ఎక్కువ బాధకు, కష్టానికి నా శరీరం అలవడుతుంది. దానివల్ల నా సహనశక్తి వృద్ధిపొందుతుంది" ఇదీ, ఎమిల్ వాదనా ధోరణి.

అప్పుడప్పుడు ఎవరో ఒకరు యీతనితో సవాలు చేయుట జరిగేది. కాని ఎమిల్ యొక్క త్వరితగతి నిర్భేద్యమయ్యేది. అలాంటి శిక్షణకు ఎవరూ తట్టుకోలేక పోయారు. ఆ విషయంలో ఏకాకిగా నిలబడిపోయాడు.

"అతిదూరపు పరుగు పందెగాళ్లను నేను మించాలంటే, వేరే పద్ధతుల నవలంబించాలి; కాని నా పద్ధతే ఉత్తమోత్తమమైనదని చెప్పలేను. కాని ఓపిక పట్టాలి; అప్పుడు ఫలితాలు వాటంతటవే మార్పాడుతవి. నా మట్టుకు నాకే ఆఫలితా లెలాగుంటాయా అని ఆతృతగా ఉంది".

అయినా తన 'ప్రాక్టీసు' తగ్గించలేదు; హెచ్చించాడు. తన గుండె ఎలా కొట్టుకుంటుందో పరీక్షించుకున్నాడు. ఏ విధంగా ఆయాసపడేవాడో, ఆ ఆయాసపు రీతి ఎలాంటిదో గమనించాడు. తన శరీరం ఎంతకష్టం ఓర్వగలదో తెలిసికోడానికి ప్రయత్నించాడు; ఎంతవరకు ఆరోగ్యంగా ఉన్న వ్యక్తి తట్టుకోగలడు, ఈ పరిశోధనలు ఒక్క ఆటస్థలంలోనే కాదతడు సాగించింది.

ఫ్యాక్టరీకి వెళ్లేమార్గం 'పాప్లార్'చెట్ల వరసకు ప్రక్కనున్నది. ఈ మార్గాన్ని తన శరీరాన్ని బాధపెట్టి, ఎంతవరకు ఓర్వగలదో పరీక్షించడాని కుపయోగించాడు. 4 వ చెట్టు చేరేవరకు ఊపిరి బిగపట్టేవాడు. మొదటిసారి, మరునాడుకూడా ఆచెట్టు వరకే; మూడవరోజు 5 వ చెట్టువరకు; ఈ విధంగా ఊపిరి నాపుటకు ఒక శిక్షణ నలవరచుకున్నాడు. తల తిరిగిపోయేది; ఛాతీ మీదకుక్రిందకు గంతులు వేసేది. చైతన్యం పోతూన్నట్లనిపించేది. కాని ధైర్యంతో సాగించాడు తన ప్రయత్నాన్ని; అలా, ఆఖరు పాప్లారుచెట్టువద్దకు వచ్చేసరికి తెలివితప్పి పడిపోయాడు.

ఇదంతా ఆ ఈతగాని కథలాగ వినిపిస్తుంది; నీటి అడుక్కిపోయి, చచ్చినాసరే ప్రతికక్షికన్నా ముందు నీటిపైకి రాకూడదన్న ఈతగాడి కథలాగుంది. కాని ఎంత మానవాతీతమైన మనోనిశ్చయం, హృదయస్థైర్యం యిట్టి కార్యాలకవసరమో గమనించతగ్గది.

ట్రెయినింగు అవుతూన్నప్పుడు 10, 12 పరుగులు తిన్నగా మహత్తర వేగంతో సాధించేవాడు. ఒకసారి, యిట్టి పరుగుల అనంతరం చన్నీళ్ళ స్నానంచేసి జలుబు తెచ్చుకున్నాడు. ఎంత శక్తివంతుడైనా, చేసే కష్టకార్యాలకు పరిమితి వుండాలి. ఈ విషయం ఎమిల్ క్రమంగా గ్రహించాడు. ఈవిధంగానే మరొక గుణపాఠం నేర్చుకున్నాడు. పరిమితుల గ్రహించి పనులను సాధించుట అతి ముఖ్యమైన విషయం.

తర్వాత తర్వాత ఆయాసం వచ్చేది, అలసిపోయేవాడు. సుళువుగా చిరాకు పడేవాడు; నిద్ర సరిగా పట్టేదికాదు; చిన్న జ్వరం ప్రారంభమయింది. యధార్థం ఏమంటే విసిగిపోయాడు; శిక్షణ భరించగలిగినదానికన్న అధికమయిపోయింది. అదృష్టంకొద్ది తన తప్పు గ్రహించాడు; ఏంచేయాలో తెలుసుకున్నాడు; జ్వరం వదలగానే 'ట్రైనింగు' తగ్గించాడు. ఆ తగ్గించడం అతి కొద్దిగానే! ఒక్కొక్కప్పుడు 100 మీటర్ల పరుగు పదిసార్లు, మరొకసారి 200 మీటర్ల పరుగు 10 సార్లు; ఇంకొకసారి 400 మీటర్లు 6 సార్లు. ఈవిధంగా 'ట్రెయినింగు' సాగించాడు; వేగ గతిని వృద్ధిచేయుటకు చేసే ప్రయత్నాలనుమాత్రం విరమించలేదు.

1944 జులైలో పందేలలో పాల్గొనుటకు 'ప్రేగ్' నగరానికి మరల ప్రయాణమయ్యాడు. 'ప్రేగ్' నగరం అప్పుడు శోకానలంతో దగ్ధమయింది. ఆటగాళ్ల నేకులు 'కాన్సెన్ట్రేషన్ క్యాంపుల'లో మ్రగ్గిపోతున్నారా రోజుల్లో; చాలామంది స్వాతంత్ర్య యుద్ధంలో ప్రాణాలను పోగొట్టుకున్నారు. అయినా దేశంయొక్క జాతీయ సైన్యం పూర్తిగా నశించలేదు; మరల ఆశలు రేకెత్తాయి.

1500 మీటర్ల పరుగులో పాల్గొనమని ఎమిల్‌కు 'ఆగి' సలహా యిచ్చాడు. 'సివోనా' ఒక్కడే యీపోటీలో తన్నోడించగల సమర్థుడు. ఈతని సెప్టెంబరు దాకా గెలుస్తూ వచ్చాడు. ఈతని నెన్నోసార్లిది వరకు తానోడించాడు; 'సివోనా' ఒక్కడే ఒకపందేనికి, మరొక పందేనికి అభివృద్ధి కనబరుస్తూ వచ్చేడు.

మధ్యరకపు పరుగు పందెంలో సివోనా స్వల్పంగా ఎమిల్‌కన్నా ప్రస్ఫుటంగా కనబరుస్తున్నాడు. 4 నిమిషాల 02 సెకండ్లలో ఎమిల్ పరుగు పూర్తిచేసినా, సివోనా కొంకవాసి తక్కువే.

"5000 మీటర్ల పోటీలో నువ్వుపరుగెత్తినట్టయితే, గెలుపు నీ దయ్యేది" అని 'సివోనా' ఎమిల్‌ను ఓదార్చాడు.

క్షణికమైన విజయాలను ఎమిల్ ఆశించుటలేదు. భవిష్యత్తులో స్థిరమైన స్థానం కొరకు కష్టిస్తున్నాడు.

'గుండర్ హాగ్' సాధించిన 1500 మీటర్ల పందెంలో ప్రపంచ విజయంగూర్చి, ఆతని 3 నిమిషాల 43 సెకండ్ల రికార్డుగూర్చి ఎమిల్ విన్నప్పుడు :

"రెండో అంతస్తు నిచ్చెనలేందే ఎక్కలేను" అన్నాడు క్లుప్తంగా, భావ గర్భితంగా !

అప్పటికింకా ప్రపంచ రికార్డులను భంగంచేయగలననే విశ్వాసం ఆతనిలో దృఢంగా నాటుకోలేదు.

కాని ఎమిల్ స్వాభావికంగా విచక్షణాజ్ఞానం కలవాడు, వివేకి. ఆతని విద్యాభ్యాసం యీ లక్షణాలకు పదును పెట్టింది. సన్నిహిత భవిష్యత్తుకు సంబంధించిన గమ్యాలను, లక్ష్యాలను మాత్రమే ఆతని మనోనేత్రాని కెదుట నిర్మించుకొనేవాడు.

"ఆకాశపుటెత్తున ఆదర్శాలను, నిర్మించుకొని, వానిని సాధించలేకపోవుట వివేకి లక్షణంకాదు. ఎందుచేతనంటే, అప్పుడు ఉత్సాహం నిస్పృహగా మారి పోతుంది. ఏ వ్యక్తీ ఏమీ సాధించలేడు. బ్రతుకు బరువై పోతుంది. అందుచేత ఆదర్శాల నిర్మాణంకూడా జాగ్రత్తగా చేసికోవాలి" అంటాడు ఎమిల్.

ఇలాంటి వివేకంతో కూడిన అభిప్రాయాలు ప్రశంసాపాత్రాలు. 'పేరేవు' నగరంలో జరిగిన "గ్రాండుప్రిక్స్" 1500 మీటర్ల పోటీలో, తనకున్న శక్తిని పరిమితంగా ఉపయోగించే ప్రయత్నం ఫలించింది. 4 నిమిషాల పరిమితిలో గెలుపుసాధించి పురోగమించాడు. 'సివోనా'తో శక్తివంచన లేక పోటీచేసి, ద్వితీయుడుగా కృతార్థుడయ్యాడు. ఇద్దరూకూడా పరుగువేళను తగ్గించగలిగేరు: సివోనా: 3 నిమిషాల 58.9 సెకండ్లు; ఎమిల్: 3 నిమిషాల 59.5 సెకండ్లు. ఇంతలో సెప్టెంబరునెల వచ్చింది. 'హారన్'కు తాను చేసిన వాగ్దాన విషయమేమిటి ? 5000 మీటర్ల రికార్డు భగ్నం చేసే అవకాశం ఎమిల్ కు అనుమానంలో పడ్డది.

జిలన్ లో ఒక ప్రత్యేక పాఠశాలకు హాజరవుతున్నాడు ఎమిల్. ఆతని కాలాన్ని ఆ స్కూలు పాఠాలు చాలా హరిస్తున్నవి. ట్రెయినింగుకు వేళ లేక పోయేది. అదే తనకు కావలసిన విశ్రాంతి నిచ్చిందని ఆకస్మికంగా గ్రహించాడు. వేసవిలో చేసిన కఠినమైన పనియొక్క ఫలితాలు కనుపించినవి. ఇదివరకుకన్న వేగంగా పరుగెత్తుతున్నట్టు భావించాడు. అదే ఆతనికి మానసికంగా ఆనందం కలిగించింది. అదే యింకా సాహసకార్యాల కతనిని పురిగొల్పింది. ఒకసారి 2000 మీటర్ల దూరం పూర్తి వేగంతో పరుగెత్తేడు; తనతోపాటు ట్రెయినింగు అవుతూన్న స్నేహితుడు, వాచీ దగ్గరపెట్టుకొని టైము చూశాడు.

"ఏమోయి, మా రికార్డును దాటేవే; 5 నిమిషాల 36 సెకండ్లలో పూర్తి చేశావు" అని కేకవేసి చెప్పాడు.

"అయితే కానీ, ఎవరితో ఈ సంగతి చెప్పకు; అందరూ ఏదో అసంబద్ధంగా వాగుడు మొదలుపెట్టారు" అన్నాడు ఎమిల్.

ఈ దూరానికి ఎంత రికార్డు 'టైమ్'మన్న విషయం ఎమిల్‌కు తెలియదు. సాధారణంగా పోటీలలో యీ దూరం (2000 మీటర్లు) అరుదు. ఇంటికి వెళ్ళిన తర్వాత, పరుగులకు సంబంధించిన పూర్వపు రికార్డులు చూస్తూంటే తెలిసింది ఎమిల్‌కు: ఆ దూరానికి 'రికార్డు' 5 నిమిషాల 38.8 సెకండ్లు; 'హోసెక్' పరుగు రికార్డది.

ఆ రికార్డును అధిగమించిన విషయం, ఎంతోకాలం దాగలేదు. తన క్లబ్బు సెక్షన్ నాయకునికి తెలిసింది. మర్నాడు వుదయం తను ఆఫీసుపనిలో వుండగా టెలిఫోన్ మోగింది:

"ఎమిల్! శనివారానికి బాగాతయారయి వుండు; మూడుకిలోమీటర్లరికార్డును భగ్నంచేయడానికి ఒక పోటీ ఏర్పాటుచేశాం" అన్నాడు.

ఎమిల్‌కు ఈ వార్త భయోత్పాతం కలిగించింది. నిరాకరించాడు. వంద సాకులు చెప్పేడు; అలాంటి ప్రయత్నంయొక్క అవివేకాన్నిగూర్చి చెప్పేడు. కాని ప్రయోజనం లేకపోయింది. ఆవిధంగా కొత్త 'రికార్డు'ను సృష్టించిన కీర్తిని సంపాదించాడు.

"అనవసర క్షమాపణలతో కాలయాపన చేయకు; నిన్ను నీవు చూపిన ప్రజ్ఞనుగూర్చి విన్నాను. నువ్వు పరుగెత్తితీరాలి; నీ ప్రజ్ఞను ప్రదర్శించాలి."

ఈరోజు అతనికి కలిగిన భయం, ఆత నెప్పుడూ అనుభవించలేదు. తన 2 కిలోమీటర్ల రికార్డు ఏమంత గొప్పదికాదు; కాని 'హోసెక్' సాధించిన 3 కిలోమీటర్ల రికార్డు అద్భుతం. ఆ దూరం 8 నిమిషాల 42 సెకండ్లలో పరుగెత్తుటకు, ఒకటి రెండు కిటుకులు తెలియాలి. దీనిమీద నిజంగా తీవ్రంగా మనసు నిలపాలా? తన రికార్డు 8 నిమిషాల 56 సెకండ్లు. 15 సెకండ్లను తను తగ్గించుటకు తగిన శక్తి తనకుందా? ఏదో ఒక అద్భుత కార్యాన్ని సాధించడానికి ప్రయత్నం కాదా ఇది?

శనివారం ఎంతో దూరమనిపించింది. ఒకయుగంగా కనిపించింది. జిలన్ స్టేడియంలో పందెపు మార్గం సరిగ్గా లేదు. ఒకసమగ్రమైన దృశ్యం కండ్ల ఎదట స్పష్టంగా కనబడదు. దాని పొడవు 453 మీటర్లు మాత్రమే. పందెంలో దృశ్యం సమగ్రంగా గ్రహించడానికి పోటీదారు అక్కడక్కడ తన పద్ధతి ననుసరించి చిహ్నాలు ఏర్పాటుచేసుకోవాలి. మిత్రుడు 'సేక్' మధ్య మధ్య 'టైము' తెలియజేస్తానన్నాడు. ఈ పనిమాత్రం చక్కగా నెరవేర్చాడు సేక్. ఆ సాయంత్రం మదొక చిన్న సమావేశం. ప్రేక్షకులు 50 మంది మాత్రమే. అంత నమ్మకంలో లేరు వారుకూడా; అందరికీ అనుమానమే. ఈ నిరాడంబర ప్రదర్శనపు పేర్పాట్ల మధ్య కూడా, ఎమిల్ చూపిన ప్రజ్ఞ అద్భుతం. తన అనుచరులకు ఆశాభంగం కలిగించలేదు. తానసుకున్నకంటె ఎక్కువ శక్తివంతంగా కార్యాన్ని సాధించాడు. 8 నిమిషాల 38.8 సెకండ్లలో పరుగు పూర్తిచేశాడు; క్రొత్త రికార్డు నిర్మించాడు.

ప్రేగ్ నగరంలోని క్రీడల వార్తలక్రింద, విమర్శలేకుండా విషయంమాత్రమే ప్రకటింపబడింది. క్రీడల ఎడిటర్లకు జటోపెక్ పరిచితుడే; అతని సామర్థ్యం

వారికి తెలిసినదే. కాని ఒక రికార్డును భగ్నంచేసే ధైర్యం ఎక్కడనుండి సంపాదించాడు అనేదే వారి ఆశ్చర్యం. కొంత ఋజువు కావాలి; అంత ప్రజ్ఞ ప్రదర్శింపగల లక్షణాలు అతనిలో కలవా ? దానికి కావలసిన మనోధైర్యం అతని కున్నదా ? అనీ ప్రశ్న.

ఒకక్షణమైనా అనుమానించనిది 'హొరన్' ఒక్కడే. ఆ మర్నాడే అతనివద్ద నుండి సందేశం "నీ వాగ్దానం సంగతి ఏమిటి" అని.

జటోపెక్ క్లబ్బు మేనేజర్లు, యీ తరుణాన్ని జారవిడవదలచుకోలేదు. 5000 మీటర్ల రికార్డు భగ్నానికి, ఆ తరువాతి శనివారం ఏర్పాటు చేశారు.

ఎమిల్ తన 'ట్రెయినింగు' పద్ధతులనుమాత్రం విడవలేదు. తన విజయానికి కారణం తన ట్రెయినింగు పద్ధతులేనన్న తన విశ్వాసం దృఢపడింది. అతని స్నేహితులుకూడా అన్ని విషయాలు ఒక కొత్త దృక్పథంతో చూచుట కారంభించారు. మంగళవారం 200 మీటర్ల మార్గంలో 10 సార్లు పరుగెత్తాడు; లక్ష్మీవారం అదేవిధంగా చేశాడు. దూరపు పరుగు పందేలకు ట్రెయినింగుపద్ధతి యిదే అని విశ్వసించాడు. ఇదివరకు ప్రయత్నం చేసినప్పటికంటె, యిప్పుడు తన శక్తి అధికమయిందన్న మనోధైర్యం కలిగింది. ఆత్మవిశ్వాస మధిక మయింది. మొదటిసారి కంటె, యీ సారి పందెపు ప్రారంభంలో తేలిక హృదయంతో నిలబడ్డాడు. 'హాసెక్' రికార్డు 15 నిమిషాల 14 సెకండ్లు; ఎమిల్ అంతకన్నా తక్కువకాలంలో పరుగెత్తగలడా ?

"అంత సులభం కాదు" అని తన్ను ప్రశ్నించినవారికి, ఎమిల్ సమాధానం యిచ్చాడు. తనకున్న శక్తిని అధికంగా ఎప్పుడూ పరిగణించే అలవాటు లేదతనికి. కాని తనకున్న యావచ్ఛక్తిని ఉపయోగించగలనని ఆతనికి నమ్మకమున్నది.

వెనుకటి శనివారంకన్నా ఈ శనివారం ప్రేక్షకు లెక్కువయ్యారు. తను పనిచేసే 'లేబొరేటరీ'లోనివారుకూడా హాజరయ్యారు; వారు ఎప్పుడూ ఆటస్థలానికి రానివారు !

వారికి ఆశాభంగం కలిగించలేదు ఎమిల్. నిజమే, చివరి ఘట్టాలలో యిదివర కెన్నడూ అవసరమనిపించని విధంగా శక్తి నుపయోగించవలసివచ్చింది; కాని విజయం పొందాడు. 20 సెకండ్లతో పూర్వపు రికార్డును తుడిచివేశాడు. 14 నిమిషాల 55 సెకండ్లు పరుగెత్తి, అంతర్జాతీయ స్థాయికి తన రికార్డును తీసుకుపోయాడు.

ప్రేగ్ నగరంలోని వార్తా పత్రికల ఆఫీసులలో టెలిఫోను మోతకు విరామం లేదు. రేడియో స్టేషన్లనుండి పొరబాటేమీ జరగలేదు కదా అని ప్రశ్నలు. వార్తలు ధృవపడిన తర్వాత, 15 నిమిషాల లోపు రికార్డును సాధించిన వీరునిగూర్చిన ప్రశంసలు అపరిమితంగా బయలుదేరాయి. ఎమిల్‌ను అభినందిస్తూ రోజూ ఉత్తరాలే. ఫొటోగ్రాఫులు పంపమని అభ్యర్థనలు అసంఖ్యాకాలు.

ఇదంతా హాస్యాస్పదంగా ఉంది ఎమిల్‌కు. రెండు రికార్డుల తర్వాత యిక ఆతనికి వేళతో సంబంధం పోయింది.

"15 నిమిషాలకంటె తక్కువ వేళలో పరుగెత్తడం నాకు సులువైపోయిందని ఈ రికార్డువల్ల బోధపడింది. ఇందులో అమానుషమేమీ లేదు. సాధారణ మానవునికి అందుబాటులో ఉందన్నమాట. ట్రెయినింగువల్ల సాధించిన నా మానవశక్తికి అనుగుణంగా ఉన్నదనాలి."

పోస్టులో మరొక ఉత్తరంకూడా వచ్చింది. వచ్చే శనివారం ప్రేగ్ నగరానికి రమ్మని ఆహ్వానం. ఈసారి 2000 మీటర్ల పందెం; జటోపెక్‌కు పూర్వ రికార్డులను ముక్కముక్కలు చేయుట కవకాశం. జిలన్‌లో ప్రజలకీ ఆహ్వానం గర్వకారణం; కాని ఆహ్వానానికి అంగీకరించడమా, లేదా, ఆలోచనలో పడింది. రికార్డును భగ్నంచేయుట మరొక స్థలంలోనా? చివరకు ఆహ్వానానికి అంగీకారం మంజూరయింది. కారణం కూడా మంచిదే. ఎమిల్ సాధించిన రికార్డులు బయటప్రజలలో విశ్వాసాన్ని పూర్తిగా కలిగించాలి; దానికిది అవకాశం.

ఈ ప్రారంభం ఎమిల్‌కు సంతోషం కలిగించలేదు. చాలాకాలంవరకు మరవలేక పోయాడు. నిష్కల్మషంగా ప్రయత్నం చేయడమే ఆతని ఆశయం; ఆఖరున వచ్చినా అతనికి సంతోషమే; కాని తన విజయాన్ని శంకించేవాతావరణం అతనికి విచారం కలిగించింది. ప్రేగ్‌నగరం వెళ్ళినతర్వాత, అక్కడి ప్రజలు ఆతని ప్రదర్శనాలను శంకించారని వింటూంటే, ఎమిల్‌కు కలిగిన హృదయావేదన ఊహించవలసిందేగాని వర్ణించ నలవికాదు. స్టేషన్‌లో దిగగానే, ఏదో తెలిసినట్టుగా ప్రేక్షకులు చిరునవ్వుతో హేళన కనబరుస్తూ "అడుగో జిలన్ రికార్డు భగ్నకారుడు! జిలన్ 'వేళల'లో ఏదో ఆంతర్యముంటుంది. ఏమంటావు" అన్న మాటలు వినబడజొచ్చాయి.

ఆలాగన్నవాడు ఎమిల్ దగ్గరకువచ్చి, వంగి ఆతని చెవిలో: "అయితే అసలు నిజమేమిటి! దూరాలు కొలిచే పద్ధతేమిటి? మీ జిలన్‌లో యిలాంటివన్నీ ఎలా ఏర్పాటుచేస్తారు?"

"ఆ వేళలు నిర్దిష్టం; మార్గం అతి జాగ్రత్తగా కొలుస్తారు; అన్నీ నిబంధనల ప్రకారం చేస్తారు."

జవాబు నచ్చలేదు. వేళాకోళం హెచ్చయింది: "అబద్ధాలాడకు, నిజంచెప్పు. నాతోటి చెప్పు నీకేమీ భయం లేదు. మనలోమాట, ఎలా చేస్తారు."

ఇక్కడ తన రికార్డు టైముమగూర్చిన అనుమానం దృఢంగా వుందని ఎమిల్ గ్రహించాడు. ఇతరులు కూడా అదేవిధంగా దగ్గరకు రావడం, అవే మాటలు అనడం!

"రికార్డులు సృష్టించడం నా కిష్టంలేదు. క్లబ్బు నిర్వాహకులు చేసిన ఏర్పాటు యిది......"

ఇంకా వాక్యం పూర్తి కాకుండానే "కాని, యిటు చూడు! ఇక్కడ నీకన్నా బాగా పరుగెత్తేవా రున్నారు. వారు రికార్డులను భగ్నం చేసే ప్రయత్నాలు చేయలేదు!"

అది సంపూర్ణంగా నిజం. ప్రఖ్యాతులు. కొద్దికాలం క్రిందట, తనను చిత్తుగా ఓడించినవారున్నారు; అయినా రికార్డులు మాత్రం పర్వతాలవలె నిలచి ఉన్నాయి. ఎందుచేత ? దానికి జవాబు తన 'ట్రెయినింగు' పద్ధతుల విశిష్టత. ఈ పద్ధతులను అందరూ త్రుణీకరించారు. నిజమే! జటోపెక్‌ను పరుగులో ఓడించేవారు లేకపోలేదు. కాని రికార్డులను ధ్వంసంచేసే ప్రజ్ఞ వారికి లేదు. ఏదో విధంగా జయిస్తే చాలంటారు వారు. అవసరానికి 'ట్రెయినింగు' అయ్యేవారు. అంతేగాని వారికి ఉన్నతాదర్శాలు లేవు. తరుచు పందేలలో పాల్గొనేవారు, తరుచుగా గెలుచుటకు తమవేగాన్ని వృద్ధిపొందిద్దామని కాని, కష్టాన్ని భరించగల శక్తిని సంపాదిద్దామని కాని వారికి ఆశలేదు. ఎమిల్ ట్రెయినింగు అతనిని ప్రఖ్యాతుని చేసింది. అతని ప్రతిపందెం అతనిలో నూతన శక్తిని విజృంభింపచేసింది. 5000 మీటర్ల పరుగు ఎమిల్‌కు అరుదైనా, ప్రతి సంవత్సరం పరుగువేళలు, అతని శక్తిని ప్రకటిస్తున్నాయి. ఆ విధంగా అతని సిద్ధాంతానికి విజయసూచనలు కనబడ్డాయి.

ఆరోజు అందరూ అనుమానపు దృష్టులతో, అసహనంతో తనవైపు చూస్తున్నారని గ్రహించాడు ఎమిల్. అస్పష్టవశాస్త్ర వ్యాయామ రంగంలో ఫలితాలు వ్యక్తిగత ప్రావీణ్యంమీద ఆధారపడి ఉంటాయి. ఎవరికివారు తమ శక్తిని ప్రదర్శించగల నైపుణ్యం, తమ శక్తిని రక్షించుకోగల సమర్థత కలిగి ఉంటారు; వారి శక్తినిగాని సామర్థ్యాన్నిగాని వారినుండి వేరుచేయగల వారెవ్వరూ లేరు. అందుచేత ఎమిల్ భయపడడానికి కారణంలేదు. ఆత్మవిశ్వాసంతో స్టేడియం ప్రవేశించాడు; అంతేకాదు, ప్రేగ్‌నగర ప్రజలలో విశ్వాసం పాదుకొలపడానికికూడా నిశ్చయించాడు.

ఫలితం : 5 నిమిషాల 35 సెకండ్లు; మరొక రికార్డు; ఒక్క సంవత్సరంలో మూడవది.

సంశయాత్మకులు ఆశ్చర్యచకితులయ్యారు.

# విముక్తి

ఆ ఆటస్థలంలో చల్లనిగాలి; ఉదయభానుని వెచ్చని కిరణాలు ప్రసరించి గాలిలో చల్లదనాన్ని క్రమంగా మాయం చేస్తున్నవి. వసంతవాసనలు వ్యాపిస్తున్నాయి. పందెపు మార్గంలో ఎమిల్ నెమ్మదిగా నడుస్తూ, అప్పుడప్పుడు వేగంగా పరుగెత్తుతున్నాడు. అతని ఎడమకాలు యింకా నొప్పిగానే ఉంది; చలికాలంలో బయట పరుగెత్తడానికి వీలులేక యింట్లోనే గెంతుతూ పరుగెత్తుతూ, కాలికి దెబ్బ తగిలించు

కున్నాడు. ఈ ఆటగాళ్ల అలవాటు ప్రకారం విశ్రాంతి తీసికొనేబదులు, నొప్పి దానంతట అదే పోతుందని అశ్రద్ధ చేయడం; ఆ నొప్పి అధికంకావడం జరిగింది. పూర్వపు ప్రజ్ఞను సంపాదించుటకు అతిజాగ్రత్తగా ఉండాలి. ఆ మెత్తని గడ్డిమీద పరుగెత్తుతూంటే, అప్పుడప్పుడు ఆకాలినొప్పి దుర్భరంగా తయారయ్యేది.

జిలన్‌లో వ్యవహారాలన్నీ విషమిస్తున్నవి. నవంబరులో పట్నం ముట్టడింప బడింది. పట్నం చాలావరకు నాశనం అయిపోయింది. అంతా తారుమారయింది. పట్నంలో యిళ్లు ఉష్ణంగా ఉండే ఏర్పాట్లన్నీ ధ్వంసం కావడంచేత, చలి ఎముకలు కొరికేస్తూంది. యుద్ధం ఎప్పుడు అంతం అవుతుందా అని ప్రజలు ఆతృతగా ఉన్నారు. ముగింపు త్వరలోనే కావచ్చు. పరిస్థితులా విధంగానే సూచిస్తున్నాయి. వసంతారంభంలో శత్రువు ఆక్రమించుకొన్న అన్ని ఆఫీసులలో కాగితాలన్నీ తగల పెట్టబడ్డాయి; దీని పొగ ఆకాశము అంటుకున్నది; ఆ పురమందిర ఆవరణలో జరిగే రహస్య సమాలోచనల వైఖరి దీనివల్ల అవగాహన అయింది.

అందరి హృదయాల్లో ఆనందం వెలిగింది. శుభసూచనలు కనబడ్డాయి.

ఆ రోజుల్లో, రెండవహాస్టలు 10 వ నెంబరుగదిలో ఎక్కువగా కాలం గడిపే వాడు ఎమిల్. అదే క్లబ్ గదిగా వాడేవారు అనేకమంది క్రీడా ప్రవీణులు. ఆగదిని ఫొటోలతో, 'జావలిన్'లతో, 'డిస్కస్'లతో అలంకరించేవారు. ఆ ఆటగాండ్రలో ముఖ్యుడు రూడ్ని, 'యిరోపా స్టీపిల్ చేజ్ ఛాంపియన్'. ప్రతివాడు ఆనందంగా కాల క్షేపము చేస్తూండడం, బలం సంపాదించడం జరిగేది. తమ శరీర శిక్షణను సాగిస్తూండే వారు. చలికాచుకోవడానికి కుంపటి తయారు చేసుకొన్నారు. ప్రక్కన బాంబులతో ధ్వంసమయిన యిళ్ళనుండి కట్టెలు తెచ్చి కుంపటి రాజేసుకొనేవారు. అలాగ కట్టెలు తెచ్చుకోవడం నిషేధం, ప్రమాదం కూడా. ఈ విధంగా ఆ చలికాలం ఎలాగో గడిచింది.

ఆ వసంతకాలంలో మొదటి వరుససైన్యం సమీపిస్తూంది. ట్రెయినింగు కొరకై స్టేడియంకు ఎమిల్‌ను వెళ్లకూడదన్నారు. కాని, ఆఉదయాలు ఎంతో ఆనందంగా ఉండేవి. బయటకు పోయే ఉత్సాహం ఆపుకోలేక పోయాడు, ఎమిల్. ఆ ఆవరణకు తాళం పడింది. అయినా ప్రహరీ గెంతి పోయేవాడు.

అది మే 2, 1945.

ఆకస్మికంగా 'సైరన్' మోగింది; భయవిహ్వలమైన రోదన బయలుదేరినవి; "టాంకులు వస్తున్నాయి; అవిగో, దృష్టిపథంలో."

ఆ రోజే ఎమిల్ అపరిమితానందం అనుభవిస్తున్నాడు. ఆ రోజు ట్రెయినింగుకు పోకపోతే ఎట్లా; ఆపరిశుభ్రమైనగాలి సవాలు చేసింది.

ఒక బ్రహ్మాండమైన శబ్దం. భూమి వణికి పోయింది. ఆటస్థలానికి సమీపాన రక్షణకొరకున్న తుపాకులన్నీ పేలుతున్నాయి. అంతా అయోమయంగా వున్నది. ఎమిల్ ఆటస్థలంనుంచి తన గదిలోనికి పరుగెత్తి, తన స్నేహితుల ట్రెయినింగు దుస్తులు మూటగట్టి చంకనుబెట్టి వల్లగా ఊళ్లోకి జారేడు.

చర్చి ప్రక్కనుండి పశ్చిమానికి ఎన్నో లారీలు వేగంగా పోతున్నాయి. ఫాసిస్టులు త్వరగా పారిపోదామనుకున్నారు. వారి వదనాలలో భయం తాండవ మాడుతోంది.

పట్నానికి పరిసరాలలో 'మెషిన్‌గన్' మ్రోతలు భీకరంగా ఉన్నాయి. సోవియట్ సైన్యం అంత దగ్గరకు వచ్చిందా !

ట్రెయినింగు దుస్తులు ఎవరివి వారికిచ్చేయాలని ఎమిల్ ఉద్దేశం. యావత్తు ప్రజ భూమి అడుగున గదుల్లో చేరి ఆత్మరక్షణ చేసికొంటున్నారు. ఇళ్ళ తలుపులు తాళాలువేసి ఉన్నవి. ఎమిల్ వానిలో ప్రవేశించుట ఎలా ? అప్పుడే ఎమిల్ వదలిన వీధిలో ఒక బాంబు పడింది; ఒక యిల్లు కూలిపోయింది. ఎమిల్ యీబాంబుల ప్రేలుడుమధ్య చిక్కుపడిపోయాడు.

"ప్రక్కన అడవిలోనుండి రష్యన్లు తుపాకులు ప్రేలుస్తున్నారు" అని ప్రజలు కేకలువేయుట ప్రారంభించారు ఆనందంతో, ఆతృతతో.

"రష్యన్లు దగ్గర్లో ఉన్నారు!" అని అరిచాడు ఎమిల్.

ప్రజలు విశ్వసించలేకపోయారు. ఆ చిన్న ఎత్తు ప్రదేశం వేగంగా ఎక్కి ప్రక్కనున్న కాలవను దాటి, వారివైపు పరుగెత్తాడు. అక్కడున్న చిన్న వంతెనమండి, రష్యన్లను పలకరించాడు. మాటలు తడబడ్డాయి ఆ తొందర్లో. కాని ఆ ఆనందపు ఆలింగనం, ఆ స్నేహంతో కూడిన కరచాలనం, అన్ని సంతోష చిహ్నాలు స్పష్టంగా ప్రకటితమయ్యాయి.

"కామ్రేడ్లందరూ చివరకు యిక్కడకు చేరుకున్నారా!" ఇంతట్లో పట్నపు ప్రజ యావత్తు అక్కడ చేరింది. సోల్జర్లకు బిస్కెట్లు, కేకులు, టీ తీసుకొచ్చారు.

సోల్జర్లు ఆయాసం మరచి, చిరునవ్వులు నవ్వడం ప్రారంభించారు. జిలన్ విముక్తితో, వారి పని పూర్తి కాలేదు. యుద్ధం ముగియలేదు. శత్రువు పరిసర రహస్య స్థలాల్లో పొంచివున్నాడు; యింకా పోరాటం విరమించవలసలేదు.

"శత్రు వెక్కడ ?"

"పారిపోయాడు" అని ప్రక్కనున్న ప్రజల జవాబు. ఆఖరు లారీలు ఏదిక్కున పోయాయో వారు చూపించారు.

కాని, సోల్జర్లు అంత సుళువుగా నమ్మలేదు. అక్కడచేరిన ప్రజలకు వీడ్కోలు చెప్పి, శత్రువుపోయిన మార్గంలోపోయారు. త్వరితంగా పరిస్థితు లవగాహన చేసు కొన్నారు. పారిపోతూన్న శత్రువును నలుప్రక్కల ముట్టడించారు.

ఇంకా సైనిక సమూహాలెన్నో ఆ మార్గాన రావడం, పోతూండడం జరుగు తూంది. గెడ్డాలు పెరిగి ఆయాసంతో వచ్చిన ఆ సోల్జర్లు, వారిని చూడడానికి వచ్చిన ప్రేక్షక జనాన్ని చిరునవ్వులతో పలకరించేవారు. ఏదో వారు తెచ్చిన ఫలాహారాలు తొందరతొందరగా తిని, వారిచ్చిన పానీయాన్ని కడుపునిండా తాగి, 'కేక'లు నవ్వుతూ ముందుకు సాగిపోతూండేవారు.

సాయంకాలానికి జిలన్‌నగరం చేరుకున్న సైన్యబృందాలుమాత్రమే జిలన్‌లో రాత్రి మకాంచేసేవారు. ఈ సోల్జర్ల ప్రశాంతస్వభావం ఎమిల్‌కి, వాని మిత్రులకు ఆశ్చర్యం కలిగించింది. ఈ సోల్జర్ల స్థిరమైనస్థావరం ఏర్పరచుకోవడం, రక్షణ ఏర్పాట్లు చేసుకోవడం ఎక్కడో నిశ్చయిమయింది. కొన్ని నిమిషాలలో 'హోవిట్జర్' మోతలు వినబడడం మొదలయింది; ఇళ్ల పునాదులు కదలడం ప్రారంభమయింది. శత్రువులకు గర్భనిర్భేద్యంగా తయారయింది. శత్రువులకు దాడిచేయడమంటే భయోత్పాతం కలిగించడంటే సందేహంలేదు. సాయంత్రం చీకటిపడేవరకే యీ తుపాకీ మోతలు.

ఈ అనుభవాలన్నీ ఎమిల్ మనసులో ఆందోళన రేపినవి. అందుచేత సుఖంగా నిద్రపోలేకపోయాడు. ఒకనాటి అర్థరాత్రి ఒక్కటే గుండుమోత వినిపించి ఆ నిశ్శబ్దవాతావరణాన్ని భంగపరచింది. వెంటనే తుపాకీమోతలు; ఆ పట్నం పరిసరాలు యీ మోతలతో నిండిపోయినవి. శత్రువు స్వరక్షణకొరకు ప్రాకులాడుట మొదలుపెట్టినట్లు స్పష్టమయింది.

పతాకాలతోనిండిన ఆ చిన్ననగరం తహతహలాడింది. శత్రువు ప్రయత్నం కొనసాగితే, పట్నప్రజల గతేమిటి ? ప్రజలు రక్షణస్థలాలకు చిందరవందరగా పరుగెత్తడం ప్రారంభించారు.

విముక్తి ప్రయత్నాలలో నిమగ్నులైన సాహసులుమాత్రం వెనుకంజ వేయలేదు. ఒక్క గృహాన్నికూడా వదలకుండా రక్షణ ఏర్పాట్లు చేశారు. వారి వద్దనున్న ఆయుధాలతో పోరాడుతూ శత్రువును ధిక్కరించారు. విశ్రాంతి కొరకు వచ్చిన సోల్జర్లుకూడా సహకరించారు. అత్యల్పకాలంలోనే శత్రువులు నిర్మూలమయ్యారు.

జిలన్‌లో యుద్ధమంతమయింది. సోవియట్ సైన్యానికిమాత్రం యుద్ధం అంతంకాలేదు. ఆయుధ సామగ్రినంతా జిలన్ తోటలలో, రక్షణ స్థావరాలలో జాగ్రత్తగా ఉంచడమైంది.

ఏ క్షణంలోనయినా, యీ సోల్జర్లకు సహాయం చేయుటకు ఎమిల్ సిద్ధంగా ఉన్నాడు. సైన్యరక్షణకొరకు, ఆయుధ సామగ్రి సంరక్షణకొరకు, భూగర్భంలో వసతులు త్రవ్వుతుంటే ఎమిల్ ఎంతో ఆసక్తితో పరికిస్తూ వుండేవాడు.

"అవి మీకు సరిపోతాయా ?"

"చాలు; మేం వృథాకాలయాపన చేయదలచుకోలేదు. అదృష్టవశాత్తు, శత్రువులు తుపాకులు పేల్చుటలో ప్రవీణులు కారు" అని హేళనగా సమీపంలోని అడవివైపు చూపించారు.

పారఒకటి తీసుకొని గొయ్యి తవ్వడానికి ఎమిల్ పూనుకున్నాడు. ఈలోపుగా శత్రువుల గుండ్లు పేలుతూనే ఉన్నాయి; కాని ఏమీ ప్రమాదం కలగలేదు.

పట్నం వెనక వైపున, శత్రువు రక్షణ ఆయుధ పరికరాలు ఏమంత ప్రయోజనకారిగా లేవు. పట్నంలోని యువకులు, దేశభక్తులు త్యాగాలుచేసి, వీరమరణం పొందినారు. వారికి ప్రత్యేకంగా, గౌరవ పురస్సరంగా స్మశానభూమి తయారుచేయబడింది. అక్కడ వారి మృతదేహాలు పాతిపెట్టబడినవి.

సైన్యంలో చేరి పనిచేయుట తన జీవితవృత్తి అవుతుందని, ఎమిల్ యీ రోజుల్లో ఊహించలేదు. అయినా సైనికులుచేసే కార్యాలను, ఎంతో శ్రద్ధతో పరికిస్తూండేవాడు ఎమిల్; తనకు తోచిన సహాయంకూడా చేస్తూండేవాడు. సైన్యాలతో పట్నపు సింహద్వారంవరకు పోయాడు ఎమిల్.

అకస్మాత్తుగా, ఆ పరిసరములలో ఒక సోల్జరు, మెషీన్‌గన్ దెబ్బకు గురి అయ్యాడు. ప్రాకి తప్పించుకుందామని ఆ సోల్జరు ప్రయత్నం చేస్తున్నాడు. ఎమిల్ ఆ సోల్జరును రక్షించడానికి దూకుదామనుకున్న సమయానికి, మరొక సోల్జరు తుపాకీ దెబ్బతో పడిపోయాడు. ఎమిల్ ప్రయత్నాన్ని ప్రక్కనున్న సోల్జర్లు విరమింపజేశారు; ప్రమాదంయొక్క తీవ్రతను బోధపరిచారు.

ఒక డాక్టరునైనా తీసుకువద్దామనుకున్నాడు, ఎమిల్. ఆ ప్రయత్నాలన్నీ విరమించుకోవలసి వచ్చింది. ఆ నరకం కురిపిస్తూన్న మెషీన్‌గన్ మంటల మధ్య నుండి, పట్నంలోకి పోవడం ఎట్లా? "ఆసుపత్రికి తీసుకుపోవలసిన అవసరంలేదు; మా ఆసుపత్రి మాతోనే ఉంద"న్నాడొక సోల్జరు.

చీకటి పడ్డాకకూడా, ఆ పోరాటం సాగిపోయింది. సహాయం అర్థిస్తూ ఒక 'రాకెట్' ప్రేలింది. శత్రు సైన్యంలో ఒక భాగం ఆ అడవుల మధ్య నెక్కడో చిక్కకొని ఉండి ఉంటుంది. రష్యన్లు ఆ వైపుకు తమ దాడి ప్రారంభించి, వారి నుండి "హాహాకారాలు'' చెలరేగేటట్లు చేశారు. ఇక శత్రువు జిలన్‌కు తిరిగి రావడం అబద్ధం.

మరుసటి దినం ప్రాతఃకాలమే, ఆ పట్నపు వీధులలో జటోపెక్ తిరుగుటకు ప్రారంభించాడు. జరుగుతూన్న చరిత్రాత్మకమైన ఆ సంఘటనలను, స్వయంగా చూచి అనుభవాన్ని సంపాదిద్దామని ఎమిల్ ఆశ.

పట్నవాసులు జరుగుతూన్న ప్రతి విషయాన్నిగూర్చి ఆతృత కనబరుస్తున్నారు; ఆయుధ సామగ్రిని పరీక్షగా చూస్తున్నారు. సైన్యాలు మారినవి. ఇంతవరకు ఉన్నవారు, ముందుకు సాగవలసి వచ్చింది; క్రొత్త సైన్యాలు, క్రొత్త మనుష్యులు; ఈ సైన్యాల రాకపోకలు ఎంతో శ్రద్ధతో గమనిస్తూండేవాడు ఎమిల్. ఎన్నో అసంఖ్యాకంగా లారీలు, కార్లు ఆ పట్నంద్వారా పోతూండేవి; రోడ్లమధ్య సోల్జరు ఒకడు నిలబడి, అవన్నీ ఏ మార్గంలో పోవాలో సూచిస్తూండేవాడు. సైనికుల వెనక పెట్రోలు, మందుగుండు సామాను ఎంత వెళ్ళేదో లెక్కలేదు.

ఒక్కసారిగా జీవితం సౌందర్యంగా కనబడింది. ప్రజలు స్వేచ్ఛగా ఊపిరి తీసుకొంటున్నారు. ఫ్యాక్టరీలో త్వరలోనే పని ప్రారంభమవవచ్చు. ఫ్యాక్టరీలో కూడా స్వేచ్ఛ అనుభవించడానికి అవకాశముంటుంది. ఎమిల్‌ను మళ్ళీ తన పనిలో ప్రవేశించాడు. కాని, తన యజమానిని తనకు ఆరోగ్యం చెడని పని నిమ్మని కోరుకున్నాడు.

"నావంటి ఆటగాడు తన ఊపిరితిత్తులను పరిశుభ్రమైనగాలితో నింపుకోవాలి; యిప్పుడు నేను చేస్తున్నపని నా కనుకూలమయినది కాదు" అన్నాడు ఎమిల్. కాని యిప్పుడున్న పనికి ఎమిల్ నైపుణ్యం ఎంతో అవసరమని యాజమాని సాకుచెప్పేను.

ఎమిల్ యీ వాదనలో యథార్థమున్నదని గ్రహించాడు. కొత్త ప్రభుత్వంలో ఆటగాడైన ఎమిల్‌కు గౌరవస్థానం ఏర్పడుతుందని విశ్వాసమున్నది. ఇన్నాళ్ళూ పరాయి ప్రభుత్వంక్రింద ఒత్తిడికి లోనయ్యాడు. ఇప్పుడు జాతీయత వేళ్ళు పాతుకోవాలి, పెరగాలి, వృద్ధిపొందాలి – జెకోస్లోవేకియా మరల స్వతంత్ర దేశమయింది. ప్రజలు శక్తివంతులు కావాలి, సమర్థులు అవాలి.

ఎమిల్ సైన్యంలోకి ఆహ్వానింపబడ్డాడు; దానితో నిర్విచారంగా ఫ్యాక్టరీ వృత్తికి స్వస్తి చెప్పేడు.

సైనికు డవడానికి కాలం పరిపక్వమైంది.

జరాజిట్సులో, ఆ చివరింట్లో

జరాజిట్సులో, ఆ చివరింట్లో

నా చిన్నపిల్ల

పైకొచ్చింది; పరిభ్రమించింది.

దక్షిణమొరావియా పర్వత పంక్తుల్లోనుండి నడచే సైనిక సముదాయంనుండి యీ గేయం ఆనందంతో చెలరేగింది; ఇక్కడ ఎమిల్‌కు తన యింట్లో ఉన్నట్టే ఉండేది. ఇక్కడి ప్రజలు ఆనందమయజీవితం గడుపుతారు; ఈ ప్రదేశమంటే, యీ ప్రజలంటే ఎమిల్‌కు ఎంతో అభిమానం.

ఇది మరొక ప్రపంచంలాగుండేది అతనికి. ఆ 'సిలికా' ధూళికి ప్రత్యామ్నాయంగా, ఆ భూమినుండి బయలుదేరే సువాసనలు, అక్కడ పుష్పించే 'డాండీలియన్' సుమపరిమళాలు అతనిని ఆకర్షించాయి.

శారీరక పరిశ్రమ, నిలబడడం, వంగడం మొదలైన సైనికవిన్యాసాలు ఎమిల్ వంటి ప్రతిభను పొందినవానికి కష్టంగా కనబడలేదు. ఆ విన్యాసాలు చేస్తుంటే తన బాల్యం గుర్తుకొస్తూ ఉండేది. జిలన్‌లో నివసించి మరచిన ఆ గ్రామసీమల సౌందర్యాన్ని అనుభవించే అవకాశం మరల ప్రాప్తించినందుకు సంతోషించాడు.

ఆ పరిసరాలలో, ఆ ఆనందమయ పరిస్థితులలో, వ్యాయామ క్రీడలలో మరల ప్రవేశించుటకు ఎమిల్ కుతూహలపడ్డాడు. యుద్ధానికి ముందే, యివన్నీ వదలివేయ వలసి వచ్చింది. ఆతని ఆంతరంగిక ప్రశాంతత, ఆత్మవిశ్వాసం యిదివరకుకన్నా ఎక్కువగా పరిశ్రమించుటకు, ప్రజ్ఞ చూపించుటకు ఉపయోగించగలవు.

విముక్తి పొందిన ప్రజారాజ్యంలో, మొదట మిలిటరీ క్రీడలు, తర్వాత జాతీయ పోటీలు ఏర్పాటు చేయబడ్డాయి.

వీటి అన్నిటిలో ఎమిల్ ప్రప్రథముడుగా తన ప్రజ్ఞను ప్రకటించాడు. మిలిటరీ ఛాంపియన్‌షిప్పులలో 3000 మీటర్ల పరుగు పందెం 9 నిమిషాల

83.4 సెకండ్లలో గెలిచాడు. నేవల్ ఛాంపియన్‌షిప్పులలో 5000 మీటర్లు 14 నిమిషాల 50.2 సెకండ్లలో పరుగెత్తగలిగాడు.

తన తోటివారి అభిమానాన్ని, తన ఆఫీసరు వాత్సల్యాన్ని సంపాదించాడు ఎమిల్. ఆటలలో పాల్గొనడానికి సెలవు యివ్వవేమనేదే అతనికిబోధపడేదికాదు.

"ఈసారి సెలవుతీసుకొని ఎక్కడకు వెళ్ళదలచావు?"

"జాతీయ ఆటల పందేలకు."

"మిలిటరీకి సంబంధంలేని 'సివిలియన్' ఆట్లలకు సెల వివ్వడానికి వీలులేదు."

కాని సైనిక ఉద్యోగస్తులలో యీ ఆటల ప్రాముఖ్యాన్ని తెలిసినవా రెక్కడుండుట పనికివచ్చింది. సెలవు యివ్వాలని టెలిగ్రాం వచ్చేది; సెలవు మంజూరయ్యేది.

చివరకు ఎమిల్ పనిచేస్తూన్న సైనిక విభాగపు అధికారికూడ కొంత అభిమానం కనబరుస్తూండేవాడు. పందేలకు పోయి గెలిచి, బహుమానాలతో తిరిగి వచ్చిన ఎమిల్, సన్మానింపబడేవాడు. సైనిక పత్రాలలో ఎమిల్‌కు ప్రశంసలు ప్రకటింపబడేవి.

సోల్జర్లు అందరూ చాలా ఆనందించారు. ఎమిల్ గౌరవార్థం అప్పటి చలామణిలోనున్న ఒక జానపద గేయం "ట్యూన్"లో గీతా లల్లారు.

ఆ యుద్ధానంతరపు ఆనందం అందర్నీ మత్తెక్కించింది. అందరికీ ఖులాసాగా ఉంది; అందరూ పరవశులయ్యారు. ఎమిల్ అందరితోబాటు ఆనందంలో మునిగి పోయాడు.

"నీవు 'ఎన్. సి. జి.' అవడానికి యిచ్ఛగిస్తున్నావా?" అని ఒక వృద్ధ సార్జెంటు మేజర్, ఆశ్చర్యంతో అడిగాడు.

"లేదు. నేను ఆఫీసర్నవుదామనుకుంటున్నాను"అన్నాడు జటోపెక్; సార్జెంటు మేజర్ ఆశ్చర్యపడ్డాడు. కాని మరేమీ జరగలేదు. ఆఫీస రవుదామని ఎమిల్‌కు ఆశ మాత్రమున్నది. ఈ క్రొత్త జీవితమంటే అభిలాష ఎక్కువయిందతనికి. తనకే కాదు; తన స్నేహితు లనేకుల కీ అభిలాష కలిగింది. మిలిటరీ వృత్తిలో ప్రవేశించినప్పటినుంచి కూడా వారి చర్చలలో ముఖ్య విషయ మిదే.

మిలిటరీ విద్యాలయం తిరిగి తెరచేరోజులు దగ్గరపడుతున్నాయి. ఎమిల్ ప్రవేశానికి దరఖాస్తు పెట్టడమా? మానడమా?ఆతని స్నేహితులందరు అతనిని ప్రోత్సహించారు. ఈ వృత్తి యీతని ప్రవృత్తికి అనుకూలమన్నారు అందరూ. స్వదేశాన్ని, శాంతిని సంరక్షించే సైన్యంలో పని చేయుటంకంటె గౌరవం చేకూర్చేదేమున్నది? క్రొత్త కార్యాలను సాధించే ఆశయంగల సైన్యంలో చేరేకంటె స్వధర్మ నిర్వహణకు మార్గమేమున్నది? ఎమిల్ సాహసిక యువ హృదయంలో విముక్తిచెందిన దేశం యొక్క శాంతియుత అభివృద్ధిని రక్షించాలన్న కుతూహలం బయలుదేరింది.

వేగంగా ఒక నిశ్చయానికి వచ్చాడు, ఎమిల్.

ఈ లోపుగా ఒకసారి ప్రేగ్‌కు ప్రయాణమయ్యాడు; అక్కడ స్వీడన్ దేశస్థుడు 'ఏవ్నీ ఏండర్సన్'తో పందెంలో పరుగెత్తేడు. అట్టి ప్రజ్ఞావంతునిమీద విజయానికి

అవకాశం లేదు. అయినా ఆ అనుభవంతో, అంత సమర్థుని స్నేహం సంపాదించుకొని, ఎమిల్ తిరిగి వచ్చాడు.

కొన్ని రోజులతర్వాత స్థిరంగా ఆ సైనికపట్నం వదిలిపెట్టాడు. ఆతని తరువాతి జీవితమంతా 'ఆఫీసర్ల ఎకాడమీ'లో గడచింది.

జిలన్‌లోని ఆ చిన్నయింటి కలవాటుపడ్డ ఎమిల్‌కి, కొత్తపరిసరాల్లో తనమీద ప్రసరించే గౌరవం, అభిమానం అతనిని సమ్మోహితుని చేశాయి. అతనిని గౌరవించ డానికి అన్నివిధాలా ప్రయత్నం చేసేవారు అధుపరులు. ఆతనికి ఆఫీసర్ క్యాడెట్ దుస్తులు యిచ్చారు. బూట్లు యిచ్చారు; మిలిటరీ ట్రెయినింగు, అయినంత సుట్టుకు సంతుష్టి కలిగించుటేకాక, ఆతనికి ఉత్సాహం కలిగించింది. ఈ ట్రెయినింగులోని "క్యాడెట్ల"ను గూర్చి అందరూ ప్రశంసించేవారే; ఎంతో బాధ్యతగల పనులను నిర్వహించడానికి శిక్షణపొందుతున్నారు కదా !

'ఎకాడమీ'లో ప్రవేశించేముందే, ఆటలలో పాల్గొనడానికి యింక వీలుండ దని ఎందరో ఎమిల్‌తో అన్నారు. పందేలలో పరుగెత్తే ఆశ మరి లేదనుకున్నాడు, ఎమిల్.

కాని వచ్చినవెంటనే తన గది కిటికీనుండి చూస్తే అందమైన పరుగుమార్గం కనబడింది. ఇక పరుగెత్తడానికి అభ్యంతరం ఉండదుకదా అనే సంతోషం అతని మనసును ముంచెత్తింది.

ఆ మిలిటరీ విద్యాలయంలో జీవితమంతా సుఖప్రదంగా తేలికగా గడిచిపో లేదు. ఎమిల్ యొక్క శారీరక బలం, ఆ శిక్షణ బాగా పరీక్షింపబడ్డాయి.

మిలిటరీ విధ్యుక్తాలన్నిటిని అవశ్యంగా నిర్వహిస్తూండేవాడు, ఎమిల్. ఒక్క "ఎక్సర్సైజు" కూడ మానలేదు. అది కాకుండా పాఠాలన్నీ ఎంతో శ్రద్ధతో చదివే వాడు. తక్కిన విద్యార్థులు విశ్రాంతి తీసుకున్నప్పుడు, పరుగెత్తే దుస్తులను తొడు క్కొని ట్రెయినింగుకు పోయేవాడు, ఎమిల్.

చలికాలంలో గుఱ్ఱాలకుపయోగించే సూక్కులు ఆవరణను, పరుగెత్తడానికి వాడుతూండేవాడు, ఎమిల్. అతని ట్రెయినింగుకు సుసువుగా, అనువుగా ఉండ డానికి, ఆ ప్రదేశంలో అంపపుపొడితగ్లి తయారు చేసేవారు, మిత్రులు. వాతావరణం బాగుంటే నది ఒడ్డున అనేక కిలో మీటర్లదూరం, ఒక్కొక్కప్పుడు వేగంగా, ఒక్కొక్కప్పుడు నెమ్మదిగా పరుగెత్తుతూండేవాడు. 'బ్యారక్సు స్క్వేర్'లోని 'ట్రాక్'లో ట్రెయినింగవుతూండేవాడు.

మిలిటరీ ఉద్యోగం, జాగ్రత్తగా జీవితం గడుపుకొనుట అతని అభివృద్ధికి కారణములయినవి. అట్లా, 1946 వసంత కాలానికి ప్రేగ్ నగర ప్రజల సమక్షంలో తన ప్రదర్శనల నిచ్చుటకు సంసిద్ధుడైనాడు.

మరొకసారి 5000 మీటర్ల పరుగు రికార్డును సృష్టించాడు, ఎమిల్. పరుగు కాలం 14 నిమిషాల 36.6 సెకండ్లు.

ఆతని మనోనిశ్చయం, గుండె నిబ్బరం కేవలం మొండితనమనుకున్నారు, ప్రేగ్ ప్రేక్షకులు. ఆతని అడుగులలో బరువు హెచ్చుచున్నా, అనేక పందేలలో పాల్గొని విజయం సాధించాడు, ఎమిల్. ఆతని ఆరోగ్యమే ఆతని కవచమయింది.

తన దేశీయులకు వ్యతిరేకంగా వందల మీటర్ల తేడాతో గెలుపొందుతున్నాడు ఎమిల్.

స్వీడన్ నుండి యీసారి వచ్చిన పందెగాళ్ళతో తన ప్రావీణ్యాన్ని కొలుచుకొని, ప్రపంచ యోధులతో తాను నెగ్గగల అవకాశాల నూహించుకొన్నాడు.

హేన్నీ ఏండర్సన్ మరల వచ్చాడు. కాని యీసారి పరుగుపందేలకని రాలేదు. ఏండర్సన్ సభ్యుడైన సంఘం, అతని నా పోటీలలో పాల్గొనడానికి బహిష్కరించింది. పూర్వం తన ప్రతికక్షులుగా నున్నవారు పందేలలో పోటీ చేస్తూంటే, ప్రేక్షక స్థానంలో నుండి విచారంతో గమనించుటతప్ప ఏండరన్స్‌కు పని లేదు. తలపంకిస్తూ యిలా అనేవాడు: "ఓ ఎమిల్ దేమి అదృష్టం. కీర్తి కష్టం తెలియకుండా, ఆ వయస్సులో నేనూ ఎంత ఆనందంగా ఉండేవాణ్ణి".

స్వీడన్‌నుండి వచ్చిన ఆ ఆటగాండ్రలో, ఐగోపాలోని ప్రముఖులు కొందరున్నారు. అందులో పొడుగుకాళ్ల 'లిడ్‌మన్' ఒకడు; ఎత్తులు దాటే (హైజంపర్) 'లిండెన్ క్రాంప్' ఒకడు; అతి వేగంగా పరుగెత్తే 'సన్‌డిన్' మరొకడు.

'లిడ్‌మన్' మంచి సమర్థతతో 'అడ్డులు' (హర్డిల్స్) గెంతి జయం పొందేడు; జెకొస్లలకు ఎదురుగా చాలా గజాల తేడాలో గెలుపొందేడు.

'లిండెన్ క్రాంప్' స్వీడిష్ రికార్డును నూతనంగా సృష్టించాడు. 2.01 మీటర్ల (6 అడుగుల 7.2 అంగుళాలు) ఎత్తును అతి చాకచక్యంతో దాటి, ప్రేక్షకుల మన్ననలకు పాత్రుడయ్యాడు. ఒక్క వెంట్రుకవాసిలో దాటగలిగాడు. దాటి క్రింద యిసకగోతిలోపడి కొన్ని సెకండ్లు సొమ్మసిల్లిపోయాడు; ప్రేక్షకుల జయ జయ ధ్వానాలే అతనిని తెప్పరిలజేశాయి. ఆ ఆనందంతో మత్తెక్కి, కనబడిన ప్రతివానితో కరచాలనం చేస్తూ పోయాడు. అప్పుడు తన దేశీయుల చేతుల్లో పడ్డాడు. వారి అలవాటు ప్రకారం వానిని పైకెత్తుతూ, ఎగరవేస్తూ, క్రిందపడవేస్తూ, ఆఖరుకు కనికరించమని ప్రాతిమాలుకుంటే, వా రాతనిని విడచిపెట్టుట జరిగింది.

ఇలాంటి ఆయాసం కలిగించే సన్మాన ఫలితంగా, వెంటనే ఏర్పాటుచేసిన 2.03 మీటర్ల పందెంలో ఓడిపోయానని యీతని వాదన.

ఈ ముగ్గురు ప్రముఖులలో 'సన్‌డిన్' పరుగు పందెగాడు; ఈతడు పరుగెత్తుట ఒక సుందరదృశ్యం. పందెం ప్రారంభదశ, నెమ్మదిగా పరుగెత్తుతూ గమనం వేగం చేసే పద్ధతి, తగ్గించే విధానం, ఆ అడుగులు తేలికగా వేయడం - అంతా అప్రయత్నంగా జరిగినట్లుంటుంది. అలాంటివాడు పోటీలలో పాల్గొనుట మానివేయుట ఆశ్చర్యంగా ఉంది. 'హేగ్'కూడా భయపడవలసిందే అతని నెదుట.

ఇలాంటి పందేలలో పాల్గొనుటకు జటోపెక్ సెలవు సంపాదించాడు. మిలిటరీ ఎకాడమీ అధికార్లు అతనికి సహకరించారు. జటోపెక్‌ని ఓడించిన కొద్ది

మంది పరుగెత్తే పందెగాండ్రలోను, తానొకడని 'సన్‌డిన్' సంతోషించవలసిందే. అంతర్జాతీయ పోటీలలో అప్పటికింకా జటోపెక్ అనుభవం సంపాదించలేదు. అయినా జటోపెక్‌ను ఓడించామని గర్వంగా చెప్పగలిగినవాళ్లు చాలా కొద్దిమంది.

'సన్‌డిన్'కు వ్యతిరేకంగా జటోపెక్ జాతీయరికార్డును మరొకసారి సృష్టించాడు. ఈ సారి 3000 మీటర్లు 8 నిమిషాల 26.8 సెకండ్లలో పరుగెత్తగలిగాడు. 'సన్‌డిన్' ఒక్క క్షణం మాత్రమే వేగంగా పరుగెత్తగలిగాడు.

వీని తరువాత, అమెరికన్ పందెగాడు 'రేఫట్టీ'ని గెలిచే అవకాశం కలిగింది, ఎమిల్‌కు. బహిరంగప్రదేశంలో పరుగెత్తడం యీ అమెరికన్ ప్రవీణుని కలవాటు లేదు. అయినా 'గుండర్‌హాగ్'ను అనేకసార్లు ఓడించాడు. ఈ సారి 2 కిలోమీటర్ల దూరం మాత్రమే. సగం దూరంవరకు ముగ్గురు పోటీదార్లు ప్రక్క ప్రక్కనే పరుగెత్తుతున్నారు. తర్వాత యూరోపియన్లు ముందుకు సాగిపోయారు; అమెరికన్ పోటీదారు వెనకబడిపోయాడు. రేఫట్టీయొక్క అదృష్ట మప్పటికప్పుడే దిగజారిపోయింది. 'సన్‌డిన్'కు దగ్గరగాపోతున్నాడు ఎమిల్, జాగ్రత్తగా స్వీడిష్ పందెగాణ్ణి గమనిస్తూ. లాభం లేకపోయింది. ఒక్కసారిగా 'సన్‌డిన్' వేగం అధికం చేశాడు. జటోపెక్‌కు సన్‌డిన్ వీపు మాత్రమే కనబడుతోంది. అయినా జటోపెక్ ఆశ విడవలేదు. 'సన్‌డిన్' వెనకే ఎమిల్ పరుగు పూర్తి చేశాడు; కొత్త జాతీయ రికార్డు నిర్మించాడు; 5 నిమిషాల 3.04 సెకండ్లు.

పరుగెత్తే ఫక్కీ విషయంలో ఎమిల్ దీర్ఘంగా ఆలోచించాడు. 'సన్‌డిన్'తో పోల్చి చూచుకుంటే, అతని ఫక్కీ చాలా అసహ్యంగా, అందవికారంగా కనబడుతుంది. పత్రికల్లో యీ విషయమై వ్యతిరేక విమర్శ జరుగుతూనే ఉంది. కాని తన 'స్టయిల్'ను మాత్రం వదలలేదు. పందెంలో గమనవేగానికి గల ప్రాధాన్యం, 'స్టయిల్'కు లేదంటాడు, ఎమిల్. ఇంకా 'స్టయిల్' దానంతటదే సాఫీ అవుతుందని అతని విశ్వాసం.

ప్రతి పందెం తర్వాత తన 'ఎకాడమీ'కి తిరిగి వచ్చేవాడు, ఎమిల్. ఇదివరకు కన్నా ఎక్కువ శ్రద్ధతో 'ప్రాక్టీసు' సాగించేవాడు, ఒకవంక చదువును నిర్లక్ష్యం చేయకుండా!

మధ్య యుకోసియా పందేలలో అతి వేగంగా, అతి అందంగా పరుగెత్తే డచ్చి దేశపు 'స్లిమ్‌కీ'తో బ్రూనోలో పోటీ చేయవలసివచ్చింది, ఎమిల్. ఇది 3 కిలోమీటర్ల పందెం.

అనుకున్నంత గట్టివాడు ఆ డచ్చిదేశపు పందెగాడు. తేలికగా, అందంగా లేడిలాగ పరుగెత్తేడు. ప్రేక్షకులను ఆనందంలో ముంచేడు. ప్రతి గజం పోరాడాడు ఎమిల్. రెండు జాతీయ రికార్డులు ఆ పోటీలో అతిక్రమింపబడ్డాయి. ఒకటి డచ్చి జాతీయ రికార్డు; 8 నిమిషాల 15.5 సెకండ్లు; రెండవది జెక్కు రికార్డు: 8 నిమిషాల 21 సెకండ్లు.

ప్రేక్షకులందరూ సంతుష్టాంతరంగులయ్యారు. ఇద్దరు పోటీదార్లకు సమానంగా గౌరవం చూపిస్తూ జయధ్వానాలు చేశారు. కాని, ఎమిల్‌కు తృప్తిలేదు. ఇంకా తానెంత నేర్వాలో గమనించాడు ఎమిల్.

ఈలోపుగా, యూరోపియన్ పోటీలు దగ్గర పడుతున్నాయి. యుద్ధానంతరం మొదటిసారి ఆగస్టులో, ఆస్లోలో అవి ఏర్పాటు అవుతున్నాయి.

# విదేశాలలో ప్రథమ పందెం

"యూరోపియన్ పందేలలో పాల్గొనడానికి ఆస్లోనగరం వెళ్ళుటకు నీ కిష్టమేనా ?"

"లేదు; ఎందుకు వెళ్ళాలి ?"

"వారడుగుతున్నారు; నీకు సెలవు దొరుకుతుంది."

"నా కవసరం లేదు."

ఆ విధంగా ఎమిల్ యీ అవకాశాన్ని నిరాకరించాడు; నార్వేదేశం చూడాలని ఎమిల్‌కు కుతూహలముంది. పర్వత శిఖరాగ్రంనుండి సముద్రం చూచే అవకాశాన్ని కాంక్షించాడు; ఆ ప్రఖ్యాత ఆటగాండ్రను దగ్గరనుండి చూచే భాగ్యాన్ని పొందుట కభిలషించాడు. కాని అంతమేటి ప్రవీణుల సాన్నిధ్యంలో నిలబడడానికైనా తానర్హుడా ? ఖ్యాతిని కాంక్షించి, సంపాదించే చొరవ అతనిలోలేదు. అయినా తన మిలిటరీ వృత్తికి సంబంధించిన విద్యుక్తాలను వదలదలచుకోలేదు.

అందుచేత ఆస్లో వెళ్లుటకు అంగీకరించలేదు. సెలవు దొరకలేదు. ఆస్లో పందేలలో జెకోస్లావేకియా ప్రాతినిధ్యంకావాలని కోరింది. ప్రాతినిధ్యమిచ్చిన తర్వాత వద్దనడానికి వీలులేదు. అందుచేత ఆఖరు నిమిషంలో ఏర్పాట్లన్నీ టెలిఫోన్ ద్వారా జరగవలసివచ్చింది. అకస్మాత్తుగా ఎమిల్ ఏరోప్లేనులో ప్రయాణం కావలసి వచ్చింది. జాతీయజట్టు సభ్యునిగా, పరదేశంలో ఆటలపోటీలలో పాల్గొనడానికి మొట్ట మొదటిసారిగా ఎమిల్ వెళ్ళవలసి వచ్చింది.

ఎలాగైనా వెళ్ళడం తప్పదుకాబట్టి ప్రయాణం, పందెం జయప్రదంగా జరగాలన్న పట్టుదల ఎమిల్‌కు బయలుదేరింది. జట్టులోని వారందరూకూడా ఎమిల్‌తోపాటు ఆనందంగా కాలంగడుపుతూ, జట్టులో సంఘీభావాన్ని బలపరిచారు.

ప్రారంభపు తంతు అంతా, జెక్ జట్టులో ఉత్సాహాన్ని కలిగించింది. యుద్ధకాలములో బయటకు కదలకుండా, యుద్ధానంతరం మొట్టమొదటిసారి విదేశాలకు

ప్రయాణం చేస్తున్నవారి జట్టులో చాలామంది ఉన్నారు. ఆ "ఒలింపిక్ గ్రామం"లో జీవితం, కొత్త స్నేహితులను చేరదీయుటలో, కొత్త అనుభవాలను కలిగించుటలో సహాయపడింది. కొత్త ప్రతికక్షులతో పరిచయం కొరకు ఎమిల్ ఉబలాటపడుతున్నాడు. పందెముల వెలుపల వీరుకూడా మామూలు మనుష్యులేనని ఎమిల్ గ్రహించాడు.

ఇంగ్లీషువారి వసతిగృహంలోని 'వూడర్సన్'ను ఎవరో చూపించారతనికి. సులోచనాలతో ఏదో ఒక బ్యాంకు గుమాస్తావలె కనుపించాడతను. ఆటగానివలె లేనేలేడు. ఒక మెత్తని చేతులుగల కుర్చీలో కూర్చుని పుస్తకం చదువుతున్నాడు.

"హల్లో" అని అతనిని ఎమిల్ ఆప్యాయంగా పలకరించాడు. 'వూడర్సన్' తలెత్తిచూచి, సస్నేహంగా జవాబు చెప్పాడు. 'స్లిఖూస్'ను తరువాత కలిసేడు. పరుగెత్తుటలో మంచి ప్రవీణుడు; 5000 మీటర్ల పందెములో గెలుపొందగల సామర్థ్యంకలవాడు. ఆ పొడుగుపాటి స్వీడన్ దేశీయుడు హాశ్యగాడు; వృత్తివల్ల మోటారుకారు నడిపేవాడు. నృత్యం, పరుగెత్తడం, రెండూ కూడా అతనికి అభిమాన విద్యలే.

ఆ సన్నని 'రీఫ్'తో తరువాతి పరిచయం; మొట్ట మొదట ఏమంత గొప్పవాని వలె కనిపించలేదు. ఊపుకుంటూ నడుస్తాడు; అతనిలో విశేషం అదే. ఫ్రెంచి పత్రికలు బ్రహ్మాండంగా పొగడి పంపిన ఫ్రెంచి ఆటగాడు 'ఫుజాజన్'కూడా హాజరు. హీనో! వీర్జాహీనో ఫిన్లాండు ఆటగాడు. మొదటిరోజే 10,000 మీటర్ల పందెం సులువుగా గెలిచేడు. అదే ప్రపంచ రికార్డు అంటారు; అయినా కాకపోయినా, 29 నిమిషాల 50 సెకండ్లలో పూర్తిచేసిన యీ పరుగు అత్యద్భుతమని ఒప్పుకోవాలి. ప్రజల ఉత్సాహ ప్రశంసలను సంపాదించాడు. ఎమిల్ వినయంతో, భక్తితో అతనిని సమీపించి ఆ రికార్డులను ధ్వంసం చేసిన కాళ్ళకు మ్రొక్కవచ్చాడు.

ఆసారి, ఆస్లోలో జెక్ ఆటల జట్టువారు భయపడుతూనే ఉన్నారు. యుద్ధం అయిన వెంటనే పోటీలలో దిగవలసిరావడంవల్ల, తమ జట్టును ఆకర్షణీయంగా, తగిన దుస్తులతో, పరికరాలతో తయారు చేయలేకపోయినందుకు వారి విచారం. మామూలు ఆటల దుస్తులు మాత్రమే ధరించవలసివచ్చింది. పరుగెత్తే పందెంలో తొడిగే 'ట్రాక్' దుస్తులు లేకపోయాయి. అయినా తమ శక్తివంచన లేకుండా విజయంకొరకు ప్రయత్నిద్దామన్న మనోనిశ్చయంతో అందరూ బయలుదేరారు.

చాలా వరకు జటోపెక్ మీద ఆధారపడి ఉన్నది. అతని పోటీ రెండవదినమే కాబట్టి, ప్రారంభం జయప్రదంగా జరిగితే వెనకవారికి ఉత్సాహం కలుగుతుందికదా!

ప్రపంచ ప్రవీణుల ప్రక్కన పోటీకి ప్రప్రథమంగా ఎమిల్ నిలబడ్డాడు. అంతర్జాతీయ ప్రేక్షక బృందాన్ని ప్రప్రథమంగా ఎదుర్కొంటున్నాడు; దానివల్ల కలిగే ఆందోళన అనుభవిస్తున్నాడు. పరుగులలో ప్రావీణ్యం, ప్రఖ్యాతి సంపా

దించిన వారందరూ, ప్రేక్షకజనానికి పరిచితులు కావడంవల్ల వారందరికీ ఉత్సాహం కలిగే జయధ్వానాలు చెలరేగాయి.

"ప్యూడర్సన్! ప్యూడర్సన్!" అనే కేకలు ఒక ప్రక్కనుండి బయలుదేరాయి.

"హీనో! హీనో!" అనే కేకలు మరొక ప్రక్కనుండి ప్రతిధ్వనించాయి.

ఆ ఆత్రుత, ఆ ఆందోళన ప్రేక్షకులనుండి పందెగాళ్ళకు ప్రాకింది. తన దేశంలో అయితే ఎమిల్ ప్రశాంతంగా ఉండగలిగేవాడు; ఇక్కడో, అతని మోకాళ్ళలో వణకు బయలుదేరింది. ఈ రోజు తన దేశపు గౌరవం కొరకు పరుగెత్తుతున్నాడు!

ప్రారంభమయ్యే సరికి పందెంలో పాల్గొన్నవారు 23 మంది. 5 కిలోమీటర్ల యూరోపియన్ పోటీలలో అందరూ స్థానంకొరకు ఆశిస్తున్నవారే!

అకస్మాత్తుగా అంతా నిశ్శబ్దం. అందరూ ఊపిరి బిగబట్టి వింటున్నారు; ప్రారంభమయినదని ఒక్కగుండు ప్రేలినశబ్దం; పోరాటం ప్రారంభం.

కొందరు పోటీదార్లు, మొదటే అతివేగంగా పరుగెత్తారు. ఎందుకింతవేగం; ఎమిల్ తన చుట్టూ చూచాడు ప్యూడర్సన్ ఏంచేస్తున్నాడని! ఎక్కడో వెనక నున్నాడు; ఎమిల్‌కు ఏమిచేయుటకు తోచలేదు; 'ప్యూడర్సన్'ను అంటిపెట్టుకొని, వెనకనే ఉండాలా! అయితే ప్యూడర్సన్ ఓడిపోతే? అతనితోపాటు తానుకూడా ఓడిపోవలసిందేనా? అనుచేం, ముందు పోయే జట్టునే అనుసరించడానికి నిశ్చయించాడు ఎమిల్.

ముందు వెళ్ళినవారు వెనుక, వెనుక నున్నవారు ముందూ; యీవిధంగా వరుస క్రమంలో మార్పులు తరచు కనబడేవి. ఎవరు గెలుస్తారో చెప్పడం కష్టమయి పోయింది. కొంతవరకు ఎమిల్ 5 వ వానిగా ఉన్నాడు; కొంతదూరం మూడవవానిగా ఉన్నాడు; 3 కిలోమీటర్లు పూర్తి అయ్యేసరికి 'స్లిఖూస్' అందరికీ ముందున్నాడు అయినవేళ 8 నిమిషాల 33 సెకండ్లు. ఇది అద్భుత విశేషం; ప్రేక్షకులు ప్రశంసించారు. వాని వెనకే ప్యూడర్సన్ ఉన్నాడు. అడుగడుగు నెమ్మదిగా ముందుకు సాగిపోతున్నాడు. ఆఖరు ఘట్టంలో వేగము హెచ్చించి, తన వెనకనున్నవారికి తనకు మధ్యనున్న దూరం ఎక్కువ చేయడానికి ప్రయత్నించాడు, 'స్లిఖూస్'.

కాని ప్యూడర్సన్ జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు. 'స్లిఖూస్'ను, చాలాదూరం ముందుకు పోనీయడానికి అవకాశం యివ్వలేదు; 'ప్యూడర్సన్', చివరికి, ఏవిధంగా అతి వేగంగా పరుగెత్తి, గెలుపును పొందేశక్తి అతనికున్నదో, పందెమునకు ముందే అనేకులకు తెలుసు; దానికొరకు ఆత్రుతగా వేచి ఉన్నారు ప్రేక్షకులు. ఇంక 200 మీటర్లు గమ్యస్థానం ఉండగా, ప్రారంభించాడు పరుగు; వచ్చినవానికన్న 5 సెకండ్లు ముందుచేరి, విజయం పొందేడు. వేళ: 14 నిమిషాల 8.6 సెకండ్లు; హేగ్ 13 నిమిషాల 58.2 సెకండ్లతో నిర్మించిన ప్రపంచ రికార్డు తరువాతి రికార్డు ఇదే.

జటోపెక్ కూడా తన శక్తినంతను వినియోగించి ప్రశంసలకు పాత్రుడయ్యాడు; అతను పెద్ద పందెములలో పాల్గొనుట యిదే మొదలు. మూడవస్థానం

కొరకు పోరాడినా, స్వీడెన్ పందెగాడు నైబర్గు, ఫిన్లాండు పందెగాడు హీనో, యీతని కా స్థానం లభ్యంకాకుండా చేశారు; సెకండులో 10 వ వంతు వేళలో యితనిని 5 వ స్థానానికి త్రోసివేశారు; అయినా తనదేశానికి తనపరుగు వేళ రికార్డే: 14 నిమిషాల 25.8 సెకండ్లు.

'రీఫ్' పూర్తిగా 25 సెకండ్ల వెనక గమ్యస్థానం చేరుకున్నాడు.

ఎమిల్‌కు లభించిన 5 వ స్థానం ప్రశంసనీయం. చివరివరకు నాయకుల మధ్యనే ఉండగలిగాడు ఎమిల్. ఆఖరు దశలోనే యీ ఉత్తరాదివారు తనకన్న ముందుకు పోగలిగారు. మాకేకాదు; ప్రపంచానికంతకు, ఎమిల్‌కు లభ్యమైన పంచమస్థానం ఆశ్చర్యం కలిగించింది. ఇప్పటివరకు అజ్ఞాతంలోనున్న యీ జెక్ యువకునికి ఉజ్జ్వలమైన భవిష్యత్తున్నదని, అందరూ జోస్యం చెప్పటకు పూనుకొన్నారు.

ఎమిల్ చూపిన ఆ ధైర్యం, పట్టుదల, పోరాడేశక్తి, తక్కిన జెక్కు జట్టుకు ఉత్సాహం కలిగించింది. వారి హృదయాల్లో ధైర్యం వెళ్ళుతన్నింది. అట్టి అంతర్జాతీయ పోటీలలో పాల్గొన్నందుకు జెక్ జట్టు సిగ్గుపడవలసిన అవసరము లేదనిపించింది ఉత్తమోత్తముల సరసన సగర్వంగా నిలబడగల మనిపించింది.

అట్లా, ఎమిల్ అడుగుజాడల్లోపోతూ, జెక్‌జట్టు, అనేక జాతీయ రికార్డులను సృష్టించుటే కాకుండా; అంతర్జాతీయంగా, గౌరవస్థానాన్ని సంపాదించింది. అనుభవములేని 'సినోవా' 1500 మీటర్ల పోటీలో 4 వ స్థానాన్ని మాత్రమే పొందగలిగాడు. 'పోల్‌జంపు'లో 'బెమ్', 'లాంగ్‌జంపు'లో 'రిహాసెక్', '200 మీటర్ల'పందెములో 'డేవిడ్', మూడవస్థానం సంపాదించారు. అసలు విజయం పొందకపోయినా, యీ స్థానాలుకూడా జెక్కులకు గౌరవం సంపాదించినవి.

"ఫలితాలు నీకు నచ్చాయా" అని పందెం పూర్తయిన తర్వాత ప్రజలు ఎమిల్‌ను ప్రశ్నించారు.

తానొక అద్భుతమైన రికార్డు పరుగు పరుగెత్తినా; అతనికి సంతుష్టిలేదు. ఇంకా ఆత నెంత నేర్వాలో ఎమిల్‌కు గ్రాహ్యమయింది. ఇంకా వేగంగా పరుగెత్తగలగాలి; యింకా, యింకా వేగంగా; శక్తినంతా కరడుగట్టుకొని, ఆఖరు కుపయోగించాలి. ప్రతికక్షుల గొప్పతనం ఎందులో ఉన్నదో గ్రహించాలి; తదనుగుణ్యంగా మన నైపుణ్యాన్ని దిద్దుకోవాలి.

ఆస్లోకు సెలవు!

ఎమిల్ యొక్క స్వభావానికి అనుగుణ్యంగానే ఉన్నది, ఆ ఆస్లో ప్రయాణ సమాప్తి. ఆ మర్నాడు మధ్యాహ్నం 'అకాడమీ'కి హాజరయ్యాడు. ఒంటిగంటకు అక్కడ వ్యాయామక్రీడల ప్రదర్శనం ఏర్పాటుచేయబడింది. ఎమిల్‌కు విశ్రాంతి అత్యవసరం; కలలోనైనా అనుకోలేదు; త్వరగా దుస్తులు మార్చాడు; సహచరులతో చేరాడు; క్రీడలలో పాల్గొన్నాడు.

వారిలో ఒకడైపోయాడు; సమూహంలో కలసిపోయాడు :

"మిత్రసైన్యాల వ్యాయామ క్రీడల పోటీలలో, మన సైన్యానికి ప్రాతినిధ్యం వహిస్తావా ? ఒక వారం రోజులలో బెర్లిన్‌లో ఆటలు ప్రారంభమవుతాయి."

వెళ్ళమని అందరి సలహా, విజయానికి అతని కవకాశమున్నదని. అతను అంగీకరించాడు.

శుక్రవారం ప్రయాణమయ్యాడు; తన పూచీమీద ఆటలు శనివారం ప్రారంభమవుతాయి. డ్రెస్డన్‌కు అర్ధరాత్రి చేరుకున్నాడు. లేచి స్టేషన్‌ను విడిచి బయటకు పోయాడు. పూర్తిగా నాశనం చేయబడిన ఆ పట్నపు శిధిలాల మధ్య కొంతసేపు సంచరించాడు. చీకటి తారులాగున్నది. ఎక్కడా ఒక్క దీపమైనా కనబడలేదు. పై కప్పు కనబడని ఆ బోడి గోడలమధ్య వర్షం నిర్దయగా కురుస్తూంది. వీధులు నిర్జనంగా ఉన్నాయి. ఒక్క మనిషికూడా కనబడడు ఏ భోగట్టా యివ్వడానికైనా. ఎవర్నడుగుటకూ ఎమిల్‌కు తోచుటలేదు.

ఈతనికొక సోవియటు మిలిటరీ ఉద్యోగి కనబడి, పూర్వం విమానదాడుల రక్షణ స్థలంగా ఉండి, ఇప్పుడు మిలిటరీ ఔటుపోస్టుగా ఉన్న స్థలానికి తీసుకుపోయాడు. వారికి అపరిచితమైన అతని దుస్తులు అక్కడివారికి ఆశ్చర్యము కలిగించినవి; అయినా యిప్పుడు ప్రశ్నలకు, పరిశోధనలకు వేళలేదు. విసిగి, వేసారి, ఆయాసంతో పందెపు స్థలానికి పోవాలని లేపోతే కొంత విశ్రాంతి అవసరం ఎమిల్‌కు. అయినా యీ ప్రయాణానికి సంబంధించిన అన్ని వివరాలను అక్కడి రక్షణాధికారి తెలిసికోక తప్పలేదు. చివరకు అంతా సవ్యంగా ఉన్నట్లు బోధపడింది.

"అయితే నీవు పరుగు పందెగాడ వన్నమాట! మా దేశంలో వసంతంలో జరిగే ప్రారంభపు పందేలలో మేమంతా పాల్గొను టలవాటు. అలా పాల్గొన్న చిహ్నం (బాడ్జి) కూడా అమగో నా మిత్రునివద్ద నుంది. అపరిచితుడా! నీకు శుభం" అన్నారు.

తెల్లవారగట్ల 3 గంటలకు బెర్లిన్ పోయే బండి బయలుదేరుతుంది. కాబట్టి అప్పటివరకు అక్కడున్న బల్లమీద వళ్లు వాల్చాడు.

పందేలముందు రాత్రి అంత అశాంతిగా నిద్రపోయిన పందెగాడు ఎమిల్ జటోపెక్‌ను మినహాయిస్తే, ఎవ్వరూ ఉండరనే చెప్పాలి.

విసిగి ఆకలితో, శనివారం మధ్యాహ్నం బెర్లిన్ చేరుకున్నాడు ఎమిల్. తిన్నగా ఆట స్థలానికి పోయాడు. ఆ మర్నాడు ఆటలు ప్రారంభ మవుతాయని వినడంతోనే ఒక్కసారి తృప్తిగా నిట్టూర్చాడు.

చాలా కష్టపడిన తర్వాత పోటీదార్ల పేర్లపట్టికలో తన పేరుకూడా చేర్పించ గలిగాడు జెకోస్లోవేకియా ప్రతినిధిగా.

"ఏమిటిది ? నీ వొక్కడవేనా ప్రతినిధివి ? ఒక్కడే ప్రతినిధా" అని అడిగాడు కెప్టెన్ ఆశ్చర్యంతో.

తల ఊపుతూ, తన ఆశ్చర్యాన్ని ఇంతకన్నా ఎక్కువ తీవ్రమైనభాషలో ప్రకటించలేకపోయాడు. జటోపెక్‌ను 5000 మీటర్ల పందెంలో పోటీదారుగా

చేర్చాడు కెప్టెన్. ఏదైనా ముందుగా తెలుసుకుంటే మంచిదికదా అని, ఆతని రికార్డు ఎంతని అడిగాడు కెప్టెన్. 14 నిమిషాల 25.8 సెకన్లని చెప్పాడు ఎమిల్.

"ఇది సాధ్యమా" అని ఆశ్చర్యపోయాడు 'ఆఫీసరు'.

నిజమే అని గట్టిగా ఎమిల్ చెప్పి, యూరోపియన్ పందేలలో యిది తన 'రికార్డు' అని రుజువుచేయగలనని ఎమిల్ చెప్పడంతో, ఆఫీసరు నమ్మక వీలులేక పోయింది. కారు అప్పటికి దొరక్కపోవడంవల్ల, లారీలో కొంతదూరం ఎమిల్‌ను పంపించారు. అక్కడ భోజనం, కాఫీ, ముఖ్యంగా విశ్రాంతికి స్థలం దొరికింది. మరుసటి దినం, ఆతనిని 'స్టేడియం'కు తీసుకుపోయారు. యుద్ధానికి పూర్వం, ఆఖరు సారి ఒలింపిక్ ఆటలు ఆ స్థలంలో జరిగినవి. 1936 ఆటలలోకన్నా ఎక్కువ ప్రావీణ్యం చూపాలని అమెరికన్‌ల కోరిక. స్టేడియం అంతా బాగా అలంకరించారు. ప్రేక్షకస్థానాలలో ఖాళీస్థలం కనబడదు. ఆ స్థానాలలో ఎక్కువమంది సోల్జర్లే.

అన్ని దేశాల ఆటగాండ్రతో ప్రారంభోత్సవం జరిగింది. వారి వారి దేశాల పతాకాలతో సోల్జర్లు ఉత్సవంలో పాల్గొన్నారు. వారి వెనక ఆ దేశాలకు సంబంధించిన ఆటగాండ్రు వరుసలు తీరి నడచారు.

జెకోస్లోవేకియా పతాకాన్ని ఎవరు మోస్తున్నారా అని కళ్లతో వెదకాడు, ఎమిల్. ఆ సోల్జరు వద్దకు పోయి తాను జెక్ పందెగాడినని, సంతోషంతో పరిచయం చేసికొన్నాడు.

"నువ్వొక్కడవేనా ?"

జంకుతూ, అవునన్నాడు ఎమిల్. సోల్జరు అసహ్యసూచకంగా చూశాడు. ఒక్క పందెగానిముందు పతాక ధరించి నడచుట అగౌరవ మనుకున్నాడా సోల్జరు.

సంగీతం ప్రారంభమయింది.

"అయితే బయలుదేరు" అన్నాడు ఎంతో చిరాకుగా, ఏదో ఒక పెద్దజట్టును వెంటతీసుకు పోదలచి ఆశాభంగం పొందినవానివలె.

'మేరథాన్' ద్వారం దాటి, ఆటగాండ్రంతా నడచారు. ప్రేక్షకస్థానాల ప్రక్కనుండి ఆ ఉత్సవం సాగిపోయింది. జెకోస్లోవేకియా పేరుతోనున్న పతాక వెనక నడుస్తున్న ఏకైక ప్రతినిధిని చూడగానే, ప్రేక్షకులు గొల్లుమన్నారు. ప్రతి వాడు వానిని చూచేవాడే. వార్తాఫిల్ములకొరకు, వార్తాపత్రికలకొరకు వాని ఫోటోను కెమేరావారు తీసేరు.

ఈ అవమానాన్ని ఎమిల్ భరించలేకపోయాడు; దుఃఖంతో కృంగిపోయాడు.

పరధ్యానంగా ప్రారంభోపన్యాసం విన్నాడు; అలాగే ఆ క్రీడాజ్యోతిని వెలిగించుట చూచాడు. అప్పుడు, అక్కడ ప్రేక్షకస్థానాల దగ్గరున్న ఒక చల్లని స్థలంలో కూర్చొని, అక్కడ జరిగే విశేషాలన్నీ చూస్తున్నాడు.

అప్పుడు అమెరికాలో కాపురమున్న ఒక జెక్ దేశీయుడు, ఎమిల్ వద్దకు వచ్చాడు స్నేహపురస్సరంగా.

"నీవే పందెంలో పరుగెత్తుతున్నావ"ని అడిగాడు.

"5 కిలోమీటర్ల పందెంలో" అని జవాబు.

"పందెం ప్రారంభాన్ని గూర్చి అప్పుడే రెండుసార్లు ప్రకటించారు. పోటీదార్లందరూ వరుసగా అప్పుడే నిలబడి ఉన్నారుమాకమని, ఆశ్చర్యపోతూ ఎమిల్‌ను హెచ్చరించాడు. ఎమిల్‌కు, పాపం తెలియదు. ఇంత ప్రయాణం వృధా అయిపోయేదికదా? మెరుపులాగ బయలుదేరేడు. పరుగెత్తుతూనే తన దుస్తులను మార్చాడు. మారుస్తూనే ఆగమని, పందెం ప్రారంభించేవానికి కేకవేశాడు; సరిగా, ఆఖరి క్షణాని కందుకోగలిగాడు.

"నీవు పరుగెత్తుతావా? నీ పేరేమిటి; నీ వెక్కడనుండి రావడం."

వాని పేరుకొరకు జాబితా చూచారు. ఆ జాబితాలో అతని పేరే లేదు. నిన్నను యీతని పేరు జాబితాలో ఎక్కించిన కెప్టెన్, కాపీలలో ఆ పేరు ఎక్కించి ఉండకపోవచ్చు. అదృష్టవశాత్తు, విదేశాల పోటీదార్లనేకులు, జటోపెక్‌ను పోల్చి పరుగెత్తడాని కాతనికి అనుమతి నిమ్మన్నారు.

"అయితే సరే, ఆ రెండవ వరుసలో నిలబడు" అన్నాడు ఆ అధికారి. ఎమిల్‌కు తృప్తికలగలేదు. అంతకన్నా మంచిస్థలం కావాలన్నాడు. ఇతరపందెగాళ్లు అతనిపక్షాన వాదించి, అతనికి ఉచితస్థానాన్ని యిప్పించారు. వారందరిలోకి అతనే సమర్థుడని, అతన్ని మంచి స్థానంలో నిలబెట్టారు.

ప్రారంభించే అధికారి అభ్యంతరపెట్టలేదు.

ఎమిల్ మంచి ఉత్సాహంగా బయలుదేరాడు. ప్రతిపక్షులలో బలవంతులైన వారిని దాటి ముందుకుపోయాడు. ఇంకా ఎంతోమందిని అతిక్రమించి పోతున్నాడు. 80 వేల మంది ప్రేక్షకులు మునిగాళ్ళమీద నిలబడిపోయారు. వారెన్నడూ చూడని ప్రదర్శనాన్ని యీనాడు చూస్తున్నారు. ఎంతోమంది వెనకబడిపోతున్నారు; వారు నెమ్మదిగా పోతున్నట్టు అనిపించేది; దానితోపాటు యీతని గమనవేగం అధికమవుతున్నట్టనిపించింది. ప్రేక్షకుల హృదయాలను తనవైపు తిప్పుకున్నాడు. అధికార్లు కూడా అతని నభిమానించారు.

"మరి రెండుదార్లే" అని అధికారి కేకలు వేస్తున్నాడు. ఎమిల్‌కు బాగా తెలియడానికి 2 వేళ్లు చూపించాడు. ఆ వేళ్లతో కళ్లు పొడుస్తాడా అన్నంత దగ్గరగా వచ్చి వేళ్లు చూపించాడు.

ప్రజలు ఆవేశంతో కేకలు వేస్తున్నారు. మిలిటరీవారుకూడా వానిని పేరు పెట్టి ఉత్సాహ పరుస్తున్నారు.

"ఆఖరు దాటు" అన్నాడు, అధికారి. తుపాకీ ప్రేల్చాడు; ఎమిల్ వేగం అధికం చేశాడు; వాని ప్రతిపక్షులంతా ఎక్కడో మైళ్ళ వెనకనున్నట్టుగా ఉన్నది. రెప్ప వాల్చకుండా ప్రేక్షకులు చూస్తున్నారు. ఆ ఆవేశం అంతులేకుండా ఉంది. 14 నిమిషాల 31 సెకండ్లలో పరుగు పూర్తిచేశాడు.

గమ్యస్థానానికి దగ్గరున్నవారు, ఆతనిమీద సంతోషంతో పడిపోయి, ప్రశ్నల వర్షం కురిపించారు. కొందరు యిటు, కొందరటు లాగేరు; ఫొటోగ్రాఫర్లు

అన్ని కోణాలనుంచి ఫొటోలు తీశారు. ఆతనిమీద తమకు ఏర్పడిన గౌరవాన్ని, అభిమానాన్ని ఒక్కసారే ప్రదర్శించుటకు అందరి ప్రయత్నం.

ఆతని పేరు అంతగా అందరికి తెలియకపోవుటచేత, వింత భావాలు అందరిలో బయలుదేరాయి.

"ఇంత పెద్ద పందెంలో ఎప్పుడైనా నీవు పరుగెత్తినావా ?"

అంత ప్రశంస ఎమిల్ భరించలేకపోయాడు, సిగ్గుపడిపోయాడు; తానేమీ గొప్పవానిని కాదన్నాడు. యూరోపియన్ పందేలలో తాను 5 వ వానిగా వచ్చానన్నాడు, యీనాటికంటె తక్కువ వేళలో.

అందరికన్న ఆనందించింది, పతాకం పట్టుకున్న సోల్జరు; సిగ్గుపడిపోయాడు తన ప్రవర్తనను తలచుకొని. కాని అతని హృదయం గర్వంతో నిండి పొంగిపోయింది.

అంతోత్సవానికి ఎమిల్ స్టేడియంలోకి వెళ్ళవలసివచ్చింది; ఈసారి ఛాతీ మీద తన కీర్తిని చాటే పతాకంతో నడిచాడు. దూరాన తన దేశపు పతాకాన్ని పట్టుకొని పందెములకుముందు తనముందు నడచిన ఆ సోల్జరు కనబడ్డాడు. ఆతనికి చిరాకు కాదిప్పుడున్నది; గర్వం. ఎమిల్ దగ్గరకు దుమికాడు; వీపుమీద, భుజాల మీద తట్టి తన సంతోషాన్ని యీ విధంగా ప్రదర్శించాడు. ఎమిల్ కు ముందు యీసారి గర్వంతో, ఆనందంతో నడుస్తూ తన అదృష్టాన్ని అభినందించుకున్నాడు. ఇప్పుడు గ్రహించాడు ఆ సోల్జరు, ప్రతి ప్రేక్షకుడూ ఆ ఏకైక జెక్ ప్రతినిధిని ఏ విధంగా గౌరవించి ప్రశంసించినదీ !

# బూట్సులో ఆటగాడు

ప్రియమైన పాఠకుడా ! మనోనిశ్చయానికి, అంతులేని ఓర్మికి ఉదాహరణ కావాలా ? అయితే నాతో వచ్చి మిలిటరీ క్యాంపులో ట్రెయినింగు పొందుతున్న ఎమిల్ జటోపెక్‌ను చూడు. అది **1946** అకురాలు కాలం.

భవిష్యత్తులో ఆఫీసరుగా పనిచేసేవాని విధ్యుక్తాలు మనుష్యుని పీల్చివేస్తాయి. పని పూర్తి అయిన తర్వాత ఉండే కొద్ది గంటల విశ్రాంతి అత్యావసరమైనది. కాని, ఈ విశ్రాంతిని, ట్రెయినింగు కావడానికి ఎమిల్ ఉపయోగిస్తాడు. తన ఉద్యోగ ధర్మాలనుమాత్రం నిర్లక్ష్యం చేయకుండా ట్రెయినింగు పొందుతాడు ఎమిల్.

ఆరోజు పని అయిపోయింది. అప్పుడే రాత్రి భోజనమయింది. 7 గంటలు; చీకట్లు కమ్ముతున్నాయి.

ఆ 'బ్యారక్సు స్క్వేర్'లో ఎమిల్ శిక్షణలో నిమగ్నుడై వుండడం కనిపిస్తూందా ?

కొంతసేపు ఫుట్ బాల్ ఆట ఆడుకొని విశ్రాంతి తీసుకుంటూన్న ఎమిల్ స్నేహితులు వాని వైఖరిని అర్థం చేసుకోలేకపోతున్నారు. అక్కడున్న వారిలో చాలామందికి అతనెవరో తెలియదుకూడా.

"ఏమిటూ తొందర; ని స్నేవరైనా తరుముకొని వస్తున్నారా ?"

ఇలాంటి తెలివి తక్కువ విమర్శలు ఎమిల్ కు యిష్టంలేదు. ఒంటరిగా ప్రెయినింగవడం కావాలతనికి. అందుచేత ఆ స్థలము విడిచి ఊరుబయట అడవుల్లోకి పోయేవాడు.

ఆ అడవిలో 400 మీటర్ల దారి కనబడింది దతనికి. అందుచేత ఆ అడవులలోని మార్గాలే అతని కఠిన శిక్షణకు మూగసాక్షులు. వెనక్కి, ముందుకు అర్థరాత్రివరకు, నిర్విరామంగా పరుగెత్తేవాడు ఎమిల్. ఈలాగు చేయమని అతనిని ఎవరూ ఎలవంతం చేయలేదు; ఎవరూ ఆజ్ఞాపించలేదు. నెమ్మదిగా, ఏదో వినోదానికి కాదతను పరుగెత్తేది. తన శక్తికొద్దీ పరుగెత్తేవాడు. పగలంతా పనిచేసిన తర్వాత, యింకా మిగిలిన శక్తినంతా ఉపయోగించేవాడు; తన కండలను, కాళ్ళను శిక్షించేవాడు; ఐచ్ఛికంగా బాధపెట్టేవాడు. అంతకంతకు ఎక్కువ కఠినమైన పనులను వప్పగించేవాడు తన శరీరావయవాలకు.

ఆఖరు గంట మోగేవరకు యింటికి వచ్చేవాడుకాదు. అలసిపోయి, ఆయాసపడి, ఆనందంగా వెనకటికంటె తన శరీరంచేత ఎక్కువ పని చేయించాననే సంతోషంతో వచ్చేవాడు. అంతా చీకటి; జేబులోని టార్చి సహాయంతో చేరుకొనేవాడు, దారి తడుముకుంటూ !

తర్వాత చలికాలం ప్రవేశించింది. మంచుకురుస్తున్నా అతను భయపడేవాడు కాదు. బురదగా ఉన్న అడవులలోకి పోయేవాడుకాదు; రోడ్లమీదే దూరాలు కొలిచేవాడు. 12 కిలోమీటర్ల గుండ్రపు దారిని తయారు చేసుకొనేవాడు. ఏరోజూ విడవకుండా ఈ దూరం పరుగెత్తేవాడు. వసంతం వచ్చినవెంటనే, అడవులలో ట్రెయినింగుకు పోయేవాడు. గాలిగాని, వానగాని వానికి అభ్యంతరాలు కావు. ఒక రోజు 250 మీటర్లు 20 దాటులలో పరుగెత్తితే, మరుసటిరోజు, 400 మీటర్లు అదే విధంగా పరుగెత్తేవాడు. ఇదికాక యింటివద్దనుండి అడవికి $2\frac{1}{2}$ మైళ్ళదూరం. ఈ దూరమంతా వెళ్ళడం, రావడంకూడా అతని పరుగు దూరానికి కలపాలి.

అంటే రోజుకు 9 నుండి 12 కిలోమీటర్లు (5-7 మైళ్ళు) పూర్తివేగంతో పరుగెత్తేవాడు. ఇంతగా తన శరీరాన్ని యీ యువకుడెందుకు ప్రయాసపెట్టుతున్నాడో అర్థంకాదు. ఎందుచేతనంటే, యింతచేయడానికి మామూలు ఆటలు, వినోదాలు, విశ్రాంతి, త్యాగం చేయవలసివచ్చేది. ఇదంతా ఎంతో ఉత్సాహంతో

చేస్తున్నాడు. చివరకు ఫలితం ఏమవుతుందో అనే అనుమానం ఉండనేఉంది. ఎవరూ కూడా విజయం తథ్యమని జోస్యం చెప్పలేరుకదా!

ఎమిల్‌ను యిక్కడనుండి చూస్తున్నాంకదా! మన ప్రక్కనుండి వెళ్ళిపోయే వరకు వేచి ఉందాం. అతని పాదాలవైపు చూడండి; ఆశ్చర్యంవేస్తుంది. మేకులున్న జోళ్ళు వేసుకోలేదు; రబ్బరు మడమలజోళ్లు వేసుకోలేదు. ఈ కిలోమీటర్ల దూర మంతా బురదలో, మంచులో, ధూళిలో, అడవులలో, రోడ్లమీద సాధారణపు మిలిటరీ బూట్లతోనే తిరుగుతాడు.

"అయితే, ఎమిల్ ఎందుచేత యిలా చేస్తున్నావు?"

"కష్టమైన పరిస్థితులలో ట్రెయినింగు కావడంవల్ల కొన్ని లాభాలున్నా" యనేదే అతని జవాబు.

ఎమిల్ సిద్ధాంతాలఫలితం పందెములలో స్పష్టపడింది. మన పందెగాళ్ళకంటె, యూరోపియన్ పోటీదార్లకంటె ఎమిల్ ప్రవీణుడని, క్రమక్రమంగా రుజువైపోయింది. అతని శరీరం, అతని మనస్సు దృఢతరమయ్యాయి. ఇతరులు విశ్రాంతి తీసుకుంటూ, హాయిగా కాలక్షేపం చేస్తూంటే ఎమిల్ కష్టిస్తున్నాడు. ప్రపంచ స్థాయినందుకొనుటకు మెత్తనిమార్గం, అనుభవంగల ఉపాధ్యాయుడు అవసరంలేదని ఎమిల్ రుజువుపర్చాడు. వంటికి నలుగు లేకుండా, వేడినీళ్ళు లేకుండా, అన్ని సౌకర్యాలతో క్లబ్బు గదులు లేకుండా, అద్భుత ఫలితాలు సాధ్యమన్నాడు ఎమిల్.

"బ్రిటానియాషీల్డు" కొరకు సైనికజట్టు ప్రవేశించింది.

అన్ని శాఖల్లోను, సైనికజట్టుకు విజయాలు లభించాయి; బాక్సింగులో, షూటింగులో, ఫెన్సింగులో, పరుగెత్తడంలోకూడా విజయం లేకపోలేదు. 'ఏస్కాట్ పందెంలో, జటోపెక్ అందర్నీ ఎంతో దూరంలో వెనక విడచి, మంచు పొగలో మాయమయ్యాడు! వాని పోటీదార్లతన్ని మళ్ళీ గమ్యస్థానం పద్దనే చూడగలిగారు. అప్పటికప్పుడే ఎమిల్ ఆయాసం తీర్చుకొని, విశ్రాంతి తీసుకుంటున్నాడు.

ఎమిల్ విజయాలు ఫిల్ములో ఒకదానివెనక వేరొకటి పరుగెత్తినట్టు అనిపిస్తుంది.

ప్రతిపందెములోను చివరివరకు ఫలితం అనిశ్చితంగానే ఉంటుంది; గెలుపునకు, ఓటమికి పోరాటం మనసునెప్పుడు ఆందోళన పరచేది. కాని చివరకెప్పుడూ ఎమిల్‌దే గెలుపు; దానికతని శాంతచిత్తత, నిశ్చలత్వం, పట్టుదల, మనోనిశ్చయం ముఖ్యకారణాలు.

క్రిస్మసులో "ఛాలెంజి సెవరిన్" పోటీలకు బ్రస్సెల్సుకు వెళ్ళాడు. వణికించే చలి. పరుగెత్తే మార్గమంతా మంచుమయం. అదీకాక, మార్గం ఎత్తుపల్లాలు. తన దుస్తులను మార్చాలా అని ఆలోచించి మార్చాడు. పెద్ద వార్తా పత్రికను తీసి, మధ్య రంధ్రంచేసి, అందులో తలదూర్చి, వంటిమీద కప్పుకొని, దానిమీద బనియనువేసుకొని ఎముకలు కొరికే ఆ చలిగాలినుండి కొంత రక్షించుకున్నాడు.

మొదటినుంచి దురదృష్టం ఎమిల్‌ను వెన్నాడుచునే ఉన్నది. కాలిజోడుతాళ్లు వదులయిపోయాయి. అవి గట్టిగా కట్టుకోవడానికి టైము చాలదు. ఆగి కట్టు కున్నాడా, తన వెనకవారు ముందైపోతారు. కొంతసేపటికి అదృష్టంకొద్దీ, ఆ తాళ్లు జోళ్ళ అడుగుమేకులకు చుట్టుకొని, గట్టిగా ఉండిపోయాయి. పట్టుదలతో, బలంతో పరుగెత్తి, అన్ని ఆటంకాలను అతిక్రమించి, చివరకు తేలికగానే జయం పొందాడు. అంతవరకు ప్రజల అభిమానాన్ని పొందిన 'గాస్టన్‌రేఫ్' యిప్పుడు ప్రజలహేళనకు గురి అయ్యాడు.

1947 వసంతారంభంలో 'మిత్రసైన్యాల ఛాంపియన్‌షిప్పులు' హానో వర్‌లో ఏర్పాటయినవి. సహజంగా జెకోస్లోవక్ జట్టు, ఎమిల్ లేకుండా పూర్తిఅవడం ఎలా! కాని ఎమిల్, 'టాన్సిలైటిస్'తో హాస్పిటలులో ఉన్నాడు. వేళకు హాస్పి టల్‌నుండి బయటకు వస్తాడా అని అనుమానం. 'పెనిసిలిన్' యిచ్చి త్వరగా ఎమిల్‌ను బాగుచేసి, ప్రయాణానికి సకాలంలో ఆతనిని హాస్పిటల్ అధికార్లు పంపించారు.

గుఱ్ఱపుపందేల మార్గమే యీ పందెమునకుకూడా ఉపయోగించారు. ఎమిల్ అతివేగంగా పరుగెత్తి, పోటీదార్లను ఎక్కడో దూరాన వదలి,దృష్టి మేరలో కనబడని దూరంలో వారుండగా గమ్యం చేరుకున్నాడు.

సాయంత్రం, పెద్ద ఉత్సవం జరిగింది. అందరూ ఎమిల్ విజయాన్ని గూర్చే చర్చ. ఇంగ్లీషు కమేండరు భార్య యీతని పరిచయాన్ని కోరింది.

"ప్రియమైన జటోపెక్, గుర్రాలుకూడా నీవంటే అసూయపడే విధంగా పరుగెత్తినావు. ఎంతో ఆనందంగా ఉంది" అని ఆతని నామె అభినందించింది.

# విజయాలు - రికార్డులు

ఎమిల్ ఇంటికి తిరిగి వచ్చాడు; వచ్చి తన చదువులో నిమగ్నుడయ్యాడు. త్వరగా ఆఫీసరుగా పట్టభద్రుడవాలని అతని అభిలాష.

సాయంకాలపు వేళలో పరిసరపు టడవులలోకి పోయేవాడు.

తన మనోనిశ్చయం అతనిని తరుముతూంటే, ఆ అడవిలో నిశ్శబ్దంలో అతని బూట్ల చప్పుళ్లు, చెట్ల కొమ్మలను కదుపుతూ ఆ ప్రశాంత వాతావరణాన్ని ప్రతి ధ్వనింప జేస్తూంటే, యింకా వేగంగా పరుగెత్తుట అలవాటు చేసుకుంటూ, తన కోరి కను సఫలీకృతం చేసికొనుటకు ఎమిల్ పాటుపడుతున్నాడు.

పోటీలకాలం ప్రారంభమయింది. బ్రాటిస్లావా-జిలన్ మధ్య జరిగిన పోటీలో ఎమిల్ పాల్గొన్నాడు. అది మూడు కిలోమీటర్ల పరుగు. చాలకాలం తర్వాత జిలన్ నగరంలో ఎమిల్ పరుగెత్తుటకు యిదే మొదలు. ప్రేగ్ లోను, యింకా యితర ప్రదేశాలలోను, తాను చూపిన ప్రావీణ్యాన్ని జిలన్ ప్రజలకు చూపలేదు కదా అని, ఈ పందెంలో తన యావచ్ఛక్తిని ఉపయోగించాడు.

దురదృష్టంకొద్దీ, అతనితో సమానమైన శక్తిని చూపగల పోటీదారు లేక పోయాడు. అందుచేత చాలదూరం ఒంటరిగా, ప్రక్కన పోటీదారులేకుండా, పరుగెత్త వలసి వచ్చింది. మొదట్లోనే, చాలామంది పోటీదార్లను వెనక్కు వదలి ముందుకు పోయాడు. అయినా, ఆఖరు 400 మీటర్లదూరం, పూర్తిశక్తిని ఉపయోగించి పరుగెత్తాడు.

ఈసారి ఆయాసమనిపించలేదు. బాగా పరుగెత్తినట్టు తనకు సంతుష్టికలిగింది. అందుచేత ఎంతో ఆతృతతో, పరుగు పూర్తిఅయిన తర్వాత అధికారి ఏమని ప్రకటిస్తాడా అని ఎమిల్ ఎదురుచూస్తున్నాడు.

అప్పుడొక ప్రేలుడుశబ్దం వినబడింది. దాని అర్థం, ఒకరికార్డు భగ్నమయిందని. ఎమిల్ మాత్రం, అలాంటి దేదో జరిగేఉండునని భావించాడు. కాని ఎంత 'వేళా' అనేది తెలుసుకోవాలి.

"3000 మీటర్ల పరుగుపందెం 8 నిమిషాల 13.6 సెకండ్లలో ఎమిల్ గెలిచి, రికార్డు సృష్టించాడు."

అప్పుడు ప్రజలలో కలిగిన ఆవేశం అపరిమితం. లైట్ మిణుగుర్లు టకటకమంటు న్నాయి; టెలిఫోన్లు అలా మోగుతూనే ఉన్నాయి; ఆశ్చర్య మవనిసంతా ఆవరించింది. 'పాయింట్ల'లో జెకోస్లోవేకియాకు నాయకుడయ్యాడు, ఎమిల్; ప్రపంచ జాబితాలలో 3 కిలోమీటర్ల పరుగులలో 8 వ వాడయ్యాడు.

కాని, యిదివరకులాగే ప్రేగ్ లో ప్రజలుమాత్రం అనుమానాలతో నిండి పోయారు. అందుచేత యింక 14 రోజులలో ప్రేగ్ లోని 'స్ట్రెహోవ్' స్టేడియంలో జరిగే అంతర్జాతీయ పోటీలకొరకు ప్రజలు ఆతృతతో కనిపెట్టుకొని ఉన్నారు. ఎమిల్ ప్రావీణ్యం అక్కడ పరీక్షింపబడుతుంది.

ఎమిల్ ఏ పందెంలో పాల్గొంటే, దానికి సంబంధించిన 'రికార్డు' ప్రమాదంలో పడుతూంది. జెకోస్లోవక్ 800 మీటర్ల ప్రవీణుడు, యుద్ధంలో మృతిజెందిన వీరుని సంస్మరణార్థం ఏర్పాటుచేసిన 'రాసికీ మెమోరియల్ రేస్' 1947 లో మొదటి పెద్ద పందెం. అందులో ఎమిల్ పాల్గొన్నాడు.

ఎమిల్ ప్రజలకు ఆశాభంగం కలిగించలేదు. ప్రత్యేకంగా చూచినవారు మాత్రమే ఎమిల్ యీ పందెంలో చూపిన శక్తిని గూర్చి చెప్పగలరు.

రోజంతా జూలై మాసపు సూర్యుని వేడితో 'కాంక్రీటు'తో నిర్మింపబడ్డ ఆ ప్రేక్షక స్థానాలు కాలిపోయి ఉన్నాయి. సాయంకాలం కొంచెం తీక్ష్ణత తగ్గిన తర్వాత, చల్లదనం ప్రారంభమయింది.

అట్టి అద్భుతమైన పోటీలు, అట్టి మహత్తర ప్రదర్శనలు అతి అరుదుగా తట స్థిస్తాయి. ఆ నిరాడంబర బెల్జియన్ వీరుడు ప్రేక్‌మన్ అద్భుత ఫక్కీలో రికార్డు సృష్టించాడు. ఆ రంగుజాతి వీరుడు మెక్డొనాల్డ్ బెయిలీ 200 మీటర్ల పందెంలో అణుశక్తి వేగంతో పరుగెత్తాడు. 800 మీటర్ల పందెంలో మన దేశం పాల్గొన్నది. అట్టి అద్భుతమైన పందెం మరెన్నడూ చూడబోం. జెకొస్లొవక్ వీరుడు రికార్డు దారు 'వాక్లేవ్ సివోనా', స్వీడెన్ దేశీయుడు 'లూంగ్రీన్' చేత ఓడింపబడ్డాడు. 'జావ లిన్' విసరుటలో, 'పోల్‌వాల్టు'లో, 'హేమరు' విసరుటలో అనేకమైన మొదటి రకపు పోటీలు జరిగినవి; వీటన్నిటిలోను పోటీలు చేస్తున్నది మన జెక్ దేశీయులే.

ముఖ్యమైన 5000 మీటర్ల పోటీ యింకా జరగవలసి ఉన్నది. ఖ్యాతినొందిన జెకోస్లొవక్ పందెపు వీరుని గౌరవార్థం, ప్రేక్షక జనం లేచి నిలబడినప్పుడు, ఆట స్థలం సగం వారి నీడలతో ఆవరింపబడింది. తన జన్మస్థానం కొరకు ప్రాణాల నర్పిం చిన జెక్‌వీరుడు 'రాసిక్'ని గూర్చి ఆవేశంతో, ఆవేదనతో ఉపన్యాసకుడు పలికిన పలుకులు అందరి హృదయాలను ద్రవింపజేశాయి.

తరువాత ప్రజల దృష్టులు ఎదురుగా, ఆశ్చర్యంతో యిటూ, అటూ పచారు చేస్తున్న ప్రపంచ ప్రఖ్యాతిగన్న పందెపు వీరులమీదకు పోయినవి. అందులో జటో పెక్‌ను గతసంవత్సరం ఓడించిన స్వీడ్ వైబర్గ ఒకడు; ఇంకా ఫిన్‌వీరులు కోస్కేలా, హేయిన్‌స్ట్రామ్‌కూడా ఉన్నారు.

ఆస్లోలో వైబర్గ మనకు పరిచితుడే. కాని, యీ ఫిన్నులగూర్చి మనకు తెలి యదు. అయినా పరుగు వీరుల జన్మస్థానమయిన ఫిన్‌లాండునుండి వచ్చిన వీరు మన గౌరవానికి పాత్రులే. మన దేశీయులలో జటోపెక్‌కాక, దూరపు పరుగు పందే లలో ప్రవీణులు కొందరు యీ అసమాన పోటీలో పాల్గొనుటకు ధైర్యంతో తయా రుగా ఉన్నారు.

ప్రారంభోద్యోగి పరుగు పందెగాళ్ళనందరిని ఆహ్వానిస్తున్నాడు. వైబర్గ జడు స్తున్నట్టున్నాడు; జటోపెక్‌శక్తి అతనికి బాగా తెలుసు. యథాప్రకారంగా ఫిన్లు మూగనోము పట్టారు; ఎమిల్ మంచి ఉత్సాహంగా ఉన్నాడు.

పందెం ప్రారంభమయింది.

మొదటిఘట్టం : 64.5 సెకండ్లు; జటోపెక్ ప్రారంభంనుంచీ అందరికన్న, ముందున్నాడు. ఒక్క సెకండుకూడా వృథా చేయకూడదని అతని అభిప్రాయం. రికార్డుసంగతి అలా ఉంచి, ముందువిషయం జయం. వైబర్గ, కోస్కేలా, హేయిన్ స్ట్రామ్ తన మడమల వెనకే ఉన్నారు.

రెండవఘట్టం : 67.5 సెకండ్లు : ఈ ఘట్టం మొదటిదానికన్న నెమ్మదయినది. జటోపెక్ ముందున్నాడు. విదేశీయులు వెనకున్నారు. పందెగాళ్లు ఊపిరి బిగపట్టు తున్నారు.

మూడవఘట్టం : 64.5 సెకండ్లు: ఎమిల్ పరుగువేగం అధికంచేశాడు. వైబర్గ, కోస్కేలా, హేయిన్‌స్ట్రామ్ అతని నంటే ఉన్నారు. ఎమిల్ వారిని వదల్చుకోలేక

పోయాడు. మొదట పరుగెత్తేవాడు వెనుక నున్నవారిని రెచ్చగొట్టడానికి పన్నే పన్నుగడలనుగూర్చి వారికి బాగా తెలుసు.

నాల్గవఘట్టం : 67.5 సెకండ్లు: వరసగా జటోపెక్, నైబర్గ, కోస్కెలా. హెయిన్‌స్ట్రామ్ వారితో సమానంగా సాగలేకపోయాడు; వళ్లు బిగుసుకుపోతూంది. నెమ్మదిగా వెనకబడిపోయాడు.

అయిదవఘట్టం : 67 సెకండ్లు: జటోపెక్ ఒకయంత్రంలాగ పరుగెత్తుతున్నాడు. కోస్కెలాకూడా విరమించుకోవలసి వచ్చింది. ఆ ముందు పరుగెత్తే కుందేలు త్వరలోనే పడిపోతాడన్న అర్థంలో తల ఊపుతున్నాడు.

ఆరవఘట్టం ; 69 సెకండ్లు: జటోపెక్ యింకా ప్రథమస్థానంలోనే ఉన్నాడు. వానివెనక నైబర్గ; 50 మీటర్లవెనక కోస్కెలా; యింకా ఎక్కడో దూరంగా హెయిన్‌స్ట్రామ్ బలహీనంగా పరుగెత్తుతున్నాడు; జటోపెక్ కష్టదశ దాటినట్టున్నాడు. కొంతవేగం సడలించాడు. వెంటనే నైబర్గ తన మడమలవెనక్కు చేరుకున్నాడు. నైబర్గ కష్టంగా పరుగెత్తుతున్నట్టు ఊహించాడు; ఊపిరితీయడం వినిపిస్తూంది. అతని అడుగులలో బరువును కనిపెట్టాడు; ఒక్కక్షణం బిగువు వదలాడు. వెంటనే పళ్ళు బిగించాడు, తల ఒకప్రక్కకు విసిరాడు; ఒక్క మానవాతీతమైన ప్రయత్నంచేశాడు; పరుగువేగం అత్యధికం చేశాడు; నైబర్గ యిదంతా గ్రహించేలోగా ఎన్నోమీటర్లు వెనకబడిపోయాడు. విశ్వప్రయత్నంచేశాడు; లాభం లేకపోయింది.

"ఆముందు పరుగెత్తుతున్నవాడు పిచ్చెత్తినవానివలె ఉన్నాడు; లేకపోతే ఆ ఆవేశం అర్థంకాదు. అతనితో సమానంగా పరుగెత్తుట దుస్సాధ్యం" అన్నారు.

7 వ ఘట్టం : 68 సెకండ్లు : ఏదో ఒక పెద్ద బరువు తన మీదనుండి తొలగిపోయినట్టు, ఎమిల్ గాలిలో ఎగిరిపోతున్నాడు. మరేమీ ప్రమాదం లేదని గ్రహించాడు. నైబర్గ 40 మీటర్ల వెనకనున్నాడు; కోస్కెలా 100 మీటర్ల వెనక; హెయిన్‌స్ట్రామ్ యింకా ఎంతో వెనక.

అనాయాసంగా ఎమిల్ ఇప్పుడు పరుగెత్తుతున్నాడు. వాని కదలికలు తేలికగా ఉన్నాయి. ఊపిరి సరిగా తీసుకొంటున్నాడు; వాని హృదయంలో ఆనందం గంతులు వేస్తూంది. ఈనాటి జటోపెక్ పూర్వం ఉత్తరాదివారిమధ్య గుర్తింపబడగలిగిన జటోపెక్ కాదు; క్రిందటి సంవత్సరం సన్‌డిన్ చేత ఓడింపబడిన జటోపెక్‌ను కాదు ఈ సారి మనం చూచేది. ఆ 'సన్‌డిన్' ఈరోజు ఎక్కడుంటాడు ? ఈనాడు జటోపెక్ తన గురువునుకూడా అధిక్షేపించగల తేలిక పాదాలతో పరుగెత్తుతున్నాడు; ఒక్క హేగ్ మాత్రమే అతనికన్న వేగంగా పరుగెత్తగలడు.

ఎనిమిదవ ఘట్టం : 70 సెకండ్లు : ఒక్కసారి ఊపిరి బిగపట్టి పరుగుతీసి, మళ్ళీ యథాప్రకారంగా ఊపిరి తీసుకుంటున్నాడు. ఫలితాలను ప్రకటించే ఉద్యోగి అప్పటికి ఎంతదూరం, ఎంతవేళలో పరుగెత్తింది ప్రకటించాడు: 800 మీటర్లు : 2 నిమిషాల 12 సెకండ్లు; 1500 మీటర్లు 4 నిమిషాల 08 సెకండ్లు; 2000 మీటర్లు

5 నిమిషాల 31 సెకండ్లు; 3000 మీటర్లు 8 నిమిషాల 24 సెకండ్లు; పూర్వపు ప్రపంచ రికార్డులు ఈ 'వేళల'లో ఆ దూరం పరుగెత్తగలిగితే గర్వించేవారు. 3000 మీటర్ల వేళ చాలా దేశాలలో రికార్డుగా పరిగణింపబడుతుంది.

రెండు సంవత్సరాల వెనుకకు మనదృష్టిని సారిస్తే యీ 2000 మీటర్ల రికార్డు, 3000 మీటర్ల రికార్డు, ఎమిల్ పూర్వపుప్రదర్శనలకంటే బాగున్నాయని స్పష్టం. ఈ కొద్దికాలంలో ఎమిల్ ఏ విధంగా అభివృద్ధి గాంచాడో యివి ఉదాహరణలు:

మా మనసులలో 'గుండర్ హేగ్'తో ఎమిల్‌ను పోల్చుటకు ప్రారంభించాం. వాని రికార్డు పరుగుపందెంలో వేళలు జ్ఞప్తికి తెచ్చుకున్నాం. 2 నిమిషాల 8 సెకండ్లు (800 మీటర్లు); 4 నిమిషాల 03.6 సెకండ్లు (1500 మీటర్లు); 5 నిమిషాల 21 సెకండ్లు (2000 మీటర్లు); 8 నిమిషాల 17.5 సెకండ్లు (3000మీటర్లు); నాలుగునుంచి 6 సెకండ్లు మాత్రమే వేళల్లో తారతమ్యం.

తొమ్మిదవఘట్టం: ఇంకా మూడుసుట్టాలున్నాయని, 200 మీటర్ల దూర ముందని ప్రకటన వినబడింది. పరుగులు జరుగుతున్నాయి. ఎప్పుడు గమ్యస్థానం చేరడమన్నదే ప్రశ్న: వేగంతోటి సంబంధంలేదు; వేళతోటి మాత్రమే. నైబర్గు 150 మీటర్ల వెనకనున్నాడు; కోస్కీలా 100 మీటర్ల వెనక నున్నాడు.

ఈలోపుగా వేళలనుగూర్చి ప్రకటనలు వినబడుతున్నాయి. ప్రేక్షకులలో ఆవేశం హెచ్చయిపోతూంది.

పదవఘట్టం: 70.3 సెకండ్లు. "జటోపెక్! జటోపెక్!" అనే కేకలు బయలు దేరాయి. ఆ చుట్టుప్రక్కల ప్రదేశాలలో యీ పేరే ప్రతిధ్వనిస్తున్నది. నిశ్శబ్దంగా, శాంతంగా ప్రేక్షకులు కూర్చోలేకుండా ఉన్నారు; ప్రతివానికి ఎన్నడూ చూడనట్టి యీ ప్రదర్శనలు ఆవేశం, ఉత్సాహం కలిగిస్తున్నాయి. జటోపెక్ పరుగెత్తుతూంటే ప్రక్కనున్న ప్రేక్షక స్థానాలలో బయలుదేరిన నినాదాలకు అంతులేదు.

పదకొండవ ఘట్టం: 68.7 సెకండ్లు: అక్కడ చేరిన వేలకొలది ప్రేక్షకుల హృదయాల్లో నుండి, కంఠాలలోనుండి "జటోపెక్!" అనే శబ్దంతప్ప నేరొకటి వినబడుటలేదు. ప్రతి ప్రేక్షకుడు లేచి నిలబడిపోయాడు; అతనితో కూడా పరుగెత్తుటకు పుత్సహిస్తున్నారు.

పన్నెండవ ఘట్టం: 72.7 సెకండ్లు. ఇదే అన్నిటికన్న నెమ్మదిగా జరుగుతూంది. హేగ్ కూడా యిదేవిధంగా ప్రవర్తించాడు. ఎంత చేసినా జటోపెక్ మానవ మాత్రుడు. అతని కాళ్లు బరువెక్కిపోయాయి. అతని వేగం తగ్గిపోయింది. ఆ గమ్య స్థానం అకస్మాత్తుగా ఎంతో దూరాయున్నట్టు కనుపించినది. ఒక్కసారి ఆ గడ్డి కంబళిమీద కాళ్లు చాచుకొని పడుకుంటే ఎంత హాయిగా ఉంటుంది. అయితే తన కోరిక ఫలించదు.

ప్రేక్షకులు గెలుపెవరు పొందుతారు అని పందేలు వేసుకుంటూంటే, ఎమిల్ ఎంతో కష్టపడుతున్నాడు. నిజమే, పందెం గెలుచుట తథ్యమే; అయినా అతి తక్కువ వేళలో గెలవాలి; అదీ ముఖ్య విషయం.

గమ్యస్థానం దగ్గరకు వస్తూంది; యీ అమానుష ప్రయత్నం, పోరాటం అంత ముందాలి. అప్పుడు తన ఆయాసం అదృశ్యమవుతుంది. "జె-టో-పె-క్, జె-టో-పెక్" అనే కేకలమధ్య, ఎమిల్ వేగం హెచ్చించాడు.

పదమూడవ చుట్టు: ఆఖరు 200 మీటర్లు 30.2 సెకండ్లలో పూర్తి కావాలి. ఆఖరు మలుపు, తర్వాత గమ్యస్థానం. జటోపెక్ వేగం హెచ్చించాడు. గమ్యస్థానం చేరుకున్నాడు.

అతడు పడిపోకుండా పట్టుకొనుటకు అనేకమంది చేతులు చాచారు. కాని ఎమిల్ ఒక సోల్జరు. అతనికి సహాయం అవసరంలేదు. అతని ఆయాసంకన్నా అతని ఆనందం అధికంగా ఉంది. విజయం సంపాదించాడు; రికార్డు ముక్కలు చేశాడు; 14 నిమిషాల 08.2 సెకండ్లు అతని అతి కనీసపు వేళ. ఒక్క హేగ్ మాత్రమే తనకన్నా వేగంగా పరుగెత్తేడు. ఆఖరి ఘట్టంలో పరుగెత్తినప్పుడు ఎదురుగాలి లేకపోతే, యింకా ఎంతవేగంగా పరుగెత్తేవాడో.

ఆయాసంతో నైగ్గ గమ్యస్థానం చేరుకొనేటప్పటికి, ఎమిల్‌ను అన్ని కోణా నుంచి ఫొటోగ్రాఫులు తీశారు. కోస్కేలా, హెయిన్ స్ట్రౌమ్ చేరుకొనేసరికి, ఎమిల్ పూర్తిగా కోలుకున్నాడు.

ఈ కొత్త రికార్డు సృష్టికర్త తన దుస్తులను వేసుకొని బహుమానాలను స్వీకరించాడు. పత్రికా ప్రతినిధులు, ఇంటర్వ్యూలు, విందులు యివన్నీ ఎందుకు ? వీటన్నింటికి వేళలేదు. సోల్జరుగా యితనికి అనేక యితర విధ్యుక్తాలున్నవి. ఆ రాత్రే 'బ్యారెక్సు'కు తిరిగి పోవాలి: మర్నాడు ఉదయమే 'ఫీల్డు ఎక్సర్సైజు'కు పోవాలి.

"సెలవు; ఈమారు సెలవు దొరకగానే, మరల మీకోరకు పరుగెత్తుతాను."

పరుగు పందెగాడుగా, సోల్జరుగా జటోపెక్ స్వభావమది.

# ఫిన్లండులో సాహస చర్య

జటోపెక్ 'బ్యారెక్సు'కు తిరిగి వచ్చేడో లేదో ప్రయాణానికి పెట్టెలు సర్దుకోవలసి వచ్చింది. ఫిన్లండు పరుగు పోటీదార్లు ప్రేగ్‌కు వచ్చి పందెములలో పాల్గొనవలెనంటే, జటోపెక్ ఫిన్లండు వచ్చి అక్కడ పందెములలో పరుగెత్తవలెనని ఫిన్నిష్ ఎసోసియేషన్‌వారు షరతు పెట్టేరు. అందుచేత జటోపెక్, కోస్కేలా, హెయిన్ స్ట్రౌమ్‌లతో పాటు ఫిన్లండుకు పోవలసివచ్చింది.

స్టాక్‌హోమ్‌మీదుగా వారు సుఖంగా ప్రయాణము చేశారు. కోస్కెలా తన జీవితాన్నిగూర్చి తన ఫిన్నిష్ భాషలో జటోపెక్‌కు చెప్పేవాడు. తన పొలాన్ని గూర్చి, దున్నడంగూర్చి, తనదగ్గర యెన్ని ఆవులు, పందులు, చెవులపిల్లులు ఉన్నాయో మొదలైన విషయాలన్నీ సంజ్ఞలతో ఫిన్నిష్ భాషరాని జటోపెక్‌కు బోధపరచాడు.

స్టాక్‌హోమ్‌కు ఎమిల్ వచ్చుట కదే ప్రథమం. స్వీడిష్ పత్రికా ప్రతినిధుల చేతులలో పడ్డాడు. ఇటీవలి తన విజయాలనుగూర్చి వా రడిగిన ప్రశ్నలకు విపులంగా జవాబు చెప్పేవాడు. పట్నం 'స్క్వేర్'లో వారి కోరికను మన్నించి పరుగెత్తగా అన్ని కోణాలనుంచి వాని ఫొటోగ్రాఫులు తీయబడినవి.

ఆ మరునాడు వారి స్టీమరు ఫిన్లండులో 'తుర్కు' అనే రేవుపట్టణం చేరుకుంది. అక్కడనుంచి ట్రెయినులో హెల్సింకీ చేరుకున్నారు. అదే ఫిన్నిష్ జాతీయపోటీలు జరిగేస్థలం. అందమైన అసంఖ్యాకమైన సరస్సులతో, వర్ణసౌభాగ్యంతో నిండిన ఆ తీరప్రదేశాలు, ఆ వనాల నిశ్శబ్దత, నిరంతరం పాటుపడే ఆ ప్రజలు అన్నీ జటోపెక్‌ను ఆకర్షించాయి, ఆనంద పరిచాయి.

హెల్సింకీలోని హోటల్సు అన్నీ నిండిపోయాయి. చివరకు "హాన్స" అనే పేరుగల హోటలులో ఆతని కొక గది దొరికింది. గదిని సంపాదించిపెట్టినందుకు తన కృతజ్ఞతను తెలియపరుస్తూ, 'శాంతాహమీనా' అనే ద్వీపంలోని "క్రీడాగ్రామం"లో ఒక చిన్న క్యాబిన్‌లో నివసించుటకు అభిలషించాడు.

ఆ ద్వీపానికి పడవలోపోతూంటే, అకస్మాత్తుగా ఎందుచేతనో అపరిమితమైన ఆయాసం బయలుదేరింది. ఇంకా సాయంత్రమవలేదు; యీ పగటిపూట యింత ఆయాసం ఒక్కసారి ఎందుకు బయలుదేరిందని ఆశ్చర్యపోయాడు. వాచీ చూచేసరికి అర్థరాత్రయిందని గ్రహించాడు. ఆ దేశాలలోని అర్థరాత్రపు వెలుతురిదని గుర్తించాడు. ఆ తర్వాత ఎప్పుడైనా పగలు నిద్రపోతే, ఫిన్లండు జ్ఞాపకంవచ్చే దతనికి. కళ్ళుతెరచాడు. తానున్న క్యాబిన్ ఎదుటనున్న 'ఎర్చి' చెట్ల పొడుగాటి, సన్నటి ఛాయ లతనికి కనబడ్డాయి. ఈ బరువైన, వెచ్చని వాతావరణంలో నిద్రపోవడానికి ఆత డిచ్ఛగించలేదు. అప్పుడే సూర్యుడు నడినెత్తికి పోతున్నాడు. మరికొంత సేపటికి ఆవృక్షచ్ఛాయలు మరొకదిక్కుకు వాలిపోతాయి.

ఈ దూరపు ప్రయాణం, అసౌకర్యాలు, ఆ ఉష్ణపు రాత్రివేళలు అన్నీ ఆతని శక్తిని పీల్చివేశాయి. ఆతని బరువు తగ్గిపోయినట్టయింది; ఆతని విశ్వాసం క్షీణించింది. ఆ స్లోపట్నంలో తాను పరిచయంచేసికొన్న కొందరు నార్వేజియన్లవద్దనుండి ఆ సమయంలో ఒక విధమైన అశుభవార్త వచ్చింది: ప్రేగ్‌లో పరుగెత్తుటకు ఆహ్వానాన్ని నిరాకరించిన 'హీనో' యీసారి హెల్సింకీలో పరుగెత్తుతాడట.

హీనోతో పరుగెత్తుటకు జటోపెక్ జంకడు. మామూలు పరిస్థితిలో చాలా ఆనందించేవాడు. కాని యీనాటి తన స్థితిలో ఫలితం ఏమవుతుందోనన్న అనుమానం కలిగింది.

జూన్ 30 వ తేదీన ఆటలు ప్రారంభమయ్యాయి. ఆ సాయంత్రమే, 5000 మీటర్ల పరుగు పందెం 7 గంటలకు ప్రారంభమవుతుంది. వేళయింది. ఆలస్యం కాకూడదని, ఎమిల్ పరుగెత్తి, పందెం మొదలయ్యే స్థలానికి పోయాడు. మైక్‌లో ఏదో చెప్తున్నారు; తన పేరువినబడింది. విషయం మిత్రులు చెప్పారు. హెల్సింకీలో పోటీదార్లు ఒంటరిగా పందెపు ప్రారంభ స్థలానికి పోరు; బయట అందరూ సమావేశ మయిన తర్వాత, ఆటల ఉద్యోగి వచ్చి వారినందరిని, నిర్ణీత స్థలానికి స్వయంగా తీసుకుపోతాడు; ఎమిల్ ఒంటరిగా ఆ స్థలానికి వెళ్ళటంవల్ల హెల్సింకీ ఆచారాలకు వ్యతిరేకంగా ప్రవర్తించాడు.

ఎలాగా అక్కడ చేరుకున్నాడు గాబట్టి, ఎమిల్ అక్కడే ఉండిపోయాడు. తక్కినవారంతా నెమ్మదిగా ఉత్సవంలో వచ్చారు. ప్రేక్షకులు సన్మాన పురస్స రంగా కేకలు వేశారు; ఈ సన్మానమంతా వీరికేనా? వీరిలో 'హీనో' లేడే. వాని కేమయిందని అడుగుదామనుకుంటున్నాడు. ఇంతలోకే పందెపు దుస్తులలో తయా రయినాడు ఫిన్నిష్ ప్రజల వీరుడు హీనో. ప్రశంసాపూర్వక నినాదాలమధ్య ఆ స్థలానికి పరుగెత్తుతూ వచ్చి చేరుకున్నాడు. 'హీనో' సన్మానంకొరకు చేసిన వీ ప్రత్యేకపు ఏర్పాట్లని ఎమిల్ అనుకున్నాడు. తన స్వతంత్ర ప్రవర్తనవల్ల, ఏర్పాట్లు తారుమారయ్యాయి. ఏదయినా అనుకోకుండా జరిగిన యీ సంఘటన రాబోవు ఫలి తాన్ని సూచిస్తున్నట్టనిపించింది.

అద్భుత పరుగుపందెగాడు 'హీనో' యీనాటి పందెంలో విజయకిరీటాన్ని ధరిస్తాడని, అందరి నమ్మకం. అందరి సమక్షంలో హీనోఖ్యాతిని తిరగ్రోయ సమ కట్టిన యువక వీరుడు జటోపెక్‌ను ఓడించాలి. జెటోపెక్‌ను యిక్కడకు ఆహ్వా నించుటకు అదే కారణం.

ఆస్లోలోవలెనే, పందెపు ప్రారంభంలో మొకాళ్ళలో ఏదో బలహీనత బయలుదేరింది ఎమిల్‌కు. ప్రేక్షకులుకూడా ఆవేశంతో ఉన్నారు. ఒక్కొక్కఘట్టం పూర్తవుతూంటే, ఆవేశం అధికమయ్యేది. ఇద్దరు సమానసామర్థ్యంగల పోటీదార్ల మధ్య పోరాటం. మానవశక్తిని సంపూర్ణంగా పరీక్షించే పోరాట మిది.

ప్రారంభంనుంచి పోరాటం జటోపెక్, హీనోలమధ్యనే. మొదటిఘట్టం అయి పోగానే ఫిన్నిష్‌భాషలో ప్రకటన; ప్రయాణంలో ఫిన్నిష్ అంకెలు కొన్నిటిలా తనకు నేర్పినందుకు సంతోషించాడు. లేకపోతే యీ ప్రకటనలు బోధపడేవికావు. వేళలు తెలియకుండా పరుగెత్తుటంత అధ్వాన్నం మరిలేదు. ఫిన్నిష్ భాషలో చెప్పే వేళలను చాలావరకు బోధపర్చుకున్నాడు. వేళలు తెలుసుకొని, తదనుగుణ్యంగా తనవేగం దిద్దుకొనేవాడు ఎమిల్.

1500 మీటర్లు యిద్దరూ 4.08 సెకండ్లలో పూర్తిచేశారు. హీనోను వెనుక్కు పంపుదామని ఎంతో ప్రయత్నించాడు ఎమిల్; కాని లాభంలేకపోయింది. ప్రేక్షకు లలో అనేకులు వారి అభిమాన వీరుని ప్రోత్సహించారు; విదేశీయులు జటోపెక్‌ను ప్రోత్సహించారు. అప్పటికి 3 కిలోమీటర్లు పరుగెత్తారు; ఫిన్నును తన ప్రక్కనుండి

వదుల్చుకుందామంటే, ఎమిల్‌కు సాధ్యంకావడంలేదు. ఇక్కడ ఫిన్ను పోటీదారు ఎమిల్‌ను దాటాడు; అప్పటినుంచి వేట ప్రారంభమయింది; ఒక్కొక్కసారి హీనో, ఒక్కొక్కసారి జటోపెక్ ముందుండేవారు. ప్రేక్షకులు యీ మధ్య యిలాంటి పందెం చూడలేదు. ఇద్దర్లో ఏ ఒక్కరు, నిర్ధారకమైన ముందంజవేయలేకుండా ఉన్నారు. ఆ నిద్రలేని వేడి రాత్రుళ్లు ఎమిల్‌ని పీల్చివేసి, ఆతనిలో సహజంగా ఉండే అవసరపుశక్తిని అణచివేశాయి. ఆయాసం ఎక్కువైంది. శక్తి క్షీణిస్తూంది. హీనో యీ విషయం గ్రహించి నట్టున్నాడు; గమనం అధికం చేశాడు. నిర్ధారణగా ముందుకుపోయాడు. విజయం చేతుల్లోనుండి జారవిడవకూడ దనుకున్నాడు.

కాని హీనోకన్న ఎక్కువ నిబ్బరమైన నిశ్చయం కలవాడు మరొకడున్నాడు. తనవెనకే, తన మడమలకు తగులుతూనే, మానవాతీతమైన మనోశక్తికలిగి, బూట్లకాళ్ళతో అనేక కిలోమీటర్ల శక్తి నలవరచుకొనుటకు పరుగెత్తిన జటోపెక్ ఉన్నాడని హీనో గ్రహించలేదు; ఒక్కసారి ఎమిల్ తన ఆయాసాన్ని దూరంగా త్రోసివేశాడు; శరీరానికి కొత్తబలం వచ్చింది. అవయవాలన్నీ మనస్సుకు బానిసలై పోయాయి. వేగం, వేగం, వేగం! గాలివలె ఎగిరిపోతున్నాడు. సమయానికి హీనోను కలుసుకొన్నాడు.

ఇంక, యిద్దరూ ప్రతి అంగుళంకొరకు పోరాడడం మొదలుపెట్టారు. హీనోకు వాని ప్రజల ప్రోత్సాహం, తన పరిచయ ప్రదేశం, తన దేశం అన్నీ అనుకూలంగా ఉన్నాయి. నారు ఆశించిన విజయాన్ని బలవంతంగా సంపాదించ వలెనన్న పట్టుదల, ప్రజలను ఆవేశించింది. హీనో తనకు దగ్గరదగ్గరగా వస్తూన్న ఎమిల్ ఊపిరిగాలులు, ఆతని సన్నిహితత్వాన్ని రుజువుచేస్తున్నాయి; ఆతని వేగం అనుల్లంఘనీయంగా ఉంది. ఆఖరు మీటర్లలో హీనో తన యావచ్ఛక్తిని ఉపయోగించాడు. నిరాశతో నిండిన ఆతని కళ్ళల్లో వెనుకనున్న జటోపెక్ భుజాలు కనబడ్డాయి; తరవాత అవి తన భుజాలతో సరిగా ఉన్నాయి; తర్వాత కొన్ని సెంటిమీటర్ల ముందు కనబడ్డాయి. గమ్యస్థానందగ్గరకు వచ్చే బదులు అపంచలంగా కనబడింది. ఆ క్షణంలో జటోపెక్ ఒక మీటరు ముందుకు గమ్యస్థానంవద్ద దృగ్గోచరమయ్యాడు. ఆతనివేళ : 14 నిమిషాల 15.2 సెకండ్లు; హీనో : 14 నిమిషాల 15 4 సెకండ్లు.

"ముందుగానే ఎందుకు వేగం అధికంచేయలేదు; ఆఖరు నిమిషంలో చేశావేం" అని తర్వాత ఎమిల్‌ను అడిగారు.

"అది అలాగ జరిగింది. పందెం జరుగుతుంటే తన శక్తి ఏమో తనకు అవగాహనవుతుంది. ఇంకా ఒక కిలోమీటరు పరుగెత్తవలసివుంటే, ఏ పోటీదారూ తన యావచ్ఛక్తిని అప్పుడే ఉపయోగించడు. ఒకవేళ ముందుగానే శక్తినంతా ఉపయోగించి వేస్తే, చివరవరకూ నిలడలేడు. గమ్యస్థానం దగ్గరిగావుంటే, తర్వాత ఏమైనాసరే, శక్తినంతను ఉపయోగిద్దామనే నిశ్చయం కలుగుతుంది. నాలోనున్న శక్తినంతను నేను వ్యయంచేస్తాను. వివేకాన్ని మూలకు త్రోసివేస్తాను."

ఫిన్ దేశస్తులు అందరూ ఆశాభంగం పొందారు. వారి మనోభావాన్ని దాచలేకపోయారు. జటోపెక్‌ను గౌరవించుటకు జరిగిన సభలో అతనితోపాటు హీనో హాజరుకాకపోవుట ఆటగాని కుండవలసిన లక్షణంకాదని ప్రజలందరూ నిరసించారు. హీనోను బలవంతంగా దుస్తులు మార్చే గదినుండి తీసుకొని వచ్చారు.

ఎమిల్ ఓడిపోయినప్పుడల్లా విజయుని అభినందించేవాడు. కాని హీనో మాత్రం ఎమిల్‌ను అభినందించలేదు. ఇది ఎమిల్‌ను బాధించింది. ఇలాంటి క్రీడలలో గెలిచినవారు, ఓడినవారు, ఒకరినొకరు గౌరవించుకోవాలి; వినయంతో ప్రవర్తించాలి; ఆత్మనిగ్రహంకలిగి నడుచుకోవాలి.

అయినా యితరు లనేకులు ఎమిల్ వద్దకు వచ్చి అభినందించారు. మనరాయబారి కూడ వచ్చి అభినందించాడు. ఒక చిన్న ఫిన్‌పిల్ల ఒక పువ్వులగుత్తి నాతనికిచ్చి "జెక్ భాషలో" జటోపెక్, నిన్ను అభినందిస్తున్నా!
నన్నది.

"ఏమిటీ? జెక్కుభాష మాట్లాడగలవా నీవు?" అని ఆశ్చర్యపోతూ ఎమిల్ అడిగా డాపిల్లను.

కాని, ఆపిల్ల జెక్ భాష మాట్లాడలేదు. అప్పుడు ఫిన్లాండులోనున్న జెక్కులు యీ మాటలు మాత్రమే ఆపిల్లకు నేర్పారు ఎమిల్‌కు ఆశ్చర్యానందాలు కలిగించడానికి.

పందెం సమాప్తి చెందినతర్వాత కలిగే ఆవేశం పందెమునకు ముందుకలిగే ఆందోళనకంటె అధికంగా ఉండడమేకాకుండా, ఎక్కుకాలముంటుంది. ఆ రాత్రి హీనోను గెలిచిన తర్వాత ఎమిల్‌కు కునుకు పట్టనే లేదు.

తిరుగు ప్రయాణంలో ఎమిల్‌కు ఒక కొత్త అనుభవం కలిగింది. పత్రికారచయితల ఆవేశపుటాకలికి ఎమిల్ గురి అయ్యాడు.

పందెమయిన మర్నాటి ఉదయం 8 గంటలకు, స్వీడిష్ పత్రికా రచయితలు జటోపెక్‌ను కలియుటకు నిర్ణయించారు.

"మాకు కొన్ని తేదీలు, కొన్ని బొమ్మలు కావా"లన్నారు వారు.

నిద్రేమీ పట్టక బాధపడినఎమిల్‌ను 6.30 గంటలకు లేపగానే, చాలాఆశ్చర్యపడ్డాడు. పోనీఏదో త్వరగా తెమిలిపోతుందికదా అని సంతోషించాడు. తన పందెపు దుస్తులు వేసుకొని పత్రికారచయితలతో సముద్రతీరానికి వెళ్ళాడు. అక్కడ ముందుకు వెనుకకు అనేకసార్లు పరుగెత్తుతూ, తన జీవితాన్నిగూర్చి అనేకప్రశ్నలు వేస్తుంటే, జవాబులు చెప్తున్నాడు. అన్నిటికన్న విస్మయ మాతనికి అంతా అయిపోయిన తర్వాత కలిగింది.

"చాలా బాగుంది, యింక మీ సామానులన్నీ సర్దుకొని మాతో దయచేయండి. మీరు ఎవరితో 8 గంటలకు మాట్లాడ దలచుకొన్నారో వారు వేరు. ఆ విషయం వినే వారికన్నా ముందు మేము వచ్చాం. హెల్సింకీకి పోదాంపదండి."

పాపం ఎమిల్ ఏం చేస్తాడు. గత్యంతరంలేదు. తమ సహచరులతో జటోపెక్ మాట్లాడకుండా చేయుటొక్కటే కాదు వారి ఉద్దేశం. వారి మనసులో వేరే ఆలోచన లున్నవి.

ప్రఖ్యాత 'నూర్మి మాన్యుమెంటు' వద్దకు అతనిని తీసుకుపోయారు. ఆ నూర్మి విగ్రహంమీద కెక్కమన్నారు. కాని యిదంతా అసహ్యంగా కనిపించింది ఎమిల్ కు. అతను నిరాకరించాడు.

పత్రికలవారిని వదల్చుకొని ఎమిల్ ట్రెయినెక్కాడు. ఎలాగో స్థలం దొరికింది. ఇప్పుడు నిజంగా అలసిపోయాడు. ప్రక్కనున్నవాడు జరగడానికి యిష్టపడలేదు. వాని దగ్గరున్న పత్రికలో నిన్నటి పందెం తాలూకు బొమ్మ కనబడింది. ఆ బొమ్మ వైపు కొంతసేపు, తర్వాత ఎమిల్ వైపు చూడడం మొదలు పెట్టేడు. తర్వాత ఎమిల్ ను గుర్తించాడు. ఎమిల్ ను వెంటనే అడిగి తెలిసికొన్నాడు. తెలిసికొని ఆ బండిలోనున్న వారందరికి తెలియజేశాడు. వెంటనే ప్రయాణీకులంతా ఎమిల్ వద్దకు వచ్చి అభినందించి, తమ హర్షామోదాలు తెలియబరచారు.

ఈ సంభాషణలు జరుగుతున్నాయి ; తుర్కు స్టేషన్ వచ్చింది. ఇంక తన దేశం పోయే ఓడలో ఎక్కవలసిన వేళవచ్చింది కదా అని సంతోషించాడు.

ఫిన్నిష్ విద్యార్థులు వారి టోపీలను గాలిలోకి ఎగరవేస్తూ, వారి ఆనందాన్ని ప్రకటించారు. ఓడ బయలుదేరే ముందు ఒక పాటపాడి, వీడ్కోలు యిచ్చారు. ప్రజలు ఒడ్డునుండి చేతులూపుతూ, తమ సంతోషాన్ని తెలియజేశారు. చిన్న చిన్న పడవలు ఆ స్టీమరుచుట్టూ తిరుగుతూ ఆ సముద్రపు అలలను క్రిందకు మీదకు గెంతులువేస్తున్నాయి. సముద్రం ప్రశాంతంగావుంది. గాలి హాయిగా, ఆనందంగా వీస్తూంది.

ఎమిల్ సముద్రంవైపు వంగిచూస్తూ, ఆ గాలిని పీలుస్తున్నాడు. మనసెంతో సంతోషంగా ఉంది. వెనక ఏదో పరిచిత కంఠం వినబడింది.

"జటోపెక్ ఇక్కడున్నాడన్న మాట ! తలత్రిప్పి ఎవరు పలకరిస్తున్నారా అని చూచాడు; 8-30 కు తనతో మాట్లాడడానికి నిర్ణయించుకున్న పత్రికా ప్రతినిధులు కనబడ్డారు. అన్ని స్థలాల్లో వెదకి ఎక్కడా దొరక్కపోతే యిక్కడకు వచ్చారు. ఇంక వారిని తప్పించుకోలేడు.

"జటోపెక్ ! యిప్పుడు మీరు మా అతిథులు. రండి, కెప్టెను గదిలోకి మాతో" అన్నారు. కెప్టెనుకు యిష్టమున్నా లేకపోయినా అంగీకరించక తప్పలేదు. బీరు, శాండ్విచ్ వచ్చాయి. కెమేరాలు పనిచేస్తున్నాయి. కాని దృశ్యం వినోదంగా లేదు. వెంటనే రెండు 'వయొలిన్'లు తీసుకు వచ్చారు. ఒకటి ఎమిల్ కు యిచ్చారు. రెండవది కెప్టెన్ కు యిచ్చారు. సంగీతం ప్రారంభమయింది. జటోపెక్ కెప్టెన్ కంటే బాగానే వాయించాడు. సంగీతంతో ప్రమేయంలేదు. అసలు ఫోటోలు తీయడమే ప్రధానం.

అమెరికా వెళ్ళినప్పుడు 'గుండర్ హాగ్' చేసినట్టుగా ఎమిల్ అక్కడే పరుగెత్తవలసి వచ్చింది.

స్థలమంతా ఖాళీచేయబడింది. ప్రయాణీకులంతా ఏమవుతోందో అని పైకి వచ్చారు. ఎమిల్ ముందుకు, వెనక్కుపరుగెత్తాడు. కెప్టెన్ 'స్టాప్ వాచీ' చూస్తున్నాడు.

'స్టాక్ హోమ్' పందెంలో పాల్గొనమని వారంతా ఎమిల్‌ను బలవంతం చేశారు. ఫిన్‌లాండు అనుభవాలు, నిద్రలేక పడిన అలసట, హీనోలో పందెపు బడలిక అతనిని బలహీన మొనర్చాయి. చివరకు వానిని వదలి వెళ్ళిపోయారు రిపోర్టర్లందరూ. అతనికి శాంతి దొరికింది. నిలబడలేక పోయాడు. తన సామానుమీదే అలాగే వాలి నిద్రపోయాడు.

మరుసటిదినం మరొక అవాంతరం. అతని "వీసా" క్రిందటిదినముతో అంతమయింది. అతనెవరో తెలిసిన తర్వాత అధికార్లు మరొక వీసానిచ్చారు. ఇంటికి ప్రయాణమయ్యాడు. ఇంటిని సమీపిస్తున్నందుకు ఆనందించాడు.

# లెఫ్టినెంటు జటోపెక్

**1947** ఆగస్టు 18 వ తేదీని మిలిటరీ ఎకాడమీలో ఉత్తమశ్రేణికి చెందిన విద్యార్థులు ఆఫీసర్లుగా పట్టభద్రులయ్యారు. దేశం విముక్తిపొందినతర్వాత అదే మొదటి పట్టభద్రుల బృందం.

ఆఫీసర్లు యూనిఫారాలలో దేశభక్తి ప్రమాణస్వీకారం చేశారు; వారి కంఠస్వరంలో వారి మనోనిశ్చయం ప్రతిధ్వనిస్తూంది.

ఆ హాలులో ఉన్నత స్థానాల్లో గౌరవనీయులైన అతిథులు, విద్యార్థుల తలిదండ్రులు, బంధువులు ఆసీనులైనారు. ప్రతి ప్రేక్షకునిదృష్టి తన కుమారునిమీదనో లేక సోదరునిమీదనో కేంద్రీకరింపబడివుంది.

రెండు సంవత్సరాల కఠినశిక్షణ తర్వాత, యీ యువకులు భవిష్యత్తువైపు ఆశతో, విశ్వాసంతో చూస్తున్నారు. ఆ 'కాకీ' దుస్తులలో జటోపెక్ అంతమందిలో ఎక్కడున్నాడో పోల్చుకొనుట కష్టం. అతడుకూడా భవిష్యత్తువైపు దృష్టి సారించాడు. అతని కండ్లలో ఆనందం పొంగుతూంది. ఎన్నాళ్ళు యీ కఠినశిక్షణను పొందాడో, ఎన్ని పందేలలో పాల్గొన్నాడో, తన విధ్యుక్తాలను ఏవిధంగా నిర్వర్తించాడో ప్రతి ఒక్కనికి తెలుసు.

ఆ ముందురోజే ప్రేగ్ నగరంలో, ఫ్రాన్సుకు పోటీగా పందెంలో పాల్గొన్నాడు ఎమిల్. 14 నిమిషాల 15 సెకండ్లలో సులభంగా పందెం గెలిచాడు. ఆ రాత్రి ట్రెయిన్‌లోనే నిద్రపోయాడు; తొందరగా క్షవరం ముగించుకుని, స్నానంచేశాడు; 7 గంటలకు తన మిత్రులతో వరుసలో నిలబడి ఉన్నాడు.

అధికార్ల ఉపన్యాసాలు, వీడ్కోళ్లు, ఆశీర్వాదాలు.

చివరకు ఎమిల్‌కు ఒక మాసం పూర్తి సెలవు దొరికింది. అత నింటికి వస్తున్నాడంటే తలిదండ్రుల ఆనందానికి మేరలేదు.

"ఎమిల్ ఎక్కువగా పరుగెత్తుతాడు" అన్నది ఆతనిచెల్లెలు ఆనాడు ఉపాధ్యాయుడు ఏదో తెమ్మని ఎమిల్‌ను యింటికి పంపినప్పుడు. అన్నట్టుగానే జరిగింది.

వాని తల్లికికూడా యీ విషయంలో ఆందోళనే. తన ఆరోగ్యాన్ని గూర్చి ఎక్కువ శ్రద్ధ తీసుకోడని చివాట్లు పెట్టేది. పత్రికల్లోకూడా యీ విషయం అనేకమంది వ్రాస్తున్నారు!

"నే నేమీ చేయలేను" అన్నాడు ఎమిల్ క్షమాపణ పూర్వకంగా. పందేలలో పరుగెత్తమని ఆహ్వానిస్తారు తెరిపిలేకుండా; వారి ఆనందానికి అంతరాయం కలిగించుట నాకిష్టంలేదు. నిజమే 5 కిలోమీటర్లు, 15 నిమిషాలలో ఎవడో పరుగెత్తుతూంటే చూస్తూ కూర్చోవడం ఎంత విసుగుగా ఉంటుంది! అందులో అర్థంలేదు. నేనా! మరికొన్ని సెకండ్లు బాధపడాలి."

ఇంకా ఎమిల్ యిలా అన్నాడు: "అదీకాక, యీ ఆటలలో ప్రజలకు అభిమానం కలిగించాలి. ప్రదర్శనలు ఎంత బాగుంటే ప్రజలంతగా ఆకర్షింపబడుతారు."

"అయితే, నీ ఆరోగ్యం సంగతేమిటి; యిప్పుడు ముఖ్యంగా నీవు జాగ్రత్తగా ఉండాలి" అన్నది ఆతని తల్లి.

"అదే నేను చేయదలచుకున్నది" ఎమిల్ వాగ్దానం చేశాడు. "మొదట అత్తయ్యకి తేనె తీసుకపోయి యిచ్చి, వెంటనే తిన్నగా వచ్చేస్తా" నన్నాడు.

ఓ తెలివితక్కువ ఎమిల్, వానిని నమ్మే ఓ తెలివితక్కువ ప్రజల్లారా! లేక తలిదండ్రులను అనునయించడానికి అలా గన్నడా ఎమిల్?

ఆగస్టు 17న ఫ్రాన్సుకు ఎదురుగా పందెంలో పరుగెత్తేడు; 18వ తేదీన పట్టభద్రోత్సవంలో పాల్గొన్నాడు. 19వ తేదీన బ్రూనోలోని తన అత్తయ్యకి తేనె తీసుకు వెళ్ళాడు; ఆ మధ్యాహ్నమే మరొక పందెంలో పరుగెత్తేడు. లెఫ్టనెంటు పట్టప్రదానం 3000 మీటర్లు 8 నిమిషాల 8.8 సెకండ్లలో పరుగెత్తి, జాతీయ రికార్డును సృష్టించుటతో ప్రారంభమయింది.

చాలా వింతయిన విషయమేమంటే, సమానంగా అదే వేళలో ఆ దూరం పరుగెత్తి, హాలండులో స్లిఖూస్, బెల్జియంలో గేస్టన్‌రీఫ్ రికార్డులు సృష్టించారు.

మూడురోజులతర్వాత బ్రటిస్లవాలో 2000 మీటర్ల పందెంలో మరొక కొత్తరికార్డు సృష్టించబడింది. 5 నిమిషాల 20.5 సెకండ్లు.

ఎమిల్ తల్లి కొడుకుకోరకు వృధాగా వేచి ఉంది. ఇంటికి తిరిగిరాలేదు. సెలవు రోజులన్నీ పందెపు స్థలాల్లోనే గడిపాడు.

వేసవిలో ఎకాడమీ క్రీడలలో పాల్గొనడానికి విద్యార్థిజట్టుతో ఎమిల్ 'ప్యారిస్' వెళ్ళాడు. ప్యారిస్‌లో అతనికి ఘనమైన స్వాగతం యిచ్చారు; ప్రజలాతని నెంతో గౌరవంగా చూశారు.

క్రీడాప్రవీణులు ఎక్కువగా ప్రయాణంచేసి, అన్ని ప్రదేశాలు చూచిన వారయి ఉంటారు. కాని వారిలో చాలమంది చూచిన ప్రదేశాలను గూర్చి చెప్పలేరు. వారు బసచేసిన హోటలునుగూర్చి, కొన్ని వీధులనుగూర్చి, 'ఒలింపిక్' గ్రామం గూర్చి, ఆటస్థలంగూర్చి వారికి ఎక్కువగా పరిచయ ముంటుంది. పందెపుమార్గం, 'జంపులు', ఆటస్థలం వీటినిగూర్చి ఎన్ని అధ్యాయాలనైనా వ్రాయగలరు. కాని యివి ఆటగాళ్ళకు మాత్రమే ఆకర్షణ కలిగిస్తాయి.

ఎమిల్ చూడవలసిన దృశ్యాలన్నీ చూస్తాడు. భవనాలు, మ్యూజియమ్‌లు, చిత్రవస్తు ప్రదర్శనాలనుగూర్చి ప్రసంగిస్తాడు. ప్రజలు, వారి జీవితాలు, అలసట చెందిన ముఖాలు, మానసిక ప్రకోపానికి అనువైన దృశ్యాలు అన్నీ పరిశీలనగా చూస్తాడు.

మొదట 5000 మీటర్ల పందెంలోనే పరుగెత్తుదామనుకున్నాడు. అయితే దీనివల్ల మొదటి రెండు రోజులు అతను ఖాళీగా ఉండవలసి వస్తుంది. అందుచేత 1500 మీటర్ల పందేనికికూడా ప్రవేశించాడు.

అతనీ పందెం 3 నిమిషాల 55.2 సెకండ్లలో పూర్తిచేశాడు. అంత్య పోటీలో గెరేతో పరుగెత్తవలసివుంది. గెరే, ఈతనికన్న వేగంగా పరుగెత్తగలడు కాబట్టి, అతనే గెలుస్తాడని అందరి అభిప్రాయం. కాని ఎమిల్ అద్భుతంగా పరుగెత్తేడు. పందెం పూర్తిఅయ్యేవరకు గెరే నీడ తన భుజాలమీదే ఉంది. గెరేను అలసట చెందించక పోతే చివరకు గెరే గెలిచిపోవచ్చు. అందుచేత వేగం అధికం చేశాడు ఎమిల్. నీడ దూరమయిపోతే మరి వెనకకుతిరిగి చూసేవాడుకాదు. ఒక్కసారి తల వెనకకుతిప్పుతే, పందెంలో వెనకబడి పోవడానికి ఎంత అవకాశమున్నదో ఎమిల్‌కు బాగా తెలుసు. అంతేకాక తల వెనక్కుతిప్పుతే వెనకవానినిగూర్చి తానెంత భయపడుతున్నాడో అర్థమవుతుంది అతనికి.

గెరే, ఎమిల్ మడమలనంటే ఉన్నాడు. చివరకు అలసట అధికమయిపోయింది; ఎమిల్ గెలిచాడు. వేళ : 3 నిమిషాల 52.8 సెకండ్లు. ఇదొక అద్భుత ప్రదర్శనం.

ఆ పందెంవల్ల రాత్రి అంతా నిద్రపోలేకపోయాడు ఎమిల్. అయినా మర్నాడు 5000 మీటర్ల పోటీకి సిద్ధమయ్యాడు. ఇదికూడా సులభంగా 14 నిమిషాల 20.8 సెకండ్లలో గెలిచాడు.

ప్యారిసునుండి తిరిగి వచ్చినతర్వాత ఎమిల్‌కు తెరిపిలేదు. ప్రతిరోజూ పందేలే. ఒక్క వారంలో దేశంలో మూడు మూలలనున్న స్థలాల్లో 4 సార్లు పందెంలో పాల్గొన్నాడు; ఫలితాలు అద్భుతం.

తర్వాత అత్యల్పకాలంలో విమానంలో ఇంగ్లండు వెళ్లాడు. గత సంవత్సరం గెలుచుకున్న "బ్రిటానియా షీల్డు"ను యీ సంవత్సరం జటోపెక్ రక్షించుకోవాలి.

ఎమిల్ సులభంగా గెలిచాడు. కాని, యీ ప్రయాణాలు, యీ పరుగెత్తడాలు ఆతని కెంతో అలసట కలిగించాయి. అయినా, బెల్జియంలో జరిగే అంతర్జాతీయ పోటీలో పాల్గొనడానికి ఎమిల్ ఇంగ్లండునుండి వెంటనే బయలుదేరవలసి వచ్చింది. అక్కడ తన మిత్రుడు రేస్టన్‌రీఫుచేత 3 కిలోమీటర్ల పందెంలో ఓడింపబడ్డాడు. అతి అరుదైయిపోయిన ఆతని అపజయాలలో ఇదొకటి.

ఎమిల్? లేక ప్రజలా? ఆతని శక్తిని అనవసరంగా ఖర్చుచేస్తున్నారు. బెల్జియం తర్వాత, ఆతనిని పోలండు పంపించారు; అక్కడ మూడు 5 కిలోమీటరు పందేలలో పాల్గొన్నాడు; ఇదంతా ఒక్కవారంలో. ఈ పందేలలో, ఎమిల్ కొత్త అనుభవాలను సంపాదించాడు. తన శారీరక స్తోమతను పరీక్షించుకోగలిగాడు.

క్రిస్మసులోమాత్రం విశ్రాంతి తీసుకుందామనుకున్నాడు. ప్రజాదరణపొందిన ఆల్జియర్సులో డిసెంబరు పోటీలలో పరుగెత్తవలసిందని "జనరల్ డి ఆల్‌గర్" వద్దనుండి ఆహ్వానం వచ్చింది. మరొకసారి ప్యారిసుకు విమానంలో పోయాడు. అక్కడ క్రీడాప్రవీణు లనేకమందిని కలుసుకున్నాడు; వారిలో వెర్నియర్, మీమోన్ ముఖ్యులు. అక్కడనుండి ప్రయాణమై ఆల్జియర్సు వెళ్ళాడు. ఆ ప్రదేశం పచ్చని పచ్చికబయళ్లతో, మనోహరమైన సూర్యకాంతితో ఆనందంగా ఉంది; అప్పుడే వదలి వచ్చిన ఆ శీతకాలపు వణుకెత్తించే వాతావరణానికి, యిప్పటి దృశ్యానికి ఎంతతారతమ్యం. శాంతిని స్ఫురింపజేసే ఆ నారింజచెట్లమధ్య, యుద్ధాన్ని స్మరింపజేసే తుప్పుపట్టిన తుపాకులు, ముళ్ళతీగెలు యింకా అక్కడక్కడ కనుపిస్తున్నాయి.

ఈ అపరిచితవాతావరణంలో పందేలపోటీలు అందంగా జరిగేయి. 300 మంది ఆటగాండ్రు విజయకిరీటంకొరకు పోరాడవచ్చారు. పందెం జరిగినంతసేపూ కుంభవృష్టిగా వర్షం కురుస్తూనే ఉంది. దగ్గరగా సముద్రపుహోరు వినబడుతూనేవుంది.

ఆ ఉష్ణప్రదేశంలో అలవాటులేని పందెగాండ్రు చాలమంది యిబ్బందిలో పడిపోయారు. ఎమిల్‌మాత్రం మంచుకొండలో, వణికించే చలిలో పరుగెత్తుటకు శరీరాన్ని అనుగుణ్యంగా తయారుచేసుకోబట్టి, యీ శీతోష్ణస్థితికి యిబ్బందిపడలేదు. ఆ వర్షంలో పందెం గెలుచుట ఎమిల్‌కు కష్టమనిపించలేదు.

ప్రతికక్షులకు పోటీగా, వర్షాని కెదురుగా బురదలో, యిసకలో ఎమిల్ పరుగెత్తేడు. చివరకు ఫ్రెంచి వీరుడు వెర్నియర్‌ను దాటి, గమ్యస్థానం చేరుకున్నాడు.

ఆ సంవత్సరపు క్రిస్మస్ ఉత్సవ సందర్భంలో ఎమిల్ యీ విజయాన్ని బహుమానంగా సంపాదించాడు. ఆల్జియర్సులో మరొక పందెం గెలిచాడు. అది 3000 మీటర్ల పందెం.

**1947** వ సంవత్సరం, ఆ విధంగా సమాప్తమయింది. ప్రపంచంలో అనేక ప్రదేశాలలో తన అద్భుత ప్రదర్శనాలవల్ల ప్రేక్షకులలో ఉత్సాహాన్ని రేకెత్తించాడు ఎమిల్. ఎన్నో విజయాలు సంపాదించాడు; ఎన్నో అద్భుతమైన రికార్డులను

సృష్టించాడు; ఎన్నో కఠినమైన పోరాటలలో పాల్గొన్నాడు. అదీకాక, తన వ్యక్తి జీవితంలోకూడా విజయంసాధించాడు; ఆఫీసరుగా పట్టభద్రుడయ్యాడు. భవిష్యత్తు నిరపాయంగా చేసికోగలిగాడు; ప్రపంచంలో తన కాళ్లమీద తను నిలబడగలిగాడు.

# ముఖ్యమైన సంవత్సరం

**1948** వ సంవత్సరపు రాజకీయ సంఘటనలు ఆటలమీదకూడా తమ ప్రభావాన్ని చూపాయి. ప్రభుత్వం దేశంలోని అన్ని ఆటలసంఘాలను కలిపి ఒకే సంఘంగాచేసి, ఆ ఏకైకసంఘ నిర్వహణను తానే స్వయంగా పూనుకున్నది. ఆ విధంగా జెక్ వ్యాయామసంఘ వ్యవస్థాపకుడు డాక్టర్ ఎం. టిర్సు ఆదర్శం సిద్ధించింది.

"ప్రజల శారీరక, నైతిక ఆరోగ్యం, దేశాన్ని రక్షించుకోగలశక్తి జాతియొక్క విలువలేని సొత్తు."

శరీర వ్యాయామం, శిక్షణ విషయాలలో ప్రభుత్వం తన ఎదుట పెట్టుకున్న ఆదర్శాలను గూర్చి ఒక ఆటగాంఁడ్రసభలో, ప్రధానమంత్రి గొట్వాల్డు ఉగ్గడించారు. ప్రప్రథమంగా ఆలోచించవలసింది ప్రజాసామాన్యానికి ఆటలను ఏర్పాటు చేయుట. ప్రతిదేశభక్తి గల పౌరుడూ వ్యాయామంలో ఉత్సాహం కనబరచాలి. ఆటలలో ప్రవీణులయినవారివిషయంలో ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధ తీసుకోవాలి. యౌవనందాటినవారెవ్వరూ నిర్ధనులై ఆకలితో, అవసరాలు తీరక మాడకూడదు. వ్యాయామంలో, ఆటలలో వారు పొందిన అనుభవం, వారు సంపాదించిన ప్రావీణ్యం, యువకుల పురోగమనానికి, వారి శిక్షణకు ఉపయోగించాలి.

ఆరుసంవత్సరాల కొకసారి జరిగే జాతీయ వ్యాయామోత్సవం, **1948** వ సంవత్సరంలోనే జరగాలి. స్లావ్ జాతులలోని అనేక సంఘాలు యీ ఉత్సవంలో పాల్గొన్నాయి. ఈ ఉత్సవాలలో ముఖ్యదృశ్యం ప్రజాసమూహం ఆటల దుస్తుల్లో, జాతీయ దుస్తులలో సామాజిక ప్రదర్శనలనిచ్చుట.

**1948**, ఒలింపిక్ సంవత్సరంకూడా ప్రావీణ్య ప్రదర్శనానికి అవకాశమిచ్చే యీ ఒలింపిక్ పోటీలలో పాల్గొనుటకు జెక్ ఆటగాంఁడ్రు నిశ్చయించారు. వారిలో కూడా ఉన్నత స్థానాలను పొందగల సమర్థత కలవారు లేకపోలేదు.

ఒలింపిక్ పందేలలో పాల్గొనే ఉద్దేశంతో, వసంతారంభంలోనే శిక్షణ మొదలయింది. కొందరు చాలా అద్భుత ప్రదర్శనల నిచ్చారు.

ఏప్రిల్ మాసం వచ్చేసరికి పోటీలు ఉచ్ఛస్థాయికి వచ్చినవి. అంతర్జాతీయ క్రాస్ కంట్రీరేస్, ఆర్డెన్నీస్‌లో బెల్జియన్ నగరం 'స్పా'లో జరిగింది. ఆ ప్రదేశానికి వెళ్ళి పందెంలో పాల్గొని గెలిచి, తిరిగి వచ్చుటకు ఎమిల్ జటోపెక్‌కు ఎన్నాళ్ళు పట్టిందో మీకేమైనా తెలుసా ?

తెలియదు; రోజుల్లో లెక్కించడానికి వీలులేదు. ఇదంతా ఒక్క క్షణం విశ్రాంతిలేకుండా 40 గంటలలో పూర్తిచేశాడు.

ఒక శనివారం సాయంత్రం మా దేశీయుల చిన్నజట్టు బ్రస్సెల్సులో దిగారు. మరుసటి రోజు 10 గంటలకు 'స్పా' చేరుకున్నారు.

ఆ పందెపు స్థలం చూచివచ్చి జట్టునాయకుడు నిస్పృహ చెందేడు.

"అలాంటిది నా జీవితంలో ఎప్పుడూ చూడలేదు."

"అయితే నేను వెళ్ళి చూడ"ననుకున్నాడు, ఎమిల్.

ఒక 'మ్యాపు' మీద ఆస్థలం చూచాడు ఎమిల్.

ముందుగా పరిస్థితుల అనుకూలతవల్ల ఎమిల్ భయపడే రోజులు పోయాయి. పందెం ప్రారంభమయ్యే ముందు పందెపు స్థలానికి పోయి పరీక్షించే బదులు, తోటి ఆటగాండ్రతో ఖులాసాగా కబుర్లు చెప్పుకొని ఆనందించేవాడు.

ఆయా దేశాలనుండి వచ్చిన 74 మంది పరుగు పందెగాళ్ళు ఆనాడు పాల్గొంటున్నారు.పందెం ప్రారంభానికి ముందు ఎమిల్ ఆ వాతావరణ సౌందర్యాన్ని చూచి ఆనందిస్తున్నాడు; అక్కడ చేరిన వారందరి సుహృద్భావాన్ని సంతోషంతో అనుభవిస్తున్నాడు. అతని మాటలు, అతని భావాలు వారిని నవ్విస్తున్నాయి.

పందెంలో పాల్గొనేవారందరిలోను ప్రజల నాకర్షించినది బెల్జియన్ పోటీదారు రామ్సన్; అందమైన శరీరంగల యువకుడు; మంచి శిక్షణపొందాడు. పందెంమీదే దృష్టి పెట్టుకొని ఉన్నాడు.

పందెం ప్రారంభమయింది. ఆటస్థలం చుట్టూ మొదటిచుట్టం; తర్వాత అస్ఫాల్టు రోడ్డు; తర్వాత కొండ ఎక్కడం; మొదటినుండీ రామ్సన్ ముందే ఉన్నాడు; కొండ లెక్కడంలో ప్రవీణుడులాగున్నాడు రామ్సన్ అనుకున్నాడు, తనలో ఎమిల్. వాని వెనకనే పోతున్నాడు ఎమిల్. తక్కినవారు వేగంగా పోలేకపోయారు; ఎమిల్ మాత్రం వేగంగా సాగుతున్నాడు, రాళ్ళనుమాత్రం తప్పించుకోవాలి! జారిపోకుండా, కాలికి గెబ్బతగలకుండా, కాలం వృథా చేయకుండా. జాగ్రత్తగా పోతున్నాడు.

పర్వతారోహణ, తర్వాత అవరోహణ; అక్కడక్కడ సమప్రదేశం. ఆఖరుకొక ఎత్తు ప్రదేశం; అన్నింటికన్న కష్టమైనది; మంచి అలవాటున్నవారికే కఠినమైనది. ఎమిల్ చాలావాటికి అలవాటుపడ్డాడు; ఎటువంటి ప్రదేశమైనా పరుగెత్తగలడు; కాని అతనికికూడా యిది కష్టంగా తోచింది. ఎక్కడానికి ప్రారంభించాడు; కాలు గట్టిగా వేసి ఉంచడానికి స్థలం దొరుకుటలేదు. చేతులుకూడా ఉపయోగించవలసి వచ్చింది. ముందుకు సాగిపోలేక పోతున్నాడు. 200 మీటర్లు ముందుగావున్న ఎమిల్

తన వెనకవస్తున్నవారి ఆయాసపు టూర్పులు దగ్గరపడ్డట్టు గ్రహించాడు. వేగంగా ఎమిల్‌ను సమీపిస్తున్నారు.

ఎమిల్ ఎక్కుతున్నాడు, జారుతున్నాడు, పడుతున్నాడు, లేస్తున్నాడు; కాని అడుగు ముందుకు పడడంలేదు. వాని కాళ్ళు వణుకుతున్నాయి.

"ఈసారి రామ్సన్ నన్నోడిస్తాడు" అని తనలో తా ననుకున్నాడు. నెమ్మదిగా కాళ్ళల్లోకి బలంవచ్చింది; శరీరాన్నంతా స్వాధీనం చేసుకున్నాడు. వేగంగా పోతున్నాడు. ఇతరులకుకూడా ఆ పర్వతం కష్టం కలిగించిందికదా! ఈ లోగా చాలా ముందుకు పోయాడు; తనకు, తన వెనకనున్నవారికి దూరం అధికమయి పోయింది. జర్నలిస్టుల కారుకూడా వెనకబడిపోయింది.

ఆ పట్నపు వీధులలో ఎమిల్‌కు ప్రజలు ఆనందంతో స్వాగతమిచ్చారు. వారు ముందు రామ్సన్‌ను చూస్తామనుకున్నారు; అయినా యీ విదేశీయుని సాహసం, దీక్ష ప్రజల అభినందనాలను పొందినవి.

పరుగెత్తేమార్గం ప్రత్యేకింపబడివుంది. ఎమిల్ ఆ మార్గాన్ని అనుసరించే పరుగెత్తుతున్నాడు. అంతకంతకు అతనికి, వెనకవారికి తేడా హెచ్చిపోతూంది. ప్రజలాతనిని ఉత్సాహపరుస్తున్నారు.

"సెహబాష్, ఎమిల్!"

ఎమిల్ ఛాతీమీద అంకె 'ఒకటి' ఉండడం, ప్రేక్షకులకు వినోదంగా కనబడింది. అంత అలసటలోనూ ఎమిల్‌కూడా, వారి వినోదకారణం గ్రహించి, తనూ నవ్వేడు.

ఈ పందెం 36 నిమిషాల 01.4 సెకండ్లలో గెలిచాడు; పూర్వపు రికార్డు అంతకన్నా $1\frac{1}{2}$ నిమిషాలు ఎక్కువ.

"ఎలాగుంది, ఎమిల్!"

"ఎముకలు ముక్కలైనట్టుంది" అని ఒప్పుకోవలసివచ్చింది. రామ్సన్, యింకా అధ్వాన్నపుస్థితిలో ఉన్నాడు. ఒకనిమిషం ఆలస్యంగా చేరుకున్నా డతను. పూర్తిగా అలసిపోయాడు. విచారంగా, ఆశాభంగంగావుం దతనికి. అయినా, మంచి ఆటగాడు; ఆటగాని మనస్తత్వం కలవాడు. కొంచెం ఊపిరాడినవెంటనే, ఎమిల్ వద్దకువెళ్ళి కరచాలనంచేశాడు. ఆగ్రహావేశం ఏమీలేకుండా, ఎంతో ప్రశంసాపూర్వకంగా ఆతనిని పలకరించాడు. ఇద్దరూ ఆలింగనం చేసుకొన్నారు.

అందరూ కలిసే 'బస్' లో వెళ్ళారు. ఎమిల్‌యొక్క అద్భుతమైన విజయం అందరి నోళ్లలో వుంది. ఇంగ్లీషువారు ముఖ్యంగా ఆతని శిక్షణనుగూర్చి ప్రశ్నలు వేశారు.

"నీ వెలా ట్రెయినింగవుతావు?"

"చలికాలంలోకూడా పరుగెత్తుతావా?"

"రోజు కెన్ని కిలోమీటర్లు పరుగెత్తుతావు?"

"నీవు రోజు కెన్ని గంటలు నిద్రపోతావు?"

"నీ భోజనం ఎప్పుడు చేస్తావు ? ఏమి తింటావు ?"

ఇవేకాక, యింకా యితర ప్రశ్నలున్నాయి. వాని దేశంలో పరిస్థితు లేమిటి; అక్కడి ఆర్థిక స్థితి ఏమిటి? జీవితం ఎలాగుంటుంది; ఎమిల్ ప్రతి ప్రశ్నకు తృప్తికర మైన జవాబు యిచ్చేవాడు.

బ్రుస్సెల్సులో విశ్రాంతికి ఆట్టేవేళ లేదు. మర్నాడు ఉదయమే ఎమిల్ తన మిత్రులతో సహా, ప్రేగ్ నగరం చేరుకున్నాడు.

మే నెలలో, బుడాపెస్టులో ఒక పందెంలో పరుగెత్తేడు. రికార్డు భగ్నంచేసే పందెం కాదది. నిజంగా, గెలవడానికికూడా ఏమంత కష్టపడలేదు. అయినా, తన జీవితంలో అతిముఖ్యమైన పందె మది. ఎందుచేతనంటే తన జీవితంలో 10 కిలో మీటర్ల పందెంలో పరుగెత్తుట కదే ప్రథమం.

పలికాలంలో ఒలింపిక్ పందేలలో 5, 10 కిలో మీటర్ల పందేలలో పాల్గొను టకు, ఎమిల్ అప్పటికప్పుడే నిశ్చయించుకున్నాడు. అందుచేత దానిని దృష్టిలో పెట్టు కొని వసంతంలో ట్రెయినింగు పొందాలి

ఈ ట్రెయినింగు చాల కఠినమైనది. నిర్దయగా, తన సౌఖ్యంమీద మమ కారం లేకుండా, అంతకష్టమైన శిక్షణను ఎవ్వరూ పొందివుండరు.

ఆలోచించండి; 400 మీటర్లదూరం, 60 సార్లు పరుగెత్తి సాధనచేశాడంటే, ఎలాంటి కష్టానికి తన శరీరాన్ని అలవాటుచేశాడో! అంటే 24 కిలోమీటర్లు అతి వేగంగా పరుగెత్తినాడన్నమాట; మధ్యమధ్య 12 కిలోమీటర్లుకూడా పరుగెత్తాడు.

మొత్తం, రోజుకు 36 కిలోమీటర్లు.

క్రాసకంట్రీ ఛాంపియన్‌షిప్ అతిసులభంగా గెలిచాడు.

మే 29 వ తేదీన బుడాపెస్టు వెళ్ళేడు; అక్కడ అనుభవంగల షిలాగితో 10 కిలోమీటర్ల పందెంలో మొట్టమొదటసారి పాల్గొనాలి. ఎమిల్ కిది పరీక్షా సమయం; ప్రేక్షకులకు ఆవేశకారణం.

ఎవరైనా అనుకొనేఅంత సులభకార్యం కాదిది. అనుభవం లేక ముందు అతి వేగంగా పరుగెత్తుకుపోయాడు. కొంతదూరం పోయినతర్వాత ఒక్కఅడుగుకూడా ముందుకు పోలేకపోయాడు. అయినా, బలమంతా ఉపయోగించాడు. తన శరీరంతో పోరాడాడు. చివరకు సాధించాడు. గమ్యస్థానం చేరేసరికి, పూర్వపు జాతీయ రికార్డును పూర్తిగా 2 నిమిషాలతో గెలిచినట్లు తెలుసుకున్నాడు.

అతని పరుగువేళ 30 నిమిషాల 28.4 సెకండ్లు.

"స్ట్రెహోవ్ ఆటస్థలానికి యివాళ వెళ్తున్నావా ?" అని ప్రజలు ఒకరినొకరు ప్రశ్నించుకొంటున్నారు.

"ఎందుకు, ఏమి టక్కడ ?"

"ఛాంపియన్‌షిప్ పందెం."

"ఓ, యిలాంటివి యీ సంవత్సరం చాలా అయ్యాయి."

"అవును, కాని యివాళ జటోపెక్ 10 కిలోమీటర్ల పందెంలో యీ నగరంలో మొదటిసారి పాల్గొంటున్నాడు."

"కాని, అతనికి పోటీదారే లేడే; ఒక్కడే పరుగెత్తుతాడు; పోటీ లేకపోతే విసుగుగా ఉంటుంది."

ఇతరులు వేలకొలది ఉన్నారు, వేరేవిధంగా తలచేవారు! వారు వచ్చి డాబా లెక్కారు; మేడలన్నీ నిండాయి. వారికి ఆశాభంగం కలగలేదు.

అందులో కొంత నిజం లేకపోలేదు. జటోపెక్‌కు నిజంగా ప్రతిపక్షులు లేరు. మొట్టమొదట ప్రారంభంలో ఎవరో కొందరున్నారు; తర్వాత వారు మాయమయ్యారు.

'టైము' చూసేవానిమీద ఒక కన్నుంచాడు పందెపు ప్రకటనదారు. బుడా పెస్టులో ఎమిల్ పరుగెత్తినప్పటి 'వేళ'లతో పోల్చిచూస్తున్నాడు యీనాటి వేళలు. అలాగే ప్రపంచ రికార్డులతో పోలుస్తున్నాడు.

హంగరీలో పరుగెత్తినప్పుడు చేసిన పొరబాట్లను యీసారి చేయకుండా, ఎమిల్ జాగ్రత్తగా పరుగెత్తుతున్నాడు. మొదట నెమ్మదిగా పరుగెత్తి చివరకు వేగంగా పరుగెత్తుటకు, తన శక్తిని సంరక్షించుకొంటున్నాడు. పందెం చూచే ప్రేక్షకులు ఏమీ విన నక్కర్లేదు; బోధపరచుకొనుట కేమీ లేదు. తన మనోనిశ్చలతచేత, తన మనోశక్తిచేత మానవ బలహీనతను, మానవబాధలను ఏవిధంగా అణచివేసి, తన సాహసాన్ని ప్రదర్శిస్తున్నాడో తిలకించడంలో ఉన్న ఆనందం మరెక్కడుంది? ఆ జులై నెల మధ్యాహ్నం ప్రేక్షక స్థానాలనుండి కనబడిన దృశ్యం ప్రజల హృదయాలను హత్తుకుపోయింది.

ఎమిల్ బయలుదేరి పోయాడు; ఎంతత్వరగా పోయాడో ఊహించుకోడానికి వీలులేదు. తక్కినవాళ్ళంతా ప్రారంభ స్థానంలో ఉన్నట్టే ఉంది. పందెం పొడుగునా యిదేవిధంగా యింత వేగంగా పరుగెత్తుకు పోతాడా? చివరవరకు యీ వేగం నిలుపుకో గలగడం కష్టమనిపిస్తూంది అందరకు.

వీలుకానిదికూడా నిర్వహించడంలో ఎమిల్‌కు అమితమైన ప్రజ్ఞ. వేగం అంతకంతకు అధికం చేస్తున్నాడు. పందెం జరుగుతూన్నంతకాలం వేళలగూర్చిన ప్రకటనలు జాగ్రత్తగా వింటూనే ఉన్నాడు; వాటి ననుసరించి గమనవేగాన్ని దిద్దుకుంటున్నాడు. ఆతని శక్తి అసమానం. మొదట ఎంతో అలసట, ఆయాసం అనిపించింది. అన్ని కష్టపరిస్థితులను అతిక్రమించగల మనోనిగ్రహంగల ఎమిల్‌ను ప్రశంసించక పోవుట ఎలా?

కాలానికి వ్యతిరేకంగా పరుగెత్తుతున్నాడు. మేమిక్కడనుండి ఊరికే చూస్తున్నాం. మనిషి అలాగ విరామంలేకుండా పరుగెత్తుతున్నాడు. ఆతని శరీరంమీద ఆతనికి సంపూర్ణమైన స్వాధీనమున్నది. గమనం అధికంచేస్తున్నాడు; తన మనస్సును స్వాధీనంలో ఉంచుకున్నాడు; చేతులు జారవిడచాడు, తలవంచేడు, కాళ్ళను మాత్రం సారించి, అడుగులు పొడిగించాడు.

మైక్‌లో మాటలు వినబడుతున్నాయి. ఇప్పటికి 7, 8, 9 కిలోమీటర్ల రికార్డులు ముక్కలయ్యాయి.

ప్రతి ప్రకటన ఒక 'ఇంజక్షన్' వలె పనిచేసి ఎమిల్ యొక్క వేగం అధికం చేసింది.

చూస్తూన్న మేం అలసిపోయాం; మా గుండెలు ఆవేశంతో కొట్టుకుంటున్నాయి; కూర్చొని చూడడం కష్టమయిపోయింది; లేచి నిలబడిపోయాం. ఆందోళన బయలుదేరింది. మా అంచనా ప్రకారం ప్రపంచ రికార్డు ధ్వంసమయ్యేటట్టుంది. ప్రపంచపు ప్రదర్శనాలకు సంబంధించిన వేళలతో పోలిస్తే, ఎమిల్ 'వేళలు' అద్భుతంగా ఉండేటట్టున్నాయి. అధికార్లకు ఏమీ తెలిసినట్టు లేదు. ఎమిల్‌కుకూడా ఏమిజరిగేది తెలియదు. చివరకు వచ్చే ఆయాసాన్ని ఎదుర్కొనే చింతలో, మధ్య మధ్య ప్రకటించేవేళలమీద ఎమిల్‌కు దృష్టిలేదు. ఒకమూల పందెం జరుగుతూంటే 'హీనో' వేళలతో, తనవి పోల్చుకోవడమనేది చేసబబుగా ఉంటుంది. ప్రకటనాధికారి చేసే ప్రకటనలమీదకూడా అతనికి విశ్వాసముందో, లేదో? ఎమిల్ ప్రపంచ రికార్డులకెంత దగ్గరగా ఉన్నాడో అధికార్లుకూడా గ్రహించకపోవుట అన్యాయం. ఎమిల్‌కు ఆ సంగతి తెలిస్తే, ఆ రికార్డును అధిగమించడానికి కావలసిన ఆ కొంచెంశక్తి వినియోగించడానికి అవకాశం ఉండేదేమో! ఆఖరుఘట్టంలో ఒక్కక్షణంకూడా కూడదీసుకొనుటకు వీలులేకపోవచ్చు.

"ఎమిల్! ఎమిల్! ప్రపంచపు రికార్డు" అని మేం అతను వినాలని అరుస్తున్నాం.

కాని, ఎమిల్‌కు నమ్మకము కలిగినట్టు లేదు. మా కేకలు, ప్రేక్షకస్థానాలనుండి బయలుదేరిన గోలలో అణగిపోయాయి.

ఆఖరుఘట్టం ప్రారంభమయింది. అన్ని కిలోమీటర్లు పరుగెత్తిన తర్వాత కూడా, యింకా వేగం ఎక్కువచేశాడు.

"ఓ ఎమిల్! ఏమి జరుగవలసి ఉందో నీకు తెలిస్తే బాగుండేది! అలాగ పరుగెత్తు, ఆగకు, ఆ బనియను అలాగ వదలివేయి; నీ చెంపలమీద చెమట తుడుచుకోకపోతేనేమి? పరుగెత్తు; నీ శక్తినంతా వినియోగించు; ఇంకా వీలుకానిది, వీలుకావచ్చు.

ఒక కంటితో గడియారం చూస్తున్నాం. మరొకవైపు గమ్యస్థానానికి యింకా ఎన్నిమీటర్ల దూరమున్నదో లెక్కవేస్తున్నాం.

ఎమిల్, అమానుషశక్తిని చూపిస్తున్నాడు; గమ్యస్థానం చేరుకోబోతున్నాడు; ప్రపంచరికార్డును చూపించే ముల్లు దాటిపోయింది.

చాలా దురదృష్టం. ప్రపంచ రికార్డు హస్తగతమవబోయి జారిపోయింది. ఎమిల్ అలాగ ఊరుకొనే వ్యక్తికాదు. ప్రప్రథమ అవకాశంలో ప్రపంచరికార్డును సంపాదిస్తాడు. ప్రపంచరికార్డులను పొందే ప్రయత్నాలు ఎన్ని వృధాఅయిపోయాయో తలచుకుంటే మాకు నిస్పృహ కలుగుతుంది.

ప్రపంచరికార్డు మన స్వంతమయితే ఎంత అద్భుతంగా ఉంటుంది!

ఎమిల్ యింకా పందెపు దుస్తులను విప్పుతూనే ఉన్నాడు. ఇంకా కష్టంగా ఊపిరితీస్తున్నాడు. అతనికి సహాయంచేయుట కెంత ఉబలాటపడుతున్నాం! ఈ ఆశాభంగం ఎమిల్ కూడా ఎంతగానో అనుభవిస్తున్నాడు. మేమేమి చేయగలం. చేయగలిగిందల్లా ఉచ్చస్వరంలో, మా సంతోషాన్ని వెలిబుచ్చుతూ, మా ప్రశంసలను తెలియజేస్తూ, మా అభినందనాలను అందచేయుటే. ఎమిల్ ఒక క్రొత్త జాతీయ రికార్డును సృష్టించాడు: వేళ: 29 నిమిషాల 37 సెకండ్లు.

బుడాపెస్టు 'వేళ' తో పోల్చిచూస్తే, ఎంత తేడా కనబడుతూంది; ఎంత వేగాన్ని సాధించాడు. హీనో ప్రపంచ రికార్డు 29 నిమిషాల 35.4 సెకండ్లు; నిజంగా దురదృష్టమే. ఎమిల్ ప్రపంచ రికార్డును హస్తగతంచేసుకోవడానికి ఎంత అర్హుడు.

సంతోషాంతరంగులయిన ప్రేక్షకజనం, జాతీయ రికార్డు సృష్టినిగూర్చిన ప్రకటన వినగానే, కరతాళధ్వనులు చేశారు. దగ్గరగా ఆటస్థలంలో ఎమిల్ కు సమీపంగావుండి అతని దుస్తుల నందిస్తూ, కరచాలనంచేసి అభినందించేవారిని చూచి మేమెంత అసూయపడుతున్నామో!

ఇందులో చాలవరకు ఆడంబరం, అనవసరపు అట్టహాసం; కాని ఆ అధికార్లు, పందెంలో పరుగెత్తినవారు, ఎమిల్ కు అంతదగ్గరగా ఉన్నామని ఎంత గర్విస్తున్నారో! అలసిపోయిన అతని చేతులను తాకుతూ, అతనిని కొన్ని నిమిషాలయినా తమదగ్గరే ఉంచుకోవడానికి, వారు ఎంతగా అభిలషిస్తున్నారో!

ఒలింపిక్ ఆటలు ప్రారంభమయ్యేముందు 5000 మీటర్ల పరుగులో తన ప్రావీణ్యాన్ని ఒక్కసారి పరీక్షించుకుందా మనుకున్నాడు. అందుచేత "డచ్చి" పందెగాడు స్లిఖూస్ తో హాలండు, హంగరీ, జెకోస్లావేకియాల్లో పందేలలోపాల్గొనడం, తరుణానికి పనికివచ్చినట్టు భావించాడు. ఈ పోటీని ప్రపంచం ఎంతో ఆతృతతో కనిపెట్టింది. ఎందుచేతనంటే యింతవరకు ఎమిల్ యీతనితో ఓడిపోయాడు.

10,000 మీటర్ల పందెంలో, నిర్బంధంగా ప్రారంభంలో నెమ్మదిగా పరుగెత్తేడు. ఇది యిద్దరికీ మధ్య పోరాటం. ఇదివరకు అనుభవించిన పరాజయాలకు కసి తీర్చుకుందా మనుకున్నాడు, ఎమిల్. బ్రూనోలోనూ, ఆస్లోలోనూకూడా యితనితో ఓడిపోయాడు 3000 మీటర్ల పందెంలో.

ప్రేక్షకుల ఆవేశానికి మరొక అవకాశం. స్లిఖూస్ నుండివదిలించుకొనిసాగిపోదా మని జటోపెక్ నిరంతరకృషి, ఆ ప్రబల ప్రయత్నం, ఆ బలప్రయోగం, ఆ భయం ముఖంలో స్పష్టంగాకనబడుతున్నాయి. స్లిఖూస్ ఏప్రయాసలేకుండా, ఎమిల్ నుఅంటి పెట్టుకునే ఉన్నాడు. వాని పరుగు అందంగా, తేలికగావుంది. బరువు పాదాలతోపరు గెత్తే ఎమిల్ తోపోల్చిచూస్తే, స్లిఖూస్ రెక్కలతో జన్మించినట్టుగా కనబడుతున్నాడు. అతని చిఱునవ్వు, ఎమిల్ ఎక్కడకుపోగలడని చులకనగా చూస్తున్నట్టు అర్థమవు

తూంది. ఆత్మవిశ్వాసంతో ఉన్నాడు; అందుకనే చివరిఘట్టంలో ఆతని వేగం ఆతనికి విజయం చేకూరుస్తుందన్న భయం మమ్ములను వేధిస్తూంది.

అలాగ ఆందోళనతో కూడిన 10 నిమిషాలు గడిచాయి. పరిస్థితిలో మార్పు మరేమీలేదు.

ప్రేక్షకులుమాత్రం జటోపెక్‌ను ప్రోత్సహిస్తున్నారు. స్టేడియంలోమాత్రం నిశ్శబ్దం. కొన్ని మీటర్లు ముందుకు పోదామని ఎమిల్ ప్రయత్నం; స్లిఖూన్ వెంటనే అతనిసరసకు పోయేవాడు అతిచులకనగా!

అప్పుడే 4 కిలోమీటర్లు పరుగెత్తారు. అప్పుడు స్టేడియంలో ప్రజలంతా స్తబ్ధులయేసంఘటనజరిగింది. జటోపెక్, స్లిఖూన్‌ను వెనక్కు త్రోసివేశాడు. స్లిఖూన్ ఒకసారి కొంచెం వెనకపడ్డాడు. కాని మళ్ళీ ఎమిల్‌తో సమానమయ్యాడు. మళ్ళీ అలాగే స్లిఖూన్ వెనకబడ్డాడు; కాని యీసారి అంతే, వెనకే ఉండిపోయాడు. ఎంతో ప్రయత్నంజేశాడు, లాభంలేకపోయింది; ఆయాసంభరించలేక మార్గంప్రక్కన కూలబడి పోయాడు స్లిఖూన్.

ఏదో పెద్ద పర్వతం తన భుజాలమీదనుండి క్రిందపడినట్లుగా ఎమిల్ రెక్కలమీద ఎగిరినట్లు పరుగెత్తి, గమ్యస్థానం 14 నిమిషాల 10 సెకండ్లలో చేరుకున్నాడు. ప్రేక్షకుల ఆనందానికి అంతులేదు.

కొన్ని సంవత్సరాల క్రిందట మొరావియా రాష్ట్రంలోని ఒక పట్నంలో ఉద్యోగంచేస్తూన్నప్పుడు అక్కడి తన ఆఫీసరుకు, ఒక అందమైన కుమార్తె ఉందని విన్నాడు. అందకత్తె మాత్రమే కాదు. మంచి 'హేండుబాల్' ఆటకత్తె కూడా. ఎమిల్ మాత్రం ఎప్పుడూ ఆమెను చూడలేదు. ఆమెపేరు 'డానా'. ఆమె తర్వాత వ్యాయామ శిక్షణ విద్యాలయంలో విద్యార్థినిగా చేరింది. అక్కడ ఆటల విషయం బాగా తెలుసుకొంది. 'ఎథెలిటిక్స్' లో కూడా ప్రవేశం సంపాదించింది. జావలెన్ విసరడంలోకూడా ఆమెకు ప్రజ్ఞ ఉండేది. ఒకనెలతర్వాత ఛాంపియన్‌షిప్‌లో గెలిచింది. మరుసటి సంవత్సరంకూడా. మే 1948 లో పూర్వపు జాతీయ రికార్డును అతిక్రమించింది.

అప్పుడు ఎమిల్ ఆమెను హృదయపూర్వకంగా అభినందించాడు. ఆమెను మెప్పించడానికి 3000 మీటర్ల పందెం 8 నిమిషాల 07.8 సెకండ్లలో పూర్తిచేశాడు.

డానా, చదువు పూర్తయిన తర్వాత ఎమిల్‌తోపాటు ఆతని ఆటల క్లబ్బులోనే సభ్యురాలైంది. ఈ పిల్లంటే ఎమిల్‌కు అభిమానం కలిగింది. డానా వినోదాలను అభిలషించేది. కాని ఆమె 'సీరియస్'గాకూడా ఉండగలదు. ఆ రోజులలో ఒకసారి ఒక ఆటల జట్టు, బ్రటిస్లావానుండి ఒక గుఱ్ఱం బండీలో తిరిగివస్తూంది. ఒక చిన్న ఊళ్లో ఫలాహారాలకు, జట్టుగాంౘడంతా బండీ ఆపుచేశారు. అక్కడ ఒక ఉత్సవం జరుగుతూంది. ఆ ఉత్సవంలో సంగీతం, నృత్యంకూడా జరుగుతున్నాయి. ఈ జట్టు ఎవరో తెలియగానే, వీరిని లోనికాహ్వానించారు.

ఎమిల్ జటోపెక్ ఒంటరి నృత్యం చేస్తాడని ఎవరో కేకవేశారు.

డానాతో నృత్యంచేయడానికి అంగీకరించాడు. ఆ క్లబ్బు అధ్యక్షుడు, సెక్రటరీ, కోశాధికార్ల భార్యలతోకూడా ఎమిల్ నృత్యంచేయవలసివచ్చింది. ఈ నృత్యాలు, తన పరుగులకంటె ఎక్కువ కఠినంగా ఉన్నాయని, ఎమిల్ ఎప్పుడూ అంటూ ఉంటాడు.

స్థానిక యువకులతో సుహృద్భావం తెలియజేస్తూ మాట్లాడవలసివచ్చింది. తర్వాత అక్కడే ఆతను పరుగెత్తవలసివచ్చింది, వారి ఆనందంకొరకు. ఆ ప్రదేశంలో, ఆ పందెంలో ఎమిల్ ఓడిపోయాడు; కాని యీ పరాజయం చరిత్రలోకి ఎక్కలేదు. ఆచీకట్లో, అపరిచితప్రదేశంలో, అందరి తర్వాత, ఆఖరుకు గమ్యస్థానం చేరుకున్నాడు.

ఈ సమావేశంతర్వాత యువతీయువకులు, ఒకరినొకరు ఎక్కువగా తెలిసికొన్నారు. అదృష్టం వారిని వరించింది. జావలిన్ విసరుటలో ప్రశ్నకనబరచి జూలై 26న లండన్‌కు బయలుదేరే ఒలింపిక్ జట్టులో స్థానాన్ని సంపాదించుకుంది, డానా!

# మొదటి ఒలింపిక్ విజయం

లండనులో ఎమిల్ తలలో విపరీతమైన భావాలు, భయాలు బయలుదేరినవి. "నా ఉచ్ఛస్థాయి అయిపోయింది. నేను చాలా దురదృష్టవంతుణ్ణి" అని ఎన్నోసార్లు చికాకుపడడం ప్రారంభించాడు.

తన సహజమైన శాంతి స్వభావంతో 'డానా' అతనిని ప్రోత్సహిస్తూండేది.

"నీ ప్రజ్ఞ నీకు తెలియదు; నీవు తప్పకుండా గెలుస్తావు" అనేది. స్త్రీలంతా 'నార్తువుడ్' లోను, పురుషులంతా ఉక్స్‌బ్రిడ్జ్ ... (note) 'డేటన్'లోనూ మకాం. తన అనుమానాలతో ఒంటరిగా ఎమిల్ కాలం గడుపుతున్నాడు. గిటార్ వాయిస్తూ, విచారం మరవడానికి ప్రయత్నించేవాడు. తర్వాత విపరీతమైన ఉష్ణపు గాడ్పులు. ఎమిల్ వేడిని భరించలేడు. కర్రలతో తయారుచేసిన ఆ బ్యారెక్సులో ఉడికిపోయేవారు. రాత్రులు నిద్రపట్టేది కాదు. దక్షిణాదివారికి, అర్జంటైనా, బ్రెజిల్ పోర్చుగల్‌లనుండి వచ్చిన వారికి యిబ్బందిలేదు; వారు ఆ వాతావరణానికి అలవాటుపడినవారే.

క్యాంపు నిర్వాహకులు వీలైనంతవరకు సహాయంచేసేవారు. పశ్చిమ డ్రేటన్ క్యాంపులోనివారు ట్రెయినింగుకు అమెరికన్లు నివసించే ఆక్సున్‌బ్రిడ్జికి వెళ్ళవలసి ఉంది. ఇది చాలా యిబ్బందిగా ఉంది.

ఎమిల్ తన శక్తిని పరీక్షించుకున్నాడు. 100 మీటర్లు 4 సార్లు, 200 మీటర్లు 6 సార్లు పరుగెత్తి, తన బలాన్ని కొలుచుకున్నాడు. సాధారణంగా దేనికీ భయపడే

స్వభావంతా దతనిది. అయినా, తననుగూర్చి పైవాళ్లు ఏమనుకుంటారోనని భావించే, తనది ఎక్కువగా తృప్తికలిగించేస్థితి కాదని అనుకొనేవాడు. పరుగెత్తడం యిదివరకు లాగ ఆనందం కలిగించుటలేదు.

“అంత నిస్సారంగా కనిపిస్తున్నావేమ”ని అతని మిత్రులు అడిగారు.

“నాకే తెలియదు; ఆందోళనకావచ్చు; లేకపోతే యీవేడివల్లకావచ్చు.

జెకోస్లోవక్ జట్టులోనివారు, తమమీదనున్న భారాన్ని, బాధ్యతను గుర్తించారు. అనేకదేశాలవారి దుస్తులు, వారి పతాకలు, వారి సంభాషణలు; వీనిమధ్య తమ జాతీయ చిహ్నాన్ని ధరించిన జెక్ జట్టువారు తమ గురుతరబాధ్యతనుగూర్చి తలపోసుకున్నారు. ఈ ఉమ్మడి బాధ్యత వారందరిలోను పరస్పర సుహృద్భావాన్ని పెంపొందజేసింది. ఒలింపిక్ గ్రామంలో, ‘సివోనా’తోపాటు ఎమిల్ నివసించేవాడు. అందులో ఒకరు నిద్రపోతూంటే, ఎక్కడ నిద్రాభంగం కలుగుతుందోనని గట్టిగా ఊపిరికూడా పీల్చేవాడుకాదు రెండోవాడు. ఆవిధంగా ఒకరికొకరు సహాయంగా ఉండేవారు.

విదేశాలనుండి వచ్చిన అతిథులతోసంభాషణలలో ఎవరికెక్కువ శిక్షణఉన్నదీ, గెలిచే అవకాశాలు ఎవరికున్నాయి అనే విషయాలనుగూర్చి చర్చలు జరిగేవి. అందులో ప్రవీణులు నిక్కచ్చిగా బాహాటంగా వారి అభిప్రాయాలను వెల్లడించేవారు. ప్రతివాడు ఏదో క్రొత్తవార్త చెప్పేవాడు.

ఎమిల్ ఎంతసేపూ తనదృష్టిని హీనో, రీఫ్‌లవైపే త్రిప్పి ఉంచేవాడు. అందులో ఏఒక్కరు సరియైన ట్రెయినింగు పొందలేదు.

జటోపెక్‌నుగూర్చికూడా ఎక్కువగా మాట్లాడుకున్నారు. ప్రవీణులు అనేకులు ఎమిల్ ప్రదర్శనాలనుగూర్చి బాగా తెలిసినవారే. అతని పరుగుపద్ధతిని గమనించినవారే; మొదటే వేగంగా పరుగెత్తడాన్ని విమర్శించినవారే. కాని అతనికి పోరాడేశక్తి అత్యధికంగా ఉండబట్టి, అతనికి మంచిస్థాన మిచ్చేరు. నూర్మికూడా తన స్వదేశీయులకు జటోపెక్‌ను ఆదర్శంగా చూపించాడు. అసలు ‘ట్రెయినింగు’ అంటే ఏమిటో పూర్తిగా గ్రహించినది ఒక్క జటోపెక్ అనేవాడు. ఫిన్నిష్ పందెగాళ్ళంతా మరి మెత్తనివారు.

ఒలింపిక్ పందేలలో బుద్ధిబలం, టక్కరితనం రెండూకూడా ఉపయోగిస్తాయని అందరూ అనుకొన్నదే. పోటీదార్లు సమానబలం గలవారే అయితే, యీ సుగుణాల్లో ఎంతో ఉపకరించి విజయాన్ని ఆగుణాలున్నవైపు మొగ్గచూపిస్తాయి.

ఒలింపిక్ ఆటలు ప్రపంచవిఖ్యాతిగన్నవి. పూర్వపు గ్రీసులోని ‘ఎలిస్’ ప్రాంతానికిచెందిన ఒలింపియా పట్నం పవిత్రస్థలం. ఇక్కడ సైన్యాలన్నీ అస్త్రసన్యాసం చేయాలి; ఒలింపిక్ ఆటలు జరుగుతూన్నంతకాలం యుద్ధాలు జరుగకూడదు విజయం పొందినవారి పేర్లు గ్రీసుదేశమంతా గౌరవం పొందుతాయి. ఈనాడు దేశం విభజించబడ్డా, యీ ఆటలసమయంలో దేశఐక్యత నిరూపణ అవుతుంది. ఒలింపిక్ ఆటలకు ప్రేక్షకులుగా గాని, ఆటలనుగూర్చి ఉపన్యసించుటకుగాని అనుమతించబడితే

గొప్ప గౌరవంగా పరిగణిస్తారు, విఖ్యాత వేదాంతులు, చిత్రకారులు, శిల్పులు మొద లైనవారు.

వేయి సంవత్సరాల ఒలింపియడ్ చరిత్ర వెనకనున్న మచ్చల గూర్చికూడా మనకు తెలుసు. ఈ ఆటలలో స్వేచ్ఛ ననుభవించే గ్రీకులు మాత్రమే పాల్గొనాలి. వారికన్న 10 రెట్లధికంగా ఉన్న కులంలేనివారు, బానిసలు పాల్గొనుటకు వీలులేదు.

విజయం లంచం యిచ్చి సంపాదించినవారుకూడా లేకపోలేదు. క్రోమస్ పర్వతపాదంవద్ద నున్న విగ్రహాలన్నీ జరిమానా సొత్తుతో నిర్మింపబడ్డవే. ఇతర దేశాల ప్రజలందరూ అనాగరికులన్న మిషతో ఈ ఆటలలో పాల్గొనుట నిషేధింపబడింది.

పూర్వపు గ్రీసుదేశపు ఆటలు జాతికి సంబంధించినవి. మతంచేత ప్రేరేపింప బడినవి. ఈనాడు శారీరక, మానసిక ఆనందానికి సంబంధించినంతవరకు శాంతి సంరక్షణ ఆదర్శంగా కలిగినంతవరకు యీ ఆటలమీద అభిమానం. మానవజాతి సౌభాగ్యం అంతవరకూ సాధించబడుతుంది; కాని దీనికిప్పుడు విశ్వశాంతి, సర్వ మానవ శ్రేయస్సు ప్రాతిపదిక.

ఈనాటి ఒలింపిక్ ఆటల అంతర్జాతీయత యీ ఆదర్శానికి దోహదమివ్వగలదు. దురదృష్టంకొలదీ యీమధ్య ప్రపంచంలోని సంఘటనలు యీ విశ్వశాంతి ఆదర్శా నికి విరుద్ధంగా జరిగినవి. ఆఖరి ఒలింపిక్ ఆటలు అన్నిజాతులను ఏకం చేయడానికి పునాదులు వేస్తూన్న సమాయానికి యీ ఆదర్శానికి కొన్ని విఘ్నాలుకలిగాయి.

ఇప్పుడు యుద్ధమాగిపోయిన తర్వాత 8 ఏళ్ళకు ప్రపంచపు ఉత్తమ ఆట గాళ్ళందరూ లండను పట్నంలో సమావేశమయ్యారు. దురదృష్టంకొద్దీ సోవియట్ నుండి మాత్రం ప్రతినిధులు హాజరుకాలేదు.

లండనులో ఆటగాండ్రందరూ కరచాలనం చేసుకొనినా, దేశాలమధ్య రగిలిన విభేదాలను వా రాపలేకపోయారు. ఆటలలో కనబడే సుహృద్భావం, దేశాలమధ్య కూడా విస్తరించేటట్లు చూడవలసిన బాధ్యత మనమీదకూడా వున్నదని తెలుసు కోవాలి.

ఏమైనా, 1936 కంటెకూడా యీసారి ఆటలకు హాజరయ్యే ప్రేక్షకజనం అత్యధికంగా ఉండాలని పత్రికలుకూడా ఎంతో ప్రయత్నించినా, లండను పౌరులు నిర్లక్ష్యంగా ఉన్నారు. ఆటలను గూర్చిన ప్రాథమిక విషయాలుకూడా తెలియని ప్రజలున్నారని తెలిసికొనుటకు ఆశ్చర్య మవుతూంది.

ఆటలయొక్క ప్రయోజనాన్ని గూర్చి వివిధాభిప్రాయలుండుట ఎమిల్ కు ఆశ్చర్యం కలిగించింది. జీవిత దృక్పథంలో ఒక క్రొత్తమార్పును సూచించే నాయకు లుగా ఆటగాండ్రను పరిగణించి, వారిని ప్రేమించి గౌరవించేవారు కొందరు; ఆటలనే వృత్తిగా చేసికొని; దానివల్ల జీవనోపాధిని కల్పించుకొనేవా రీ ఆటగాండ్రని భావించేవారు కొందరు.

ఆటలలో పాల్గొన్న అన్నిదేశాలవారి ఉత్సవంతో ఆటలు ప్రారంభ మయ్యాయి. ఈ ఉత్సవంలో పాల్గొని అలసిపోవడం మంచిది కాదని, ఎమిల్ కు

సలహాయిచ్చారు కొందరు మిత్రులు. ఆ రోజే 10 కిలో మీటర్ల పందెం జరుగనున్నది. కాబట్టి ఈ అలసట మంచిది కాదని వారి అభిప్రాయం. అలవాటులేని వేడి అతనికి ప్రమాదమని వారున్నారు.

"హీనో కూడా యింటివద్దనే ఉండిపోయాడు. ఈ వేడి గాలుపులలో తిరిగి ప్రమాదం తెచ్చుకోకు."

"కాని, హీనో ఒక్కడితోనే నాకు కక్షకాదు. ఇతరులుకూడా నా ప్రత్యర్థులు; వారందరూ హాజరవుతున్నారు; అందుచేత నేనుకూడా హాజరవుతాను" అన్నాడు ఎమిల్.

సంభాషణ అక్కడితో ఆగిపోయింది.

ప్రపంచం అన్ని మూలలనుండి 58 దేశాలనుండి ఆటలలో పాల్గొనడానికి వచ్చిన 6000 మంది స్త్రీ పురుషులను ఆహ్వానించడానికి, 80,000 మంది ప్రేక్షకులు హాజరయ్యారు.

ఒలింపిక్ విజయాలను వాంఛించి జెకొస్లొవేకియానుండి వచ్చిన ఆ చిన్నజట్టు కూడా ఆ ఉత్సవంలో పాల్గొంది.

అప్పుడు, గ్రీసు ఒలింపస్‌నుండి అమరజ్యోతిని తీసికొనివచ్చిన ఆటగాడు వచ్చాడు. ఆ జ్యోతి ఆకాశాన్ని అంటుకొంటూంటే, అనేక పావురాల జట్టులు ఒక్కసారి గాలిలోకి ఎగురుటతో ఆటల ప్రారంభోత్సవం పూర్తిఅయింది.

ఒలింపిక్ ఆటలలో పాల్గొనేవారిలో వృద్ధుడు, ఇంగ్లీషుదేశస్థుడు డోనాల్డు ఫిన్లే ఆనవాయితీగా, యీ క్రింది ప్రమాణాన్ని ఉచ్చైస్వరంలో పలికాడు :

"మాదేశంయొక్క గౌరవాన్ని, ఆటలయొక్క గొప్పతనాన్ని సంరక్షించే రీతిగా యీ పోటీలను నిర్వహించుటకు ఏర్పడిన నిబంధనలకు లోబడి పోటీలలో పాల్గొంటున్నామని, మేము ప్రమాణం చేస్తున్నాము."

మరొక్కసాయంత్రం, మరొక్కరాత్రి ఆటల ప్రారంభానికి ముందు; శీతోష్ణస్థితి యధాప్రకారంగానే ఉంది.

'హైజంపులు', డిస్కస్ త్రో, చిన్న పరుగులు, వీనిలో పోటీలు ప్రారంభమయ్యాయి. డిస్కస్ విసురుటలో విజయంగాంచిన ఫ్రెంచి పియానిస్టు మైకలేన్ ఆస్టర్‌మేయర్ అధికార్లవద్దనుండి విజయపీఠంవద్ద సువర్ణపతకాన్ని స్వీకరించింది.

ప్రేక్షకుల దృష్టిమాత్రం సాయంత్రం 6-30 గంటలకు జరిగే 10 కిలోమీటర్ల పరుగు పందెంమీదనే ఉంది.

ఎవరు గెలుస్తారు. హీనో? జటోపెక్? లేక ఏ అజ్ఞాత వీరుడైనానా? ట్రెయినింగుస్థలంలో ఎమిల్, హీనోను కలిశాడు. హీనో ఆతనిని ఆకర్షించాడు; మంచి ఖులాసాగా ఉన్నాడు; ఆతని నుదుటిమీద విజయం స్పష్టంగా వ్రాసి ఉన్నట్టనిపించింది. ఆతని ఆనందం యితరులకు కూడా ప్రాకినట్టుంది. హీనో, చాలా మైత్రితో పలకరించాడు ఎమిల్‌ను. "హేహే," అని పిలిచాడు తన ఉత్తరాది

ఫక్కీని; స్థితిగతులెలాగున్నాయని, యిద్దరూ ఒకరొక్కరు అడిగారు; ఎవరికి వారికే చెప్పరాని యిబ్బందులు.

“నువ్వు గెలుస్తావని అనుకుంటున్నావా ?” అని హీనో అన్న మాటలు ప్రక్క-నున్న అనువాదకుడు, ఎమిల్‌కు ఎఱుకపరచాడు.

జటోపెక్ జవాబేమీ చెప్పకుండా, సింహద్వారం మీద చెక్కి-ఉన్న మాటల వైపు చూపించాడు. ఆ మాటలు “ఒలింపిక్-ఆటలలో ముఖ్యమైనది గెలుపుకాదు, ఆటలలో పాల్గొనుట; జీవితంలో ముఖ్యమైనది గెలుచుటకాదు, బాగా పోరాడడం.

హీనో చకితుడయ్యాడు; ఏమీతోచక నవ్వాడు. ఏదో అనాలికదా అని, ఉష్ణం అధికంగా, దుర్భరంగా ఉందన్నాడు.

“ఈ వేడిలో, మొదటే వేగంగా పరుగెత్తడం కూడదనుకుంటా” అన్నాడు హీనో. ఎవరిదారిని వారు పోయారు. మళ్ళీ పందెం ప్రారంభంలోనే కలుసుకోడం; అతనిమిత్రులు వేళలు, సరిగా పరుగెత్తుతూన్నప్పుడు అతనికి తెలియజేసే మార్గం గూర్చి ఒకపన్నుగడ చేశారు. అధికార్ల ప్రకటనలు, సరిగా వినబడకపోవచ్చు. “జెకోస్లోవేకియా జట్టునాయకుడు కొన్ని సంజ్ఞలమూలంగా, ఎంతదూరం ఎంత వేళలో వచ్చాడో, తెలియజేయాలి. ఎమిల్ దుస్తులతోనే సంజ్ఞలుచేయాలి.

“నేను వేగంగా పరుగెత్తుతూంటే, తెల్లమేజోడు పెకెత్తు; నెమ్మదిగా పోతుంటే, ఎర్రబనియను. వేసుకున్న లెక్కప్రకారం 10 సెకండ్లు హెచ్చుతక్కువగాఉంటే, మేజోడుగాని, బనియనుగాని తలమీదకు ఎత్తి విసురు.”

ఇది సులువుగా బోధపడేటట్లుగా నిర్ణయింపబడింది. 30 దేశాలనుండి వచ్చిన విఖ్యాతిగాంచిన దూరపు పరుగు పందెగాండ్రు పోటీకి ప్రవేశించారు. 1932 లో పోలిష్‌దేశస్థుడు కుసాజిన్‌స్కీ గెలిచినతర్వాత, యిప్పటివరకు ప్రతి పందెంలోనూ ఫిన్లాండు పందెగాడే గెలుస్తూవచ్చాడు. అందుచేత ఆదేశస్థునివైపే అందరి దృష్టి.

పందెపు ప్రారంభంనుండి ఫిన్నులదే ముందంజ. తన సత్తాలహో మరచిపోయి హీనో ముందు వేగంగా పరుగెత్తుకుపోయాడు. వాని వెనక హెయిన్ట్స్రా, స్వీడెన్ పోటీదారుడు ఆల్బర్ట్సన్. 203 వ నెంబరు తగిలించుకున్న జటోపెక్ 15వ స్థానంలో ఉన్నాడు. ముందు, వెనక పోటీదార్లే; కాని మార్గానికి ఒక అంచునే పరుగెత్తుతున్నాడు; ఎందుచేతనంటే ఆ త్రొక్కుడులో మేకులబూట్లవాడెవడైనా తనకాలిని త్రొక్కివేసి గాయపరచవచ్చు. అనుభవంలేని ప్రేక్షకులు యితడు అలసిపోయాడని, ఉత్తరాదివారికి అనవసరంగా ముందుస్థానమిచ్చివేశాడని మొదటినుంచి ఓటమిలో పడిపోయాడని అనుకున్నారు. అందుచేత వారి అభిమానం అంతా హీనోవైపే మళ్ళింది.

మొదటి ఘట్టం పూర్తికాగానే తెల్లమేజోడు పైకి వెళ్ళింది. దాని అర్థం ఎమిల్ తక్కిన అందరూ కూడా అనుకున్నదానికంటే ఎక్కువ వేగంగా పరుగెత్తుతున్నాడన్నమాట. ఎమిల్‌కు కొంత ధైర్యం కలిగింది; ఆ వేగంలోనే పరుగెత్తుతున్నాడు. అతనికి వేళఉందని తెలుసు. పరుగెత్తుతున్నవారు చెదిరి పోతున్నారు.

ఎమిల్ మాత్రం తన స్థానం మార్చలేదు. 8 వ ఘట్టంలో 17 వ వానిగా పరుగెత్తు తున్నాడు.

చెకోస్లావక్ రేడియో కులందర్ లో రిపోర్టర్లున్నారు. వారికి ఈ కంఠరగోళంలో సరిగా ఏమీ బోధపడుటలేదు. వారి కంఠధ్వనిలో భయం, అనిశ్చయం ఉన్నాయి. అకస్మాత్తుగా విమర్శన ఆగిపోయింది. దీనికి కారణం వారికిచ్చిన "టైము" అయి పోవుటే.

అందుచేత మన రేడియో విమర్శన వినేవారు ఆందోళన పడ్డారు.

ఎప్పుడూ మొదటివాడుగా పరుగెత్తే మన జటోపెక్ 17 వ స్థానంలో ఉన్నాడా? ముందుకెందుకు పోడు? వేగంగా పరుగెత్తమని, ఎవరైనా అతనికి చెప్పాలి. "జటోపెక్! జటోపెక్!"

ఎమిల్ పరుగెత్తడంలో చాలా వివేకం చూపిస్తున్నాడు. వాని సిద్ధాంతం "ఎప్పుడూ వేగం హెచ్చించకు."

మొదట్లో వేగం ఎక్కువచేస్తే, చివరకు వేగం తగ్గిపోతుందని అతనికి తెలుసు.

ఈసారి మొదటినుంచీ నెమ్మదిగా, తెలివిగా పరుగు ప్రారంభించాడు. స్వదేశంలో రేడియోలదగ్గర చైతన్యం లేకుండా శ్రోతలు కూర్చొండిపోయారు. వారలాగ శక్తిలేకుండా ఆవేశంతో కూడుకున్న ఆ ఘడియలు గడుస్తూంటే ఏమిచేయ డానికీ తోచక కూర్చున్నారు.

తొమ్మిదవఘట్టం - అంటే యింకా 16 ఘట్టాలు గడవాలి. అకస్మాత్తుగా ఎమిల్ కు ఎర్రబనియను కనబడింది. అంటే నెమ్మదిగా పోతున్నాడన్న మాట. ఎమిల్ వేగం అధికంచేశాడు. పత్రికా విలేఖర్లు యీ విషయం ముఖ్యంగా వ్రాశారు: ఎమిల్ మొట్టమొదటిసారి మేల్కొన్నాడు. 203 నెంబరుగల పోటీదారు నెమ్మదిగా ఒక్కొక్క పందెగానిని దాటి వెళ్ళిపోతున్నాడు. ప్రేక్షకులు యిది గమనించి వానిని ప్రోత్సహించారు. 3800 మీటర్లు పరుగెత్తేసరికి ఎమిల్ 4 వ స్థానంలోకి వచ్చాడు. 4 వ కిలోమీటర్లో ఫిన్నులను అందుకున్నాడు. వారిని దాటేడు. తన వెనుక హీనో, హెయిన్ స్ట్రాప్, ఆల్బర్ట్సన్, మెమోన్ ఓకోబా (ఫ్రెంచి) స్టోకెన్ (నార్వేజియన్) వస్తున్నారు.

పరుగెత్తేవారికి ఊపిరితీసుకోవడం కష్టం కలిగింది. వారికి అలసట కలిగింది. వారి శరీరమంతా చెమటపట్టిపోయింది.

హీనో ఒక్క ప్రయత్నంచేసి, జటోపెక్ ను దాటి ముందుకు పోయాడు. ఒక్కఘట్టంలోనే వరుస యీ విధంగా ఉంది. ఎర్రసంజ్ఞ రావడంలోనే ఎమిల్, హీనోనుదాటి ముందుకు పోయాడు. ఆ పోవడంలో 30 మీటర్లు ముందుకుపోయాడు. తనముందు మార్గంతప్ప పోటీదార్లు ఎవ్వరూలేరు. వెనక హీనో పరుగెత్తుతున్నాడు. ప్రేక్షకుల అభిమానం హీనోనుండి ఎమిల్ మీదకు ప్రసరించింది. సముద్రపు ఘోష లాగుంది; ఆ కరటాలు తెరిపి లేకుండా "జటోపెక్! జటోపెక్!" అని అరు స్తున్నట్లుంది.

జెకోస్లొవక్ జట్టుకుమాత్రం మొదట్లో కొంత ఆందోళనగాఉంది. ఎప్పుడైతే జటోపెక్ ముందుకు పోయాడో వారి ఆవేశానికి అంతులేదు. మాట్లాడలేకపోయారు. ప్రక్కనున్న అర్జంటైనా దేశస్థులు, జమైకావారు జటోపెక్ పేరు ఎలా ఉచ్ఛరించాలో నేర్చుకున్నారు. అక్కడి నుండి ఆస్థలమంతా ఆపేరుతో ప్రతిధ్వనిస్తూంది.

కొంతసేపటికి హీనో కనబడలేదు. "హీనో ఎక్కడ"ని కేకవేశాడు. "హీనో పందెంనుండి తప్పుకున్నాడ"ని జవాబు. ప్రేగ్‌లో స్లిఖూస్ మధ్యదారిలో పడిపోయినట్టు హీనో లండన్ పందెంలో అలసిపోయి 6400 మీటర్లదగ్గర ఆగిపోయాడు. ఎమిల్ వేగాన్ని హీనో తట్టుకోలేకపోయాడు.

తన బలమైన పోటీదారు తప్పిపోయాడని ఎమిల్ గ్రహించాడు. అయినా వేగం తగ్గించలేదు. ఆనందంతో పరుగెత్తుకుపోతున్నాడు. ప్రేక్షకు లందరూ ఏ జాతివారైతేనేం అతనిని ప్రశంసిస్తున్నారు. ఇంక అతని ఆందోళన యిదివరకు పోలిష్ పందెగాడు కుసోషిన్‌స్కీ స్థాపించిన రికార్డును భగ్నంచేయుటే. ముందున్నది ఒక్క ఆల్జీరియా పందెగాడు అబ్దుల్లా. అతనుకూడా ప్రక్కకు తప్పుకొని జటోపెక్‌కు దారినిచ్చాడు.

చివరిఘట్టంలో మరల ఎర్ర సంజ్ఞ కనబడింది. ఎమిల్ వేగం తగ్గిపోతూంది. ఎమిల్‌కూడా ఆ వేడిలో వేగం తగ్గకుండా పరుగెత్తలేకపోయాడు.

రెండవ ఫిన్ హెయిన్‌స్ట్రామ్‌కూడా అలసిపోయి ఆగిపోయాడు. ముందుకు సాగిపోదామన్న వాంఛ; కాని శరీరం లొంగడంలేదు. బలవంతంగా అతనిని బయటకు తీసుకుపోయారు.

ఇంక పోటీ ఆఖరయ్యే సమయంలో పొరబాటున యింకా ఒక ఘట్టం ఉండగనే పందెం పూర్తిఅయిందని అధికార్లు ప్రకటించారు. ప్రేక్షకులలో ఆందోళన బయలుదేరింది.

ఎమిల్ మాత్రం తొణకలేదు. పరుగెత్తుతూనే ఉన్నాడు. గమ్యస్థానం 200 మీటర్లుండనగా వేగం అధికం చేశాడు. 10 కిలోమీటర్ల పందెంలో అంత వేగం ప్రేక్షకు లెన్నడూ చూడలేదు. గమ్యస్థానం దాటిపోయాడు. ఇలాంటి పందేన్ని జెకోస్లొవేకియా దేశస్థుడు గెలుచుట కిదే ప్రథమం. ఆనంద బాష్పాలు రాల్తూంటే, గ్యాలరీలమీదనున్న మన జెక్ ప్రేక్షకులు ఒకరొనొకరు కౌగలించుకున్నారంటే ఆశ్చర్యంలేదు.

తనను అభినందించుటకు వందలకొలది చేతులు ముందుకు చాచుట చూచాడు ఎమిల్. ఆటగాండ్రు, అధికారవర్గం, ఒలింపిక్ కమిటీ సభ్యులు ఒకరేమిటి అందరూ అభినందించారు.

మరొకక్షణం: ఎమిల్ విజయపీఠం పై మెట్టుమీద నిల్చబడి ఉన్నాడు. ఒలింపిక్ కమిటీ అధ్యక్షుడు, స్వీడన్ దేశస్థుడు ఎడ్‌స్ట్రామ్ వద్దనుండి సువర్ణపతకాన్ని స్వీకరించాడు.

వాని ప్రక్కనే రెండవ, మూడవస్థానాలను వరుసగా పొందిన ఫ్రెంచి-ఆల్జీరియన్, మెమోన్, స్వీడిష్ ఆల్బర్ట్సన్ నిలబడ్డారు. వారి వెనక డెన్మార్క్ (స్వీడ్), స్టాకెన్ (నార్వే), ఎవరాడ్జ (బెల్జియం) నిలబడిఉన్నారు.

విజయధ్వజంపై జెకోస్లావక్ పతాకం గర్వంగా ఎగురుతోంది. మేరధాన్ సింహద్వారంపై యీ అక్షరాలు కనబడుతున్నాయి.

1. జటోపెక్, జెకోస్లావేకియా-29 నిమిషాల 59.6 సెకండ్లు-ఒలింపిక్ రికార్డు.

కమ్మని జెక్ జాతీయగీతం ధ్వనిస్తోంది. కొందరుప్రజలు దానితోపాటు పాడుతున్నారు. ఆ పాడుతున్నది ఆనందపరవశులైన జెక్ ఒలింపిక్‌దళ సభ్యులు.

# 5000 మీటర్ల పందెం

ఎమిల్ ప్రయాణానికి సిద్ధమయ్యేసరికి దుస్తులగది, నీళ్లగది యింకా నిండుగానే ఉన్నాయి.

"ఎమిల్, నీ కెలాగుంది" అని మిత్రులు సంతోషంగా అడిగారు.

"నా భుజములమీద నుంచి ఒకబరువు పోయినట్టుగా అనిపిస్తూంది" అని నవ్వేడు.

నిజమే. పందెమునకు ముందు, పందెం జరుగుతున్నంతకాలం బాధ్యత, దానికి సంబంధించిన బాధ అతనిని వేధించాయి. ఇప్పుడవి పోయాయి. వాటి స్థానంలో విలువలేని ఫలితాలు సంపాదించాడు. విజయం, మనమందరం అతనికొరకు ఆశిస్తూన్న బంగారు పతకాన్ని సంపాదించిపెట్టింది. తన కోరికలనే కాకుండా, పౌరుల కోరికలను కూడా ఎమిల్ నెరవేర్చాడు.

పశ్చిమ ప్రేటన్‌నుండి బండిలో బయలుదేరేసరికి, తన దేశంనుండి ప్రజల ఆనందం తెలియజేస్తూ కుప్పలుకుప్పలుగా టెలిగ్రాంలు వచ్చాయి. పురాతన గ్రీసులో ప్రజలు చేసినట్టుగా ఎమిల్ గౌరవార్థం గోడలనుకూడా పడగొట్టటానికి సిద్ధమయ్యారు. తన దేశానికి, ప్రజలకు ఎమిల్ అపరిమితమైన గౌరవాన్ని సంపాదించాడని అందరూ అనేవారే. అతని విజయంలో ఎమిల్ ఒక సువర్ణ పతకాన్ని సంపాదించుటే కాదు; అంతకన్న ఎక్కువ విలువైనది సంపాదించాడు. మంత్రులు, క్రీడా సమాజాలు, మిలిటరీ అధికార్లు, మిత్రులు పంపిన టెలిగ్రాములు, సందేశాలనుబట్టి అతనీ విషయం గ్రహించగలిగాడు. పరిచితులు, అపరిచితులుకూడా వారి ప్రశంసలు, కృతజ్ఞతలు టెలిగ్రాంలద్వారా తెలియజేశారు.

"ఎమిల్, ఒలింపిక్ ఉత్సవంలోకి నీవు వచ్చుట ఎంత సమంజసంగా ఉంది. హీనో నీడలో కూర్చున్నాడు; కాని అతని కది ఏమి లాభించింది? ఏమైనా ఒక ప్రత్యేక సౌకర్యం నీ విజయానికి తోడ్పడిందని యిప్పుడు ఎవరూ అనలేరు కదా!"

ఆ మరుసటిరోజు ప్రేక్షకస్థానంలో ఎమిల్ తన ఆటదుస్తులతో కూర్చొనుటకు సాహసించలేకపోయాడు. లండన్ పౌరులు గుంపులు గుంపులుగా ఎక్కడ దాగివున్నా అతనిని చుట్టుముట్టారు. వారి నోట్ పుస్తకాలలో అతని దస్కతు కావాలంటారు.

శనివారం జావలిన్ విసరుటలో స్త్రీల పోటీ జరిగింది. 'డానా'కు ఏడవ స్థానం వచ్చింది. అదే అద్భుతమైన విజయం; ఆమె యీ ఆటలో ప్రారంభదశలోనే ఉన్నది.

'హర్డిల్' పందెంలో, డాన్ ఫిండ్లే ఆఖరు 'హర్డిల్'వద్ద పడిపోయి, పందెంలో నుండి 'రిటైర్' అయ్యాడు. హంగరీ పందెగాడు నీమెత్ 'హేమర్‌త్రో' సులభంగా గెలిచాడు. అమెరికన్ నీగ్రోలు 'హైజంపు' గెలిచారు.

ఆ మధ్యాహ్నం 500 మీటర్ల పందేనికి మూడు పరీక్షలు జరిగాయి. ప్రతి పరీక్షలోను, మొదటి నాలుగు స్థానాలకు అర్హులైనవారికే అసలు పందెంలో పాల్గొనుటకు అర్హత.

ఈ పరీక్షాపందెములలో విజయమనేది, వేళఅనేది ముఖ్యాంశాలు కావుకాబట్టి, స్వీడిష్ పందెగాడు ఆల్గొహాడెన్‌తో, ఎమిల్ వేగంవిషయం, నాయకత్వం విషయం ఒప్పందానికి వచ్చాడు. పందెంలో స్వీడ్ పందెగాడికి వేళల విషయం ఎప్పటికప్పుడు తెలియపరుస్తుంటానని ఎమిల్ అభయం ఇచ్చాడు.

ఆఖరు ఘట్టంలో స్వీడిష్ పందెగాడు ఒప్పందానికి వ్యతిరేకంగా ఒక్కసారి వేగం అధికంచేసి, ఎమిల్ యీ మోసం గుర్తించేలోగా 25 మీటర్లు ముందుకు పోయాడు. పోనీ పోతే పోయాడని ఎమిల్ వదిలేసినా యిబ్బందిలేదు; ఈ పరీక్షలలో రెండవస్థానం వచ్చినా అంత్యపోటీలకు తనకి అర్హత ఉంటుంది. కాని యీ మోసం ఎమిల్‌కు కోపకారణమయింది. ఎలాగయినా జటోపెక్ మీద గెలుపుకోరకు అతని తాపత్రయం. కాని అంత సులభంగా గెలవనీయదలచలేదు ఎమిల్. అతని వెంటబడ్డాడు: ఒక మీటరుకన్న తక్కువలో రెండవ స్థానంలో నిలబడ్డాడు. ఆల్గొహాడెన్ ఎలాగైనా గెలుద్దామని తన యావచ్ఛక్తిని ఉపయోగించి, గమ్యస్థానం చేరుకునేటప్పటికి పూర్తిగా అలసిపోయాడు.

తనవాళ్ళు ఎమిల్ చూపిన ధైర్యానికి మెచ్చుకుంటూంటే, ప్రవీణులు ఒక సెకండులో 10వ భాగం కూడా వృథాచేయుట ఎమిల్ అవివేకమన్నారు.

ఆదివారం మధ్యాహ్నం మా జట్టు లండన్ దృశ్యాలను చూచుటకు బయలుదేరింది. సూర్యరశ్మి భరించశక్యంగాకుండావుంది. పందేలకు బలమధికంగా ఉండేనిమిత్తం, యీ అలసట లేకపోతే బాగుండేది.

ఎమిల్ ఖులాసాగా ఉన్నాడు. కథెడ్రల్ ఎదురుగా పిల్లలతో ఆడుకున్నాడు. మధ్యాహ్నమల్లా నిలబడే ఉండుటవల్ల సాయంత్రం అయ్యేసరికి ఆయాస మనిపించింది ఎమిల్ కి. ఆయాసం శారీరకమే కాదు, మానసికంకూడాను. కొంతసేపు నిద్రపోయి ఆయాసం తీర్చుకుందా మనుకున్నాడు.

సోమవారం ఉదయం వర్షం కురుస్తూంది. పొగమంచు ఆకాశమంతా కప్పివేసింది. కిటికీలమీద వర్షం తెరిపిలేకుండా కొడుతూనే ఉంది. రోజల్లా కురుస్తూనే ఉంది.

ఆ వర్షంలోనే పోల్ వాల్టర్సు ఊహించరాని ఎత్తులను దాటుతున్నారు. డిస్కస్ త్రోలో విజయం సాధించిన ఇద్దరు ఇటాలియన్లు విజయపీఠాన్ని ఎక్కారు. 800 మీటర్ల పందెం 'విట్ ఫీల్డు' అనే నీగ్రో కఠిన పోరాటం ఫలితంగా గెలవగలిగాడు. ఒక డేనిష్ ఆటగాడు పందేలలో పాల్గొనలేక, పందేలుమాడనైనా చూచి ఆనందిద్దామని 'స్ట్రెచర్' మీద వచ్చాడు. పరీక్షాపందేలలో కాలు బెణికిపోయిం దతనికి.

డచ్చియిల్లాలు బ్లేంకర్సు-కోన్ 100 మీటర్లపరుగు పందెం గెలిచినందుకు, డచ్చి జాతీయగీతం పాడినవెనువెంటనే 5000 మీటర్లపరుగు పందెం ప్రారంభమయింది.

వాతావరణం చల్లగాఉంది. వర్షంకురుస్తూవేఉంది. పరుగుమార్గం మెత్తగా, బురదగా ఒక్కొక్కచోట చెరువు లాగుంది. వేగానికి అనువుగా వుండే ఆ మార్గం తన కసితీర్చుకుంటూందా అన్నట్టుంది.

పరుగు ప్రారంభానికి ముందు స్వీడ్ దేశస్థులు ఎమిల్ ను పందెంఫలితాన్నిగూర్చి ప్రశ్నించారు. ఎమిల్ తాను గెలుస్తానని కొంత ఆశకలిగి ఉన్నాడు. కాని ఆహ్లాడెన్ కొంచెం తనకన్నా నయమేమో అనుకున్నాడుకూడా!

"ఆహ్లాడెన్ గెలుస్తాడనుకుంటా" అని హృదయపూర్వకంగానే అన్నాడు.

పరుగు ప్రారంభ ప్రదేశంవద్ద ఆ వర్షంలో కోట్లు తొడుక్కొని, చలికి రగ్గులు కప్పుకొని ప్రేక్షకులు నిలబడిఉన్నారు. ప్రేక్షకస్థలం చాలవరకు ఖాళీగానే ఉంది. పందెగాళ్ళు కనబడగానే అన్ని ప్రక్కలనుండి జయధ్వానాలు వినబడ్డాయి. ఫిన్నుల తరఫున ముగ్గురు పోటీదార్లు, ప్రేక్షకుల్లోనుండి చాలమంది ప్రోత్సాహాన్ని పొందుతూన్న స్వీడులు ముగ్గురు, బెల్జియన్లు ఇద్దరు. మా దేశస్థులు ప్రేక్షకులలో కొద్దిమందే అయినా, అన్నిప్రక్కలనుండి జటోపెక్కు పేరు ప్రతిధ్వనిస్తూంది. అతను ఇక్కడి ప్రజల అభిమానాన్ని సంపాదించాడు; వివిధ జాతులవారు అతని విజయాన్ని కోరుతున్నారు. జటోపెక్ పాల్గొనుటవల్ల పందేనికే ఒక కొత్త స్వరూపం ఏర్పడుతుందని అందరి నమ్మకం.

203 వ నెంబరు ఛాతీమీద మెరుస్తూంటే, ఎమిల్ అతివేగంగా ముందుకు పరుగెత్తేడు. ఉత్తరాదివారందర్ని దాటిపోయాడు. తన మడమలనంటే ముఖంమీద బాధను సూచిస్తూ, పెద్ద పెద్ద అంగలతో రీఫ్ వస్తున్నాడు; వాని వెనక ఆహ్లాడెన్, వాని వెనక స్లిఖూస్. తక్కినవారు వీరికి బాగా వెనక నున్నారు.

వర్షం పందెగాళ్ళముఖంమీద కొట్టూంది. వళ్ళంతా తడిసిపోయింది. ఆ బురద మార్గంలో మేకులతో ఉన్న వారి జోళ్లు భూమిలోకి గ్రుచ్చుకుపోతున్నాయి. బురద వారి అడుగులలోనుంచి చిందుతూంది.

3 కిలోమీటర్లవరకు వరుస చెదరలేదు. ఎమిల్ మడమల నంటి ఉంటేనే, అతనిని జయించుట సాధ్యమవుతుందని రీఫ్ అభిప్రాయం. జటోపెక్ జోళ్లనుండి చిందే బురద తనమీద త్రుళ్లుతున్నా, రీఫ్ తన శక్తినంత నుపయోగించి ఎమిల్‌ను వదలడంలేదు. వాని వెనకనే పోతున్నాడు.

ప్రేక్షకులు జటోపెక్కును ప్రశంసిస్తున్నారు. రెండు పందేల తర్వాత యీ వర్షంలో, బురదలో యీ 5000 మీటర్ల పందెంలోకూడా అందరికన్నా ముందు పరుగెత్తే జటోపెక్కును ప్రేక్షకులు అభినందిస్తున్నారు. అదీకాక, తన ప్రత్యర్థులందరూ విశ్రాంతి తీసుకున్నారు. వారిలో అతి ప్రమాదకరమైన ప్రత్యర్థి 10,000 మీటర్ల పందెంలో పరుగెత్తలేదు.

అప్పుడు జటోపెక్ వెనకపడడం ప్రారంభించాడు. వేగంగా ముందుకు జరగలేకపోయాడు; కాలు గట్టిగా నేలమీద ఆనించలేకపోయాడు. మొదట అనుకున్న ప్రకారం చేయలేకపోయాడు.

3500 మీటర్ల దగ్గర రీఫ్ ధైర్యంగా ముందుకు పోయాడు. మరొక కొంత దూరం తర్వాత స్లిఖూన్‌కూడా అలాగే చేశాడు. రీఫ్ 60 మీటర్లు, స్లిఖూన్ 30 మీటర్లు ఎమిల్‌కు ముందున్నారు.

ఎమిల్ వేగం అధికం చేద్దామని ప్రయత్నించాడు. కాని సాధ్యంకాలేదు. కాళ్లు బరువెక్కిపోయినవి. కాళ్లు దిగబడిపోతున్నాయి; జారిపోతున్నాయికూడా. ఈ అశక్తి అతనిని ఎలా ఆవహించిందో తెలియలేదు. మానసికమైన ప్రమాదమేదో జరిగినట్టయింది. ప్రబల ప్రయత్నంచేసి శరీరాన్ని స్వాధీనం చేసుకున్నాడు; తనతో తానే కుస్తీపట్టడం మొదలుపెట్టేడు. ఏమిచేసినా ముందున్న యిద్దర్నీ కలుసుకోలేకపోయాడు. పోనీ 3 వ స్థానమయినా తప్పదుకదా అని సంతుష్టిపడ్డాడు.

ఎమిల్ ప్రజ్ఞా సామర్థ్యాలనుగూర్చి ప్రజలకేమీ అనుమానంలేదు. ఇన్ని విజయాలు పొందినవానినుండి యింతకన్నా ఎక్కువ ఆశించుటకూడా న్యాయంకాదు. అయినా, వారు పడినపాట్లకు, యితరులుమాత్రం స్వర్ణపతకాలు ఎందుకు పొందకూడదు ?

ఆఖరు ఘట్టంలో స్లిఖూన్, రీఫ్‌ను దాటుదామని ప్రయత్నం చేశాడు. కాని రీఫ్ జాగ్రత్తగానే ఉన్నాడు. అతని వివేకం, అతని దృఢనిశ్చయం అతనిని ముందుకు తీసుకుపోతూంది. తన శక్తినంతా లోభత్వం లేకుండా వ్యయం చేశాడు. స్లిఖూన్ ప్రయత్నంకూడా ప్రబలమయినదే. సాధ్యం కాకపోవడంవల్ల రీఫ్‌ను వదిలేసి నెమ్మదిగా పోయాడు.

జటోపెక్కు, రీఫ్‌కు మధ్యనున్న తేడా అలాగే ఉంది. గమ్యస్థానానికి 200 మీటర్లదూరంమాత్రమే ఉంది. ఎమిల్‌యొక్క విశిష్టతకు తరుణం ఆసన్న

మైంది. ప్రేక్షకులు యీఘట్టం మరవలేరు; ప్రపంచ పత్రికాధిపతులు యీఘట్టం గురించి విపులంగా విమర్శించే అవకాశం ఎప్పుడూ విడువరు.

గమ్యస్థానం సన్నిహితమైన విషయం జటోపెక్‌లోని నైరాశ్యాన్ని, ఆయాసాన్ని పారద్రోలింది. శరీరం స్వేచ్ఛను పొందింది; అతని మనస్సు అతని కండరాలకు చైతన్యం కలిగించింది. పూర్తి శక్తితో అత్యంత వేగంతో పరుగెత్తుకుపోతున్నాడు. అతనిని వెనుకకు లాగే శక్తి ప్రపంచంలో ఎక్కడా లేదు. అదే అతనికి ఆనందాన్ని కలగజేసింది. ఆ ఆనందమే అతనికి బలమొసగింది.

తనకు ముందు స్లిఖూస్ అనుమానంగా వెనక్కు చూస్తున్నాడు. బురద త్రుళ్లుతూంది; నీరు చిందుతూంది. అమానుష శక్తితో ఎమిల్ పరుగెత్తుతున్నాడు. తల దించి, దవడలు బిగించి, ముఖం కదలకుండా, ఊపిరితిత్తులు గాలికోసం కొట్టుకొంటూంటే ఎమిల్ సాగిపోతున్నాడు. స్లిఖూస్‌ను దాటిపోయాడు; రెండవ స్థానంలోకి వచ్చేడు.

ఈ సమయంలో రీఫ్ మళుపు తిరిగి తిన్నని మార్గంలోకి వచ్చేశాడు. ఒక్కసారి రీఫ్ వీపువైపు చూశాడు. సుమారు 20 మీటర్లే వారిద్దరిని వేరుపరుస్తున్న దూరం. రీఫ్ తన మామూలు ఫక్కీని అవలంబించకపోవుట ఎమిల్ గుర్తించాడు. అతనిని దాటుటకు అవకాశం ఉందని తోచింది ఎమిల్‌కు. ఈ భావం అమలులో పెట్టేడు.

ఎంజిన్ యొక్క 'పిస్టన్‌రాడ్'ల వలె కాళ్లు, చేతులు కొట్టుకుపోతున్నాయి. శరీరంమీద సంపూర్ణమైన స్వాధీనం ఏర్పడింది. పై భాగం ముందుకు వంగిపోయింది. వేట ప్రారంభమయింది.

ప్రేక్షకులలో ఆశ్చర్యం బయలుదేరింది. మొట్టమొదట తనకోసమే ఆ కేకలని రీఫ్ భావించాడు. అంతదూరంనుండి తన విజయావకాశానికి ప్రమాదం ఎవరు తేగలరని అతని ధీమా! ఆ కోలాహలంమధ్య జటోపెక్ పేరు వినబడింది. ఒక్కసారి వెనక్కు చూచాడు; అదిగో జటోపెక్ సునిశ్చలమైన ముఖం.

అప్పుడు తన విజయంకొరకు భయం అతని హృదయాన్ని ఆవేశించింది. ఇదివరకెప్పుడూ ఒలింపిక్ విజయాన్ని సాధించి ఎరుగని ఒక చిన్న దేశానికి చెందినవాడే రీఫ్ కూడా! ఆ సంవత్సరంలో బయలుదేరిన వీరాగ్రగణ్యులలో ఆత డొకడు; అతని దేశస్థుల కాతనే ఆశాజ్యోతి. అన్నీ వదలి కేవలం యీ పందేలకొరకే కఠినశిక్షణ పొందిన వ్యక్తి రీఫ్.

వేగం అధికం చేయుటకు ప్రయత్నించాడు రీఫ్. కాని జటోపెక్‌కున్న మనోబలం యితనికి లేదు. తనకున్న శక్తినంతా యిదివరకే ఉపయోగించేశాడు. శరీరం అలసిపోయింది. కాళ్లు తడబడుతున్నాయి.

మరొక్కసారి వెనక్కు తిరిగి చూశాడు; దూరం తగ్గిపోయింది.

ఆత్మనిగ్రహంవల్ల శరీరంమీద అపరిమితమైన శక్తిని సంపాదించాడు ఎమిల్. అతనికి బాధ అనేది తెలియడంలేదు.

రీఫ్‌కు గమ్యస్థానంవద్ద కట్టిన 'టేపు' కనబడుతూంది. తన బెల్జియంకు విజయం తనచేతి కందుబాటులో ఉంది. విజయం; తన దేశపతాకకు గౌరవం; తన జీవితఫలం—కాని వెనక వేగంగా తన ప్రత్యర్థి అడుగుల చప్పుడు; ఊపిరి పీల్చుట వినబడుతూంది.

మరొక 10 మీటర్లు; మరి 5 మీటర్లే.

రీఫ్‌కు కాళ్లలో బలం పోయింది; ఏదో కొంత కాళ్లీడ్చాడు; తన ఛాతీ ఆ టేపును ముందు తాకించవని గ్రహించాడు. అతని జీవితస్వప్నం నెరవేరింది.

ఆఖరు నిమిషంలో తనకు, రీఫ్‌కు మధ్యనున్న తేడాను బాగా తగ్గించివేశాడు ఎమిల్. రెండు మీటర్లమాత్రమే ఉంది. అదిగూడా తుడిచివేయడం సాధ్యం కాలేదు.

విజయం రీఫ్ హృదయాన్ని ఆనందంతో నింపింది. అలసిపోయిన చేతులను ఒక్కసారి చూచి, చిరునవ్వు నవ్వాడు.

తన స్వదేశమైన బెల్జియం కొరకు రీఫ్ యీ విజయాన్ని సాధించాడు !

రీఫ్ గెలిచినవేళ : 14 నిమిషాల 17.6 సెకండ్లు; జటోపెక్ వేళ: 14 నిమిషాల 17.8 సెకండ్లు. ఈరెండూ ఒలింపిక్ రికార్డులను భగ్నమొనర్చినవి.

శీతోష్ణస్థితి బాగుండివుంటే, మార్గం ఉండవలసినరీతిగా ఉండి వుంటే ఎంత వేళలో వీరు గెలిచి వుందురు?

స్లిఖూన్ 10 సెకండ్ల వెనక చేరుకున్నాడు. తర్వాత ఆష్లెండెన్, ఆల్బ్రెట్సన్, స్టోన్.

ఒలింపిక్ ఆటల ఆనువాయితీ ప్రకారం రేపు ఆటలు ముగిస్తారనగా యీ సాయంత్రం స్టేడియంలోని ఒలింపిక్ పతాకం, అలాగే ఒలింపిక్ గ్రామంలోని పతాకం ఎంత జాగ్రత్తగా రక్షిస్తున్నా అదృశ్యమవుతాయి. క్రీడోత్సాహులకు ఆ పతాకం విలువలేని జ్ఞాపక చిహ్నం.

ఈసారి పతాకం పోవడమేకాదు; మరొకవస్తువుకూడా క్రీడోత్సాహుల అపహరణాసక్తికి గురయిందని ఎమిల్ ఫిర్యాదు. పోగొట్టుకున్నది తాను.

దుస్తులు ధరించి రీఫ్‌ను కౌగలించుకొని తన వస్తువులను సర్దుకొనుటకు వెళ్ళ సరికి, తన విజయపాదరక్ష లదృశ్యమయ్యాయి.

ఈ అద్భుతమైన పోటీ చాలాకాలం చర్చించబడింది; రీఫ్ గెలిచాడు; కాని ఒలింపియడ్‌లో ఎన్నడూ ఎవ్వరూ సాధించనిది జటోపెక్ సాధించాడు.

రీఫ్ విజయాన్ని జటోపెక్ తృణీకరించలేదు. తనమీదే తనకు అసంతుష్టి కలిగింది. ఇంటికి తిరిగివెళ్ళినతర్వాత అందరూ తన్ను నిందిస్తారని అతని భయం.

"నేను మూడవవానిగావస్తే అది వేరే సంగతి; రెండవవానిగా అంత దగ్గరకు వచ్చి ఓడిపోయినందుకు నిందించకమానరు."

అతనిని ఓదార్చవలసివచ్చింది. రజితపతకం వచ్చినందుకు అందరం సంతోషించాం; జెక్ పతాకం సగర్వంగా, ఎత్తుగా ఎగురుతూన్నందుకు ఆనందించాం.

కాని యీ అపజయ కారణాలను పరిశీలించి విమర్శించుటమాత్రం ఎమిల్ వదలి పెట్టలేదు.

“నా స్నేహితుడు రీఫ్ గెలిచినందుకు నాకు సంతోషం. మొట్టమొదటిసారి బెల్జియన్ దేశస్తుడు ఒలింపిక్ పోటీలో గెలుపొందుట యిదే. అయినా అతనిని గెలుచుట అసాధ్యం కాదు. పొరపాటు నాది. ఆఖరు పరుగు నేను కొంత ముందు ప్రారంభించినట్లయితే ఫలితం వేరుగా ఉండేది.”

నిజమే! అందరి అభిప్రాయం అదే. మరొక కొన్నిమీటర్ల దూరం ఎక్కువగా ఉంటే, రీఫ్‌ను దాటిపోయేవాడు ఎమిల్. చివరివేట కొంచం ముందుగా ప్రారంభించినా సరిపోయేది. కాని అది సాధ్యమయ్యేదా? అదంతా యీ యిద్దరు ప్రవీణుల మానసిక ప్రవృత్తి, శరీర పరిస్థితిమీద ఆధారపడి ఉండలేదా? పందెం, పోరాటం, మనోబలం, ఆయాసం, నైతికబలం అన్నింటిమీద ఫలితం ఆధారపడి ఉంటుందికదా!

అయినా యీ ఒలింపిక్ ఆటలనుండి ఎమిల్ కొన్ని పాఠాలు నేర్చుకోవద్దా? ఆ హ్లాడెన్ విషయంలో తాను అనవసరంగా తన శక్తిని వృధాచేయలేదా?

నిజంగా, యింకే ఒక వ్యక్తి సాధించినదానికన్న ఎక్కువ ఎమిల్ సాధించిన మాట వాస్తవం. అయితే అతనీ అసంతుష్టితో వేదనపడుట దేనికి? అంతా అతని మంచికొరకే; ఏదోరోజు దీని ఫలితాన్ని అనుభవిస్తాడు.

ఒలింపిక్ ఆటలు సాగుతున్నాయి. ఎమిల్ అడుగుజాడల్లోనే మన జట్టులోని యితర ఆటగాండ్రుకూడా నడుస్తున్నారు. చెప్పుకోతగ్గ విజయం ‘సివోనా’ది. 1500 మీటర్ల పందెంలో ఎరిక్సన్, స్ట్రాండు, స్లీఖూస్ వెనక నాల్గవ వానిగా గెలిచాడు. అతని “టైము” 3 నిమిషాల 51.2 సెకండ్లు; ఆ మార్గ స్థితినిబట్టి చూస్తే యిది అద్భుత ప్రదర్శనమే.

ప్రతిరోజూ విశిష్టమైన ప్రదర్శనలు జరుగుచున్నవి. మేరథాన్ పందెంలో గమ్యస్థానం దరిదాపున బెల్జియన్ దేశపు గెయిలీ పడిపోవడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. 400 మీటర్ల పందెంలో జమైకా జట్టువారి మొనగాడు ‘వింటు’ ఆకస్మికంగా దెబ్బతగలడంవల్ల ‘రిటైర’ యిపోవడం ఒక విషాదసంఘటన.

ఒలింపిక్ ఆటలలో ముఖ్యమైనవి “ఫీల్డు” “ట్రాక్” ఆటలు. ప్రతి ‘ఒలింపియడ్’ ఉత్సవంలో ఏ ఒక వ్యక్తియొక్క ప్రదర్శనలో, ప్రేక్షకులమనస్సులను ఎక్కువగా ఆకర్షించి, ఆ వ్యక్తిని తారాపథానికి ఎత్తివేస్తవి. ఇదివరకలాగ తారాపథం అందుకున్నది థోర్ప్, నూర్మి, ఓవెన్సు. ఈసారి జెటోపెక్ ఆ గౌరవాన్ని పొందేడు. కాని డచ్చి స్త్రీ బ్లేంకర్సు-కోన్‌తో యీ గౌరవానికి భాగస్వామి మాత్రమయ్యాడు.

వెంబ్లీ ఆటస్థలంలో చేరిన పత్రికా విలేఖరులు జటోపెక్ యొక్క అసాధారణ ప్రజ్ఞను వర్ణించుటకు తగినమాటలను వెదకుటలో తికమక పడ్డారు.

“మానవ యంత్రం” అని ఒక శీర్షిక.

"గిరిజనులు పర్వత నివాసాలనుండి, గుహలనుండి జటోపెక్‌ను చూడడానికి వచ్చేవార"ని ఫ్రెంచి వార్తాహరుని వివరణ.

ఫ్రెంచి వ్యాసకర్త మేగ్నస్ యిలా వ్రాశాడు: "జటోపెక్ మానవమాత్రుడు; తక్కినవాళ్ళవలెనే పరుగెత్తుతాడు."

ఇంకా యిలా వ్రాశాడు: "అభిమానుల ప్రశంసలవలన మోసపోయే ఆట గానికి ప్రమాదం తప్పదు. విజయం కాంచినవారు అమానుష ప్రజ్ఞానిధులని అను కుంటే, వారు తమ శారీరకశక్తిమీదనే ఆధారపడుతున్నారన్నమాట. ప్రేక్షకులు వారిని ప్రశంసించవచ్చు.

"వెంబ్లీలో ఒక అసాధారణ సంఘటనవల్ల వాతావరణం స్తంభించిపోయింది.

"జటోపెక్ నవీన పద్ధతులకు బానిసకాదు. మానవుడు ఏ విధంగా పరుగెత్తునో ఆ విధంగా పరుగెత్తాడు. విజయంకొరకు ఎన్నో కష్టాలు అనుభవించాడు; తన శరీరంయొక్క సరియైన బరువు వతనికి తెలుసు; ఎంతవరకు ఏ ఘట్టంలో ఎంత శక్తిని వినియోగించాలో అతనికి తెలుసు; పరుగెత్తుతున్నప్పుడు అతని ముఖంలో బాధ, ఊపిరికొరకు ఆ కొట్లాట, అతని విజయం, అతని పోరాటం లండన్‌లో జరిగిన ఒలింపిక్ ఆటల స్మృతులలో మరువరానివి."

జటోపెక్ విజయఘోష దేశాల ఎల్లలుదాటి ప్రతిధ్వనించింది. ఒలింపిక్ ఆటలు సమాప్తమయిన తర్వాత చాలాకాలం ఆ ప్రతిధ్వని అతనిని వెన్నంటేవుంది.

లండన్‌నుండి ఎమిల్ 3000 మీటర్ల ప్రావీణ్య ప్రదర్శనమిచ్చుటకు ఆన్ట్వెర్పుకు వెళ్ళాడు. హార్బరువద్ద బెల్జియన్ ప్రతినిధులను కలిశాడు; వారుకూడా అలసి అప్పుడే అక్కడ చేరుకున్నారు.

బ్రస్సెల్సులో జరిగిన ఉత్సవసందర్భంలో ఒలింపియడ్ ప్రవీణుల సమీక్షంలో బెల్జియన్ ప్రత్యర్థులతో మాత్రమే ఎమిల్ 3000 మీటర్ల పందెంలో పాల్గొని సులభంగా గెలిచాడు.

లండన్ వదలిన తరువాత ఎమిల్‌కు సరియైన ట్రెయినింగులేదు. అలసి పోయాడు; ఇంటికి పోదామని ఆతురత పడుతున్నాడు. అక్కడనుంచి ఎమ్‌స్టర్‌డమ్‌కు వెళ్ళి 3000 మీటర్ల పందెంలో పాల్గొని ఆ స్లైడెన్, స్లిఖూస్, తర్వాత మూడవ వానిగా వచ్చాడు.

ఆ తర్వాతనే ఇంటికి వెళ్ళగలిగాడు. అది ఉత్సవంగా తయారయింది. దేశ మంతా సన్మానించుటకు వేచి ఉంది. ఎంతో సంతోషంగా ఉంది. విమానాశ్రయం వద్ద తలిదండ్రులు తన కొరకు నిరీక్షించుట అతనికి పరమానందంగా ఉంది.

దురదృష్టవశాత్తు తలిదండ్రులతో ఆట్టే కాలం గడపలేకపోయాడు. ఇక్కడ కూడా అనేక సన్మానపు టుత్సవాలలో పాల్గొనవలసి వచ్చింది. సరైన 'ఫారమ్' లో లేకపోయినా, ఎడమ తొడలో నొప్పి ఉన్నా తన ప్రజలకు ఆశాభంగం కలగకుండా పరుగుపందేలలో పాల్గొన్నాడు. ప్రత్యర్థిని చూచి భయపడినాడనిగాని, ఒలింపిక్

విజయా లాతని తల తిరిగేటట్టు చేశాయనిగాని ప్రజలెక్కడనుకొని పోతారోనని పరుగెత్తుటకు సంశయించలేదు.

ఒలింపిక్ ఆటల నీడలలో జరిగిన అసంఖ్యాకమైన పోటీలలో బ్రూనోలో జరిగిందాతనికి మరువరానిది. అక్కడే ఒక వెండి గ్లాసు, ఒక పిస్టల్, ఒక గిటార్ ఆతనికి బహుమానాలుగా వచ్చాయి. క్రీడా స్థలంలోనే ఆ గ్లాసు ఎవరో దొంగిలించారు. పిస్టల్ తానే ఎవరికో బహుమతిగా యిచ్చివేశాడు. ఒక్క గిటార్ మాత్రమే ఆతనికి దక్కింది. అప్పుడు ప్రేక్షకులు దానిమీద ఆతనిని వాయించమన్నారు. కాని వారిని సంతుష్టి పరచలేకపోయాడు; సిగ్గు పడుతూ అక్కడనుంచి అదృశ్యమయ్యాడు.

తర్వాత ప్రేగ్ స్ట్రేహోవ్ స్టేడియంవద్ద ఒలింపిక్ పోరాటంలో తనకు కలిగిన అవమానానికి రీఫ్‌మీద కసితీర్చుకునే అవకాశం వచ్చింది. ఈ ఒలింపిక్ వీరులిద్దరూకూడా అలసిపోయి ఉన్నారు. వారిద్దరికీ విశ్రాంతి అత్యవసరం. ఇద్దరిలో రీఫ్ యొక్క కేంద్రీకరణశక్తి యెక్కువ. 14 నిమిషాల 19 సెకండ్లలో పరుగు పూర్తి చేశాడు; ఎమిల్ కన్నా 2 సెకండ్లు వేగంగా పరుగెత్తేడు.

ప్రేగ్ పౌరులు రీఫ్‌ను ఎంతో ఆదరంగా ఆహ్వానించారు. ఎమిల్ హృదయపూర్వకంగా రీఫ్‌ను అభినందించాడు. రీఫ్ ఆనాడు తనకన్న ఎక్కువ ప్రజ్ఞను చూపించాడని ఎమిల్ అంగీకరించాడు. రీఫ్‌ను అభినందిస్తూ పౌరులు అదేపనిగా కేకలు వేస్తూంటే, వారికి కృతజ్ఞత చూపిస్తూ చేతులనూపమని ఎమిల్ నెమ్మదిగా ఆతని చెవిలో చెప్పేడు.

రీఫ్ అలాగే చేశాడు. ఈ బెల్జియన్ వీరునికి మూకీభావం కలిగిందికదా అని పౌరులు ఆనందించారు. వారి అభిమానాన్ని ఆతనిమీద కురిపించారు.

ఈ అపజయం తరువాత ఏదో కారణంవెదకి తన ఓటమి ఓటమికాదని రుజువుపరచడానికి ఎమిల్ ప్రయత్నించలేదు. అతని తొడలో నొప్పి అతనిని బాధపెడుతూన్నది; నడవనీయుటలేదు. విశ్రాంతి వల్లనే అదికుదరాలి. కుదిరేవరకు వేచి ఉండాలి.

అయినా ఆతనిని బుఖారెస్టుకు పంపారు. 6వ కిలోమీటర్లో నొప్పి అధికమయింది. ఎంతో మనోబలం ఉపయోగించి, పరుగుపూర్తి చేశాడు. విజయం ఆతనిదేనని వేరే చెప్పక్కర్లేదు.

జెకోస్లావేకియాకు, ఇటలీకిమధ్య బొలోనాలో జరిగిన అంతర్జాతీయ పోటీలో మొదటిరోజు 10,000 మీటర్ల పందెంలోను, రెండవరోజు 5000 మీటర్ల పందెంలోను ఎమిల్ పరుగెత్తేడు. 'వేళలు!' 30 నిమిషాల 35 సెకండ్లు; 14 నిమిషాల 30 సెకండ్లు; అంతమంచి 'వేళలు' కావివి. అయినా విజయానికి మాత్రం అభ్యంతరం లేకపోయింది; అంతకన్నా సంతోషించవలసిన విషయం: నొప్పులు అదృశ్యమవుతున్నాయి. అందుచేత, అక్కడే ఆ గడ్డి బయళ్ళలో ట్రెయినింగు ప్రారంభించాడు. దానివల్ల ఆతనికి కొత్తశక్తి వచ్చినట్టయింది.

తర్వాత ఆహ్లాడెన్ (స్వీడ్)తో పోటీకి ప్రేగ్ చేరుకున్నాడు. ఒక సాయంత్రం కృత్రిమ కాంతిలో ఏ అనుమానం లేకుండా అతనిని ఓడించాడు. 14 నిమిషాల 16 సెకండ్లలో జటోపెక్ పరుగు పూర్తిచేశాడు.

అలాగ, ఆ సంవత్సరం విజయంతో సమాప్తమయింది.

తర్వాత ఏమిటి ? ఆటల రుతువు పూర్తి అయిపోయింది. ఇంక తన స్వంత వ్యవహారాలను చక్కజేసికోవాలి. 'డానా'ను వివాహమాడినాడని విని ఆశ్చర్యపోయే దెవరు ?

ఆ ఒలింపిక్ ఆటల మధ్య నెమ్మదిగా ఒక ప్రేమకథ అల్లుకుపోతూంది. స్వభావంలోను, ఆకర్షణలలోను రుచులలోనూ ఐక్యతగల యీ యిద్దరు వ్యక్తులు ఒకరి హృదయంలోని కొకరు ప్రవేశించారంటే ఆశ్చర్యంలేదు.

ఈ విధంగా ఆ వివాహదినం వచ్చింది: అక్టోబరు 24, 1948.

ఛాంపియన్‌షిప్ హేండుబాల్ పోటీలో ప్రవేశించవద్దని ఆమెను తలిదండ్రులు ఎందుకు వారించారో పెండ్లికూతురుకు తెలియలేదు. కాని అవివేకంగా వారిద్దరు సైకిళ్ళమీద షికారు వెళ్లుటకు అంగీకరించారు. పర్యవసాన మలాగయినందుకు యిద్దరూకూడా అదృష్టవంతులే అనాలి. ప్రేమించినవారు సైకిళ్ళమీద ఒకరిప్రక్కనొకరు పోయినప్పుడు సంతోషం అజాగ్రత్తకు దారితీస్తుంది. ఒకరి చేతులొకరు పట్టుకోవా లనిపిస్తుంది; ముద్దుపెట్టుకోవాలని కూడా అనిపించవచ్చు—కాని ఏమవుతుంది.

అకస్మాత్తుగా, వారు వారి సైకిళ్ళ క్రింద పడిపోయారు. వారిని త్రోసివేసిన లారీ, వారి మీదనుంచి పోనందుకు సంతోషించాలి.

పెండ్లికుమారుని బట్టలకొక చిరుగు; పెండ్లికుమార్తెకు మోకాలుమీద చిన్న దెబ్బ; ఆ దెబ్బ ముక్కుమీద తగలలేదు; అలాగయితే వివాహసమయంలో ఆమె ముఖ మెలాగుండేదో !

వివాహానికి వచ్చిన ఆహ్వానితులు, వధూవరుల ఆలస్యానికి ఆందోళన చెందుతూన్న సమయానికి వారు చేరుకున్నారు; వారు బలవంతులైన ఆటగాండ్రు కాబట్టే, ఆ గుంపులోనుండి, దేవాలయంలోకి త్రోవచేసికొని పోగలిగారు. ఇద్దరు ప్రఖ్యాత వ్యాయామ ప్రవీణులు వివాహ సమయాన సాక్షులు.

వివాహం పూర్తి అయిన తర్వాత పరిస్థితులు, యింకా విస్మయంగా ఉన్నవి. వధూవరులు, దేవాలయంలో నుంచి బయటపడేసరికి వధువు పెండ్లిగౌను ముక్కలయిపోయింది. కష్టంమీద బయటపడ్డారు. బయట 'హేండుబాల్' జట్టువారు యింకా యితర స్త్రీ పురుష ఆటగాండ్రు బారులుతీర్చి అలంకారాలతో 'ఆర్చి'గా ఏర్పడి వధూవరులను గౌరవించారు.

ప్రాతఃకాలంవరకు నృత్యాలు. ఎమిల్ - డానా చివరవరకు 'డ్యాన్సు'చేశారు.

ఆటల ఊహా ప్రపంచంలో అల్లిన దేవతల కథ కాదిది; కాని అంత అందమైన ప్రేమగాథే. ఇద్దరు క్రీడా వీరులు, ఒలింపిక్ విజయులు ప్రేమించి వివాహం చేసు

కున్నారు. వారు ఉత్సాహంగా యీనాటికీ ఆటలలో పాల్గొంటూ విజయాలు సాధిస్తూ వారిదేశంయొక్క గౌరవాన్ని ద్విగుణీకృతం చేస్తున్నారు.

# రాష్ట్రభవనంలో సన్మానం

శారీరక వ్యాయామ ప్రణాళిక మొదటి సంవత్సరం అభివృద్ధిని సూచించింది. క్రీడల పోటీలలో సంపాదించిన ఘనవిజయాలకు తన సంతోషము ప్రకటించుటకు అధ్యక్షుడు గొట్వాల్డు రాష్ట్రభవనంలో ఒక ప్రత్యేక సభను ఏర్పాటుచేశాడు.

దేశంలో వ్యాయామ శిక్షణపొందినవారి ప్రతినిధులుగా కొంతమంది ప్రవీణులు అధ్యక్షునితో సమావేశమగుటకు యీ ఏర్పాటు జరిగినది.

ముఖ్యమైన అతిథులు, విదేశ ప్రతినిధులు, రాయబారులుమాత్రమే ప్రవేశించుటకు ప్రత్యేకింపబడిన "మేత్యూ" ద్వారంలోనుండి ఆరోగ్యానందాలతో పొంగి పోతూన్న ఆటగాండ్రు, ఒలింపిక్ ఆటలలో తమదేశానికి ప్రాతినిధ్యం వహించిన సమర్థులు, యీ నాడు రాష్ట్రభవనం ప్రవేశించారు. అలా ప్రవేశించినవారిలో ఎమిల్ జటోపెక్ కూడా ఉన్నాడు.

ఆటగాండ్రకొరకు అధ్యక్షుడు నిరీక్షిస్తున్నాడు. వారొక్కరొక్కర్నే పరిచయం చేసుకొని తర్వాత వారు దేశానికి చేసిన సేవను ప్రశంసిస్తూ కృతజ్ఞత తెలిపేను. ఆటలంటే ఆయనకెంత అభిమానమో ఆయన ఆడిన మాటలవల్ల బోధపడుతుంది. యువకుడుగా, వర్కర్సు స్పోర్ట్సు యూనియన్‌లో ఆయన సభ్యుడు.

"మన వ్యాయామ జీవితంలో యిటీవలి సంఘటనలు మనం సరిగ్గైనమార్గంలో నడుచుకుంటున్నట్లు స్పష్టపరచినవి. మన సౌందర్యమైన మాతృభూమి నిర్మాణానికి, రక్షణకి కావలసిన శక్తిని, సామర్థ్యాన్ని సంపాదించుటకు యీ వ్యాయామ క్రీడలు ప్రజలకు తోడ్పడుతాయని నా అభిప్రాయం" అని అన్నారాయన.

వివిధ రంగాలలో మన ప్రవీణుల ప్రదర్శనలయొక్క ప్రాముఖ్యతను ఆయన ప్రత్యేకంగా పేర్కొనుట గమనార్హం. "మిత్రులారా! ప్రజలు అసంఖ్యాకంగా వ్యాయామాలలో పాల్గొని, ఆటల పోటీలలో కొత్తరికార్డులను సృష్టించండి; పందేలలో గెలుపొందండి" అని ఉద్ఘాటించారు. సంతోషం మనసు నూగిసలాడజేస్తుంటే, అధ్యక్షుని చుట్టూచేరి, ఆటగాండ్ర ప్రతినిధులు కొత్త స్టేడియంలు, ఆటస్థలాల, జిమ్నాషియంలనిర్మాణముగురించి శిక్షణనిచ్చే ఉపాధ్యాయుల, ప్రముఖ ఆటగాండ్ర

ట్రెయినింగు పద్ధతులనుగూర్చి, క్లబ్బులద్వారా, స్కూళ్ళద్వారా యువకుల చదువు యేర్పాట్లను గురించి చర్చించారు.

చర్చలు ముగిస్తూ, ఎమిల్ జటోపెక్ ఇలా అన్నాడు:

"మన ప్రజల రాజకీయ విముక్తితోపాటు, వ్యాయామ శిక్షణకు ఒక క్రొత్త రూపాన్నిచ్చిన మిమ్ములను ఆటగాళ్ళందరి తరపున అభినందిస్తున్నాను; మీకు కృతజ్ఞత తెలియజేస్తున్నాను. మీరు చేసిన ఏర్పాట్ల ఫలితంగా దేశంలోని ప్రజలు యావన్మంది శారీరకశిక్షణ పొందగలుగుతారు; క్రీడలలో సమర్థులైన మన ఆటగాండ్రు అద్భుతమైన ప్రదర్శనల నివ్వగలరు.

"మన జాతి పతాకను మనదేశపు సరిహద్దుల బయట రక్షించుట మాకు ఘనమైన గౌరవం. మన పితృదేశంమీద మా కుండే కృతజ్ఞతవల్లనే మేమీ కార్యమును సాధిస్తున్నాం."

ఎమిల్ తన దుస్తులలో ఠీవిగా అత్యున్నత అధికారి ఎదుట నిలబడ్డాడు. అధ్యక్షుడు గొట్వాల్డు అభిమానంగా అతనితో కరచాలనంచేసి 5000 మీటర్ల పందెంలో ఒలింపిక్‌లో ఎమిల్ విజయాన్ని తానెంతగా ఆ కాంక్షించాడో జ్ఞప్తికి తెచ్చాడు.

ద్రవించిన హృదయంతో, హెచ్చిన ఆత్మవిశ్వాసంతో, ఎమిల్ రాష్ట్రభవనం నుండి బయటకు వచ్చాడు.

ఎమిల్ మంచి ఆటగాడు మాత్రమే కాదు; పనిమీద మంచి శ్రద్ధ, ఒక వంక కాలాన్ని హరించే ట్రెయినింగు అవుతూ, తన ఆఫీసు పనిని సక్రమంగా చేసేవాడు.

అలాంటి ఆదర్శ యువకుడు పందేలలో పాల్గొనుటేకాక ప్రజాహిత జీవనంలో పాల్గొనవలసి వచ్చింది. జాతీయ ఉత్సవాలకు ఆహ్వానాలు వచ్చాయి. శాంతిసభకు ప్రతినిధిగా పంపబడ్డాడు. లాంఛనానికి ఏర్పాటు చేసిన 'రోడ్ రేసెస్'లో పాల్గొన్నాడు; రిలే రేసెస్‌కు బ్యాటన్‌ను తీసుకువచ్చే గౌరవం అతనిమీద మోపబడింది. యువక సంఘాలలో తన అనుభవాలనుగూర్చి ప్రసంగించేవాడు. స్కూళ్ళలో ఎప్పుడూ గౌరవనీయమైన అతిథే.

ఈ గౌరవపదవులు యీయనమీద ప్రజలకున్న గౌరవాన్ని తెలియజేస్తాయి. క్రీడారంగంలో యితనికి ఏర్పడిన ప్రతిష్ఠనుగూర్చి యివి చాటుతవి.

ఇన్ని గౌరవాలూకూడా యితని వినయానికి భంగం కలిగించలేదు. కాలహరణకు కారణాలయిన యీ గౌరవస్థానాలు, అతని ముఖ్యాదర్శమైన ఆటలనుండి అతని మనసును మరల్చలేదు. ఎక్కడికి వెళ్ళినా అతనిని చుట్టుముట్టే యువకులు, యువతులు - అతని అనుభవాలనుగూర్చి అడిగేవారు. వారందరికీ అతడు ఆదర్శం.

**1949** వసంతంలో ఒక చిన్న పందెంలో పాల్గొన్నాడు. అనుకోకుండా అతని కిదొక మరపురాని ఘటన. ఏమయిందో ఊహించగలరా? తన జీవితంలో ఎన్నో బహుమానాల నందుకున్నాడు పతాకలు, అద్దాలు, గ్లాసులు మొదలైనవి.

వీటిలో చాలావరకు అతను ఉపయోగించలేదు. వాటన్నింటినీ స్నేహితుల కిచ్చేవాడు. ఈసారి మొట్టమొదటిసారి ఒక పుస్తకం బహుమానంగా వచ్చింది.

అధికారరీత్యా ప్రేగ్ నగరం బయటికి పోవలసివచ్చింది. అందుచేత అడవులలో కాని, రోడ్డుమీదకాని 'ట్రెయినింగ్'య్యేవాడు. స్థానికంగా ఉన్న పిల్లలు వారి బైసికిళ్ళమీద అతనితో పోయేవారు. నిజంగా పరుగెత్తాలంటే అడవిలోనికి దూరంగా పోయేవాడు. తిరిగి చీకటిపడిన తర్వాతే వచ్చేవాడు.

ఆటస్థలంలోనే ట్రెయినింగవ్వాలంటే గుంపులుగా పిల్లలు అక్కడ చేరేవారు. వారినిచూచి ఎమిల్ పారిపోయేవాడు కాదు. వారందరూ తననుచూచి నేర్చుకుందామని వచ్చినవారని అతనికి తెలుసు.

"వానితో నేను మాట్లాడగలనంటావా" అని పిల్లలు ఒకరినొకరు అడిగేవారు.

"తప్పకుండా నీవేమడిగినా జవాబుచెబుతాడు. ఇతర తారలవలె గర్వపోతు కాడు."

భయంగా ప్రారంభిస్తారు. ఎమిల్ అప్పుడే వేగంగా పరుగెత్తి ఊపిరితీసుకోవడానికి నెమ్మదిగా పోతూండి ఉంటాడు. అనుకోకుండా అతనితో వస్తాన్నట్టు ముందొకడు, తరవాత యిద్దరు, తరవాత ముగ్గురు ఆలని ప్రక్కన చేరుతారు. వెంటనే తనేవచ్చి కూర్చుంటానని ఎమిల్ అనడం అదే సంజ్ఞ అక్కడున్న పిల్లలందరూ చుట్టూ చేరడానికి.

వారిలో చాలామంది ప్రారంభదశలోనివారు: మనస్సులు నిశ్చయంచేసి కోనివారు, చేసికొన్నవారు; కొన్ని పందేలలో అప్పుడే పాల్గొన్నవారు. ఈ యువకులు అనేక అడ్డుప్రశ్నలు వేసేవారు. అన్ని ప్రశ్నలకు శాంతంగా, స్పష్టంగా, జవాబు యిచ్చేవాడు అతని సహజ ధోరణిలో. "రోడ్ రేసు ఛాంపియన్ షిప్పు లంటే నీ కిష్టం లేదట నిజమేనా?" అని వెనకనుండి ఎవరో ప్రశ్న.

"అవును; ఇవి ప్రమాదకరం. ఒక నెలరోజులు పూర్తిగా ట్రెయినింగవ్వాలి రోడ్లమీద దానివల్ల ఆటలరుతువులో మరేపనికీ అవకాశముండదు. అందుచేతనే యీ పందేలు 'మే' నెలనుండి ఆరురాలకాలానికి వాయిదాపడినవి."

"వీటిలో మీరెప్పుడైనా పాల్గొంటారా ?"

"తప్పకుండా, ఎప్పుడో ఒకప్పుడు బెల్జియంలో 'స్పా' పట్నంలో, ఒకసారి రోడ్డుపందెంలో పరుగెత్తినాను. రోడ్డు అతికఠినంగా రాతిలావుంది. గెలిచి ఎలాగయితేనేమి బయటపడ్డాను. ఒకసారి భరించిన యీ కష్టం మరొకసారి భరించుట కేమి? కాని సిద్ధాంతరీత్యా యీ పందేలకు నేను వ్యతిరేకిని."

"జటోపెక్ గారూ! 5000 మీటర్ల పందేనికి తయారయ్యేఉత్తమమార్గమేది?"

"ఎవర్ని తయారుచేయుటకు ?"

"నన్నే"

"5000 మీటర్ల పందెం నీవే పరుగెత్తాలనా ?"

"అవును, నాకు అభిలాషగాఉంది; నీవాదూరం పరుగెత్తినావని నాకుకూడా ఆశగాఉంది."

"నా ప్రియమైన యువకుడా! ఇంకా చాలాకాలం నీవు వేచిఉండాలి. కొన్ని వయసులలోనే కొన్ని ఉత్తమ ప్రదర్శనల నిచ్చుటకు అర్హత ఏర్పడుతుంది. చిన్న దూరాలు 22 వ ఏట; మధ్యరకం 26 వ ఏట; ఎక్కువ దూరాలు 30 వ ఏట. శరీరతత్వం ఆయాప్రయాసలకు, ఆయావయసులోనే అనుమతిస్తుంది అనుకూలవడుతుంది. బహుదూరాలకు ప్రయత్నిస్తే నీశక్తిని వృధాగా వ్యయంచేస్తున్నావన్నమాట. నీ 'వేగం' తగ్గిపోతుంది. నీలోనున్న యువకాగ్ని అకాలంలో నుసిఅయిపోతుంది. నీ స్వాభావిక శారీరక అభివృద్ధిని నీవాటంకపరచినవాడవవుతావు."

"అయితే, నన్నేమి పరుగెత్తమన్నావు."

"నీవు తక్కువ దూరాలతో ప్రారంభించాలి. అన్నిటికన్నా ముఖ్యం 'వేగం'; తరువాత నిబ్బరం, తరవాత ఓర్మి."

"5000 మీటర్ల పందేనికి ఏ వయస్సులో ట్రెయినింగు ప్రారంభించాలి?"

"పరుగు పందెగాడు 1500 మీటర్లు 4 నిమిషాలలో పరుగెత్తగలిగినప్పుడు, 5000 మీటర్లకు ట్రెయినింగ్ ప్రారంభించవచ్చు. లేకపోతే, దూరపు పందేలలో మంచి 'వేళల' ను సంపాదించుట దుర్లభం. 800 మీటర్లను 2 నిమిషాలలో పరుగెత్త గలిగినప్పుడే 1500 మీటర్ల ప్రయత్నం చేయవచ్చు. అవసరమైన వేగాన్ని సాధించ లేనప్పుడు దూరపందేలకు దిగకూడదు."

"ఓర్మికొరకు ప్రత్యేకంగా ట్రెయినింగు పొందాలా?

"అంటే ఏమిటని నీ భావం. పూర్వం ఎన్నో కిలోమీటర్లు వరుసగా పరుగెత్తితే అది ఓర్మికి తార్కాణమనేవారు. ఈనాడు నాకు కావలసింది ఎంతసేపు ఓర్వగలను అనేదికాదు; గమ్యస్థానం ఎంత త్వరగా చేరుకోగలను అనేదే. అందుచేత, పందెపువేగం ఎంతసేపు నేను నిలపగలననేదే ప్రశ్న. 100 మీటర్లు అనేకసార్లు 15 సెకండ్లలో పరుగెత్తగలిగితే, 800 మీటర్లు 2 నిమిషాలలో పరుగెత్తగలనన్నమాట. 1500 మీటర్లు 3 నిమిషాల 45 సెకండ్లలో పరుగెత్తగలనన్నమాటకూడా! అందుచేత వేగం ఎంతసేపు ఓర్వగలమనేదే పందెంలో అంత్య ఫలితాన్ని చేకూర్చగలదు. అందువల్లే ట్రెయినింగులో యీ విషయం దృష్టిలో ఉంచుకోవాలి.

"మధ్యరకం పందేల ట్రెయినింగుకు, దూరపుపందేల ట్రెయినింగుకు గల భేదమేమిటి?"

"మైలుదూరం పరుగెత్తేవాడు శరీరాన్ని అట్టేబాధ పెట్టనవసరంలేదు. వాని 'ట్రెయినింగు' వేగంమీద కేంద్రీకరించాలి. చిన్నదూరాలు వేగంగా పరుగెత్తుట అలవాటు చేసుకోవాలి.

ఒలింపిక్‌లో 4 వ స్థానంవచ్చిన మన 'సివోనా'తో ట్రెయినింగు కావాలంటే 200 మీటర్లు పరుగెత్తుతూండాలి. ప్రతిసారి 'సివోనా'యేనాకన్న త్వరగా పరుగు పూర్తి చేస్తాడు. కాని ఆ దూరం నేను రెండురెట్లు ఎక్కువసార్లు పరుగెత్తాలి."

"అయితే ఎక్కువదూరపు పరుగుపందెపు ట్రెయినింగు చాలా కష్టమన్న మాట ?"

"అవును. దూరం పరుగెత్తేవాడు, తన శరీరశక్తిని ఎక్కువగా ఉపయోగించాలి. 'స్ప్రింటర్', 'జంపర్', 'త్రోయర్' పందేనికి ముందు కొన్నాళ్లు నెమ్మదిగా విశ్రాంతి తీసుకోవచ్చు. సమయంవచ్చేసరికి బేటరీలలో ఎలక్ట్రిసిటీ తయారయినట్టు, వారి శరీరాలు తయారుగా ఉంటాయి. బహుదూరం పరుగెత్తేవాని శరీరం అకస్మాత్తుగా అలవాటు తప్పినట్లు ప్రవర్తిస్తుంది. అవసరం వచ్చినప్పుడు మోసంచేస్తుంది. మేరథాన్ పందేలలో పరుగెత్తేవారు చివరినిముషంవరకూ ట్రెయినింగు విడువకూడదు."

"నీవుకూడా ఎక్కువదూరాలు పరుగెత్తుతావా ?"

"ప్రస్తుతం కాదు. నావేగం తగ్గిపోతుందేమోనని భయం. ఒకసారి 'వేగం'పోతే మరల సంపాదించుట కష్టం."

"నీ ట్రెయినింగు ఏర్పాటు చేసుకొనేపద్ధతినిగూర్చి చెప్పగలవా ?"

"సంతోషంగా చెబుతాను, కాని ఆ పద్ధతిని అనుసరించకండి. ఎందుచేతనంటే నాపద్ధతి ఎవరైనా అలసట చెందిస్తుంది."

"సునాయాసంగా పరుగెత్తుట నేర్చుకోవాలి. అడవి ప్రదేశంలోగాని, పచ్చిక బయళ్ళలోగాని, 1000 మీటర్లు పరుగెత్తుట కలవాటుపడాలి. 100 మీటర్ల దూరం పరుగువేగం క్రమంగా ఎక్కువచేస్తూ పరుగెత్తాలి. నెమ్మదిగా బయలుదేరి మధ్యలో వేగం అధికంచేసి, చివరకు వచ్చేసరికి వేగం అత్యధికంచేయాలి.

"నా విషయంలో నేను సంవత్సరం సంవత్సరం నాపద్ధతి మార్చివేస్తూంటాను. వెనుకటి సంవత్సరపు అనుభవాల ననుసరించి నేను పద్ధతులను మారుస్తూంటాను. ముఖ్యమైన విషయం తక్కువదూరపు పరుగులా? ఎక్కువదూరపు పరుగులా ? అనే దానిమీద ఆధారపడి ఉంటుంది నా ట్రెయినింగు. అది కాకుండా శీతోష్ణస్థితిమీద కూడా ఆధారపడి ఉంటుంది. అదే నిర్ధారణచేస్తుంది 400 మీటర్ల ట్రెయినింగా, 200 మీటర్ల ట్రెయినింగా అనేవిషయం.

"నా ట్రెయినింగు ప్రారంభించేముందు, నేనెంత ఓర్వగలననేది నిర్ధారణచేసుకొంటాను. ఉదాహరణకు; 100 మీటర్లు పదిసార్లు; 200 మీటర్లు 10 సార్లు; 400 మీటర్లు 6 సార్లు; మధ్యమధ్య వేగం అధికంచేసే ఘట్టాలుకూడా ఉంటవి. కాలం వెళ్ళినకొలదీ, నా ఓర్వగలిగిన శక్తికూడా అధికమవుతుంది. అందుచేత నా ట్రెయినింగు కఠినంచేస్తాను. అలాగ, రెండువారాలు చేస్తాను. పందేనికి ముందు వారం, రోజువిడచి రోజు మాత్రమే నా 'ప్రాక్టీసు'. పందేనికి ముందు ఒకటిరెండు రోజులు విశ్రాంతితీసుకుంటా. పందేనికి ముందు సాయంత్రం, సరదాకి నెమ్మదిగా పరుగెత్తుతాను; వీలయితే ఏ మార్గంమీద పందెం జరుగుతుందో దానిమీదే. మానసికంగా సిద్ధమగుటకు మాత్రమే. పరుగుమీద దృష్టి ఉండదు. సరదాకు, ఖులాసాగా చేసేపనియిది. మర్నాడు పందెంలోకూడా మనసు ఖులాసాగా ఉంటుంది.

"పందేనికి యిట్టి సంసిద్ధత యీ విధంగా తయారగుట చాలా ముఖ్యమని నా అభిప్రాయం. హైజంపు చేస్తూ ఒకడు కాలువిరుగకొట్టుకొనుట నాకు తెలుసు. ప్రతిరోజూ కుంటుకుంటూ ఆటస్థలానికి పోయేవాడు 'బార్' ఎత్తైనస్థలంలో పెట్టే వాడు. అన్నివైపులనుంచి పరికించి చూసేవాడు. అతనిస్నేహితు లతనిని పిచ్చివానిగా కట్టేరు. కాని, తన కాలు బాగవగానే ఆ ఎత్తును మొదటిప్రయత్నంలోనే సాధించాడు."

"ప్రతిపందేనికి ముందు ఎక్కువగా పరుగెత్తుతావా ?"

"నేను చాలాసార్లు పరుగెత్తుతాను; 5, లేక 6 సార్లు వేగం అధికంచేస్తాను. కొంత వ్యాయామం చేస్తాను."

వ్యాయామం ఎలా చేస్తాడో లేచి నిలబడి చేసి చూపించాడు.

"త్వరితంగా చేయుటవల్ల వళ్ళు వేడెక్కుతుంది. ఆరోగ్యం దృష్ట్యా యిది చాలా ఉపయోగం. అవయవాలు సరియైన స్థితిలో ఉంటాయి. పందెం మధ్య ఏ అవయవమైనా అవసరమైన పనికి జంకదు. అన్ని విధాలా ఉపయోగపడుతుంది. మోటారు బైసికిల్ ఏక్సిలరేటర్ నొక్కేముందు వేడెక్కాలికదా ! మానవయంత్రానికికూడా యిది అవసరం. ఇది బలాన్ని అనవసరంగా వ్యయంచేయదు."

"నీకు ఊపిరితీసుకోవడానికి అవసరముండదా ?"

"అది నాకు తెలియదు. వేగంగా పరుగెత్తుతే నీ కండలకు ఎక్కువ 'ఆక్సిజెన్' కావాలి. ఊపిరి పోయినట్టనిపిస్తుంది. ఈ స్థితి స్వాధీనంలోకివస్తే అవయవాలన్నీ యథాస్థితికివచ్చి పనిచేస్తవి. కాని మంచి ట్రెయినింగుపొందినవారికి యీ అవస్థ రానేరాదు.

"కొంతవరకు భయమే దీనికి కారణం. రక్తనాళాలు బిగుసుకుపోతాయి; రక్తం ప్రవహించవలసినంత వేగంతో ప్రవహించదు. కాస్త ఓర్వగలిగితే, యిది ప్రమాదంకాదు. అందుచేతనే ఒకేరోజు రెండు పందేలలో పాల్గొనేవాడు, రెండవ పందెంలో ఎక్కువ జయప్రదంగా పరుగెత్తగలడు, ముఖ్యంగా అది అంత విలువైన పందెం కాకపోతే."

"పరుగుప్రారంభంలో భయంగా ఉంటుందా నీకు?"

"నిశ్చయంగా, ముఖ్యమైన పందెమయితే నా కెంతో భయంగా ఉంటుంది. కాని ఆ విషయం నా ప్రత్యర్థులకుమాత్రం తెలియనీయను. రాబోయే ఆయాసం, అలసట, బాధ మనుష్యులను క్రుంగతీస్తాయనటానికి సందేహ మేముంది ? కష్టమైన పందెంలో పందెగాడు బాధపడతాడు. సందేహంలేదు. ఈ బాధలన్నీ, మనో నిశ్చలతవల్ల జయించగలవాడే, రికార్డులు భగ్నంచేస్తాడు; విజయాన్ని సాధిస్తాడు. అవన్నీ పందెం ప్రారంభమయినంతవరకే. పందెం జరుగుతూన్నంతకాలం అన్ని బాధలు మరచిపోతాం; అన్ని తలపులు పందెంమీదే నిలబడిఉంటాయి."

"అలాంటి పెద్దపందెంలో పరుగెత్తాలి. రాక్షసిలాగ ప్రారంభంనుంచి పరుగెత్తుతా" అన్నాడొకడు.

"మొదటే కొన్ని గజాలవరకు అతివేగంగా పరుగెత్తకూడదు. అలా చేస్తే అది ప్రాథమికంగా పొరబాటుగా పరిణమిస్తుంది. నీ మెదడు నిర్మలంగా ఉండాలి. ముందే వేగంగా పరుగెత్తుటవల్ల ప్రమాదం కలదు. మొదట్లోనే నీ శక్తిని ఉపయోగించేస్తే, చివరకుండవలసిన బలం మధ్యలోనే ఆహుతి అయిపోతుంది. ఒక్కొక్కప్పుడే, కొన్ని పరిస్థితుల్లోనే మొదటే వేగంగా పరుగెత్తుట అవసరమవుతుంది. అప్పటికికూడా దానివల్ల నష్టాలు లేకపోలేదు."

"ఆఖరుఘట్టంలో పరుగెత్తే పద్ధతేమిటి?"

"కొందరు 'స్ప్రింటు' పందెగాళ్లున్నారు. మొదటినుంచి చివరవరకు వేగంగా పరుగెత్తేవారున్నారు. "స్ప్రింటర్లు" ఆడంబర ప్రియులు. నాంవటి వేగప్రియులు, ప్రత్యర్థులను లెక్కచేయకుండా, అందమైన ఫలవంతమైన ప్రదర్శన లివ్వగలరు. స్ప్రింటు పరుగుదారులలో సత్తువను బయటకు లాగుట కెవరైనా ఉండాలి. మావంటి వారికి, 'స్ప్రింటు' దార్లకు పోటీవస్తే, వీరు మొదట ప్రారంభించిన వేగ గమనం చివరవరకు నిలుపుకోగలరా అనేదే ప్రశ్న."

"మీ జీవనపద్ధతులనుగూర్చి ఏమైనా చెప్పగలరా? మీ కేమైనా నియమాలున్నాయా?"

"సులువుగానే చెప్పవచ్చు. మత్తుద్రవాలు ప్రమాదకరం. అప్పుడప్పుడు ఒక గ్లాసు పుచ్చుకుంటాం, అంతగా అవసరమైతే. నేనసలు పొగత్రాగను. పొగ త్రాగుడు ఎందుకు ప్రమాదకరమో డాక్టర్లు చెబుతారు. నేను చెప్పనవసరంలేదు.

"అన్నింటికంటె ముఖ్యం నిద్ర. నియమంగా నిద్రపోవాలి. నేను మామూలుగా, రాత్రి 9, 10 మధ్య నిద్రపోతాను, ప్రొద్దున 5, 6 మధ్యలేస్తాను. కష్టమైన పందేనికి ముందు 10 గంటలు నిద్రపోతాను.

"ఇంక తినుట, త్రాగుట: ఆకలివేసినంత తినుట, దాహంవేసినంత త్రాగుట. ఒకసారి డాక్టర్లసలహావల్ల ఆకలిదప్పుల కారణంగా చనిపోవలసినవాణ్ణి. ఆలోచించి చూస్తే లేళ్ళు, కుక్కలు, చెవులపిల్లులు, ఏ ఆహారం తమ ఆరోగ్యానికి మంచిదా అనే ఆవేదన చెందవు. అయినా మనుష్యులకంటె అవి ఎక్కువవేగంగా పరుగెడతాయి."

"పందేనికి ముందు మీరు భోంచేస్తారా?"

"పందెం ప్రారంభమవుతుందనగా భోంచేయకూడదు. కాని నేనుమాత్రం యీ నియమానికి వ్యతిరేకంగా చాలాసార్లు ప్రవర్తించాను. అయినా, దానివల్ల నేనేమీ దుష్ఫలితా లనుభవించలేదు. బహుశః నాకడుపు చాలాబలమైన దనుకుంటా.

"నేను 'ఏకాడమీ'లో చదువుతూన్నప్పుడు ఉదాహరణకు చెబుతున్నా: 7-9 ఘంటలమధ్యనే నేను ట్రెయినింగు అవగలిగాను; అంటే రాత్రి భోజనానికి, 'బ్యూగిల్' పిలుపుకు మధ్యవ్యవధిలో నన్నమాట. నేను దానికి అలవాటుపడిపోయాను. అప్పటినుంచి పందేలకు ముందు ఆహారం నన్ను బాధించలేదు. కాని ఆరోగ్య కారణాలవల్ల యీ పద్ధతి నిరాకరించాలి.

'బ్రిటానియాషీల్డు' పోటీలకు నేను లండన్‌లో నున్నప్పుడు పందేనికి ముందు మాకు భోజనం పెట్టేరు. పందెం పూర్తి అయినతర్వాత చాలామంది పోటీచేసినవారు కడుపునొప్పని ఫిర్యాదుచేశారు. కాని నాకేమీ బాధ అనిపించలేదు.

"ఒకసారి దక్షిణాన మమ్ముల నాహ్వానించినవారు పోటీలమధ్య ఫలాహారాల విందుచేశారు. నా పందెం మరో అరగంటకు ప్రారంభం కానున్నది. ఆ రుచికరమైన అందమైన ద్రాక్షపండ్లకొరకు ఒక గంట వేచిఉండాలి. ఈ లోపుగా నా మిత్రులు అవన్నీ కాజేసేవారే. ఈ ద్రాక్షాలంటే నా కెంతో ప్రీతి. అందుచేత పందెమంత దగ్గరున్నా, నా కిచ్చిన ద్రాక్షపండ్లన్నీ త్వరగా మింగివేశాను. మామూలుకన్నా ఎక్కువ చెమటపోసింది. దానికి కారణం నా శరీరంలో ఎక్కువగా నీరుండుట. అదృష్టవశాత్తు అది చాలా సులభమైన సునాయాసమైన పందెం.

"ఈ విషయం యింకా స్పష్టంచేయాలి; ఏ పందెముగురించి అయినా నేను ఆతృతగా ఉన్నట్లయితే, 5 గంటలు ముందుగా తినడం ఆపివేస్తాను."

"ఎమిల్ ! యింత ఆత్మనిగ్రహం నీ కెలా అలవడింది ?"

"అది కాలంతో క్రమంగావస్తుంది. కాని, వెంటవెంటనే అద్భుతాలు సాధిద్దామని బయలుదేరకూడదు. ఏవ్యక్తి అయినా లేనిస్థాయినందున్నవానినే చేయుటకు పూనుకోవాలి. చిన్నచిన్న కార్యాలను సాధిస్తూ, చివరకి పెద్దవి సాధించవచ్చు. ఒక్కొక్కప్పుడు యీ సాధన విసుగ్గాయంగా ఉంటుంది. ట్రెయినింగు విడవకుండా చేస్తూంటే ఆ ట్రెయినింగు క్రమంగా తీవ్రతరంచేస్తే మనసును స్వాధీనం చేసికొనేశక్తి విజృంభిస్తుంది. అప్పుడు ఎంత కఠినకార్యాలైనా చేయగలుగుతారు. ఆలసట, ఆయాసం బాధపెట్టవు. ఈ విధంగా శరీరాన్ని లొంగతీసుకొనకపోయినట్లయితే మానసికశక్తిని అభివృద్ధిచేసికొనకపోయినట్లయితే ఏమీ సాధించలేరు."

"ఎమిల్ ! నీ ఫక్కీనిగూర్చి కొంత తెలియజేయి."

నెమ్మదిగా చీకటి నీడలు సాయంకాలపు వెలుతుర్ని మింగివేస్తున్నవి. ఇంటికి పోదామని ఎమిల్‌కు ఆతృతగాఉంది. అయినా ప్రశ్నలడుగుతున్న యువకులకు జవాబులు చెప్పుట మానలేదు. ఆతని మాటలను, వారందరూ వేదవాక్కులలాగ పరిగణిస్తున్నారు.

"ప్రదర్శనయొక్క బాహ్యస్వరూపం 'స్టెయిల్'. ఏదైతే మీరు మీకళ్ళతో చూడగలరో అది. స్టెయిల్‌నుబట్టి పందెగాడిసత్తా నిర్ణయించుట న్యాయంకాదు. 5 కిలోమీటర్లు యిద్దరు పరుగెత్తుతున్నారనుకోండి; ఒకనిది మంచి స్టెయిల్, రెండవవానిది చెడ్డస్టెయిల్. అందులో ఒకడు ఆకస్మికంగా, పరుగుగమనం అధికంచేసి 50 మీటర్లలో గెలిచాడనుకోండి. వాని విజయానికి కారణమేమంటారు? బాహ్యంగా కనబడే స్టెయిల్ కారణమా, లేక ఆతనిలో అంతర్భాగమైన మంచిలక్షణాలా ? చెడ్డ స్టెయిల్‌వాడే యీ విజయం పొందేడనుకోండి. సనాతనమైన, ఉత్కృష్టమైన స్టెయిలున్నవాడు ఎన్నిసార్లు ఓడిపోలేదు. నా స్టెయిల్ అందంగా ఉండదని ఎంత

మంది నన్ను నిందించలేదు! పందేలు, జయాపజయాలు, సౌందర్యాన్ని అనుసరించి నిర్ణయిస్తామని ప్రకటిస్తే, అప్పుడు నేను స్టైయిల్‌లో అందాన్ని అలవరచుకుంటాః ఎన్నాళ్ళు, వేగం ప్రాధాన్యం వహిస్తుందో, అన్నాళ్లు వేగాన్ని సాధించుటే నా పరమావధి.

"అయినా అనేక సంవత్సరాల ట్రెయినింగువల్ల, స్టైయిల్‌లో ఉండే ఉత్త మాంశాలను, ఎవరైనా గ్రహించగలుగుతారు. ఏ కదలికలవల్ల కాలం వృధాఅవు తుందో వానిని త్యజించవలసిందే. అందుచేత దీనినిగూర్చి మీ రెక్కువగా బాధపడ కండి - నేను ప్రారంభించినప్పుడు, నన్నుగూర్చి యిలాగే అనేవారు. "ఈతని తీరు నిష్ప్రయోజనం. గొప్పపరుగు పందెగాని లక్షణాలు యితనిలోలేవు.' తర్వాతనేను రికార్డులు భగ్నంచేస్తూ పోయేసరికి, వారే యిలా అన్నారుః అవును 'అదేపద్ధతి, జటో పెక్‌ను ఆదర్శంగా భావించాలి.'

"ఏమయినా, పరుగులవిషయంలో సిద్ధాంతీకరించుట ఎక్కువగా అనవసరమని నా అభిప్రాయం.

"పరుగెత్తుట మానవసహజమైన స్వభావం. నీవు ఉత్తముడని అనుకొన్న విధంగా పరుగెత్తు. ఎప్పుడూకూడా ఇదొక సునాయాసమైన కార్యక్రమనే భావం తోనే ఉండు. పందేలుకూడా పరుగెత్తుట నేర్చుకొనే పద్ధతే యిది.

సిద్ధాంతాలు ఎక్కువైతే మనసును కలవరపరుస్తాయి. తప్పు చేసేస్తామేమో అనుకొనేవారు, ఏమీ చేయకుండా సిద్ధాంతాలనువల్లిస్తూ యింటివద్దనే ఉండిపోతారు."

పిల్లలందరు గొల్లున నవ్వేరు. ఎమిల్ జవాబులు వారిని నవ్వించాయి. వారికి నచ్చేందుకు యింకా ఉదాహరణలిస్తూ యిలా అన్నాడుః

"నిజమే, సిద్ధాంతాలపరవంవల్ల ఒక్కొక్కప్పుడు, ప్రజ్ఞావంతులుకూడా ఫలితాలను అందలేకపోయారు. తన కాళ్లు ఎక్కువబరువును మోయవలసివస్తుందని తేలికగా అయిపోయేందుకు ప్రయిత్నించాడొకడు. దానికి త్రాగుట పూర్తిగా మానివేశాడు. దీనివల్ల కడుపులో వికారం పుట్టయిలుదేరితే, డాక్టర్‌దగ్గరకు వెళ్ళేడు. ఈతని సిద్ధాంతాన్ని డాక్టర్ తెలిసికొని ఏమిజరిగిందో నిశ్చయించాడు. రోజుకు రెండులీటర్ల నీరు త్రాగమన్నాడు. వారంరోజులలో బాగున్నాడు.

మరొకడు 800 మీటర్ల పందెం 2 నిమిషాలలోపుగా గెలవాలంటే 6 కిలోల బరువు తగ్గాలని నిశ్చయించాడు. తగ్గాలన్న బరువులో సగం తగ్గేసరికి 800 మీటర్ల పరుగెత్తుటకు 2 నిమిషాల 10 సెకండ్లు పట్టింది. అంతకుముందు 2 నిమిషాల 05 సెకండ్లలోనే పరుగెత్తేవాడు."

"నీ అంగలు చిన్నవని అంటారుకదా ?"

"అవును, నిజమే. పెద్దవిగా ఉంటే బాగుండేది. అయినా, దూరాన్నిబట్టి ఉంటుంది. స్ప్రింటరు తన శక్తినంతా ఒక్కసారే ఉపయోగిస్తాడు. కాని దూరం ఎక్కువైనప్పుడు, వేలకొలది అడుగులు వేయవలసినప్పుడు అంతశక్తిని ఒక్కసారి

ఉపయోగించలేను నేను. మేరథాన్ పరుగులో అడుగు భూమిమీదనుండి ఎత్తేసే ఎత్తరు. ఊపిరి జాగ్రత్తగా బిగపట్టి, స్వీయశక్తిని లోభివలె ఉపయోగిస్తారు."

చీకటిపడింది. వాతావరణం సుహృద్భావపూరితంగా ఉంది. పిల్లలు ఎమిల్ చుట్టూ కూర్చొనే ఉన్నారు; పెద్దన్న విదేశాలనుండి వస్తే ఉన్నట్టుంది వారందరికి. ఎన్నో విషయాలు తెలుసుకోవాలన్న వారి ఆసక్తి హృదయపూర్వకం. ప్రతివానికి ఏదో తెలుసుకోవాలన్న జిజ్ఞాస.

"తిన్నని మార్గానికి ఎంత వేగంతో ట్రెయినింగు అవుతావు?"

"ఆ( అదీ విషయం. అదే నాకు తెలియదు. దానిమీద నాకు దృష్టిలేదు. నేనొక అసిస్టెంటును పెట్టుకొనుటకు నావద్ద ధన మధికంగా లేదు. నావద్ద ఒక 'స్టాప్‌వాచ్' అయినా లేదు. వేగంగా పరుగెత్తడమే కాని ఎంతవేగ( మనేది లేదు. పందెపువేగంతోనే పరుగెత్తుతాను. ప్రతిపందెగానికి ఎంతవేగంగా పోవాలో లోలోన తెలుస్తుంది. నా సత్తువకొద్దీ పరుగెత్తుతే వేగం క్రమక్రమంగా హెచ్చు తుంది. నీవు డబ్బు దాచాలంటే యిదివరకు బ్యాంకులో ఎంత డబ్బు వేశావో ప్రతి సారీ చూడడంకాదు; వీలైనప్పుడల్లా వీలైన ప్రతీపెన్నీ, బ్యాంకులో వేస్తూండడమే. అవసరమైనప్పుడు ఎంత డబ్బువేశావో లెక్కించుకోవచ్చు. పందెములలో కూడా అంతే".

"నీవు చాలా పందేలలో పాల్గొంటావని, అందువల్ల నీ ఆరోగ్యానికి ప్రమాద మని పత్రికలలో వ్రాస్తారే ?"

"అదొక దురభిప్రాయం. పరుగుపందేలలో వారాని కొకసారి లేక రెండుసార్లు 10 కిలోమీటర్లకంటె ఎక్కువ పరుగెత్తను. కాని ప్రతిరోజూ ట్రెయినింగవుతాను; అప్పుడు 3 రెట్లధికంగా పరుగెత్తుతాను. పరుగుపందేలు నాలో శక్తిని క్షీణింపచేస్తాయి. అప్పుడు నాకు ట్రెయినింగుకు తగినవేళ ఉండదు. ట్రెయినింగే నన్ను మంచి తయారీలో ఉంచుతుంది. ట్రెయినింగులో పందెంలోకంటే నన్ను నేను ఎక్కువ కష్టపెట్టుకుంటాను. నా కండలకు ఎక్కువ అలసట కలిగించాలి.

"గ్లైకోజెన్" అంటే ఏమిటో తెలుసా ? శారీరకబలంయొక్క మూల స్థానం. కారుకు పెట్రోలు ఎలాగో, అలాగే శరీరంలోని కండలలో యిది యిమిడి ఉంటుంది. కండకు పని తగిలిందంటే, గ్లైకోజెన్ ఆహుతి అయి పోతుంది. అప్పుడు దానిని శరీరం మళ్ళీ సృష్టించుకోవాలి; యీసారి ఎక్కు వగా. పని లేకుండా ఉన్న శరీరావయవాల్లో యీ గ్లైకోజెన్ క్షీణిస్తుంది. ట్రెయినింగ్ నిరంతరంగా జరుగుతూంటే, గ్లైకోజెన్ ప్రవాహపు వేగం అధికంగా ఉంటుంది. కండలు వానిని ఉపయోగిస్తాయి. పందేనికి ముందు కొన్నాళ్లు విశ్రాంతి తీసుకుంటే యీ ప్రవాహం తగ్గిపోతుంది. కాని అలవాటు ననుసరించి కొంతవరకు గ్లైయికోజెన్ సరఫరా జరుగుతూనే ఉంటుంది. అప్పుడు అలవాటు ప్రకారం పరు

గత్తాలనే ఒత్తిడి తీవ్రంగా బయలుదేరుతుంది. అలాగ, పందేనికి ఎంతో శక్తితో నీవు బయలుదేరుతావు. అందుచేత ఒక మహత్తర ప్రయత్నానికి ముందు, విరామం లేకుండా కొన్ని వారాలు ట్రెయినింగు కావాలి; ఆఖరు వారం తేలికగానూ, ఆఖరు రెండు రోజులూ పూర్తిగానూ విశ్రాంతి తీసుకోవాలి."

ఎలకలలాగ నిశ్శబ్దంగా ఎమిల్ చుట్టూ పిల్లలు కూర్చొనే ఉన్నారు. ఎమిల్ చెప్పినమాటలు వారికి ఆకర్షణీయంగా ఉన్నాయి. వారిని నిరాశనుండి, ఆశాభంగం నుండి తప్పించినవి. వారి గమ్యస్థానానికి వారిని త్వరగా తీసుకుపోతవి. ఒలింపిక్ వీరుడు సంపాదించిన అనుభవ జ్ఞానాన్ని వారికి ప్రసాదించాడు. వ్యాయామ అభివృద్ధిలో రహస్యాన్ని ఒక్కరోజులో వారు తెలిసికొన్నారు.

కృతజ్ఞతతో పిల్లలు లేచి ఎమిల్‌తో 'ట్రాము' వరకు వెళ్లారు. ట్రాము కారు వస్తూంది. ఓ పిల్లవాడు, ఎమిల్ విదేశాలకు పోయాడని జ్ఞాపకం వొచ్చి "నీవు ఫిన్లాండు, బెల్జియం, ఆస్ట్రేలియాలు వెళ్లేవుకదా!"

"అవును. ఆటగాడు ప్రజ్ఞ చూపినట్టయిన, ప్రపంచం కొంతవరకు చూడ గలుగుతాడు. అయినా, నీ ఉత్సాహానికి అది కారణం కాదనుకుంటా. ప్రతివాడు ఛాంపియన్ కాలేడు. అది అవసరంలేదుకూడా. అయినా అది ఆరోగ్యదాయకం కాదుకూడా! కాని అద్భుత ప్రదర్శనలవల్ల మీ దేశానికి మీరు ప్రతిష్ఠ సంపాదించ గలరు. అనేకమందిని మీ అడుగు జాడలలో నడచేటట్లు చేయగలరు. ఆ విధంగా దేశ ప్రజలు వృద్ధి పొందుతారు. అవునా, కాదా!"

వారందరూ సెలవు పుచ్చుకున్నారు. ఎమిల్ ట్రాములో కూర్చున్నాడు.

వారిలో అందరికన్నా చిన్నవాడు ట్రామ్ వెనక పరుగెత్తుతూ? "ప్రపంచ రికార్డు మాటేమిటి!" అని కేకవేశాడు.

ఆ క్షణంలో అందరికీ అదే చింత. అయితే "ప్రపంచ రికార్డు" విషయమై మన మెవ్వరం అడుగుట మరచా మెందుచేత?"

మెట్లమీద నుంచొని ఎమిల్ ఏదో అంటున్నాడు. స్పష్టంగా తెలియలేదు. చేతులతో సంజ్ఞలు చేస్తున్నాడు.

వాని అర్థం కొరకు చీకట్లలోకి చూస్తున్నారు ఆ పిల్లవాళ్లు, ఎమిల్ జవాబేమో తెలుసుకుందామని; కాని ఎమిల్ అప్పటికే చాలాదూరం పోయాడు.

# ఎమిల్ జవాబు

ఎమిల్ ఈ ప్రశ్న జ్ఞప్తియందుంచుకున్నాడు. ఈ ప్రశ్నే అనేకమంది ఆతని నిదివరకడిగారు.

1949 జూన్ 12 న ఒస్ట్రావాలో ఆర్మీఛాంపియన్‌షిప్ పందేలు జరుగుతున్నాయి. ఎమిల్ పరుగెత్తుతున్నాడు. 7 వ కిలోమీటర్లోమధ్యలో వేళలను ప్రకటిస్తూంటే, ప్రపంచ రికార్డును గూర్చిన ప్రశ్న యితని మెదడులో మెలగింది. మంచి తయారీలో వున్నాడు. ముందువారం 'వార్సా'లో 5000 మీటర్ల పందేన్ని గెలిచాడు; వేళ 14 నిమిషాల 10.8 సెకండ్లు. ఆ సంవత్సరానికి అదే కనీసవేళ. రికార్డులను భగ్నంచేసే ఉద్దేశం అతనికి లేదు. ప్రేక్షకులు ప్రశంసాపూర్వకంగా కేకలు వేస్తూంటే, తన "ఫారమ్"ను గూర్చి తనకు విశ్వాసం కలిగింది. శరీరం సంపూర్ణ స్వాధీనంలో ఉంది.

మొదటినుంచి తన శక్తినంతా ఉపయోగించి పరుగెత్తుతున్నాడు. ఎప్పుడూ ఖులాసాకు పరుగెత్తినట్టుగా పరుగెత్తేడు. ఎప్పుడూ వేళమీదే అతని దృష్టి.

"మధ్యవేళలు" ప్రకటించినప్పుడు ప్రోత్సాహకరంగా ఉన్నాయనుకున్నాడు. పందెం ఆనందంగా ఉంది.

7 వ కిలోమీటర్లో ఆతని మనస్సును నిశ్చయపరచే అవకాశం వచ్చింది. "ఎమిల్ జటోపెక్ ప్రపంచ రికార్డునే భగ్నంచేయవచ్చు" అనే ప్రకటన చేసే అధికారి మాటలు ఆతని చెవుల్లో పడ్డాయి. అదేకాకుండా హీనో వేళలకు, ఎమిల్ వేళలకు తారతమ్యంకూడా ప్రకటించాడు.

ప్రేక్షకులు ఊపిరి బిగబట్టి కూర్చున్నారు. ఒక్కసారి ఊపిరి విడిచారు. మొదట కొందరి కేకలు; అంతకంతకు ఉత్సాహం హెచ్చింది. నినాదాలు మిన్నుముట్టినవి. ప్రపంచ రికార్డు ఎమిల్ మనస్సులో ఆశను పరుగెత్తించింది. నిశ్చయానికి, దాని అమలుకు ఎమిల్ విషయంలో ఎంతో దూరం లేదన్న సంగతి అందరకు తెలిసిందే.

ఆతనిలో అంతర్భూతమైన శక్తినంతను ఒక్కసారి ఆతని నిశ్చయం పైకి ఉబికేటట్టు చేసింది. ఆతని కాళ్ల నొక నూతనశక్తి అతివేగంగా పరుగెత్తించింది. ఊపిరి లోతుగా తీసుకోవడం ప్రారంభించాడు.

స్టేడియం మూలలనుండి పిల్లలు "ప్రపంచ రికార్డు, ప్రపంచ రికార్డు, ప్రపంచ రికార్డు" అని కేకలు వేయుట మొదలు పెట్టేరు.

8 వ కిలోమీటరు చేరేసరికి మధ్యవేళ ఎంతో తెలిసికోడానికి ఎమిల్ ఆతురతపడ్డాడు.

"28 నిమిషాల 37 సెకండ్లు ! హీనోకంటె మంచివేళ."

9 వ కిలోమీటరు 3 నిమిషాలలో పూర్తిచేశాడు. ఆతని ఆత్మవిశ్వాసం హెచ్చింది. బలహీన మేకోశానా కనబడదు. ఏ బాధ, నొప్పి ఆతని వేగాన్ని తగ్గించుటలేదు.

ఆతని మనోనిశ్చయం ఆతనిని ముందుకు పరుగెత్తిస్తూంది. ప్రేక్షకులు ఆతనిలో విశ్వాసాన్ని కలిగి ఉన్నారు. వారంతా కేకలు వేస్తున్నారు; నినాదాలు చేస్తున్నారు; గాలిలో చేతులు విసురుతున్నారు. ఆతని కే అవాంతరం రాకుండుగాక అని ప్రార్థిస్తున్నారు. అశుభభావాలు పైకిరాకుండా అందరూ జాగ్రత్తగా ఉన్నారు. రాబోయే మహత్తర సంఘటనలో అందరూ భాగస్వాములు అనుకుంటున్నారు.

9 కిలోమీటర్లు, 26 నిమిషాల 36 సెకండ్లలో దాటి వేశాడు.

ఇంకా జాగ్రత్తగా ఉండాలి; ఆఖరు కిలోమీటరు దాటుటకు 3 నిమిషాలు పట్టిందంటే హీనో రికార్డుకు బయటుంటాడు; హీనో రికార్డు 29 నిమిషాల 35.4 సెకండ్లు. అంతకన్నా ఒక్క సెకండు ముందుగా గమ్యస్థానం చేరుకోవాలి. ఇది సాధించగలడా ?

ఎమిల్ ముఖంలో అపరిమితమైన ఆయాసం, ఆతని ఆంతరంగిక పోరాటం ప్రేక్షకులకు స్పష్టమవుతూంది. ఆతనిని ఉత్సాహపరుస్తున్నారు. ఈ క్షణంలో ప్రతి ష్టంతా పణంలో ఉంది.

ఎమిల్ పరుగెత్తుతున్నాడు; చివర వేగం అధికంచేస్తున్నాడు. గమ్యస్థానం చేరుకున్నాడు జయప్రదంగా ! స్టాప్ వాచీలు 29 నిమిషాల 28.2 సెకండ్లు చూపించినవి —అంటే పూర్వపు ప్రపంచ రికార్డును 7 సెకండ్లలో భగ్నమొనర్చాడు'

అతని యువక మిత్రుల కిత నిచ్చిన జవాబిది.

అధికార ప్రకటన చేసిన వ్యక్తి యొక్క వణకే కంఠస్వరం గాలిలోనుంచి ఈ విధంగా వినబడింది: "మిత్రులారా ! ఇదొక మహత్తర సమయం..." ప్రేక్షకుల కోలాహలంలో ఆఖరుమాటలు వినబడలేదు. ఎమిల్ 'మైక్' వద్దకు వచ్చినప్పుడే నిశ్శబ్దత; ఇంత స్నేహభావం కనబరచినందుకు ప్రజలకు కృతజ్ఞత తెలియజేశాడు. యువకుల నుద్దేశించి యిలా అన్నాడు:

"...నా అడుగు జాడల్లో నడచేది మీరే."

జెకోస్లావక్ ప్రపంచ రికార్డునుగూర్చి అంతర్జాతీయ క్రీడలసంఘం ఐ. ఎ. ఎ. ఎఫ్. కు అధికార పూర్వకంగా తెలియజేయబడింది.

వేసవికాలంలో నిర్బంధంగా చాలా రోజులు విశ్రాంతి తీసుకోవాలి. స్టాక్‌హోమ్‌లో ఒక పందెంలో సగందూరం పరుగెత్తినతర్వాత మోకాలులో నొప్పి బయలుదేరింది. ఎంతో ప్రయత్నంచేసి పరుగు పూర్తిచేసి, దుస్తులు మార్చుకొనే గదిలోనికి కుంటుతూ చేరుకున్నాడు. పందెపుగోజున శీతలవాతావరణం అధికంగా ఉండుటచేత, ఆతనికి బాధకలిగింది. కండర మొకటి దెబ్బతిన్నదని డాక్టరు చెప్పినాడు.

ఇంటికి విచారంతో చేరుకున్నాడు ఎమిల్. ఆటలకాలం జయప్రదంగా ప్రారంభమైనదని చాల సంతోషించాడు. కాని చివరి కిలాగవుతుందని అనుకోలేదు. రుమేనియా కెదురుగా 10,000 మీటర్ల పందెం 29 నిమిషాల 48 సెకండ్లలో జయప్రదంగా పూర్తి చేశాడు. కాని నొప్పి వచ్చినచోట 'హెయిమటోమా' చిహ్నాలున్నవి. 5000 మీటర్ల పందెంకంటే ఎక్కువ దూరపు పందెంలో పాల్గొనకూడదని డాక్టర్ల సలహా.

ప్రజలకు, ముఖ్యంగా క్రీడా ప్రపంచానికి యిది విచారం కలిగించే విస్మయ సంఘటన. ఎమిల్ ఇనప మనిషని అందరి అభిప్రాయం. దేనికయినా తయారని, ఎప్పుడూ గెలుస్తాడని, అతని కే ప్రమాదం జరగదని అందరూ అనుకుంటారు.

ఇప్పుడు మరి చేసేదేమీలేదు. 'రాసికీ మెమోరియల్' పందెంకూడా ఎమిల్ లేకుండా జరగవలసిందే.

ఫిన్లాండుతో అంతర్జాతీయ పందెం దగ్గరకు వస్తూంది. దీక్షాపరులైన ఫిన్నుల కెదురుగా నిలవవలసిన జట్టులో ఎమిల్ ఉంటాడా?

అతి జాగ్రత్తగా ట్రెయినింగవుతున్నాడు. ప్రమాదం జరగలేదు. దెబ్బ మానింది. యథాస్థితికి వచ్చాడు. ఇది శుభసూచకమే. జట్టులో ఆత్మవిశ్వాసం పెరిగింది. ప్రత్యక్షంగా అంతబలమైన దేశంతో పోరాటానికి దిగుట కిదే ప్రథమం. అందుచేత వీలయినంత బలమైన జట్టుతో పందేలకు వెళ్లాలని కోరిక.

ట్రెయినింగుకు వేళ ఎక్కువగా లేకపోయినా, ఫిన్లాండులో ఎమిల్ పరుగెత్తిన పందేలు ఆతని ప్రతిష్టను ఎక్కువచేశాయి. కాగా, ప్రపంచంలో బహుదూరపు పందెగాండ్రలో మొదటివాడన్న ఖ్యాతి చిరస్థాయిగా ఉండిపోయింది.

మేము ఫిన్లాండు చేరగానే చూచిన ప్రకటన పత్రాలవల్ల, ఎమిల్ ఖ్యాతి స్పష్టమయింది; అక్కడి ప్రజలు ఎమిల్ కొరకెంతగా నిరీక్షిస్తున్నారో కూడా బోధ పడింది.

"జటోపెక్ పరుగెత్తే ఆసు" అనే శీర్షికలు అంతర్జాతీయ పోటీని గూర్చిన ప్రకటనల్లో కనబడినవి.

మా జట్టు ఎక్కడికి వెళ్ళినా, ఎమిల్‌ను గూర్చి తెలిసికోవాలన్న కుతూహలం ప్రకటితమయింది.

ఆట వస్తువుల దుకాణాలలో ఫిన్నిష్ మేకులజోళ్లు కొంటున్నప్పుడు, భోజన శాలల్లో, ట్రాములలో, ప్రతిస్థలంలోనూ ఎమిల్ మా జట్టులో వచ్చాడని ప్రజలు వారి హర్షాన్ని తెలియజేశారు.

1952 ఒలింపిక్ ఆటల నేర్పాటుచేసిన హెల్సింకీ స్టేడియంలో మా ఆటగాండ్రకు, ఫిన్నిష్‌వారికి తీవ్రమైన పోటీలు జరిగినవి. పోటీల ఫలితాలు టెలిఫోన్ ద్వారా తెలియగానే, మన దేశపు ప్రజలలో బయలుదేరిన సంతోషం అద్వితీయం. ఫిన్నుల జట్టుకన్న మన జట్టు 7 'పాయింట్లు' మాత్రమే వెనుకనున్నది. అదీగాక, చాలా జాతీయ రికార్డులు భగ్నమయ్యాయి.

ఎమిల్ 6 రోజులలో, 4 ముఖ్యమైన పెద్దపందేలలో పాల్గొన్నాడు. స్టేడియంకు వెళ్ళిరావడం ఒక పెద్దపని. ఎమిల్ మీద ఒక్కసారైనా గెలుపు సాధిద్దామని ఫిన్లు అనేక ప్రయత్నాలు చేశారు. కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది.

ప్రతిపందెంలోను ఫిన్నిషు పందెగాండ్రు ఒకరి కొకరు అమితమైన సహాయం చేసుకున్నారు. వారి పన్నాగాలవల్ల మొదటి స్థానానికి చేరుకోగల మనుకున్నారు. వారికి జటోపెక్‌కు లేనిసౌకర్యమొకటుంది. ఎమిల్ అన్నిపందేలలోనూ తానొక్కడే పరుగెత్తవలసి ఉంది. ఫిన్నులకు ఆ యిబ్బంది లేదు. మా జట్టులోని మరొక బహుదూరపు పరుగుపందెగాడు జటోపెక్‌కు సహాయం చేయలేడు; ఆతనంటే ఫిన్నులకు భయంలేదు.

10,000 మీటర్ల పందెంలో కోనెనెన్, హీనోల కెదురుగా జటోపెక్ పరుగెత్తేడు. ప్రారంభమయిందో లేదో రాక్షసిలాగ పరుగెత్తేడు కోనెనెన్. ఎమిల్, ఆస్లో, బుడాపెస్టులలో పూర్వం పరుగెత్తినప్పటివలె అనుభవంలేని ప్రారంభదశలో లేడు. ఎమిల్ ఏమిచేస్తున్నాడోనని వెనకకు తిరిగి చూశాడు కోనెనెన్. దీని అర్థం ఎమిల్‌కు బోధపడింది. అప్పుడే ఫిన్నిష్ పత్రికలలోని శీర్షికలు ఎమిల్‌కు జ్ఞాపకం వచ్చాయి; "మొదటిస్థానం, ఎమిల్ ఎవరికి వదలడు" అనే శీర్షికలు.

కోనెనెన్ ఉద్దేశం ఎమిల్‌కు తెలిసింది. పన్నాగడయొక్క ఆంతర్య మర్థమైనా, దానివల్ల మోసపోకూడదని నిశ్చయించాడు. జటోపెక్ ఎప్పుడు తన్నందుకుంటాడా అని వేచివున్నాడు, అతనిని వేగంగా పరుగెత్తునట్లు ప్రోత్సహించుటకు. ఎమిల్ మాత్రం తన ఫక్కీ వదలలేదు. తన కేవిధంగా అనుకూలమో, అలాగే పరుగెత్తుతున్నాడు. దానివల్ల తన శక్తిని సమయానికి ఆదా చేస్తున్నాడు. ప్రత్యర్థులు బాగా తెలుసు నతనికి. అంతకన్నా బాగా తన సామర్థ్యం తెలుసు ఎమిల్‌కు. ఈ క్షణంలో అతని అనుభవం అతనికి అండగా నిలచింది.

కోనెనెన్ చచ్చేటట్టు పరుగెత్తేడు. లాభం లేకపోయింది. ఎమిల్ తన కనువైన వేళ చూసి, ఆతనిని దాటిపోయేడు. అలాగే మరికొంత సేపటికి హీనోను వెనుక్కు పంపించాడు.

29 నిమిషాల 55 సెకండ్లు పట్టింది. ఎమిల్ జట్టుకది ప్రథమ స్థానాన్ని సంపాదించింది. మర్నాడు 5000 మీటర్ల పందేనికి మరొక యిద్దరు క్రొత్త పందెగాళ్లు యీతనితో పోటీకి నిలబడ్డారు. వారు 'మకీలా, కోస్కేలాలు.'

నమ్ముతారా! ముందురోజు పన్నాగడ యీరోజుకూడా అవలంబించారు. మకీలా తన శక్తిని వ్యయం చేసిన తర్వాత, కోస్కేలా జోరుచేశాడు. వెనకటి దినం ఆయాసం ఎమిల్‌కు అసౌకర్యం కలిగిస్తుందని ఆశ. పోరాటం గమ్యస్థానం వరకు సాగింది. ఆఖరుకు ఎమిల్ గెలిచాడు. వానివేళ: 14 నిమిషాల 20 సెకండ్లు; జట్టుకు యింకా కొన్ని 'పాయింట్లు' అధికమయ్యాయన్న మాట.

ఎమిల్ సంతోషానికి కారణముంది. పైదేశంలో ఆ దేశంవారి పోటీదార్లపైన విజయాలు ఆనందింపదగినవే. ఫిన్నిష్ ఆటల పత్రికలు ఎమిల్‌ను ప్రశంసించాయి.

పరుగు పందేల ప్రావీణ్యానికి పెట్టినది పేరు ఫిన్లాండు. అట్టి ఫిన్లాండులో ఎమిల్ యొక్క ప్రజ్ఞను పత్రికలు ప్రశంసించాయంటే, దానిలోని అంతరార్థం ఊహించవలసిందే.

రెండు రోజుల తర్వాత, కోస్కెలాకు ఎదురుగా ఎమిల్, 'టుర్కు'లో కలిశాడు. ఈసారి తన ప్రజ్ఞనంతా చూపించాడు జటోపెక్ మీద ప్రతీకార కాంక్షతో. పోరాటం తీవ్రంగా జరిగింది. పరుగుమార్గం వెనక్కి పరుగెత్తుతూన్నట్టయింది, ఈ ఇద్దరు ప్రఖ్యాత పందెగాండ్ర అడుగుల ఒత్తిడికి జడిసి. పందెం కాలమంతా ఒకరి ప్రక్క నొకరు పరుగెత్తేరు. కాని ఆఖరు మీటర్లలో ఎమిల్ వేగం అధికం చేశాడు. దానివల్ల ఫలిత మతనికి దక్కింది. రెండు రోజుల క్రిందటికంటె, అతనివేళ బాగున్నది. ఈసారి వేళ : 14 నిమిషాల 13.6 సెకండ్లు.

మూడవసారి కోస్కెలా, జటోపెక్, 'పోరి' పట్నంలో 3000 మీటర్ల పందెంలో పోటీచేశారు. ఎమిల్‌కు యీ పందెం చాలా ప్రమాదకరం; అతని వేగానికి అనువైన పోటీలలో కనీసమైన దిది. అందుచేత ఫిన్లాండులో జరిగిన అన్ని పోటీలలో యిది కఠినతమమైనది. కోస్కెలా ఆఖరు మళుపువరకు, ముందే ఉన్నాడు. ఈసారి తప్పకుండా ప్రతీకారవాంఛ నెరవేరుతుం దనుకున్నాడు. కాని, చివరకు ఎమిల్ అతనిని దాటి కొన్ని అంగుళాలలో గెలిచాడు.

అజేయుడుగా, కీర్తికాంతతో ఫిన్లాండును పాదాక్రాంతంచేసి, ఎమిల్ యింటికి తిరిగివచ్చాడు. కొద్దిరోజులలో మాస్కోలో సోవియట్ ఆటగాళ్ళను ఎదుర్కోవలసి ఉంటుందని తిరుగు ప్రయాణంలో వారికి శుభవార్త తెలిసింది.

# మాస్కోలో విజయం

**1938** లో యుద్ధం ప్రారంభం కాకముందే, సోవియట్ ఆటగాండ్రతో సంబంధం ఏర్పాటుచేసుకొనుటకు ప్రయత్నాలు జరిగినవి. యుద్ధంమూలంగా ఏర్పాట్లన్నీ ఆపుచేయడమైంది. యుద్ధంతర్వాతనే ఈ సంబంధాలు క్రొత్తగా ఏర్పాటుచేయుటకు అవకాశం వచ్చింది. జెకోస్లావక్ యీతగాండ్రప్పుడే మాస్కోలో అతిథులయ్యారు. ఇంక యిప్పుడు ఆటగాండ్రు ఆహ్వానింపబడవలసి ఉంది.

ఫిన్లాండునుంచి వచ్చారో లేదో, జెక్ ఆటగాండ్రు మాస్కో ప్రయాణానికి సంసిద్ధులు కావలసివచ్చింది. అప్పటికి సోవియట్ వ్యాయామ స్థితిగతులనుగూర్చి

ఎవరికీ అంతగా తెలియదు. ఆస్లోపట్టణంలో జరిగిన యూరోపియన్ ఛాంపియన్ షిప్పులలో, కొందరు సోవియట్ వ్యాయామ ప్రవీణులనుగూర్చి తెలియవచ్చింది; లండన్‌లో సోవియట్ ఫుట్‌బాల్ ఆటగాండ్ర విజయాలనుగూర్చి విన్నాం. ఈతగాళ్ళ అద్భుత 'వేళ'లనుగూర్చి, 'స్కేటర్సు' గూర్చి విన్నాం. కాని వ్యాయామ శిక్షణయొక్క విస్తరణనుగూర్చి ఎవరికీ ఏమీ తెలియదు.

ఆస్లోలో ఎమిల్, సోవియట్ పందెగాళ్ళను కలుసుకున్నాడు. ఒసాలిన్, డుంబాడ్జీ, కారాకులోవ్, వేనిన్ ఎమిల్‌కు మిత్రులయ్యారు. సరిహద్దు ప్రాంతాల మధ్య జరిగే 'రిలే రేసు' మూలాన మరికొంతమందితో పరిచయం కలిగింది. అందు చేత యీ ప్రయాణానికి ఎమిల్ సుముఖంగానే ఉన్నాడు. అందులో స్త్రీల జట్టులో ఎమిల్ భార్య 'డానా' కూడా వస్తూంది!

జులై 21 వ తేదీని సోవియట్ విమానంలో 50 మందితో కూడిన జెక్ జట్టు మాస్కోకు ప్రయాణమయింది.

ప్రతికా రచయితల వార్తలకంటె, వ్యక్తిగతాభిప్రాయాలూ, భావాలు విలువగలవికాబట్టి, ఎమిల్ యీ ప్రయాణాన్నిగూర్చి చెప్పిందియే నంటే:

"మేము మాస్కో చేరేసరికి చీకటి పడింది. మమ్ములను నాహ్వానించుటకు వ్యాయామ శిక్షణాధికార్లు, స్త్రీలు, పురుషులు, ఆటగాండ్రు పువ్వుల గుత్తులతో విమానాశ్రయంవద్ద నిరీక్షిస్తున్నారు. ఈ హృదయపూర్వక స్వాగతానికి మే మానంద భరితులమయ్యాం. నే ననేక విదేశాలలో అతిథిగా ఉన్నాను. కాని, మాప్రత్యర్థులే అంత అభిమానంతో మాకు స్వాగతమిచ్చుట, యిదే మొదటిసారి.

పట్నంలోకి వెడల్పాటి రోడ్లమీదనుంచి బస్సులో ప్రయాణంచేశాం. బస్సులో కొందరు రష్యన్ ఆటగాండ్రతో పరిచయం అయింది. అందులో ఆస్లోలో కలుసుకున్నవారు వున్నారు.

పట్టణ పరిసరాలలోనుంచి బస్సు వేగంగా పోతూవుంది. మొదట చిన్న యిళ్లు, తర్వాత బ్రహ్మాండమైన మేడలు రోడ్లకిరుప్రక్కల కనబడుతూ వున్నాయి. భవనాలు, కార్లు, మనుష్యులు; అంతా ఏదో చాలా హడావుడిగా ఉంది. అనేక రకాలైన బళ్లు, ఆరువరుసల్లో ఒక్కసారి పోతున్నాయి. షాపులన్నీ వస్తువులతో నిండి ఉన్నాయి. ఆ యిళ్ళమధ్య 'క్రెమ్లిన్' భవనం అత్యున్నతంగా ఎగురుతూవున్న ఎర్రపతాకతో మాకు కనబడింది.

"నేషనల్" హోటలులో, విశాలమైనగదులలో మాకు విడిది యేర్పాటయింది. ఆ మరునాడే మా కచ్చటి దృశ్యాలను కనబరచుటకు ప్రత్యేకమైన ఏర్పాట్లు జరిగినవి. ప్రొద్దున్న ఫలాహారం తర్వాత పట్నం చూచుటకు బయలుదేరినాం. మాకు పట్నం చూపించుటకు వచ్చిన పెట్రోవ్, మేము కోరినవన్నీ చూపిస్తూ వున్నాడు. తర్వాత పత్రికా రిపోర్టర్లు ఒక గుంపుగా వచ్చారు. వారివెంట ఫొటోగ్రాఫర్లు. ముందు నేను వీరితో పని పూర్తిచేసుకొని, ప్రక్కవీధులు కొన్ని

చూద్దామని వెళ్లేను. అకస్మాత్తుగా అధికారదుస్తులలో నున్న ఒక యువకుడు ఆదారిని వస్తూండడం చూచాను.

అతడు నా వద్దకు వచ్చి, నా వీపుమీద తట్టి పెద్దనవ్వు నవ్వాడు.

"ఏమి టిది, నీ వప్పుడే యిక్కడకు వచ్చావా? నీకు జ్ఞాపకమున్నా నా? మనిద్దరం ఆస్లోలో కలిశాం అన్నాడు."

"ఏమిటిది, వేనిన్" అని సంతోషంతో పలకరించాను. కరచాలనంచేసి, వీపు మీద తట్టడం యిప్పుడు నావంతు. అప్పు డిద్దరం ఒకరి మెడమీద ఒకరం పడ్డాం.

అతడు కెప్టెన్ ఫిడోషీ వేనిన్. యూరోపియన్ ఛాంపియన్‌షిప్పులో ఎంతో ధైర్యంగా 10,000 మీటర్ల పందెంలో పరుగెత్తేడు. ఈమధ్యనే 30 కిలోమీటర్లలో ప్రపంచ రికార్డు సృష్టించాడు. అనుకోని ఆనందమయ సంఘటన, వేనిన్‌ను కలుసు కోవటం.

తర్వాత ట్రెయినింగు విషయం, ఏర్పాట్లు ముఖ్యం కాబట్టి, స్టేడియం వద్దకు వెళ్ళాం. సోవియట్ ఆటగాండ్రలో ముఖ్యులుచాలామంది అక్కడేవున్నారు; మేముకూడా ఏర్పాట్లలో నిమగ్నులమయ్యాం. ట్రెయినింగు విషయమై వారెంత శ్రద్ధ వహిస్తారో, ఉపాధ్యాయుల సలహాలను వారెంతగా మన్నిస్తారో, మేము తెలుసుకున్నాం. వ్యాయామంలో వారి కెంత నమ్మకముందో గ్రహించాం. వారి నినాదం: "శారీరకారోగ్యం నూటికి 30 పాళ్ళు వ్యాయామంమీద ఆధారపడి వుంటుంది."

ప్రజల విద్యాకార్యక్రమంలో వ్యాయామ శిక్షణకు వున్నత స్థానం కల్పించ బడింది. అధికంగా ధనం ఈ శిక్షణపై ఉపయోగించబడుతోంది. పూర్వం సంవత్స రానికి దీనిమీద వ్యయం 16 మిలియన్ల రూబుల్సుమాత్రమే. ఇప్పుడు 500 మిలియన్ల రూబుల్సు వ్యయ మగుచున్నది. సోవియట్ ప్రజల శారీరకశక్తి, యీ వ్యాయామ శిక్షణమీద ఆధారపడి ఉంటుంది. కాబట్టి, ప్రణాళికలు దేశవ్యాప్తంగా ఏర్పాటు చేయబడ్డవి.

ఈ విధమైన శిక్షణ యుద్ధానికి బాగా ఉపకరించింది. శత్రువు నోడించు టలో, దేశాన్ని విముక్తి నొందించుటలో యిది ప్రముఖస్థానం వహించిందనుటకు సందేహం లేదు.

శాంతి స్థాపనతో, రక్షణ కర్మాగారాలనుండి ఆట స్థలాల్లోకి ఆటగాండ్రు తిరిగి వచ్చారు. ప్రజాసమూహం క్రీడలలో ఆసక్తితో పాల్గొనుటమూలంగా, సాధారణ ప్రజ్ఞా స్థాయి ఎక్కువైంది. 350 జాతీయ రికార్డులు, 20 ప్రపంచ రికార్డులు యీ సంవత్సరంలో భగ్నమయ్యాయంటే, దేశంమొత్తంమీద వ్యాయామ శిక్షణ ఎంత వ్యాప్తమయిందో ఊహించుకోవచ్చు.

స్కీయింగ్ ఆటమీద అందరికి అభిమాన మెక్కువ. 4 × 10,000 మీటర్ల రిలే పందె మొకటి ఏర్పాటు చేయబడింది.

వేసవి ఆటలోలకల్లా ఫుట్ బాల్ ప్రజలను ఎక్కువగా ఆకర్షిస్తుంది. 100,000 క్లబ్బులకు పైగా ఛాంపియన్ షిప్పులలో పాల్గొంటవి.

మేము చేరిన రెండవరోజునే, మాస్కో ప్రజలకి ఫుట్ బాల్ ఆటంటే ఎంత అభిమానమో మాకుబోధపడింది. 'డైనమో' మాస్కోజట్టు, ఆర్మీజట్టు 'సి.డి.కె.ఎ.'కు వ్యతిరేకంగా ఆడుతూంది. 80,000 మంది ప్రేక్షకులు పట్టే 'డైనమో' స్టేడియంలో ఆట మొదలుపెట్టారు. కార్లు ఎన్నివచ్చి 'క్యూ'లో నిలబడ్డాయో లెక్కలేదు. ఇక జనసమూహం అసంఖ్యాకంగా ఉంది.

ప్రజలు రెండుజట్లనూకూడ సంతోషంగా ప్రోత్సహించారు. నేను 'సి.డి.కె.ఎ.'ను మాత్రమే ప్రోత్సహించాను. మొదటికారణం వారుసైనికజట్టు కాబట్టి; రెండవది: డైనమో ఛాంపియన్లు ప్రజల అభిమానం పొందినవారు; వారికి వ్యతిరేకంగా, ఎంతో ఆత్మనిగ్రహంతో సైనికబృందం ఆడింది. ఏకమవై వున్న ఆటగాడొకడు చూపిన ధైర్యం అద్వితీయం. అదే తక్కినవారి ధైర్యానికి, సాహసానికి పునాదిగా ఉంది. వాని తలమీద తెల్లగుడ్డతో కట్టొకటుంది. కొంతసేపయిన తర్వాత, ఆ తెల్లగుడ్డ ఎర్రగా అయిపోయింది. తలతో బంతిని కొట్టడంమూలంగా, పూర్వపు గాయంలోనుండి నెత్తురు కారడం ప్రారంభమయింది. అయినా ఆ యువకుడు లక్ష్యం చేయలేదు. తలను బంతిని కొట్టడానికి ఉపయోగిస్తూనే వుండేవాడు. అదే కార్యదక్షతకు తార్కాణం. ఫుట్ బాల్ ఆటగాండ్రలో యీ విధమైన దీక్ష అరుదు.

ఆట అందంగా, ఆకర్షణీయంగా వుంది. సోల్జర్లు గెలిచారు. వారు, ప్రత్యర్థుల మీద 2 'గోల్సు' చేశారు. ప్రేక్షకులలో ఆట ఆవేశాన్ని కలిగించింది. బాగా ఆడినవారిని కరతాళధ్వనులతో మెచ్చుకొనేవారు. పాడుచేసినవారి విషయంలో యీలలువేసి తమ నిరసనను ప్రదర్శించారు.

ఆ సాయంత్రం మా జట్టులోనివారు మరికొందరు చేరుకున్నారు. శనివారం, ఆదివారం జరగవలసిన అంతర్జాతీయ పోటినిగూర్చి, మా కెప్టెన్ చర్చించుట ప్రారంభించాడు. నేను 10,000 మీటర్ల పందెంలో పరుగెత్తవలసి ఉంది. కాని, దానికీ అంతర్జాతీయ పందేనికి సంబంధంలేదు.

సమావేశం 'డైనమొ' స్టేడియంలో జరిగింది. నిన్నటి ఫుట్ బాల్ పందెంలో మాకీస్టేడియం పరిచయమే. ప్రథమ కార్యక్రమం, సుహృద్భావ వాతావరణాన్ని ప్రతిబింబింపజేసింది.

మేమొక ప్రక్కనుండి, సోవియట్ పందెగాళ్ళు మరొక ప్రక్కనుండి ప్రవేశించాం. మా పతాకాలు మధ్యస్థలంలో కలిసినప్పుడు, ప్రేక్షకుల ఆనంద నినాదాలు మిన్నుముట్టినవి. అంతర్జాతీయ పందేలయొక్క అంతరార్థం రెండు చిన్న ఉపన్యాసాలద్వారా బోధపరచబడింది. వ్యాయామపోటీల చరిత్రలో, మా రెండుదేశాలు పాల్గొనుట కిదే ఆరంభం. జాతీయగీతాలు పాడిన తర్వాత, యిరుపక్షాల వారం ఒకరినొకరు పలకరించుకున్నాం. తర్వాత చాలమంది ఆడపిల్లలు, మగపిల్లలు

గుంపులుగా వచ్చి మామీద పూలవర్షం కురిపించారు. మా కందరికి ఒక్కొక్క పువ్వులగుత్తి నిచ్చారు.

"మార్చాఫ్"కు ఇరుపక్షాలవారం కలసిపోయాం. ప్రతి ఒక్క సోవియట్ పందెగాని ప్రక్కన జెక్ పందెగానిని నిలబెట్టారు. మా జట్టులో అతి పొట్టిగాఉన్న 800 మీటర్ల పందెగాడు, 6 అడుగుల సోవియట్ పందెగాని ప్రక్కన నిలబడితే, అందరూ వినోదంగా చూచారు.

దుస్తులు మార్చేగదులలో పళ్లు, పళ్ళరసాలు మాకోసం ఉంచారు. అక్కడ నుంచి ప్రక్కనేవున్న స్థలానికి శరీరం వేడెక్కించడానికి బయలుదేరినాం.

మొదటిరోజు నా కేమి పనిలేదు. అందుచేత ప్రేక్షకస్థానంనుండి ఆనాడు జరిగే ఆటలు శాంతంగా చూస్తూ, ఆనందించుట కవకాశం కలిగింది. నాకు ఆవిధంగా చూచుటకు అవకాశం చాలా అరుదుగా దొరుకుతుంది. పందేనికి ముందు, పందేన్ని గూర్చిన దీక్షలో కాలంగడుస్తుంది; పందెం తర్వాత, స్నానాలగదిలో చాలా సేపు ఉంటాను. అక్కడనుంచి బయటకు వచ్చేసరికి ఆటోగ్రాఫులవాళ్ళు, పత్రికల వాళ్ళు నాకు ఊపిరి సలపనీయరు. అందుచేత ఒక్కసారి పందేలను ప్రశాంతంగా చూచే అవకాశం వచ్చినందుకు సంతోషించాను.

ప్రపంచ రికార్డుతో సరిపోల్చదగినట్లు నైనాడంబాడ్జ్ 'డిస్కస్' 50 మీటర్ల దూరం విసరింది. ఆనల్లవెంట్రుకల ప్రపంచ ఛాంపియన్ స్మిర్‌నిట్స్కియతో సమానంగా డానా పోటీలో నిలవలేకపోయింది. 43 మీటర్ల దూరమే విసరగలిగింది. పోల్ వాల్టులో ఆపోలిన్ అద్భుత ప్రదర్శన నిచ్చాడు. 40 ఏళ్ళ వయస్సున్నా, 4 మీటర్ల దూరం వురకగలడు. ఆవిధంగా 20 ఏళ్లబట్టి చేస్తున్నాడు. ధైర్యానికి, ఓర్పుకి 'కనకి' అనే అతను ఉదాహరణగా కనుపించాడు. ఈతడు యుద్ధంలో బాగా గాయాలు పడ్డాడు. అయినా మనోనిబ్బరంతో ట్రెయినింగు ప్రారంభించాడు. ఆశ్చర్యమేమంటే, 5 ఏళ్ళ తర్వాత ఛాంపియన్‌గా తయారయ్యాడు.

మా జట్టు ఎంత ప్రయత్నం చేసినా మొదటి రోజున చాలా 'పాయింట్లు' వెనకబడిపోయింది. దీనికి ముఖ్యకారణం సోవియట్ స్త్రీ ఆటకత్తెలు.

రాత్రి విశ్రాంతికి అవకాశం లేకపోయింది. కాని బ్రహ్మాండమైన గాలివాన మొదలుపెట్టింది, ఉరుములు, మెరుపులతో. కిటికీ తలుపులుమీద వర్షం తీవ్రంగా పడుతూంది. తెల్లవారేసరికి వీధులనిండా నీరే. కార్లు నీళ్ళలో నడుస్తున్నాయి. ప్రజలు జోళ్లు లేకుండా నీళ్ళలో నడుస్తున్నారు. సూర్యోదయం తర్వాత నీరు నెమ్మదిగా ఇంకిపోయింది.

స్టేడియం నీటిమయంగా వుందని పుకారు పుట్టింది. ఇది నిజమా, అబద్ధమా అని మేము ఆత్రతగా సమాచారంకోసం వేచివున్నాం. ఏ విషయం మాకు నిర్ధారణగా తెలిసేలోపుగా మరల కుంభవృష్టి కురిసింది. అందుచేత పందెం విధిలేక వాయిదా పడింది.

నాకు కడుపులో నొప్పి ప్రారంభమయింది. అందుచేత యీ వాయిదా నాకు సంతోషంగానే ఉంది. బరువైన ఆహారం, వర్షం, వాతావరణం అంతా నాకు యిబ్బందిగా ఉంది. వారు పెట్టిన రుచికరమైన మీగడ పదార్థం మామూలుకంటె ఎక్కువ తినటంవల్ల మరీ యిబ్బందిగా వుంది. సోవియట్ భూమిలో ప్రజల జీవన పద్ధతికి, మన పద్ధతికి కొంచం తేడా వుంది. వారు ప్రొద్దున్న 9 గంటలకు కొంచెం బరువైన భోజనం తీసుకుంటారు: టీ, పాలు, పండ్లు, బేకన్, గుడ్లు, రొట్టె, వెన్న. మధ్యాహ్న భోజనం యింతకన్నా తేలికగా ఉంటుంది. అసలు భోజనం సాయంత్రం 6 గంటలకు తీసుకుంటారు. జీవనం నిజంగా అప్పుడు ప్రారంభమై అర్ధరాత్రి వరకు నడుస్తుంది. ఈ వేళలోనే షాపులకు, మిత్రుల యిండ్లకు, నాటకాలకు, సంగీత కచ్చేరీలకు, లేకపోతే డ్యాన్సులకు ప్రజలు వెడుతూంటారు. అర్ధరాత్రి కానిదే ఎవరూ సాధారణంగా నిద్రపోరు. అందుకనే వారు ప్రొద్దున్న ఆలస్యంగా లేస్తారు.

ఇవన్నీ కూడా నా కానందం కలిగించినవి. ఇదివరకుకంటె ఎక్కువగా అలసి పోతున్నాను. మరుసటి రోజు 5000 మీటర్ల పందెంలో నేను పరుగెత్తగలనా ? అని పించింది. గాలి వానలో సముద్రంమీద ప్రయాణం చేసినట్టుగా ఉంది మానసికంగా. నా కడుపులో ఏదో బాధ బయలుదేరింది. నా గుండె తీవ్రంగా కొట్టుకుంటూంది.

అయితే పక్కమీద పడుకొని ఉండలేకపోయాను. నా శక్తిని కొంచెం పరీక్షించుకుందామనుకున్నా. సాయంత్రం అందరితో నాటకానికి వెళ్ళాను. నాటకం అద్భుతంగా ఉంది. నాటకానికి వెళ్ళటంవల్ల నా ఆరోగ్యం పాడుచేసుకున్నానన్న విచారం లేకపోయింది.

ఆ రాత్రి ఒక్కక్షణం నిద్రపోలేదు. ఉదయం అయ్యేసరికి ఎంతో బలహీనంగా ఉంది. మూడురోజుల వరకు 'టీ' మాత్రమే త్రాగి ఉన్నాను. అంత ఆకలితో పందెంలో పరుగెత్తగలనా ? అనే అనుమానం కలిగింది. అందుచేత తేలికగా భోజనం చేయడానికి నిశ్చయించాను. మా జట్టు డాక్టరు యిది వినగానే జుట్టు పీక్కొని తిట్టి యిదంతా ఏదో ప్రమాదానికి దారితీస్తుందన్నాడు.

"ఎవరినైనా అది చంపివేస్తుంది" అన్నాడు డాక్టరు.

"నేను ఆకలితో పరుగెత్తలేను" అని వాదించి, పైకి సంతోషం కనబరచాను.

మా డాక్టరుకు చాలా ఆత్రుత, ఆందోళన కలిగించాను. ఎలాగైనా పందెంలో నన్ను పరుగెత్తనీయకుండా చేద్దామని అతని ప్రయత్నం. కాని యిన్నివేల కిలో మీటర్లదూరం సోవియట్లకు ఎదురుగా పరుగెత్తడానికి వచ్చి చేతులు, కాళ్లు కట్టుకు కూర్చుంటే ప్రజలు ఏమంటారు ?

నేనెంతోసేపు యీ ఆందోళనతో గడపలేదు. త్వరగా దుస్తుల గదిలోకి వెళ్ళాను. ముందుగా వ్యాయామం అవసరమనుకోలేదు. నా శక్తిని కాస్తా అది పీల్చేస్తుంది. బయలుదేరేస్థలం దగ్గరే కొంచెం పరుగెత్తేను. నా కాళ్ళు ఎంతో బరువుగా

అనిపించాయి. ఆరోగ్యనిధి కాజన్షేవ్, ఎర్రని చెక్కిళ్ళతో వున్న పాఫావ్‌లప్రక్కన నేను అసహ్యాంగా కనుపించి ఉంటాను. ఈ పందెగాంద్రుకూడా నా సంగతి కని పెటినట్టున్నారు. పందెం ప్రారంభంనుంచి 800 మీటర్ల పందెంలో పరుగెత్తినట్టు అతివేగంగా పరుగు ప్రారంభించారు.

మొదటిఘట్టం ఎలాగోలాగ గడిపాను. నా ప్రత్యర్థులుకూడా అలసిపోయారు. నేను మామూలు గమనంలోకి వచ్చాను. కాని పందెం సులభంగాలేదు. నా స్వాధీనం తప్పిపోకుండా అఖండ ప్రయత్నం చేయవలసివచ్చింది. మొదటినుంచి మరణబాధగా వుంది. కాజన్షేవ్ ఒక 'స్ప్రింట్' చేసినప్పుడు, అతనివెంట వెళ్ళలేకపోయాను. ఆతడు వాయువేగంతో పోతున్నాడు. ఆఖరుఘట్టం వచ్చింది. 300 మీటర్లు, వాని వెనక పరుగెత్తుతూనే ఉన్నాను. ఒక్క మీటరుకూడా తేడాను తగ్గించలేకపోయాను. కాజన్షేవ్ ప్రజల ప్రశంసలను, ప్రోత్సాహాన్నీ పొందుతున్నాడు. నా ప్రచండ ప్రయత్నం ప్రజలు కనిపెట్టగానే, నా పేరుకూడా వారి పెదవులమీద నృత్యంచేసింది. నాకుకూడా ప్రోత్సాహమిచ్చారు. సరియైనమార్గంలోకి వచ్చేసరికి నా యావచ్ఛక్తిని ఉపయోగించాను. అకస్మాత్తుగా కాజన్షేవ్ మోకాళ్ళు వణికాయి. ఆఖరు ఐదు మీటర్లు ఎలాగు పరుగెత్తేనో; ఇంక నిలవలేక పడిపోతాననుకుంటూంటే, గమ్య స్థానపు 'టేపు' తాకినానని తెలిసింది. నేనే ప్రథముడను. చిరునవ్వు నవ్వడానికికూడా ఓపికలేదు. 14 నిమిషాల 29 సెకండ్లలో పరుగు పూర్తిచేశాను. నా వెనకే వచ్చిన కాజన్షేవ్, పాపావ్ గడించిన జాతీయ రికార్డునుమాత్రం అతిక్రమించాడు.

అంతర్జాతీయ పోటీలో మొత్తంమీద 75 పాయింట్ల తేడాతో మా జట్టు ఓడిపోయింది. కాని ఒక ప్రపంచ రికార్డు, 4 జెక్ రికార్డులు, 6 సోవియట్ రికార్డులు భగ్నంచేయ గలిగాం.

ఆట స్థలంలో సంభాషణకు అవకాశంలేదు. కాని దుస్తులు మార్చే గదిలో చేరి సంభాషణలకు వుపక్రమించాం. మా భాషలు రెండూ చాలా సన్నిహితం కాబట్టి, మా మాటలు ఒకరి కొకరికి బోధపడ్డాయి.

"ట్రెయినింగు విషయంలో నీ అభిప్రాయం ఏమిటి ? ప్రత్యేకం మా ట్రెయి నింగు విషయంలో నీ అభిప్రాయం ఏమిటి ?" అని అడిగారు, సోవియట్ జట్టువారు.

నా భావాలను బోధపరచాను.

"జిమ్నాస్టిక్సు చేస్తావా ?"

"లేదు, ట్రెయినింగయిన "ఎథ్లెట్"కు జిమ్నాస్టిక్సు అవసరంలేదు.

"అంటే?"

"కుక్క బాగా పరుగెత్తుతుంది. అది జిమ్నాస్టిక్సు చేస్తుందా ?"

వారంత రొక్కసారి నవ్వారు. ఆ మాటల కలాగు నవ్వుతూనే వున్నారు. నన్ను భుజాలమీద తట్టారు.

"జటోపెక్ మంచివాడు" అన్నారు అందరూ సస్నేహంగా. ఆటల పోటీలన్నీ అయిపోయాయి కాబట్టి, చారిత్రాత్మక మాస్కోనగరంలోని మహత్తర దృశ్యాలను చూచుటకు మాకు అవకాశం కలిగింది. దీనికొరకు మేము నిరీక్షిస్తున్నాం.

క్రెమ్లిన్ స్వర్ణగోపురాలవద్దకు వచ్చాం. అవి మమ్మల్ని ఎంతో ఆకర్షిం చాయి. ముందు పూర్వపు క్రెమ్లిన్ మాకు చూపించారు. ఆ విశాలమైన గదులు అందమైన ఫర్నిచరు, పాలరాతి గోడలమీద ఆకుపచ్చని వర్ణవైభోగం, డ్యాన్సుహాలు, 30 రకాల కర్రతో తయారయిన నేలభాగం మా కాశ్చర్యం కలిగించాయి.

పూర్వపు మ్యూజియంకూడా చూశాం. పురావస్తు సముదాయాన్ని, జారుల పరిపాలనలోని వజ్ర ఖచిత సింహాసనం చూశాం. జారుచక్రవర్తుల పిల్లలాడుకొనే బంగారపు ఆటవస్తువులు, వారి జోళ్లు, జార్ పీటర్ తాను స్వయంగా కుట్టుకున్న బట్టలూ చూచాం. బంగారం, ముత్యాలు, రవ్వలు చూస్తే ఆ రోజులలో చక్రవర్తులు ఎంత వైభవంగా కాలం గడిపేవారో బోధపడుతుంది. చక్రవర్తుల గుర్రాల జీనులు కూడా బంగారంతో చేయబడేవి.

వీటన్నింటినిగూర్చి మాకు దృశ్యాలు చూపించుటకు వచ్చిన 'గైడ్' అన్ని విషయాలు తెలిసినవానివలె ప్రసంగిస్తున్నాడు. చారిత్రాత్మక సంఘటనలనుగూర్చి సుపరిచితంగా చెప్పాడు.

తరువాత, సుప్రీం సోవియట్ సమావేశ స్థలంలో ప్రవేశించాం. ప్రతి స్థానం వద్ద ఒక మైక్రోఫోన్ అమర్చబడి ఉంది.

లెనిన్ సమాధిపట్ల మా అందరిలోను అపూర్వ గౌరవం రేకెత్తింది. అప్పుడే పూచిన పూలతో కట్టినదండ భక్తిపురస్సరంగా సమాధికి సమర్పించాం. సోవియట్ దేశపు మహానాయకుని మృతశరీరాన్ని నిక్షిప్త మొనర్చిన గాజు పెట్టెచుట్టూ చేతులు జోడించి ప్రదక్షిణ చేశాం.

ప్రసిద్ధ 'ట్రెటికోవ్' గ్యాలరీలో చాలాసేపు గడిపేం. వాస్తవికత ఉట్టిపడే సోవియట్ చిత్రకారుల అత్యుత్తమ చిత్రాలనేకం అక్కడ వున్నాయి.

ఇవన్నీ చూస్తూ, యింకా జరగవలసిన ఒకటి రెండు పందేల విషయం విస్మ రించాం. నేను, కాజంత్సేవ్, పాపావ్‌లతో 10,000 మీటర్ల పందెం పరుగెత్తవలసి ఉంది. ఒక 'రిలేరేస్'కూడ పరుగెత్తవలసివుంది మేము.

మెట్రోపోల్ హోటలులో మేమంతా కలసి పాల్గొన్న విందు మాత్రం ఎల్లప్పుడు జ్ఞప్తియందుంటుంది. సోవియట్ మిత్రులతో మా సమావేశం, మాస్నేహాన్ని ఎక్కువ చేసింది. ఒకరితో ఒకరం మా అభిరుచులనుగూర్చి, మా ప్రత్యేక అనుభవాలను గూర్చి చర్చించుకున్నాం. సోవియట్ రష్యాలో 3000 మంది వ్యాయామనిపుణులు (మాస్టర్సు ఆఫ్ స్పోర్ట్సు) వున్నారని, 600 మంది గౌరవప్రవీణులు (ఆనరర్డు మాస్టర్సు) ఉన్నారని తెలిసింది. మనదేశంలోని ఆటల పరిస్థితులను గూర్చి, ప్రపంచంలోనిఆటల పరిస్థితిని గూర్చి సోవియట్ ఆటగాండ్రు విషయాలు తెలిసిన ఆశ్చర్యం కలిగిస్తాయి.

మాకిచ్చిన ఫలాహారాలతో బల్లలువంగిపోతున్నాయి. అక్కడుంచిన ఫలాల్లో నిజంగా యీడులాడినానన్నమాట. పళ్ళంటే నాకంత యిష్టం. ఇంక అక్కడ మాకిచ్చిన ఫలాల రుచి, ప్రత్యేకత నాకు వెర్రెత్తించాయి.

మా గౌరవార్థం ఒక పాటకచేరి ఏర్పాటయింది. ప్రముఖ సంగీత విద్వాంసు లందు పాల్గొన్నారు: అక్కడ పాడిన ఒక తీయని జానపదగేయం నా తలలో ఇంకా ప్రతిధ్వనిస్తూనే ఉంది. ఒక సైనికునివద్దకు యమధర్మరాజు వచ్చాడట, తీసికొనిపోవ టానికి. ఆ యమధర్మరాజును మద్యద్రవాల విందు ఆరగించమన్నాడట, సైనికుడు. యముడు అంగీకరించి వచ్చేవరకు త్రాగేడట. యముడు త్రాగి మరణించాడటకాని, సైనికుని దాహంమాత్రం తీరలేదట. ఇదీ ఆ జానపదగేయంలో కథ.

తరవాత నృత్యాలు. మొదట హాలు యీ చివరనుండి ఆ చివరకు డానాతో డ్యాన్సు చేశాను. తరవాత సైనాడుంబాజ్జిని డ్యాన్సుకు ఆహ్వానించాను. డానా, బులంవక్‌తో సుహృత్పానం (టోస్టు) చేసింది.

జావలిన్ విసరే 'స్మిర్నిట్‌స్కియా'తో ఆనందంగా కాలక్షేపం జరిగింది. ఆమె భర్తకూడా మంచి పరుగు పందెగాడే. మాలాగే 'ఆటల దంపతులు; వైవాహిక జీవితం ఆనందమయమయినదని మేమంతా అంగీకరించాం. ఈ వైవాహిక సుఖానికి దాసులమయి, మైమరవకుండా ఉండడానికి పందెగానికి చాలా బలం కావాలని కూడా మే మొప్పుకున్నాం.

"ఎవరి జీవిత ఆదర్శాన్ని వారు నెరవేర్చాలి" అన్నాను.

"ఆటల కాటంకం కలిగించే విషయాలు జీవితంలో చాలా ఉన్నాయి. కాని జీవితం, దాని ఉద్దేశం, ఆదర్శం, వానిని గౌరవించి నెరవేర్చుట అతిముఖ్యం." ఈవిషయంలో 'స్మిర్నిట్‌స్కియా దంపతులు' నాతో పూర్తిగా ఏకీభవించారు.

ఆసమయానికే ఒక పరిచిత కంఠం వినబడింది. ఈసోనియానుండి మా స్నేహి తులు లిప్పు, విటోస్మి వచ్చారు.

"సుదినం" అన్నారు.

మా అందర్ని పలకరించారు. అక్కడ మేము చాలా మందితో స్నేహం కలిపాం. మా చిరునామాల నొకరి కొకర మిచ్చుకున్నాం.

చివరకు జ్ఞాపక చిహ్నంగా, మా కందరికి ఒక్కొక్క బహుమతి నిచ్చారు. స్త్రీ లందరికి రష్యన్ సెంట్లు; పురుషులందరికి త్రాగే గ్లాసులు. జి. టి. ఒ. ఆటల పతకాలుకూడా మా కందరికి యిచ్చారు.

ఆ మరుసటి దినం మరొక పందెంలో నేను పాల్గొనవలసివచ్చింది. డైనమో, కీవ్ విమాన దళపు జట్ల మధ్య ఫుట్‌బాల్ పందెం జరుగుతూన్నప్పుడు, విరామ వేళలో 10,000 మీటర్ల పందెం జరిగింది. నా కిప్పుడు వంట్లో బాగుంది. కకేషియన్ 'వైన్', వోడ్కా చుక్కలు నా కాళ్లకు బలం కలిగించాయి. అందుచేత పందెంలో ధైర్యంతో ప్రవేశించాను.

పందెం ప్రారంభానికి ముందు, ప్రత్యర్థులు కాజస్లేవ్, పాపావ్‌లను, యితరులను పలకరించాం.

"నీకు పోటీగా మరల పరుగెత్తుతున్నందుకు సంతోషంగా ఉంద"ని కాజస్లేవ్‌తో అంటూ, నీవు చాలా ముందుకు పురోగమిస్తున్నావు. త్వరలో రికార్డు భగ్నంచేస్తావని నా విశ్వాసం అన్నాను.

నా మామూలువేగంతో పరుగు ప్రారంభించాను. ఈసారి పరుగెత్తే ప్రత్యర్థులు నాకు లాంగుబాటులో నున్నారు. ఎక్కువగా అలసట, ప్రయాస అవసరం లేక పోయింది. 30 నిమిషాలకు ముందే పందెం గెలిచాను.

వీడ్కోలు సమయంవచ్చింది. రాయబారవర్గపు అధికార కార్యాలయంవద్ద మేమంతా కలిశాం. ఒకరి కొకరం బాగా పరిచయమయ్యాం కాబట్టి, యీసారి మా సమావేశంఇదివరకుకన్న ఎక్కువ ఆనందదాయకంగా వుంది. సంగీతం, నృత్యం, అర్ధ రాత్రివరకు సాగినవి. మేమంతా ఖులాసాగా, హాయిగా కాలం గడిపాం.

మర్నాడుదయం మా అనుభవాల సంపదలో, మేము సోవియట్ ముఖ్య పట్టణాన్ని వదిలేం. అక్కడి విషయాలన్నీ ప్రశాంతంగా తలపోసుకొనడానికి ఇప్పటికి తీరికైంది. ఆ ఆనంద స్మృతులు, అప్పటి దృశ్యాల ఆకర్షణలు, ఆటల అనుభవాలు, వారి మిత్రత్వం అన్నీ సమ్మిళితమై మా మనస్సులను సంతోషంతో నింపినవి.

సుఖానుభూతులతో యిళ్ళకు తిరిగి వచ్చారు. రష్యనుల హృదయ నైర్మల్యం, వారి సుహృద్భావం తెలుసుకోవాలంటే రష్యా వెళ్ళాలి. ఈ విషయంలో ఆటలు మా పరస్పర స్నేహానికి దోహదమిచ్చినవి. ఆటల ఉత్సవాలు, అంతర్జాతీయ పోటీలు, ఒలింపియన్లు, వివిధ జాతులమధ్య మైత్రిని పెంపొందించి, సన్నిహితం చేయుటకు తప్పకుండా తోడ్పడగలవు.

# ప్రపంచ రికార్డు పోయింది!

**మా**స్కోనుండి తిరిగి వచ్చిన తర్వాత దైనందిన జీవితం యథావిధిగా ప్రారంభమయింది. ఒకటి రెండు పందేలలో ఎమిల్ పరిగెత్తినాడు; ఒక్కొక్క ప్పుడు తక్కువ దూరాల పందేలలోకూడా; వాటిలో గెలవలేనని తనకు తెలుసు. అలవాటు తప్పిపోకుండా తన వేగం నిలబెట్టుకొనుటకు, యిట్లా చేయవలసి వచ్చింది అంటాడు ఎమిల్.

1500 మీటర్ల "గ్రాండుప్రిక్సు"లో మూడవ వానిగా వచ్చాడు. సిరోనా, స్వేగర్‌ల వెనక ఎమిల్ వచ్చాడు. ఆనాని పరుగు 4 నిమిషాలు. తన పూర్వపువేగాన్ని తిరిగి సంపాదించుటకు ఎంత కృషిచేయాలో స్పష్టమయింది.

జటోపెక్ పేరు యింక అతని సొత్తుకాదు; పూర్వం, నూర్మి, హేగ్ వలె అందరిదీని.

1920 సంవత్సర ప్రాంతంలో "ఎక్కడికలాగ పరుగెత్తుతున్నావు; నువ్వేక నూర్మి లాగున్నావే" అంటూ వుండేవారు. కాని ఇప్పుడు పిల్లలు ఒకర్నొకరు పలుక రించే పద్ధతిలో "నేను జటోపెక్‌ను అంటే నేను జటోపెక్‌ను" అని, ఆ పేరు కెవరు అర్హులు అనే విషయంలో, వారిలో వారి కిప్పుడు పోట్లాట.

ఆ సంవత్సరం సెప్టెంబరులోకూడా యింకా వెచ్చగా, ఆనందంగా ఉంది. అందుచేత హంగరీ, రుమేనియా, బల్గేరియా మొదలయిన అనేక దేశాలనుంచి వచ్చిన ఆహ్వానాల నంగీకరించాడు ఎమిల్. బుడాపెస్టులో జెకోస్లోవేకియా, హంగరీ, ఇటలీ దేశాల మధ్య జరిగిన త్రైపాక్షిక పోటీలో 5000 మీటర్ల పందెం, 10,000 మీటర్ల పందెం రెండూకూడా ఎమిల్ గెలిచాడు. తరువాత సోఫియా, బుఖారెస్టులకు వెళ్ళాడు.

ఈ రెండు స్థలాల్లోకూడా యీతనికి అద్భుతమైన విజయాలు కలిగినవి. సోఫియాలో యీదుతూంటే మోకాలుమీద దెబ్బతగిలింది. ఐనా సులభంగానే పందెంలో గెలుపొందేడు. బుఖారెస్టులోకూడా, రెండు దూరపు పరుగు పందేలు గెలిచాడు. ఆ స్థలాల్లో ఆయాభాషలను మాట్లాడే నేర్పు చూపి, అందరికి ఆశ్చర్యం కలిగించాడు.

ఏమైనా, పరిస్థితులు సవ్యంగాలేవు. ప్రపంచ రికార్డును సృష్టించిన జటోపెక్, పరుగు పందెంలో పాల్గొనుటలేదు. హీనో 10,000 మీటర్లపందెంలో జయప్రదంగా ప్రపంచ రికార్డును అతిక్రమించాడని సెప్టెంబరు 1వ తేదీన వార్త. వేళ 29 నిమిషాల 27.2 సెకండ్లు; ఎమిల్ రికార్డును 1 సెకండులో భగ్నమొనర్చాడు. ఇంటర్నేషనల్ ఎసోసియేషన్‌వారు దీనిని గుర్తించకపోయినా, తాత్కాలికంగా గౌరవం ఫిన్లాండుకు హస్తగతమయింది.

ఎమిల్ మిత్రులు, యీ విషయంలో మీ అభిప్రాయమేమని అతనిని అడగక మానలేదు. ఊరికే అడిగిన ప్రశ్నలు కావివి; వీనిలో ఒక సవాలు యిమిడి ఉంది.

"హీనో ప్రపంచ రికార్డు నెందుకు పొందకూడదు?" అని ఎమిల్ చిరాకుతో అడిగాడు.

"నీవు ప్రయత్నించవా..."

"ఎప్పుడు ? ఈ సంవత్సరానికి అప్పుడే ఆలస్యమయిపోయింది. తర్వాత కొన్నాళ్ళకు, వసంతకాలంలో ప్రయత్నం చేయవచ్చు" అన్నాడు ఎమిల్.

సెప్టెంబరులో మరికొన్ని పందేలు ఏర్పాటయినవి. ఆకురాలు కాలం దగ్గరకు వస్తూంది. ప్రపంచ రికార్డు విషయమై ఎమిల్ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. పైకి

ఎంత నిర్లక్ష్యంగా ఉన్నా, లోపలి ఆందోళన అందరికీ అవగతమే. ఎమిల్ సంతోషంగా లేడు. వినోదాలన్నీ మానివేశాడు. పత్రికా రిపోర్టర్లంటే దూరంగా పారిపోతాడు. తన ముఖ్య స్నేహితులతో కూడా యీ విషయం మాట్లాడుటకు విముఖత్వం కనబరచేవాడు.

ఇన్ని ప్రయాణాలు చేయుటవల్ల ట్రెయినింగు నిర్లక్ష్యం చేశావుగదా అని విచారించేవాడు. సరియైన, తృప్తికరమైన తయారీలో లేడు. ఆస్ట్రేలియాలో ఆటలు అయిపోయిన తర్వాత, తన సైనికోద్యోగ విధుల నిర్వహణకు తిరిగి వచ్చాడు. ఆస్ట్రేలియాలో 10,000 మీటర్ల పందెం 29 నిమిషాల 38 సెకండ్లలో గెలిచాడు.

సెప్టెంబరు ఆఖరువారంలో, తన స్పోర్ట్స్ క్లబ్బు కమిటీ మెంబరు నొకనిని ఎమిల్ కలుసుకొన్నాడు. సహజంగా కోల్పోయిన ప్రపంచ రికార్డును గూర్చి సంభాషణ జరిగింది. అతను ఎమిల్ నడిగాడు :

"ఈ సంవత్సరం ప్రపంచ రికార్డును తిరిగి గెలవదలుచుకోలేదా? ఇదంతా మన కెంత అవసరమో నీవు గుర్తించే వుంటావు".

"అవును, నాకు తెలుసు; కాని యీ మధ్య అసలు నాకు ట్రెయినింగే లేదు (ఎమిల్ అర్థం మామూలు ట్రెయినింగు లేదనికాదు. ట్రెయినింగు తీవ్రంగా, దీక్షగా చేయుటలేదని మాత్రమే).

"సాయంత్రాలు ఆనందంగా ఉంటున్నాయి. నీ వీ సమయం వృధాగా పోనీయకూడదు. ఈ సాయంత్రాలను పూర్తిగా వినియోగించాలి. నీవు తయారగుటకు ఎన్నాళ్ళు పడుతుంది" అని అడిగాడు కమిటీ మెంబరు.

"అధమం 3 వారాలు; రెండువారాలు తీవ్రంగా, ఒక వారం తేలికగా ట్రెయినింగు కావాలి" అన్నాడు ఎమిల్.

"అయితే అక్టోబరు 20 వ తేదీసరికి నీవు తయారు కాగలవన్నమాట. ఓస్ట్రావా స్టేడియం నీ కనువైనదేనా? అక్కడ మార్గం, వాతావరణం అంతా బాగుంటుంది."

ఈ అవకాశం, ప్రపంచ రికార్డును భగ్నంచేసే ప్రయత్నంగా మార్చుకోవాలి. ఎమిల్ యింక కాదనలేకపోయాడు. ఇప్పటివరకు ఏ భావాలతో చెలగాటమాడుతున్నాడో, వాని కొక స్వరూప మేర్పడుతూంది.

క్లబ్బులో ఎవరూ యీ విషయంలో ఎక్కువగా ఆందోళనపడలేదు. అక్టోబరులో ప్రపంచ రికార్డును భగ్నమొనర్చే ప్రయత్నం జరుగుతూందని ప్రకటించుట ఉన్నతమని కొందరి అభిప్రాయం. వాతావరణం బాగుండకపోతే, దీని పర్యవసానమేమిటి ?

ఏమైనా ప్రస్తుతం ప్రకటన చేయకుండా, యీ విషయం రహస్యంగానే ఉంచారు. కాని, వార్తా పత్రికలకు వ్యాసం వ్రాయమని నిర్బంధ పెడితే, తప్పించుకోవడానికి ఎమిల్ "నాకు వేళలేదు, ప్రపంచ రికార్డుకొరకు ట్రెయినింగవుతున్నా" నని చెప్పేడు. దానితో పత్రికలలో పెద్ద అక్షరాలతో:

"ఎమిల్ జటోపెక్ ప్రపంచ రికార్డును తిరిగి గెలుచుకోడానికి ప్రయత్నం" అని ప్రకటనలు బయలుదేరినవి.

నిజమే, ప్రయత్నం విఫలం కావచ్చు. ఎమిల్‌కు కూడా తెలుసు. ఆ రోజు ఆకాశం నిర్మలంగా ఉంటుందని నిర్ధారణగా చెప్పడమెల్లా? కాని తన ప్రయత్న లోపముండదని మాత్రం చెప్పగలడు. అలాగే ప్రయత్న లోపం చేయలేదు.

ఇంక తన ట్రెయినింగు తీవ్రం చేయవలసిన అవసరం మాత్రం స్పష్టం. అంత బ్రహ్మాండమైన ప్రపంచ రికార్డును తిరగ త్రోయుటంటే, ఎంతగా బాధపడాలో ఎమిల్‌కు తెలుసు; సమస్యనంతా పూర్తిగా పునరాలోచించాడు. తన మామూలు పద్ధతి ఉత్తమమైనదన్న నిర్ధారణకు వచ్చాడు.

మొదటిరోజు 200 మీటర్లు 5 సార్లు పరుగెత్తేడు; 400 మీటర్లు 20 సార్లు, 5 సార్లు 200 మీటర్లు పరుగెత్తేడు. 200 మీటర్లు తన శక్తికొద్ది వేగంగా పరుగెత్తేడు. 400 మీటర్లు మామూలు వేగంతో పరుగెత్తేడు.

ఒక పరుగుకు మరొకదానికి మధ్య మరొక విధమైన వేగం ఉపయోగించాడు.

రెండవరోజునుండి 15 వ రోజువరకు, వాని కష్టానికి అంతులేదు: 200 మీటర్లు 5 సార్లు, 400 మీటర్లు 30 సార్లు, 200 మీటర్లు 5 సార్లు; ఇదీ కార్యక్రమం.

అంటే పూర్తిగా 14 రోజులు, రోజుకు 20 కిల్లోమీటర్లకు పైగా పరుగెత్తే వాడు; అందులో 14 కిల్లోమీటర్లు ఊపిరాడని వేగంతో.

అకస్మాత్తుగా 14 వ రోజున ఒక ప్రమాదం జరిగింది. కాలిలోని కండ నొప్పి పెట్టుట ప్రారంభించింది; ఇదివరకొకసారి స్వీడన్‌లో జరిగినట్టు.

ఈసారి మరొక కాలు. "హెమటోమా" కనబడింది. కండ పాడయింది.

ఈ పడిన కష్టమంతా వృధాయేనా? దీన్ని గురించి పైకేమి చెప్పలేదు ఎమిల్. ఇంటిదగ్గర బ్రోస్ సొల్యూషన్‌తో కట్టుకట్టేవాడు.

15 వ రోజు జాగ్రత్తగా ట్రెయినింగయ్యాడు. ట్రెయినింగు మాత్రం అపుటకు ధైర్యంలేదు. అతి తేలికగా పాదాలు వేస్తూండేవాడు.

ఆఖరు వారంలో మొదటి రోజువలెనే ట్రెయినింగు పూర్తిచేశాడు. 17, 19 వ రోజులలో విశ్రాంతి తీసుకుంటూ, కాలునొప్పి ఎలా పరిణమిస్తుందో అని ఆలోచిస్తూన్నాడు. ఎలా వచ్చిందో అలాగే పోయింది, కాలునొప్పి. ఇంక ట్రెయినింగు యధావిధిగా సాగిపోతూంది.

20 వ రోజున 200 మీటర్లు 5 సార్లు, 400 మీటర్లు 10 సార్లు, 200 మీటర్లు 5 సార్లు పరుగెత్తేడు.

21 వ రోజున బాగా బలం చేరుకుంది.

రికార్డులు భగ్నం చేసే మనస్తత్వం బయలుదేరింది. ఎంత కఠినమైన ట్రెయినింగ్ కయినా సిద్ధంగా ఉన్నాడు. అయితే, శరీరారోగ్యం కూడా జాగ్రత్తగా రక్షించు కొంటున్నాడు. పరుగెత్తినప్పుడు మాత్రం శరీరంమీద కనికరం చూపుటలేదు. ఇతర

సమయాలలో శరీర సంరక్షణ వదలలేదు. మేడ ఎక్కడానికికూడ భయపడిపోయాడు. ఎవరైనా అతనిని పైకి మోసుకొని పోవలసిందే. అనవసరపు శ్రమకు లోనయ్యేవాడు కాడు.

పందేనికి తయారయిన ఆ మూడు వారాలలో ఎమిల్ 350 కిలోమీటర్లు పరుగెత్తినాడు.

ఈ బాధ్యతాయుత ప్రయత్నం ఒక విధమైన మానసిక ప్రయాస కలుగ చేస్తూంది. ఒలింపిక్ ఆటలలోవలె యీసారి ప్రత్యర్థులు లేరు.

ఇంత తీవ్రమైన ట్రెయినింగు ఫలితం అనుమానాస్పదమైనప్పుడు మనస్సును ఆందోళనపరుస్తుంది.

ఆస్ట్రియావాలోని నిర్వాహకులు యీ ప్రయత్నం అసలు జరుగుతుందా అని అనుకున్నారు. గురువారంవరకు అనుమానంలోనే ఉంది. ఆనాడు శనివారం, అక్టోబరు 22 న ఎమిల్ ప్రపంచ రికార్డుకొరకు ప్రయత్నం చేస్తున్నాడని అధికార ప్రకటన జరిగింది.

శుక్రవారం సాయంత్రం ఎమిల్, తన క్లబ్బు మిత్రులు ఆస్ట్రియాకు చేరుకున్నారు. ఆనాటి స్వాగత కోలాహలం ఎమిల్‌ను ఆందోళన పరచింది. లౌడ్ స్పీకర్ల సహాయంతో ఎమిల్ ఆగమనాన్నిగూర్చి పట్నంలో ప్రకటన జరిగింది.

"ఎమిల్ జటోపెక్ యిప్పుడే ఆస్ట్రియాకు చేరేడు. ఆయనకు సుస్వాగతం. ప్రపంచ రికార్డుకొరకు ఆయనచేసే ప్రయత్నం సఫలం కావాలని మా కోరిక".

ఈ విధమైన ప్రచారం ఎమిల్‌కు యిష్టంలేదు. అయినా సహృదయంతోనే ప్రవర్తించాడు. మిత్రులతో యీ ప్రచారంగూర్చి వేళాకోళాలతో కాలంగడిచింది. పత్రికావిలేఖరులు స్టేషన్‌లోనే ఎమిల్‌ను కలిశారు. అతను మంచి తయారీలోనే ఉన్నాడని వారి సంపాదకులకు టెలిగ్రాంలు యిచ్చారు.

అతని సౌకర్యానికి అన్ని ఏర్పాట్లు చేయుటకు నిర్వాహకులు సిద్ధంగా ఉన్నారు. ఎమిల్ ఏ హోటలులో ఉంటాడో అడిగారు; కాని తనకు ప్రత్యేక ఏర్పాట్లు అవసరంలేదని, తన మిత్రు లందరితోపాటు బ్యారెక్సులోనే ఉంటానని చెప్పాడు. భోజనంకూడా ప్రత్యేకంగా ఏర్పాటు చేస్తామంటే నిరాకరించి అందరితో సాధారణ భోజనం చేశాడు. ఒక్కటే కోరిక; అది పందెపు మార్గాన్ని గురించి:

"దయచేసి స్టేడియంలో నీళ్ళు చల్లవద్దు. అలా చేస్తే బురదయిపోతుంది; పాదాలంటుకుంటాయి; కాలు గట్టిగా వేసి పరుగెత్తడానికి వీలుండదు" అన్నాడు ఎమిల్.

"అయితే పిక్కలు నొప్పి పెడతాయేమో" అన్నారు నిర్వాహకులు.

"ఆ భయం లేదు. మార్గం మెత్తగాఉంటే, కాలు జారిపోతుంది; గట్టిగా ఉంటే కాలి ఒత్తిడికి తట్టుకుంటుంది".

సాయంత్రం స్టేడియంకు వెళ్లి, ట్రెయినింగయ్యాడు. 4 సార్లు పరుగెత్తేడు. తర్వాత యింటికిపోయి, భోజనంచేసి నిద్రపోయాడు.

ఆతని గదిలోనున్న మిత్రులకు ఆతని విజయానికి ఏమికావాలో తెలుసు; ఆతనికి కావలసింది ధైర్యం; ఆత్మవిశ్వాసం.

గత 3 వారాల ట్రెయినింగు తనకు మంచి సంసిద్ధత నిచ్చిందని ఎమిల్ కు తెలుసు; అయినా ఫలితంగూర్చి యిప్పు డాలోచించ దలచుకోలేదు.

శనివారం కార్యక్రమం సిద్ధంచేసుకోవాలి. తన వేగ గమనం తెలిసికోకపోతే, ప్రపంచ రికార్డులకు ప్రయత్నించుట అర్థంలేనిపని.

ఏ ఘట్టంలో ఎంత వేగంగా పరుగెత్తాలి? ఇదొక గణిత సమస్య.

ఒక్కొక్కఘట్టం 70 సెకండ్లచొప్పున పరుగెత్తితే, 29 నిమిషాల 19 సెకండ్లలో పరుగు పూర్తిచేస్తాడు. అయితే అంత వేగంగా పరుగెత్తుట వీలుకాదు. కాని 71 సెకండ్ల చొప్పున లెక్కవేస్తే 29 నిమిషాల 35 సెకండ్లు పడుతుంది. అయితే ప్రపంచ రికార్డును మించుట జరగదు.

ఒక్క సెకండు ఎంతపనైనా చేస్తుంది. ఫలితం ఆ సెకండుమీద ఆధారపడి ఉంటుంది.

అందుచేత 29 నిమిషాల 23 సెకండ్లలో పూర్తిచేయాలన్న పథకా న్ననుసరించాలని నిర్ధారణ చేసుకొన్నాడు. ఒకఘట్టం 70 సెకండ్లయితే, రెండవఘట్టం 71 సెకండ్లు; ఈ విధంగా కార్యక్రమం ఏర్పాటుచేసుకొన్నాడు.

ఇంక, అంతా ఎమిల్ యొక్క సాహసం, మానసికశక్తిమీద ఆధారపడి ఉంటుంది.

# ప్రపంచ రికార్డుకొరకు యుద్ధం

ఈ చరిత్రాత్మకమయిన అక్టోబరు 22 వ తేదీ అంత శుభప్రదంగా ప్రారంభం కాలేదు. వాతావరణం అనుకూలంగా లేదు. పరుగుమార్గానికి అడ్డంగా ఉత్తరాన్నుండి చలిగాలి వీస్తోంది. ఆకులు గాలిలో కెగిరి గిర్రున తిరుగుతున్నాయి; ఫాక్టరీలనుండి వచ్చే పొగ ఆకాశం అంతా ఆవరించింది. కాని సాయంత్రం 4 గంటలకు పందెం ప్రారంభమయ్యే వేళకు గాలి తగ్గిపోయింది.

కాని అందరికి ఆందోళనమాత్రం తగ్గలేదు. నల్లటి మేఘాలు ఆకాశమంతా అలముకున్నాయి. గాలివానకు ముందుండే ఆందోళన ప్రజల నావరించింది. వేల కొలది ప్రజలు స్టేడియంవద్ద చేరుకున్నారు. స్టేడియం మధ్యప్రదేశం అంతా అలం

కారాలతో నిండి ఉంది. పందేలలో పాల్గొనేవారంతా చేరుతున్నారు; ఏవో చిన్న చిన్న పందేలు జరుగుతున్నాయి. కాని, అందరి దృష్టి ప్రపంచ రికార్డుమీదనే ఉంది.

ప్రకటనలు చేసే అధికారి మైక్‌వద్ద నిలబడ్డాడు. ఏదో ఆలోచిస్తున్నాడు. ఆతని ముందు హీనో, జటోపెక్‌ల ప్రపంచ రికార్డుల వేళలు పెట్టుకున్నాడు. వేళలు చూచే అధికారి బల్లమీద స్టాప్ వాచీలు మొదలకుండా వున్నాయి. వాటి లోహపు హృదయాలు యిక కొట్టుకోవడం మొదలుపెడతాయి. నిమిషాలు, సెకండ్లు, సెకండ్లలో పదో భాగాలు కనికరంలేకుండా, ఆ పందెంలో పరుగెత్తేవీరుడు ప్రతి నిమిషం, ప్రతి సెకండు, సెకండులో భాగం ప్రాణసమానంగా చూచుకుంటూన్నట్టు తెలియకుండా ఆ వాచీలు చూపిస్తుంటాయి.

ఆ క్షణం వచ్చింది. లౌడ్‌స్పీకర్లు పందెంలో పాల్గొనేవారిని పిలుస్తున్నాయి. మొదటి పరుగుపందెగాళ్లు వచ్చారు.

అడుగో వచ్చాడు. అందరూ ఆతనిని గుర్తించారు. ప్రేక్షకులు పలుక రించారు. అఖండమైన స్వాగత నినాదాలు బయలుదేరేయి. వారేమంటున్నారో ఒక్క మాటయినా స్పష్టంగా తెలియుటలేదు. కాని అర్థంమాత్రం అందరికీ తెలిసింది.

"ఎమిల్! నీ యీ పోరాటంలో నీకు సహాయంచేయుటకు వచ్చాం; మే మిక్కడే ఉన్నాం; మామీద విశ్వాసముంచు."

రాగలిగిన ప్రతివ్యక్తీ స్టేడియంకు రానేవచ్చాడు. జనాభాలో సగానికి ఎక్కువగా అక్కడే వున్నారు; ఉక్కు ఫ్యాక్టరీ కార్మికులు, విద్యార్థులు, ఆఫీసు ఉద్యోగస్తులు హాజరయ్యారు. ఇంకా చుట్టు ప్రక్కల జిల్లాలనుండికూడా ప్రజలు వచ్చారు. ఆ ప్రపంచ రికార్డుకొరకు ప్రయత్నం ఎలా జరుగుతుందో చూడాలని అందరికీ వుత్సాహమే.

ఎమిల్ అంటే ముఖ్యంగా కార్మికులకు అభిమానం. వారు కర్మాగారాలలో పనిచేస్తూంటే, వారిని చూచుటకు ఎమిల్ చాలాసార్లు వచ్చాడు. వారితో ఆటలను గూర్చి మాత్రమే కా దతను సంభాషించింది. వారి యంత్రాలు ఎలా పనిచేస్తాయో వారి నడిగి తెలిసికొనేవాడు. అంతేకాదు, తానుకూడా యంత్రాలను నడపేవాడు. ఇదే వారి అభిమానాన్ని యినుమడింపచేసింది; దాని ఫలితమే వా రాతని కిచ్చిన బ్రహ్మాండమైన స్వాగతం.

ఎమిల్ పందెపు దుస్తులు ధరించాడు. అతని తెల్లటి వస్త్రంమీద ఆర్మీ స్పోర్ట్సు క్లబ్ అని తెలియజేసే అక్షరాలు ఎ. టి. కె. స్పష్టంగా కనుపిస్తున్నాయి. చేతులు సునాయాసంగా ఊగిస్తున్నాడు;అరచేతులతో కాళ్ళు, పిక్కలు తడుముకుంటున్నాడు. ఆతని వేళ్ళ ఒత్తిడికి బిగుసుకుపోయిన కండలు కదలుట ప్రారంభించాయి. ఒక్క సారి ఆ గాయం ఏమి మోసంచేస్తుందోననే భయంతో దానివైపు చూస్తాడు. ఒక్కొక్కసారి నెమ్మదిగా దాన్ని తాకి ఆ నొప్పి విషయం మరచిపోదామనుకుంటూ వుంటాడు. అక్కడే ఆత్మవిశ్వాసంతో అటూ, యిటూ పచారుచేస్తూ, కరతాళ

ధ్వనులు చేస్తూన్న ప్రేక్షక సమూహంవైపు చూస్తూ, ఆనందం తెలియజేయుటకు చేతు లూపుతున్నాడు ఎమిల్.

పరుగెత్తే పందెగాళ్ళంతా వరుసగా నుంచున్నారు. అప్పటికి ఎమిల్‌కు, యితరులకు ఏమీ భేదం కనబడలేదు. అయినా ఎమిల్ మీద ఎన్నో ఆశలు కేంద్రీ కరింపబడి ఉన్నాయి.

ఈ రోజు మనందరి ఆనందానికి ఎమిల్ కారణం కావచ్చు. మన జాతీయ పతాక గౌరవానికికూడా అతడు కారణం కావచ్చు. మన ఆశల కాతడు నిలయం. 20 వేలమంది ప్రేక్షకులు ప్రపంచ రికార్డు తిరిగి తమదే ననిపించుకొనుటకు నిశ్చ యించుకున్నారు. అందరికీ యీనాడు ఒక్కటే హృదయం; రెండే ఊపిరితిత్తులు.

"జెటోపెక్! జటోపెక్! జటోపెక్!!" ఆ పేరే అందరి పెదవులమీద.

ప్రేక్షకులంతా ప్రారంభంనుంచికూడా పందెపు తీరును గమనిస్తున్నారు. ప్రపంచ రికార్డుమీద దృష్టితో, మొదటిక్షణంనుంచి జటోపెక్‌ను ముందుకు పరు గెత్తించే కోలాహలం. ఈసారి ఆఖరిఘట్టంలో ఉత్సాహపరిచే పద్ధతికాదు; మొదటి నుంచీ, ప్రతి ఘట్టంలోనూ ఎమిల్‌కు ఉత్సాహం యివ్వాలి. ప్రజాసమూహానికి నాడు హృదయం ఒక్కటే; అదే ఎలుగెత్తి అరుస్తూంది, ఎమిల్ విజయంకోసం. అదే ఆతనికి ధైర్యాన్ని, బలాన్ని యిచ్చింది. అదే అతనికొరకు ఆందోళన పడింది; అతని దీక్షకు రెక్కల నొసగింది.

ఈనాడు ఎమిల్ లౌడ్ స్పీకర్లలో ప్రకటించే వేళలమీద ఆధారపడుట లేదు. ఒకరి మాట లొకరికి వినిపించుటలేదు.

ఎమిల్ పరుగెత్తుతున్నాడు.

అతన్ని ప్రోత్సాహపరుస్తున్న జన సమూహంనుండి దూరం అయినాడు.

ఆతని పరుగువైపే అందరి దృష్టి. ఇదివరకల్లా హాయిని కలిగించిన ఆతని పరుగు ఫక్కీవైపే అందరూ తదేక ధ్యానంతో చూస్తున్నారు. ఆతని శరీరపు ఊర్ధ్వభాగం కొంచెం ముందుకు వంగింది. ముందున్న మార్గంమీదనే ఆతని రెండు నేత్రాలు. భుజాలు మామూలు ధోరణిగానే చేతుల కదలిక ననుసరిస్తున్నాయి. ఎడమచెయ్యి ముందుకు పోతుంది; తరువాత కుడిచెయ్యి కొంచెం క్రిందుగా. నమ్మ డానికి వీలులేనంతవేగంతో ఆ పాదాలు మార్గాన్ని వెనక్కు త్రోసుకొనిపోతున్నాయి. మా ప్రక్కనుంచి ఎప్పుడు పోయాడో! మా కాతని వీపుమాత్రం గోచరమవుతూంది; ఆతని ప్రత్యర్థులకు ఆ వీపు చాల పరిచయం. ఆతని భుజాలు 'పిస్టన్ రాడ్లు'వలె ఎడ తెగకుండా పనిచేస్తున్నాయి.

ఆతని అద్భుత మనోనిశ్చయానికి అమరత్వం యిచ్చే స్వరూపాన్ని చిత్రించ లేకపోవుట ఒక తీరనిలోపం.

హీనో, తన ప్రపంచ రికార్డు సృష్టించిన సమయంలో మొదటి ఘట్టాలలో ఊహించలేని వేగంతో పరుగెత్తినాడు. అందుచేత ఆ ఘట్టంలో ఆతనికంటె ఎమిల్ 2 సెకండ్లు వెనకపడ్డాడు; రెండవ ఘట్టంలో 4 సెకండ్లు వెనకపడ్డాడు. కాని తన

వేళల కార్యక్రమంమాత్రం చెదరకుండా పరుగెత్తుతున్నాడు. మొదటి ఘట్టంలో కొద్దిగా నెమ్మదిగా పోయాడు; అందుచేత తరవాత కొంచెం వేగం అధికంచేశాడు. ఈరోజు తన శక్తిని జాగ్రత్తగా వాడవలసిన అవసరంలేదు. క్రమంగా హీనో వేళల నందుకున్నాడు. మూడవ కిలోమీటరు చేరేసరికి రెండు సెకండ్లు వేగంగా పోయాడు. ఈ విధంగా 4, 6, 7 సెకండ్లు ఆదాచేశాడు.

6 కిలోమీటర్లు : 17 నిమిషాల 36 సెకండ్లు.

7 కిలోమీటర్లు : 20 నిమిషాల 35.5 సెకండ్లు.

ప్రతి కిలోమీటరుకు 3 గడియారాలు ఆగిపోతాయి. తక్కినవి నడుస్తూ వుంటాయి. ఆగిపోయిన గడియారాలు జాతీయ రికార్డుల నతిక్రమించుటకు సూచిస్తవి. ఇప్పటి ప్రపంచ రికార్డులను మించిపోయిన వేళ లివి.

ఆతనితో పరుగెత్తే వారందరు ఎక్కడో వెనకబడిపోయారు. ప్రత్యర్థులు బాగా పరుగెత్తుటకు ప్రయత్నం వదలలేదు. కాని ఎమిల్ వేగంముందు, పాపం వారెక్కడ ఆగగలరు.

ప్రేక్షకస్థానాలకు మీద నున్న పెద్ద గడియారం వేళ చూపిస్తూంది. ప్రతి సెకండూ యింత విలువైనదా అనిపిస్తుంది. "ఇప్పుడు, యిప్పుడు, యిప్పుడు, సమయం మించిందంటే నరెప్పుడూ వీలుండకపోవచ్చు!" ఎమిల్ ఒక్క సెకండు కూడా వృధాచేయుటలేదు; ఒక్క మీటరుకూడా వృధా చేయుటలేదు. ప్రతి అడుగులోనూ తన యాంత్రశక్తిని ఉపయోగిస్తున్నాడు; వేగం అధికం చేస్తున్నాడు.

8 వ కిలోమీటరులో ప్రమాదం సంభవించింది. హీనో రికార్డుకంటె 7 సెకండ్లు ముందున్నా, తన పూర్వపు రికార్డుకంటె 14 సెకండ్లు ముందున్నా, తన వేళల పథకానికి వెనకపడి ఉన్నాడు. టైము కీపరుండా పైకి వెళ్ళింది, యింకా ఎమిల్ 'మార్కు' వద్దకు రాకముందే. అప్పు డాతడు విన్నాడు: ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు. అప్పుడుగాని 'టైముకీపరు'ను దాటలేదు.

ప్రేక్షకులు ఆందోళన చెందేరు; వేళ : 2 నిమిషాల 55 సెకండ్లకు బదులు, దాదాపు 3 నిమిషాలని ప్రకటన చేసినప్పుడు వారందరికి ఆశాభంగం కలిగింది.

"ఎమిల్! ఎమిల్! యింకా వేగంగా" అనే కేకలు బయలుదేరాయి.

తొందరగా అందరూ లెక్కలువేయుట మొదలుపెట్టేరు. ఈ వేగంతో హీనో రికార్డుకూడా వెనకబడిపోతాడా? తన రికార్డుకే వెనకబడిపోతాడా? అప్పుడు యీ ప్రయత్నమంతా వృధా!

"ఎమిల్! ఎమిల్! యింకా వేగంగా పరుగెత్తు."

కేకలు ఎక్కువయ్యాయి. ఊపిరాడకుండా, ఒగరుస్తూ పరుగెత్తేవాని వాని చుట్టూ యీ ధ్వనులే.

"జటోపెక్!" అని యీ కోలాహలంలో పిలుపు, ఏదో ఆపదలో సహాయం కోరినట్లు.

తన పందేన్ని చూస్తున్న వేలకొలది జనం నైతికంగా, హృదయాలతో సహా తన వెనకనున్నారని ఎమిల్‌కు తెలుసు. తన కెంతైనా సహాయం చేయుటకు వారంతా ఉత్సాహంతో వున్నారనికూడా తెలుసు. తన్నావరించిన ఆయాసం, అలసట, బాధ వీనిని గెలుచుటమీద అంతా ఆధారపడి ఉంటుంది.

అతని ముఖం చిట్లింది. రికార్డును భగ్నమొనర్చుటలో తనకు విజయమా, పరాజయమా ? ఆ కఠినమైన ట్రెయినింగుకు ఫలితం ఏమిటి? 8 కిలోమీటర్ల పరుగు తర్వాత ఓటమేనా ? అలాగ ఎప్పటికీ జరుగుటకు వీలులేదు. ఎప్పుడూకూడా అతని శరీరం అతనికి స్వాధీనమే; ఇప్పుడుకూడా అంతే! కాని, అంత సులభమైన కార్యం కాదు. అయినా ఎమిల్ మానసికశక్తి నశించలేదు. చివరకు కాళ్లు వేగంగా అడుగులు వేస్తున్నాయి. తన కిష్టమున్నా లేకపోయినా ప్రేక్షకులతో తన అడుగులు లయ కలిపినవి. ఏదో మగత కమ్మిన చెవుల పిల్లిలాగ పరుగెత్తుతున్నాడు; అతని కేమీ కనబడడంలేదు, వినబడడంలేదు. అతని మెదడు మాత్రం చెప్తోంది: "ఇంకా వేగంగా, యింకా వేగంగా !" అని.

9 వ కిలో మీటరులో వేగంగా పరుగెత్తేడు. ఈసారి తన పథకానికి 3 సెకండ్లే వెనకున్నాడు; మరొక్క కిలోమీటరు పరుగెత్తాలి. మామూలు వేగం పనికి రాదు.

"ఎమిల్ ! ఎమిల్ !" కేకలు.

ఆ కేకల వెనక ఆందోళన; దానితోపాటే విజయంలో నమ్మకం. ప్రేక్షకు లింక కూర్చోలేకపోయారు; నిలబడ్డారు. ఎమిల్ ఎంతమాత్రం మాకు ఆశాభంగం కలిగించడు. వేలకొలది ప్రేక్షకుల కోలాహలంలో విశ్వాసం, విజయం, ఆనందం మిళితమై ఉన్నాయి.

స్టేడియంమీద చీకటి నీడలు పడుతున్నాయి. పరుగెత్తేవాళ్ళ కళ్లు చెదరకుండా కెమేరాలను మూలపెట్టేరు ఫొటోగ్రాఫర్లు.

ఏదో శక్తిపూనినట్టుగా అమితమైన బలంతో, ఒక పిచ్చిదీక్షతో, చల్లని ఆ సంధ్యా సమయంలో అలా పరుగెత్తుకుపోతున్నాడు ఎమిల్. అతని ఒక్కని మనోబలంతోనే కాదు ఎమిల్ పరుగెత్తుతున్నది; ప్రజల అందరి మనోబలంకూడా కలిసింది. ఈ మనోబలమంతా కలిసి ఒక మహాప్రవాహమయిపోయి, అతని గుండె, అతని కండలు ఉక్కుగాచేసి గమ్యస్థానానికి అతనిని పరుగెత్తిస్తున్నాయి.

300 మీటర్లదూరం మిగిలిందనగా ఎక్కడో దాచిన అతని శక్తినంతా ఉపయోగించాడు. మా కేక లాతనిని ముందుకు తోస్తున్నాయి. ఇంక 50 మీటర్లే ఉంది. అప్పుడు అలసిపోయిన ఎమిల్, చైతన్యంలేకుండా పరుగెత్తుతూన్న ఎమిల్, ఒక్కసారి తలెత్తి, మావైపు చూచి ఒక్క చిఱునవ్వు నవ్వాడు, మేమంతా అతనికొరకు ఎంత ఆందోళనపడుతున్నామో గుర్తించినట్టు.

రికార్డు విషయమై అతనికి యిప్పుడు ధైర్యంకలిగింది. 'టేపు' ముక్కలు చేశాడు; పిస్టలు పేలింది. ప్రపంచపు రికార్డు మనదేనని ప్రకటించబడింది.

అనుకున్న దానికంటె 2 సెకండ్లు ముందుగా చేరేడు:

29 నిమిషాల 21.2 సెకండ్లు.

తన దేశానికి ప్రపంచ రికార్డును తిరిగి సంపాదించాడు ఎమిల్.

మా అందరి సంయుక్త మనోబలం జయించింది.

ఎమిల్ హృదయం ఆనందంతో నిండింది. ఈ అద్భుతకార్యాన్ని సాధించాడు. ఏదో లోహంతో చేయబడిందా ఆతని గుండె అన్నట్టు కొట్టుకొంటూంది. కొంత దూరం నడుద్దామనిపించింది. కాని అందరూ ఆతనిని కౌగిలించుకునేవారే. ఎత్తి ఆతనిని గాలిలో కెగురవేస్తున్నారు; ఊపిరి సలపనీయుటలేదు. విజయవీరుని చుట్టూ ప్రేక్షక సమూహాలు మూగిపోయాయి. అకస్మాత్తుగా ఎమిల్ కేక వేశాడు:

"చూడండి, మార్గం వదలండి, పరుగు పూర్తికాలేదు..." ఎమిల్ ప్రత్యర్థులు యింకా పరుగెత్తుతూనే ఉన్నారు. వీరి విషయం ఎవరూ ఆలోచించలేదు, ఒక్క ఎమిల్ తప్ప.

సైనిక క్లబ్బులోని తన మిత్రులు ఆతనిని భుజాలమీద ఎక్కించుకొని తీసుకు పోతూంటే, ప్రేక్షక స్థానాలనుండి ఆతని పేరు ప్రతిధ్వనిస్తూంది.

దుస్తులు మార్చే గదిలో డాక్టర్లు హేర్నాఫ్‌తో సహా ఆతనికొరకు వేచి ఉన్నారు. ప్రపంచ రికార్డు ప్రదర్శన తర్వాత పరుగుపందెగా డేస్థితిలో ఉంటాడో వారిప్పుడు నిర్ధారణగా చెప్పగల అవకాశం వచ్చింది. ఆతని గుండె ఎలా కొట్టు కుంటుందో, ఆతని రక్తపుపోటు మొదలైన వివరాలన్నీ వారు స్వయంగా పరీక్షించి తెలుసుకున్నారు.

అన్ని కోణాలనుంచి ఎమిల్ ఫొటోగ్రాఫులు తీయబడ్డాయి. అతను స్నానం చేస్తూన్నప్పుడు ఎంతో ఆనందంగా ఉన్నాడు; గట్టిగా నవ్వుతున్నాడు. ఎక్కువ అలసటగా లేదతనికి. కార్యం పూర్తిఅయింది. ఒక ఫిల్ము చూచినట్టుగా ఆ పందెమంతా ఆతని కంటి యెదుట కనబడుతూంది.

ఇప్పుడు యీ సంస్మరణలకు వేళ లేదు. ఆతని తండ్రి, తల్లి, తమ్ముడు, ఉక్కు ఫ్యాక్టరీ పనివాళ్లు, అంతా అతనికొరకు ఎదురు చూస్తున్నారు. వారందరికి అతను కావాలి. వారందరూ అతనిని ఆహ్వానించా లనుకుంటున్నారు. అభినందనలు, టెలిగ్రాంలు, టెలిఫోను సందేశాలు కుప్పలు కుప్పలు వేచివున్నాయి ఆతనికొరకు. ఆధ్యాత్మికంగా ఎంతమంది ఆతనికి మద్దతు యిచ్చారో, ఎమిల్‌కు యిప్పుడు బోధపడుతూంది.

ముఖ్యంగా ఒక సందేశం ఆతనికి సంతోషం కలిగించింది. అది రిపబ్లిక్ ప్రెసిడెంటువద్దనుండి; ఆటలలో తన అభిమానం చూపిస్తూ, ఆ సందేశంలో ఆయన అన్న మాట లివి:

"ప్రపంచ రికార్డు నీవు మరొకసారి గెలిచినావన్న వార్త నా కెంతో సంతోషం కలిగించింది. నిన్ను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. మన దేశం, మన ప్రజలు నిన్ను చూచి గర్విస్తున్నారు."

ఎమిల్ తండ్రి ఆతని నింక చీవాట్లు పెట్టడు; పరుగెత్తవద్దని ఆతనిని వారించడు. ఎన్నాళ్ళయింది ఆతని కుటుంబంవారు ఆటలలో పాల్గొనవద్దని ఆంక్ష పెట్టి?

ఎన్నాళ్ళయింది ఆతని సోదరుడు ఆతనిని యీ విధంగా ప్రార్థించి: "ఎమిల్, నీవంటే ఎవరైనా సిగ్గుపడిపోయేటట్టు పొలాలకు అడ్డంగా పరుగెత్తకు, ఏదో పిచ్చెత్తినవానిలాగ."

ఎన్నాళ్ళయింది ఆతని తల్లి యిలాగని హెచ్చరించి: "ఎమిల్! అంతవేగంగా పరుగెత్తకు; క్రింద పడిపోతావు."

అప్పటినుంచి గమనిస్తే అభిప్రాయాలు ఎంతగానో మారిపోయాయి. ఆస్లోలో యూరోపియన్ ఛాంపియన్‌షిప్పు లయిపోయిన తర్వాత, తండ్రి డ్రాయర్లలో వార్తాపత్రికల కత్తిరింపుల కుప్ప కనబడింది, ఎమిల్‌కు.

"నాన్నా! యీ కత్తిరింపులు జాగ్రత్త పెడుతున్నావా?" అని ఎమిల్ అడిగాడు, తండ్రి స్వభావంలో మార్పుకు ఆశ్చర్యం కనబరుస్తూ.

"ముఖ్యమైనవే జాగ్రత్త పెట్టాను. అంతర్జాతీయ పోటీలకు సంబంధించినవే..." అన్నాడు తండ్రి, ఆనందాన్ని అణుచుకుంటూ.

ఎమిల్ తన జోళ్ళను మరామతు చేసుకుంటూంటే, తన పనిముట్లనిచ్చాడు తండ్రి.

ఈ విధమైన స్వల్పమైన విషయాలు తలుచుకొని, కుటుంబ సమావేశాలలో అందరూ నవ్వుకుంటూంటారు. అప్పటినుంచి యిప్పటికి ఎంతకాలమయింది? ఇప్పుడు ఆతని స్వస్థలంలో ఆతని పేర "జటోపెక్" అని ఒక స్టేడియం నిర్మిస్తున్నారు.

ఆ మరుసటిరోజు స్టేడియం నిర్మాణస్థలానికి వెళ్లదలచుకున్నాడు ఎమిల్, పనిముట్లతోసహా!

ఆతని కిచ్చిన సన్మానం నేత్రపర్వంగా ఉంది. ఒక యువతి ఆతని కొక పూల గుత్తి నిచ్చి, దానితో నొక ముద్దుకూడా యిచ్చింది. అందరూ ఆతనితో కరచాలనం చేసి, అభినందించారు. పరుగు మార్గం ఆదర్శంగా తయారుచేస్తామని ప్రజలు వాగ్దానం చేశారు. దానిని, తన స్వస్థలంలోనే మరొకసారి ప్రపంచ రికార్డు స్థాపించేందుకు వీలుగా తయారు చేస్తామన్నారు.

అంతా అయిపోయిన తర్వాత ఎమిల్ చొక్కా విప్పి, స్వయంగా కొన్ని గజాల మార్గం చదును చేసేవరకు వదలలేదు.

తర్వాత ప్రేగ్‌కు ప్రయాణం. అన్నిటికంటే అద్భుతమైన సన్మాన మతనికి అక్కడ జరిగింది. డానా ప్రపంచ రికార్డును సృష్టించిన తన భర్తను ఆనందంతో కౌగలించుకొని ముద్దు పెట్టుకుంది.

టీ, శాండ్విచెస్‌లు తింటూ అర్ధరాత్రివరకు పందెం వివరంగా వర్ణించవలసి వచ్చింది.

క్రీడలకు, వ్యక్తులకు సంబంధం లేనట్లు, ఎమిల్ వర్ణిస్తే, అతని భార్య ఇట్లా అంటూ వుండేది: "ఆ మాటలు నమ్మకండి; ప్రపంప రికార్డు నెలకొల్పిన తర్వాత ఒక నక్షత్రంవలె మెరసిపోయాడు; ఆ రాత్రంతా ఆవేశంలో నిద్రపోలేదు."

వేళలను పోల్చి చూచుటతోటే ఎమిల్ ప్రపంచ రికార్డు చరిత్ర పూర్తికాలేదు.

ఈ మహత్తర ప్రదర్శనం అనేకమంది యువకులలో ఆశలు రేకెత్తించింది. వారు 'ప్రాక్టీస్' చేయవలచారు; ట్రెయినింగు అవాలన్నారు; ఎమిల్ జటోపెక్‌ను ఆదర్శంగా వుంచుకొని దీక్షతో, పట్టుదలతో ఆటలలో ప్రవేశించుటకు నిశ్చయించారు.

వ్యాయామ శిక్షకులు పనికావాలని దరఖాస్తులు పెట్టేరు. వ్యాయామ శాఖలు క్రొత్తగా తెరచారు; క్రొత్త ఆటస్థలాలకొరకు పథకాలు తయారయినవి.

ఒలెంపిక్ ఆట, పరుగు పందెం, క్రీడారంగంలో ప్రముఖస్థానం వహించింది.

# ఎమిల్ సంభాషణ - తత్వం

ఎమిల్‌కు సెలవు దొరికింది. విదేశ ప్రయాణాలతో చాలాభాగం గడిచి పోయింది. అయినా యింకా కొన్నిరోజుల వ్యవధి ఉంది. కొంత విశ్రాంతి తీసుకొని పోయినబలాన్ని సంపాదిద్దామని అనుకున్నాడు.

దూరంగా ప్రశాంతస్థలానికి పోదామని 'హైటట్రాస్'లో ఒక స్థలానికి డానా, ఎమిల్ ప్రయాణమయ్యారు. ఇక్కడ పర్వతశిఖరాలమీద శాంతి, విశ్రాంతి ఆశించారు వారు యిద్దరూ.

ఆ మంచుతోనిండిన పర్వతశిఖరాలన్నీ నవంబరు మేఘాలమధ్య చిక్కుకున్నాయి. మిణుకు మిణుకుమనే నక్షత్రాలకాంతిలో ఆ శిఖరాలు దయ్యాలవలె కనిపిస్తున్నాయి. ప్రొద్దుట మంచు కురుస్తుంది, తరవాత కరిగిపోతుంది. మంచుపొగ లోయలలోకి దిగి, చెట్లకొనలకు ఎగిలి మాయమయిపోతూంటుంది.

అక్కడ చెమ్మ, చలి. అయినా, ప్రొద్దున్నే ట్రెయినింగుమాత్రం వదలడు ఎమిల్. వెచ్చని దుస్తులు వేసుకొని, బూట్లు గట్టిగా కట్టుకొని, చిన్నగా పరుగెత్తుతూ శానిటోరియం ప్రక్కనుంచి పోయేవాడు.

నిర్జనమైన మార్గం, చెట్లప్రక్కని చెమ్మగిలిన కాలిబాట, వివర్ణమైన మొక్కలు, మంచులో తడిసిన పచ్చికబయళ్లు ఆతని పాదాలచప్పుళ్ళను ఆశ్చర్యంతో వింటూవుండేవి!

మేఘాలు వంగి తలమీద పడుతూంటే ఎమిల్ పరుగెత్తేవాడు. దారిలేని అడవి ప్రదేశంలో చిన్న నీటిగుంటల మధ్యనుంచి, పచ్చికబయళ్ల ఎత్తుపల్లాలగుండా ఎమిల్ గంతులువేస్తూ, పరుగెత్తుతూ వుండేవాడు. విశ్రాంతి తీసుకోవడానికి యిక్క-

డకు వచ్చినా యిదే పని. ఇక్కడకూడా వేగంగా, అతివేగంగా పరుగెత్తడానికి ప్రయత్నం వదలలేదు. గట్టిగా ఊపిరిపీలుస్తూ, ఆ చల్లని గాలితో ఊపిరితిత్తులను శుభ్రపరచుకుంటూ వుండేవాడు.

ఆ గుబురుగానున్న చెట్లమధ్య పరుగెత్తుతాడు. వెంటనే యింటికి వస్తాడు. అక్కడెంతో మంచు ఉండదంటాడు. ఆ స్థలం తొమ్మిది కిలోమీటర్ల దూరముంది!

మధ్యాహ్నం డానాతో షికారు వెడుతూండేవాడు. ఆ సమయంలో సూర్యకిరణాలు ఆ నవంబరు చలిని దూరంచేస్తాయి. ఇద్దరూకూడా ఒక్క నిమిష మైనా ప్రశాంతంగా ఊరుకోరు. ఎప్పుడూ పరుగులే. పరుగెత్తడమే వారికి హాయి నిస్తుంది. అక్కడనుంచి మంచు బంతులతో ఆట; వాటిని విసరటంలో ఎమిల్ కన్నా డానాకి నిదానం, గురి ఎక్కువ.

ఎమిల్ ఆ మంచుకొండలలో లోతయిన ప్రదేశాలలో యీ గట్టునుంచి ఆ గట్టునకు వురుకుతూ వుండేవాడు. చెట్ల కొమ్మలను పట్టుకొని ఊగుతూ, అక్కడ నుంచి మంచుపరుపుమీదకు ఉరుకుతూ వుండేవాడు. తర్వాత ఒకరిమీదనుంచి ఒకరు కప్పగంతులు వేయడం. "నా బుర్ర ఎగిరిపోతుంది సుమా" అంటూ వుండేది డానా ఒక్కొక్కప్పుడు!

"నీకేమీ భయంలేదులే" అంటూ పరుగెత్తుకు వచ్చి, డానా తలమీదనుంచి వురుకుతూ వుండేవాడు, ఎమిల్.

ఎమిల్‌ను యీ కోణంనుండికూడా తెలిసికొనుట ఆనందంగా ఉంటుంది. ఆ పరుగులు, ఉరుకులు, గంతులు ఆతని యువ హృదయాన్ని, సంతోషంగా కాలం గడుపుదామన్న కోరికని తెలియజేస్తాయి. ఏ విధంగా తన కోరికలను నెరవేర్చుకో వాలి, ఏ విధంగా కార్యం సాధించాలి అనే విషయం అతనికి బాగా తెలుసు. చిన్న పిల్లవాడిగా ఉన్నప్పుడు, అతని కా చురుకుతనం లేదు. కాని ఫాక్టరీ లో స్వతంత్రంగా పనిచేస్తున్నప్పటినుంచి, ఆతనికి వ్యవహారాలు చక్కదిద్దుకొనే నేర్పు అలవడింది. ఒకరోజు నా టైపురైటరు మరమ్మతు చేసిస్తాడు. ఇంకొక రోజు తన విరిగిన తలుపును బాగుచేసుకుంటాడు. ఎప్పుడూ సుత్తి అతని దగ్గరే ఉంటుంది. కిటికీలన్నీ మరమ్మతు కోరుతున్నాయి. సరే, మేకులు తీసుకువచ్చి గ్లాసు తలుపులు కదలకుండా చేస్తాడు, రాత్రి శబ్దంచేయకుండా.

ఇంక యిప్పుడు నా కెదురుగా ఆటల దుస్తుల్లో, కేసరి చిహ్నం కోటుమీద మెరుస్తూంటే, నేనడిగే ప్రశ్నలకు జవాబు చెప్పేందుకు ఎమిల్ సిద్ధంగా ఉన్నాడు.

ప్రతిరోజు కొన్నిగంటలు నాతో కూర్చోవడానికి అంగీకరించాడు. నా పుస్త కానికి కావలసిన విషయాలన్నీ సేకరించుటకు ఆతనితో పనిచేయుట నాకిష్టం. ప్రతి ప్రశ్న జాగ్రత్తగా ఆలోచిస్తాడు; అనాలోచిత జవాబు లియ్యడు. ఏదైనా వర్ణిస్తుంటే ఆతని ముఖంలో తీవ్రత కనబడుతుంది. ఏదైనా ప్రత్యక్షంగా చూపించాలంటే, లేచి చేతులతో చేసి మనకు బోధపరుస్తాడు.

అతను మాట్లాడునప్పుడుగాని, ఏదైనా వివరించి చెప్పునప్పుడుగాని ఒక్కొక్క సారి ఆ పనిలో నిమగ్నుడై తొందరగా చెప్పుకుపోతాడు; వేగంగా మాట్లాడుతాడు, సాధారణంగా. ఏదైనా నొక్కి చెప్పాలంటే కంఠమెత్తి గట్టిగా మాట్లాడుతాడు. ఏదైనా తేదీనిగూర్చిగాని, పేరునుగూర్చిగాని, వేళనుగూర్చిగాని సరిగా జ్ఞాపకం లేక పోతే డానావైపు తిరిగి :

"సరిగా ఉందా ?" అని అడుగుతాడు.

డానా, కుట్టుకుంటూ ఒకసారి తల ఎత్తుతుంది; అవునో, కాదో చెప్తుంది.

నా కోరికలను నెరవేరుస్తానన్నాడు కదా! అతనిని అష్టప్రశ్నలుకూడా వేశాను, వినోదానికి.

"ఎమిల్ నిన్నొక వింతమనిషి అని అంటారు నీకు తెలుసునా" అని నేను అడిగినప్పుడు :

"అందులో కొంత నిజ ముండవచ్చు, పూర్వం నాప్రదర్శనల గూర్చి నే నెవరితోనూ చర్చించేవాణ్ణి కాను. ఈ ప్రశ్నలను అంతుండేదికాదు, నా ట్రెయినింగుకు వేళయిపోయేది. నాకు దేనికీ వేళ ఉండేదికాదు. నే నెప్పుడూ సినిమాకు వెళ్ళలేదు; ఎక్కడా సైకి డ్యాన్సింగుకు పోలేను. అందుచేత నే నేనొక వింతమనిషి నని ప్రజలనుకున్నారంటే ఆశ్చర్యంలేదు. నా చిన్ననాటి అనుభవాలుకూడా కొంతవరకు కారణం కావచ్చు. జిలిన్ నగరానికి పల్లెప్రదేశంనుంచి వచ్చాను. అక్కడ ప్రజలలో స్నేహభావం తక్కువ. తర్వాత నా ప్రధమ విజయాలు అందర్నీ నావద్ద కాకర్షించాయి. ఈ చేరిక హృదయపూర్వకమైనది కాదు. వారి క్లబ్బులో సభ్యునిగా నన్ను చేర్చుకోవడానికి అదొక ఎత్తు; లేకపోతే నాకు వచ్చిన బహుమతులను సంగ్రహించుటకొక పన్నాగం.

"ఈ కారణంవల్ల వారి కోరికలను నేను మన్నించకపోతే, నే నొక వింతమనిషి నని అంటూవుంటారు" అనేవాడు ఎమిల్.

"అభినందన లందుకోవడమే నీ కిష్టంలేదని, నిన్నుగురించిన ప్రచారం నీకు అయిష్టమని అంటారు ప్రజలు" అని అడిగితే:

"అవును. ఈ ప్రశంసలు హృదయంలోనుండి రావు. కొంతవరకు ఆడంబరాలని అనుకుంటా. ఎకాడమీకి పందేలనుండి తిరిగిరాగానే, ఎంతవేళలో పందెం గెలిచావని ప్రశ్న. "అద్భుతం" అని కరచాలనాలు. ఒకసారి ఒక 'పిచ్చివేళ' చెప్పితే దానికికూడా "అద్భుతం" అని అభినందించారు. 13 నిమిషాలు చెప్పినా, 16 నిమిషాలు చెప్పినా ఒకటేవారికి.

"ఏదో మాట్లాడాలనేకాని, యిదంతా ఏమిటో వారికి తెలియనే తెలియదు" అంటూ ఇంకా యిలా అన్నాడు : "అదీకాక, నా గెలుపులనుగూర్చి నే నెక్కువగా గణించను. నా గెలుపు ఎంత ఉత్తమమైనదైతే, అంత ఎక్కువగా యింకా గెలుపు ఉత్తమతరం చేద్దామని నా కోరిక. ఇలా చేయాలంటే ఆత్మస్వాధీనం యింకా ఎక్కువగా అలవరచుకోవడానికి ప్రయత్నం చేయాలి. విజయాలను మించిన విజయా

లను సాధించాలంటే, విజయాలనుగూర్చి ఆత్మస్తుతి మంచిదికాదు. వివేకహీనంగా, గర్వపోతుతనంగా కనిపిస్తుంది. ఒక విజయానికి మించిన విజయం సాధించగలిగితే, ఆ శక్తి నాలో ఉందన్న మాట; అలాంటప్పుడు ప్రస్తుత విజయాన్ని గురించి ప్రస్తుతించుట అర్థహీనం. అయిపోయినది అయిపోయిందానిలో జమ. దానినిగూర్చి చెప్పుకోవడం దేనికి. భవిష్యత్తే నాకు ముఖ్యం. నా ఆలోచన ఎప్పుడూ రాబోయేదాన్నిగూర్చి. అదే నన్నాకర్షించేది."

"అయినా కొంత వెనకకు చూచుటకూడా అవసరం" అన్నాను. నేను ఏదో ఆలోచిస్తూ "నీ విజయానికి వెనకనున్న రహస్యం ఏమిటో నీకు తెలుసా. దానిని నిర్ధరించుటకు మార్గమేమైనా ఉందా ? "అని అడిగాను.

ఎమిల్ కొంచెం ఆలోచించాడు; ఎన్నో స్మృతులు ఆయన మెదడులో మెలగినవి.

"ఒక ముఖ్యమైన అంశం ఏమంటే, నా శక్తిని ఉన్నదాని కంటె ఎక్కువగా ఊహించలేదు. నే నేకార్యాలను సాధించగలనని నమ్మకముందో, వాటి సాధనకే పూనుకున్నాను. ఒలింపిక్ విజయపీఠం నేనెప్పుడైనా ఎక్కగలనని ఆ రోజులలో ఊహించలేదు నా శక్తి ఆ పీఠానికి దరిదాపుగా ఉన్నప్పటికి. కాని యీనాడు చిన్న మగపిల్లలు, ఆడపిల్లలుకూడా ఆ పీఠాన్ని ఎక్కుటకు కొంత ఉబలాటపడు తున్నారో నాకు వ్రాస్తుంటారు. వారు విజయాలు సాధించలేరని నా నమ్మకం. ఈ సమస్య కొక సమాధానం కనిపెట్టేనని అనుకుంటూ. ఒకమెట్టు తర్వాతఒకమెట్టు కృషి క్రమంగా జరగాలి. ఏది వీలవుతుందో, ఏది సాధ్యమో దానికొరకే కృషి చేయాలి. అనుకున్నకంటె ఎక్కువ వేగం సాధిస్తే అది ఆనందాశ్చర్యాన్ని కలిగిస్తుంది. నా శక్తిని నేను తక్కువగా గణించానన్న మాట.

"ఆకాశహర్మ్యాలు ఎవరూ నిర్మించకూడదు. సాధించలేని ఆదర్శాలు నిష్ప్రయోజనం. చివరికి ఆ ఆదర్శాలు నెరవేరక ఒకదానివెంబడి ఒకటిగా అపజయాలు ఎదుర్కొంటే దానివల్ల అశాంతి, అసౌఖ్యం."

"అయినా, నీ విషయం పరిశీలిద్దాం. నీలోవున్న ఏ సద్గుణాలవల్ల నీకు విజయాలు ప్రాప్తించాయి ? నీ శరీరం ఆరోగ్యంగాను, యిట్టి కృషికి అనువుగాను ఉండవాలి. ఇంక నీ బుద్ధిబలం ? అది సాధారణమనిషి కున్నదానికంటె ఎక్కువంటావా, కాదా ?"

"నిశ్చయంగా కాదు ! నేను పరుగుపందేలు ప్రారంభించిన కాలంలో నా మిత్రులు చెప్పి చెప్పి, నన్ను ఓడించేవారు. నా కేమీ ప్రత్యేకమైన బుద్ధిబలంలేదు. క్రమక్రమంగా నా మిత్రుల తెలివితేటలకు ఎదురుగా నా ఆదర్శం, దీక్షతో నిలపవలసి వచ్చింది. అయితే, అలా చేయుటలో రికార్డులు సృష్టిద్దామనికాని, ఒలింపిక్ విజయాలు సాధిద్దామనిగాని నా ఉద్దేశం కాదు. నా ఆదర్శాలు, నా ఉద్దేశాలు ఒక స్థాయిలో ఉంచేవాణ్ణి; కొంత పట్టుదలతో, నెరవేర్చగల శక్తికి పరిమితమై ఉండేవి. ఆ విధంగా నా ప్రవర్తనను దిద్దుకొనేవాణ్ణి. ఉత్తమ ప్రదర్శనం ఒక్క మహత్తర

ప్రయత్నంవల్ల వీలుపడదు; నిర్విరామకృషి కది ఫలితం. మొదట మా క్లబ్బు ఛాంపియన్, నా మిత్రుడు కృపీకాను మించాలని ఉద్దేశం పెట్టుకున్నాను. ఆ సమయంలో రికార్డు పందెగాడు 'సేల్'ను మించుట ఆదర్శంగా పెట్టుకొనుట తగదు. క్రమంగా కాలం గడిచిన తర్వాత ఆ ఆదర్శం నెరవేరింది. ఆ రోజులలో రికార్డువేళకు దగ్గరగా జరుగుతున్నాను. క్రమక్రమంగానే, నా ప్రయత్నాలస్థాయి హెచ్చింది. నా శక్తి అధికమయింది; ఒక పందెం తర్వాత మరొక పందెంలో నా 'వేగం' ఎక్కువైంది."

"అయితే నీవు సాధించినదానితో నీకెప్పుడూ తృప్తిలేదన్నమాట. జయం చేకూరితేచాలు, అనేకమంది సంతుష్టిచెందుతారే!"

"నా ఉపాధ్యాయులతో సమానంగా సాధించగలిగానంటె నాకంతగా సంతుష్టిలేదు. వారికన్న ఎక్కువ సాధించుట చాలకష్టతరమయినపని. అప్పటివరకు యింకొకరి అడుగుజాడల్లో నడిచేవాణ్ణి. అంతకన్న ఎక్కువ సాధించుటకు నాదారి నేనే ఏర్పాటు చేసికోవలసి వచ్చింది. శిక్షణ ఏవిధంగాఉంటే నా ప్రదర్శనాల స్థాయిని హెచ్చించవచ్చునో నేనే నిర్ణయించుకోవలసిన అవసరం కలిగింది. ఇదంత సులభమైన కార్యంకాదు. నా మహత్తర విజయాల తర్వాత, నా లోపాలను నేను గుర్తించగలిగాను కనకనే, అంతకన్నా ఎక్కువ విజయాలను సాధించగలిగాను. మొదటి రికార్డు పరుగు తర్వాత, కొత్త పద్ధతులను కనిపెట్టవలసి వచ్చింది. నేనే నా ప్రత్యర్థిగా తయారయి నామీద విజయానికి నేను పోరాడుతుండేవాణ్ణి. నా రికార్డును నేనే భగ్నంచేయాలని ప్రయత్నం చేసేవాణ్ణి.

"మాటల్లో యిదంతా తేలికగా కనిపిస్తుంది. ఒక సెకండులో పదవభాగం పరుగువేళలో తగ్గించుటకు ఎంత ఆత్మనిగ్రహం కావాలో ఎవరికీ బోధపడదు."

"నీ ప్రథమ అంతర్జాతీయ పందేన్నిగూర్చి చెప్పు ఎమిల్. యుద్ధానంతరం దేశాల సరిహద్దులు తెరవబడుతూన్న సమయంలో యీ పందేలలో పాల్గొనుట ఎలా సంభవించింది?"

"తెలియనివారు ఆస్లోలో జరిగిన మొదటి పందెంలో నేను తప్పకుండా గెలుస్తానవుకున్నారు. ఎంత అమాయకులు? ఆసారి నేను 5 వ వాణ్ణి.

"ఆ రోజులలో నాకు కొన్ని లోపాలున్నవి. ఆస్లో పందెంలో నా కవి స్పష్టమైనవి. అంతర్జాతీయరంగంలో నే నేమైనా ప్రగతించాలంటే యీ లోపాలను సవరించుకోవాలి అనుకున్నా. ఆసారి నేను గెలుస్తానని అనుకోవడం పొరపాటే అవుతుంది. అలాంటప్పుడు నేను 5 వ వానిగా వచ్చుట నాలో ఎంతో నిస్పృహను కలిగించేది. అయితే నిజాని కది ఉత్తమ ప్రదర్శనలకు నన్ను పురికొల్పింది."

"తరవాత పరిస్థితులనుగూర్చి చెప్పు ఎమిల్" అని అడిగాను ఎంతో కుతూహలంతో.

"మొట్టమొదటిసారి ప్రపంచ వీరులకు దరిదాపుగా వచ్చేను. వారిని అనుకరించగలనని నాకు ఆశ కలిగింది. నా కఠినమైన ట్రెయినింగు ఫలితం 1947 లో కనబడింది. ప్రపంచఖ్యాతి గాంచిన పరుగు పందెగాళ్ళకన్నా ముందున్నా."

"అయితే అప్పటికే ప్రపంచ రికార్డుమీద నీదృష్టి పడిందా ?"

"అవును. అప్పటికి మహోజ్వల ప్రదర్శనలమీద కాంక్ష నాలో మేల్కొంది. ఏ యితర పందెగాను సాధించి ఎరుగని ప్రదర్శనమీదకు పోయింది నా కోరిక. అందుచేత నాకు అత్యంతానుకూలమైన పరుగు దూరాన్ని నిర్ణయించుకోవాలి. 10,000 మీటర్ల దూరంమీద నా మనసు పోయింది. అందుచేత దానికి తగిన శిక్షణ ప్రారంభించాను."

"నీవీ విషయంలో అద్భుతంగా ప్రవర్తించావు. ఈ సంవత్సరం నీవు సాధించినది ఏ పందెగాడైనా ఆశించదగినదే."

"విరామం లేకుండా శిక్షణ పొందడంవల్లనే, విజయాలు సాధించగలిగాను. మన గుణాలు, లక్షణాలు, ఒక్క సంవత్సరంలో ఏవిధంగా మార్పు చెందుతాయో, ఆశ్చర్యంగా ఉంటుంది. మనిషికి బుద్ధి వికాసం చెందుటేకాకుండా, భౌతికంగా కూడా ఏదో ఒక కొత్తరూపం ఏర్పడుతుంది. వీలుకానిది వీలవుతుంది. దీక్షవల్ల, మనోనిశ్చయంవల్ల, ఓర్మివల్ల, మానవ దుర్లభం అనుకున్నది సులభమైపోతుంది."

పర్వత శిఖరాలవెనక ఆకాశం నిర్మలమవుతూందని ఎమిల్ మా సంభాషణ జరుగుతూండగానే గ్రహించాడు. ఆ మధ్యాహ్నపు సూర్యకాంతిలో, ఆ తెల్లని పర్వతాలు మామీద మెరుస్తూన్నట్టున్నవి. కిటికీలోనుంచి తొంగి చూచాడు. అక్కడ రెండు పొట్టేళ్ళు కనబడ్డాయి. అవి అతని స్నేహితులు; అంతకుముందు వాటితో ఆడుకొంటున్నాడు.

"అవి నాకోసం చూస్తున్నాయి. వాటికి కాస్త ఉప్పుతీసుకొని వెళ్ళాలి" అని క్షమాపణ చెప్పుకొని అర్ధపరీక్ష తప్పించుకున్నాడు. ఆ పొట్టేళ్ళు ఒకసారి అతని అరచేతులు చుంబించిన తర్వాత, తలతో ఎమిల్ తలను పొడిచినవి. పరుగెత్తడంలో వాటకికూడ శిక్షణనివ్వడం మొదలుపెట్టాడుఎమిల్.

పొట్టేళ్ళు ఆ సవాలును అంగీకరించాయి. ప్రజలవెనక పరుగెత్తుట వాటికి అలవాటే. కాని, యీసారి అసాధారణవేగంతో పరుగెత్తేవానిని ఎదుర్కొన్నట్టు అవి గ్రహించాయి. ఇతనిని అందుకోలేక వాటికి విసుగెత్తి పరుగెత్తడం మానివేశాయి, మేము తెలివితక్కువవాళ్ళం కామోయి అన్నట్టుగా !

అలాగ వాటితో ఆడుకుంటూన్నప్పుడుకూడా అతనిలో మరోవిధమైన లక్షణాలు కనుపించలేదు. తన ఆనందంకొరకే అలాగ ఆడుకుంటాడు. ఏదోవిధంగా అతనిలోని బలాన్ని వృద్ధిచేయాలి. అతను చెప్పేది, చేసేది ఎంతో సహజంగా ఉంటాయి.

"కార్మికుని హృదయం అతనిది" అనుకున్నా నాలో నేను. అందుచేతనే ప్రపంచమంతా గులాబీరంగులో కనబడుతుంది అతనికి. అతనా వింతమనిషి ? తనకన్న పెద్దవాళ్ళను ఎదుర్కొనడానికి అతని యవ్వనం, సహజత్వం వదులుకొనవలసివచ్చి ఎమిల్ అలా కనుపిస్తాడు.

ఎమిల్ ది నిర్మలమైనమనస్సు.ఉన్న తాదర్శాలనునిర్మించుకొనేవారికది అవసరం.

ఈలోపుగా ఎమిల్ తిరిగివచ్చి, విషయాలన్నీ తెలుసుకోవాలనే అభిలాషతో మిగతా ప్రశ్నలకు జవాబు చెప్పటకు తన సంసిద్ధతను తెలియజేశాడు.

"సైనికోద్యోగం నీ ప్రవర్తనను ఏ విధంగా సంస్కరించింది?" అని అడిగా.

"ఉత్తమోత్తమంగా. జీవితం కఠినంగానేసే దేనీ ఎవరికీ అపకారంచేయదు. దైనందిన జీవితంలో ఉపయోగించే చాలా సద్గుణాలు, బాధ్యత, శిక్షణ, నిర్మల స్వభావం, నిర్ణాయకశక్తి సైనిక శిక్షణలో అలవరుచుకుంటారు. అక్కడ వ్యక్తి స్వభావం దూరమైపోతుంది; వ్యక్తి అభిప్రాయం, బహు సంఖ్యాకుల అభిప్రాయానికి లొంగిపోవాలి. మిత్రులంటే ఆదరణ, ఆత్మ శిక్షణతోపాటు ఉన్నత లక్షణంగా పెరుగుతుంది."

"ఉత్తమ ప్రదర్శనల సాధించుటకు కావలసిన ముఖ్య లక్షణాలేమిటి, మీ అభిప్రాయంలో?"

"అమితమైన ఉత్సాహం, అకుంఠిత దీక్ష చాలా ముఖ్యమైన లక్షణాలు. ఈ లక్షణాలే యితర లక్షణాలను తెరిపిలేకుండా సృష్టిస్తాయి. ఈ విధంగా ఓటమికి దారితీసే ప్రాథమిక కష్టాలను గడచి, నెమ్మదిగా వృద్ధిలోకి రావచ్చును. అప్పటి నుంచి మన పథకాలను తయారుచేసుకోవాలి. మెట్లవరసమీదనుంచి ఎక్కండే, మేడమీద చేరుటకు ప్రయత్నించకూడదు."

"అయితే మానసిక శక్తి చాలా ముఖ్యమన్నమాట?"

"నిజం. కాని పుట్టుకతోనే యిదిరాదు. చాలా కఠినమయిన శిక్షణకు లోను కావాలి."

"ఎలాగు?"

"ఆత్మ నిగ్రహంవల్ల! ఏళ్ళతరబడి ట్రెయినింగు వదలకుండ ఉన్నట్టయితే, మానసిక శక్తి ఒక సమస్యకాదు. వర్షం వస్తూన్నా శిక్షణ ఆపలేదు. నేను అలసిపోయాను? అది లెఖచేయలేను. నేనేవిధంగా ట్రెయినింగు అయ్యేవాడినో చెప్పేనుకదా! ఒక్కొక్కప్పుడు వర్షం; ఒక్కొక్కప్పుడు చీకటి; ఆ చీకటిలో నుంచి టార్చి సహాయంతో శిక్షణ పొందేవాడను. ఇదంతా సౌఖ్యప్రదంకాదే; కాని చాలా ఉపయోగించింది. ప్రతి కార్యసాధనతో మనోశక్తి అధికమవుతుంది; దానివల్ల ఎప్పుడుకలగని, ఎరగని పనులుకూడా మన శరీరంచేత మనం చేయించగలుగుతాము."

"ఉత్తమమైన గుణాలనుకూడ యీ పందేలవల్ల అలవరచుకోవచ్చునన్నమాట."

"నిశ్చయంగా! ఈ గుణాలన్నీ ఆటలలోనే ఉపయోగిస్తాయని కాదు. ఏ పరిస్థితిలోనైనా శరీరాన్ని స్వాధీనంలో ఉంచుకొనేశక్తిని పెంపొందించుకుంటాము. ఎలాంటి అవాంతరాలు తటస్థించినా భయపడము. ఆటలవల్ల ఆరోగ్యం, శారీరకాభివృద్ధి సరిదిద్దబడుటేకాక, మానవుని శీలంమీదకూడా ఆటలప్రభావం ఎక్కువగా కనబడుతుంది.

"ఏదో ఒకసారి, రెండుసార్లు శిక్షణపొందడంవల్ల ప్రయోజనంలేదు. కనీసం ఒక వందసార్లు ప్రయత్నం చేసినట్టయితే ఒక జీవితకాలాన్ని పవిత్రంచేసే సద్గుణాలు అలవడుతాయి."

పర్వతప్రాంతాలలో శీతోష్ణస్థితి తరుచు మారుతూంటుంది. జిలీనీప్లేసో (ఆకుపచ్చ సరస్సు)కు షికారు పోదామనుకున్నాము. కాని, ఆకాశంఅంతా పాగ కమ్మింది. మేఘాలు దట్టంగా అల్లుకొన్నాయి. అందుచేత యింటికి తిరిగివచ్చేశాము.

ఎమిల్‌తో మరికొంతసేపు కాలంగడుపుటకు అవకాశం కలిగిందికదాఅని సంతోషించాము. అతని మాటలు ఆ మొరావియా యాసతో ఎంతో కమ్మగా వుంటాయి. తర్వాత అతను చెప్పింది అంతా వివరంగా, స్పష్టంగా వున్నది.

వార్తాపత్రికలలో వ్రాసిన వ్యాసాలేమైనా ఉన్నాయా అని అడిగాను. కాని, అతనివద్దర ఏమీలేవు. ఆటలకు బానిసయిపోవుట అతని కిష్టంలేదు. అతని జీవితం సంపూర్ణంగా స్వతంత్రంగా వుండాలని అతని కోరిక. అయినా, యితరులంటే అతనికి ఎంతో ఆదరణ - అతనికి అందరియెడల మైత్రీభావమే. ఎవరికైనా సహాయం చేయగలిగితే చాలా సంతోషిస్తాడు. ఇతరుల అవసరాలు, దుఃఖాలు అతనిని బాధిస్తాయి.

పందేలలో అతని పథకాలు, పన్నుగడలు చర్చించాము. పరుగెత్తుతూన్నప్పుడు తనమీద తనకంత నిర్దయ ఎందుకో. అంతగా అతనిశక్తిని ఉపయోగించకూడ దంటూరు అందరూ.

కాని ఎమిల్ అభిప్రాయాలు వేరు.

"ఈ పన్నుగడల (టాక్‌టిక్సు) కు అర్థం, జయము సంపాదించే పద్ధతి. నా ప్రత్యర్థులను ఎలాగైనా ఓడించుట నా ఉద్దేశంకాదు. ఇదివరకు నేను సాధించినదాని కన్న ఎక్కువ సాధించుటే నా ఆశయం. అందుచేత, తక్కువవేళలో పరుగెత్తగలిగి వుండీ, ఎక్కువవేళ ఎందుకు తీసికోవాలి? నా ప్రత్యర్థుల లోపాలను నా కొరకు నేనెందు కుపయోగించాలి; వారిని నే నెందుకు మోసగించాలి. నా కేంకావాలో, నా శక్తి ఎంతుందో, అందరికీ తెలియజేయుటే నా మతం."

'ఎమిల్ నిర్మల హృదయుడు' అనే అభిప్రాయం మనసుకు నిరంతరం తట్టుతూనే ఉంటుంది.

"భవిష్యత్తుకు, మీ కార్యక్రమ మేమిటి? ప్రపంచంలో ఏ కొద్దిమందికోగాని లభ్యంకాని విజయాలను సంపాదించారు. ఇంక ముందేమి చేయదలచుకున్నారు" అని అడిగా.

"ఇంత విజయం సంపాదించినా, యింకా అభివృద్ధికొరకు ప్రయత్నం మానను. 10,000 మీటర్ల పరుగు రికార్డు 29 నిమిషాల 15 సెకండ్లకు దించాలని నా ఉద్దేశం. ఏమైనా, ప్రయత్నిస్తా. నా పరుగులలో అభిమానంచూపుతూ, నా విజయాలకు కారణభూతులైన నా ప్రజలకు యీ విధంగా నా కృతజ్ఞతను చూపిస్తా.

"ఇది నా వ్యక్తిగత ఆశయంకాదు. ఇది మా అందరి ఉమ్మడి వ్యవహారం. ప్రజా బాహుళ్యంయొక్క మనోవాంఛయొక్క ప్రభావం నామీద ఉన్నది. అదే నన్ను ఉన్నత ప్రయత్నాలకు పురికొల్పుతుంది. మన ఆటగాండ్ర కీర్తి ప్రతిష్టల విషయంలో మన ప్రజలు ఆతృతగా ఉన్నారు. స్టేడియంలో కూర్చొనే ప్రేక్షకులే కాదు; క్రీడలగూర్చి పత్రికలలో వార్తలు చదివేవారేకాదు; రేడియోలదగ్గర శ్రోతలేకాదు; రాజ్యాంగం నడిపే రాజకీయవేత్తలు; సైన్యాలను నడిపే అధికార్లు కూడా ఆటలమీద ఆదరణ అధికంగా కనపరుస్తూవున్నారు. ప్రజలు నన్నభినం దిస్తూ, ఆటలలో విజయం తమ అందరిదివలె మాట్లాడుతారు.

"ప్రియమైన ఎమిల్; అది మనందరిది. ముఖ్యంగా యువకులది. వారికి దాని వల్ల అఖండమైన ఉత్సాహం. నీ ప్రతి రికార్డు పందెం తరవాత, వేలకొలది యువకులు, యువతులు, యీ క్రీడల్లో పాల్గొనుటకు నిశ్చయిస్తారు. ఇది నిజంగా వారి ఆరోగ్యా నికే కాకుండా, వారి శీలానికి పునాది."

దీనికంతకూ తనే బాధ్యుడా, అనుకుంటాడు ఎమిల్.

"నా మిత్రు లనేకులు ఉత్తమ ప్రదర్శనలు కావించారు. ఏమైనా యీ క్రీడలు మన యువకులకు ఉత్సాహం కలిగిస్తున్నాయంటే నాకు సంతోషం. మామూలు ప్రదర్శనాలయితే ఆటస్థలాలు ప్రేక్షకులతో నిండవు. ఇప్పుడు ఆటలస్థాయి హెచ్చింది కాబట్టి, ఆటస్థలాలు ప్రేక్షకులతో నిండిపోతున్నాయి. కొత్తగా యిస్తూన్న పతకం అందర్నీ ఆకర్షిస్తూన్నది; హెచ్చుస్థాయిలో ఆటల నిర్వహణకు దారితీస్తూంది."

"పరదేశాలలోకూడా నీ ప్రపంచ రికార్డులు ప్రజలను ఆకర్షించాయి.మన దేశానికి అవి గౌరవాన్ని తెచ్చాయి."

"కావచ్చు. మనదేశంలో అవి తెచ్చిన ఫలితాలు నా కెక్కువ ముఖ్యం. ఈ క్రీడలలో పాల్గొనుటకు నిశ్చయించిన మన యువతీ యువకులలో చాలా కొద్ది మంది రికార్డులు నెలకొల్పేవారుగా తయారవుతారు. అందుచేత వారి ప్రయత్నాలు గణనీయంకావని కాదు. ఇంతమంది ఆకర్షింపబడుటే ప్రజలతత్వంలో మార్పు తీసు కొనివస్తుంది. రాష్ట్రపతిభవనంలో ప్రెసిడెంటు గొట్వాల్డు, నాకు సన్మానం యిచ్చి నపుడు ప్రజాసముదాయంయొక్క విస్తృతాభివృద్ధి మన ఆశయమై వుండాలని అన్నాడు. ఆటగాళ్ళలో నాయకులకుకూడ ఎక్కువశ్రద్ధ చూపించుట మరవకూడదు. ప్రజాసమూహాలను ఆకర్షించేది వారే. అందుచేత యీ నాయకులంతా శిష్యబృందా లను చేరతీయాలి."

"అయితే మీ ప్రదర్శనలు ఒక్క ఆటగాండ్రనే ఆకర్షించవు; అందరూ 'జటోపెక్' వలె పనిచేస్తామంటారు. వేగంగా, తీక్ష్ణంగా పనిచేయుటకు ప్రజల ప్రయత్నాలకుకూడ మీ పేరు ఉపయోగించుచున్నది. ఈ విధంగా దేశంయొక్క శక్తి, సౌభాగ్యం అధికమవుతాయి."

"అదంతా నా కెంతో సంతోషాన్ని కలిగిస్తుంది" అన్నాడు ఎమిల్. "ప్రజా సామాన్యంయొక్క, ఆరోగ్యం, శీలం అధికమవుతున్నాయన్న విషయం నన్నింకా ఎక్కువ కృషికి పురిగొల్పుతుంది."

బల్లమీద ఒక కట్ట కాగితాలున్నాయి. జటోపెక్ ఆదర్శాన్ని అనుసరించుటకు ఎంతమంది నిశ్చయించుకున్నారో తెలియజేసే కాగితాల కట్టలవి. వారందరూకూడా కఠినమైన శిక్షణా పద్ధతులకు సంసిద్ధులే. కొత్త యువకబృందాలు ఏర్పడాలి; కొత్త స్టేడియంలు నిర్మించాలి.

ఎమిల్ రికార్డు పరుగు అన్ని పట్టణాలలోనూ, పల్లెల్లోనూ ఎక్కువగా ప్రశంస పొందింది. యువకసమితి వారాతనికి గౌరవ సభ్యత్వం ప్రసాదించారు. ఇంకా ఎన్నో సంఘాలు యీ విధంగా గౌరవ సభ్యత్వాలిచ్చాయి.

విదేశీ పత్రికలుకూడా ఆతనినిగూర్చి పెద్ద శీర్షికలతో విమర్శలు ప్రకటిస్తున్నాయి. ఆతని భవిష్యత్తు కార్యక్రమంగూర్చి, ఆతని ఆదర్శాన్ని అనుసరించుటకు నిశ్చయించిన యువకుల ప్రమాణాలనుగూర్చి ప్రజలు చర్చించుకుంటూ వుంటారు.

ఎమిల్ మళ్ళీ పందేలలో పాల్గొంటే, ఆతని మనోనిశ్చయం మరికొన్ని రికార్డుల సృష్టికి దారితీస్తే, మళ్ళీ ఆతను విజయుడుగా విజృంభిస్తే సరేసరి, లేకపోతే, తన ప్రేరేపణవల్ల బయలుదేరిన యువక బృందంలో ఏ మహనీయుడైనా ఆతనినే ఓడించినా-ప్రజలు ఆతనినే విజయుడంటారు. తన దేశ గౌరవం ఉన్నత శిఖరాలందుకోవడానికి జటోపెక్ చేసిన సేవను కృతజ్ఞతతో ప్రజలు నిరంతరం స్మరిస్తారు.

# చరిత్రాత్మక వసంతం

**1950** సంవత్సరం ఆనందాశ్చర్యాలతో ప్రారంభమయింది.వసంతారంభంలో సోవియట్ దేశంనుండి ఆహ్వానం వచ్చింది. బ్లాక్ సీ ప్రాంతంలో సోచీ అనే పట్నంలో ఒక నెలరోజులు కాలక్షేపంకొరకు రమ్మని ఎమిల్, డానా, మొరావెక్ లకు ఆహ్వానం. ప్రముఖ సోవియట్ 'ఎథలెట్సు' ట్రెయినింగులో వీరు కూడా పాల్గొనాలని ఆ ఆహ్వానం.

ఏప్రిల్ నెల 'సోచీ'లో గడపడానికి ఎవరు అంగీకరించరు ? ఎమిల్ తొందరగా సెలవుకు దరఖాస్తు పెట్టుకున్నాడు. అనుకొనంత త్వరగా ప్రయాణానికి సిద్ధమయ్యారు. మాస్కోకు విమానంమీద వెళ్ళేరు. క్రీడాసంఘ ప్రతినిధివర్గాన్ని విమానాశ్రయందగ్గర కలిశారు. ఎమిల్ వస్తున్నాడని సంతోషంతో అనేకమంది

ఆటగాండ్రు ఆతనిని అక్కడే కలిశారు. హంగరీకి చెందిన ప్రపంచరికార్డు నెలకొల్పిన హేమర్ త్రోయర్ కూడా విమానాశ్రయానికి వచ్చాడు. అతడుకూడా శిక్షణకు సోచీవస్తున్నాడు.

మాస్కోలో ఉన్న కొద్దికాలం థియేటర్లు, కాన్సర్టులు దర్శించుటలో గడపినారు.

సోచీకి ప్రయాణం 7 గంటలు పడుతుంది. 9 గంటలకు మంచుతో నిండిన మాస్కో విమానాశ్రయం వదలి 4 గంటలకు సూర్యకాంతితో నిండిన దక్షిణానికి చేరుకున్నాం.

సోచీలో వసంతం సౌందర్యమయం. సముద్రతీరాన ఫలవృక్షాలన్నీ చిగిర్చి శోభాయమానంగా ఉన్నాయి. తెల్లని మంచులో కకేషియన్ పర్వతశిఖరాలు ప్రక్కలోయలలోకి నిగనిగలాడుతూ కనబడుతున్నాయి.

అక్కడి ఆటగాండ్రు ఎమిల్ - డానాలను నవ్వుతూ పలకరించారు. వారికి పూలగుత్తులందించారు.

సోచీ వారిని మైమరువజేసింది. సాధారణంగా యీ ఆరోగ్యనిలయం కార్మిక వర్గానికి ప్రత్యేకింపబడింది. ఆటగాండ్రు తాత్కాలిక అతిథులు మాత్రమే. ఎమిల్-డానాలు ఆనందమయంగా కాలంగడిపారు. సూర్యరశ్మిలో స్నానం చేసేవారు. నీటిలో యీదేవారు; సముద్రంలో ఆటలాడుతూ వుండేవారు. తుఫాను వచ్చినపుడు తొందరగా తీరానికి వెళ్ళి సంతోషంగా గడిపేవారు.

ఎమిల్ అన్నివిషయాలు పరిశీలించే స్వభావం కలవాడు. డాల్ఫిన్ల ప్రవర్తన ఆతనిని ఆకర్షించింది. వాని వెనకే యీదుకు పోయేవాడు. వాటితో సముద్రంలో ఆడుకొనేవాడు. తుఫాను సముద్రంలోకి దూరంగా వానిని త్రోసేవరకు వానితో ఆడేవాడు. జెల్లీ చేపలు కూడా ఆతనిని ఆకర్షించాయి అవే కాదు. అన్ని సముద్ర జీవులు ఆతని నాకర్షించాయి.

ఎమిల్ - డానాలు, సిప్రస్ త్రోవలలో విలాసార్థం నడచిపోతూండేవారు, ఆ ప్రక్కనున్న శానిటోరియం భవనాలను, అక్కడికి రోగనివారణకు, విశ్రాంతి కొరకు వచ్చివుంటున్నవారిని చూస్తూ.

ఆటగాండ్రు వారి ట్రెయినింగును గూర్చి మరచిపోలేదు. ప్రతిరోజూ, ఎమిల్ విమానాశ్రయం చుట్టూ మామూలు దూరం పరుగెత్తేవాడు. ఆతనితో సోవియట్ ఆటగాండ్రు కూడా పరుగెత్తేవారు. వారందరూ కూడా యువకులు. తెలివయినవారు. ఎమిల్ చుట్టూ చేరేవారు.

ఆతని ట్రెయినింగు పద్ధతులను గూర్చి తెలిసికోవాలని వారి కోరిక. 'స్టాప్ వాచీ' చేతిలోపట్టుకొని, ఆతని పరుగులను కనిపెట్టేవారు. తన అనుభవాలన్నీ వారికి చెప్పేవాడు ఎమిల్.

వీడ్కోలు సమయంలో ఒక పరీక్షా ప్రదర్శనం ఏర్పాటు చేశారు. ఎమిల్ సులువుగా గెలిచాడు.

ఇంటికి తిరిగి వచ్చేముందు మాస్కోలో 'మే' దినోత్సవాల్లో పాల్గొన్నారు. ఆ ఆనందోత్సవం వారిని ఆకర్షించింది. దాని తర్వాత వారు సెలవు తీసుకొని గృహోన్ముఖులయ్యారు.

సోవియట్ యూనియన్ నుండి తిరిగి వచ్చిన తర్వాత ఎమిల్‌కు ఆహ్వానాలు కుప్పలుగా వచ్చిపడ్డాయి. ఒకమూల తన ట్రెయినింగు కూడా మానుకొని, ఆహ్వానాలు అంగీకరించవలసి వచ్చేది; ఉపన్యాసాలు యివ్వవలసివచ్చేది, అనేకస్థలాల్లో ప్రయాణాలను గూర్చి, ట్రెయినింగును గూర్చి, సోచీలో తన ఉనికిని గూర్చి, సోవియట్ శారీరక వ్యాయామం గూర్చి ప్రసంగించేవాడు ఎమిల్.

ఈ ఉపన్యాసాల తర్వాత అలసి యింటికి చేరుకొనేవాడు. కాని ఒకవిధమైన సంతుష్టి అనుభవించేవాడు. ఆ చిన్న యువతీయువకుల ఆనందమే, వారి ఆకాంక్షే ఆతనికి బహుమానం.

1950 వ సంవత్సరంలో జర్మన్ డెమొక్రెటిక్ రిపబ్లిక్‌లో యువజనోత్సవాల సందర్భంలో జరిగిన పోటీలలో ఎమిల్ పాల్గొన్నాడు. ఆ దేశంలో ఆతని మొదటి పందెం అదే.

యుద్ధం అయిపోయినతర్వాత రెండుదేశాలయువకులు కలియుట కదే మొదటి సారి. ఆ ఉత్సవం ప్రేమోత్సాహాలతో నిండింది. పూర్వపు బోధలన్నీ ఒక్కసారి మరచిపోయారు. ఎప్పటికీ మరపురానిది, బెర్లిన్‌వీధులలో వెళ్ళిన ఆ ఉత్సవం. యూరపులోని లక్షలాది ప్రజలు ఉత్సవంలో చేరారు.

క్రొత్తగా నిర్మింపబడ్డ స్టేడియంలో ఏర్పాటయిన ఆటలలో పాల్గొనడంవల్ల, వివిధదేశాల యువకుల మధ్య సుహృద్భావం పెరిగింది. ఎమిల్‌ను మళ్ళీ విజయ కన్య వరించింది. అత్యుత్సాహంతో అందరూ యీ విజయాన్ని ప్రశంసించారు. ఎంతమంది స్నేహితులనో సంపాదించుకొని, రెండుదేశాల మధ్య స్నేహ సంబంధం పెరుగుతూన్నందుకు ఆనందిస్తూ ఎమిల్ ప్రేగ్ నగరం చేరుకున్నాడు.

ఎమిల్ తన పథకాలను నిర్వహించడానికి జాగ్రత్తగా దీక్షగా యింకా శిక్షణ పొందాలి.

ఆస్లోవాలో జరిగే ఆర్మీ ఛాంపియన్‌షిప్పుల లో 5000 మీటర్ల జాతీయ రికార్డును భగ్నమొనర్చుటకు ఎమిల్ తన ప్రయత్నం ఉత్సాహంతో ప్రారంభించాడు.

ఇదివరకు కంటె శిక్షణను కఠినం చేశాడు. ఒక ఉన్మత్తునివలె అయిపోయాడు.

ఆతని ట్రెయినింగు పద్ధతి గమనిద్దాం: శనివారం జూన్ 15 న, 25 కిలోమీటర్లు, తనమామూలు పద్ధతిలో పరుగెత్తేడు. ప్రతీ 400 మీటర్ల తర్వాత కొంత దూరం నెమ్మదిగా పరుగెత్తుతాడు. ఇలాగ 40 సార్లు పరుగెత్తేవాడు. సోమవారం సరికి 32 కిలోమీటర్లకు పైగా పరుగెత్తేవాడు. ఈ విధంగా 2 వారాలు పరుగెత్తేడు. ఆ తరువాతి వారం రోజుకు 18 తరువాత 10 కిలోమీటర్లకు తగ్గించేడు.

ఆర్మీ ఛాంపియన్‌షిప్పులలో రికార్డుసృష్టించగలనన్న ధైర్యం, ఉత్సాహం ఆతనికి కలిగింది. ఫిన్నిష్ కార్మికసంఘం టి. యు. యల్ ఏర్పాటుచేసిన ఆటల ఉత్సవాలలో

పాల్గొనవలసిందని ఎమిల్‌కు ఆహ్వానం వచ్చింది. ఎమిల్ శిష్యబృందం ఫిన్‌లాండులో యీ రికార్డు సృష్టించబడుటా అని చాలా ఆశాభంగం పొందింది. అయితే చేసేది లేదు.

కోపెన్‌హేగన్ మీదుగా విమానం హెల్సింకీకి వెళ్ళింది. అక్కడ సెపోనా ఆతనిని కలిశాడు. మధ్యరకం దూరాల పోటీలలో ఆతను పాల్గొంటారు.

ఎమిల్ కార్యక్రమం చాలా పెద్దదిగానే ఉంది. వచ్చిన వెంటనే జర్నలిస్టులతో ప్రసంగం ప్రారంభమయింది. అర్ధరాత్రివరకు జరిగింది. తనను గురించి, తన దేశాన్ని గురించి అన్ని విషయాలు చెప్పవలసి వచ్చింది. అదీకాక, జెకోస్లొవేకియాలో వ్యాయామం, క్రీడలు, వాని నిర్వహణను గూర్చి వారు తెలిసికొనుటకు ఉత్సాహం చూపించారు.

హెల్సింకీలో ఎంజినీరింగువర్కు్స చూశాడు ఎమిల్. ఇక్కడ పనివాండ్రంతా ఆతనికి ఆహ్వానం ఏర్పాటుచేసి ఆతని కెన్నో బహుమతు లిచ్చారు. సాయంత్రం ప్రదర్శనం చూచుటకు రమ్మని తన శక్తినంతా ఉపయోగిస్తానని, ఎమిల్ వారికి చెప్పేడు.

ఎమిల్ తన వాగ్దానం నిలబెట్టుకున్నాడు. అది సాధారణ పందెపుపరుగుకాదు. ప్రత్యర్థులెవ్వరూ లేకపోయినా, తన రికార్డును తానే భంగమొనర్చవలసిన పందె మది.

టి. యు. ఎల్. సభ్యులే పాల్గొంటున్నారు కాబట్టి పోటీ తీవ్రంగా లేదు. అందుచేత ఎమిల్ ప్రయత్నం, దీక్ష ప్రజలమెప్పులను పొందింది. ఇక్కడ ప్రజలందరూ స్వదేశంలో వలెనే, అంత ఆదరంతోనూ చూచారు ఎమిల్‌ని.

అద్భుతమైన ఆ పందెంలో ఎమిల్ విజయుడయ్యాడు. ఫిన్లాండు ప్రజలిట్టి ప్రదర్శనాన్ని చాలాకాలమై చూడలేదు. పాత రికార్డు 2 పూర్తి సెకండ్లలో భగ్నమయింది. క్రొత్తవేళ 14 నిమిషాల 06.2 సెకండ్లు.

మరునటిరోజు ఫిన్లాండులో రెండవ ప్రముఖ నగరం 'టుర్కు' దర్శించాడు.

పట్నంలో ప్రపంచ రికార్డు స్థాపించే వాతావరణముందన్నాడు జెక్ రాయబారి ఎమిల్‌తో. ఎమిల్ సిగ్గుతో నవ్వాడు. తాను కూడా అలాగే అనుకుంటూన్నట్టుంది. కాని ఏమీ వాగ్దానం ముందుగా చేయలేదు.

ఈసారి 10 కిలోమీటర్ల పందెం. పరుగు నెమ్మదిగా ముందుకు సాగింది. ఫిన్నిష్ పందెగాండ్రలో ప్రముఖుడు 'పేరేలా' ఒక్కడే పాల్గొన్నాడు. 2 ఘట్టాల తర్వాత వెనకబడిపోయాడు. చివరవరకు ఎమిల్ ఒక్కడే ఆ పరుగు మార్గంలో వేగం అధికం చేసి, మరి తగ్గించకూడదనుకున్నాడు.

అనుభవంగల ప్రేక్షకులు ప్రపంచ రికార్డుకొరకే ఎమిల్ పరుగెత్తుతున్నాడని కనిపెట్టేరు. అన్నిమూలలనుంచి జటోపెక్‌కు జయజయధ్వానాలు. స్మృతిపథాన్నుండి ఎప్పుడూ చెరిగిపోని 'నూర్మి' జన్మస్థానంలోనే యీ ప్రపంచరికార్డును సృష్టించుటకు ప్రయత్నం చేస్తూన్న జటోపెక్ ప్రశంసాపాత్రుడయ్యాడు.

ఎమిల్ పరుగెత్తేడు. ఒక క్రొత్తరికార్డు తన శక్తికి మించిందికాదని గ్రహించాడు; నా బలం నిలుస్తుందా ? అని తన్ను తాను అనుక్షణం ప్రశ్నించుకొంటున్నాడు. తప్పకుండా నిలుండాలి. ఆతని ఆత్మవిశ్వాసం అంతకంతకు పెరుగుతూంది.

6 వ కిలోమీటర్లో వేగం అధికం చేశాడు. తుర్కు స్టేడియంలో యిలాంటి పరుగుపందెం ఎన్నడూ జరగలేదు. ఇదివరకు వేళలన్నీ వెనక్కుపోయాయి. ప్రేక్షకులాతనిని ప్రోత్సహిస్తున్నారు. ఇక్కడే నూర్మి రికార్డుల సృష్టించాడు; గత సంవత్సరం హీనో అద్భుత విజయాన్ని సంపాదించాడు. ఈనాటి జటోపెక్ ప్రదర్శనముందు అవన్నీ ప్రేక్షకులు మరచారు. ఆఖరు ఘట్టంలో వేగం యింకా అధికం చేశాడు. 29 నిమిషాల 15 సెకండ్లకన్నా రికార్డువేళ తగ్గిద్దామని ఆతని కోరిక. ఒక్కసారి మనసులో లెక్కవేసికొన్నాడు. ఇది సాధ్యమనుకున్నాడు. సాధారణంగా ఫిన్నులు వారి దేశస్థులనేగాని పైవారిని ప్రశంసించరు. అలాంటివారు తనని మెచ్చుకుంటున్నారని గుర్తించాడు.

ఆఖరు ఘట్టం : వేగం అంతకంతకు అధికమవుతూనే ఉంది.

ఆతనిలో మిగిలిన బలం అంతా ఆఖరు మీటర్ల కుపయోగిస్తున్నాడు. పిడుగులాగ పరుగెత్తుతున్నాడు. ఆతని ఆఖరు పరుగు అందరికి ఆశ్చర్యం కలిగించింది. ఆతని బలం క్షీణిస్తూంది; అయినా గమ్యస్థానం వరకు నిలబెట్టుకున్నాడు. ఎమిల్‌తో పోలిస్తే తక్కిన ప్రత్యర్థులందరూ నిలుడిపోయినట్టు కనుపించారు.

మరికొన్ని క్షణాలలో యీ మానవాతీత ప్రయత్నం, దాని బాధ పూర్తి అయాయి. గమ్యస్థానం చేరుకున్నాడు ఎమిల్.

వేళ : నమ్మడానికి వీలులేదు. 29 నిమిషాల 02.6 సెకండ్లు.

అక్కడ వారికి కలిగిన సంతోషానికి మేరలేదు. ఆ స్టేడియం ఆవరణలో వర్ణింపనలవికాని అమితమైన ఆవేశం బయలుదేరింది. ఆ ఆవేశం పట్నమంతా ప్రాకింది; ఫిన్లాండు అంతా నిండింది; ప్రపంచాన్ని ముంచెత్తింది. మానవులకు అసాధ్యమైన ప్రదర్శన మిచ్చాడొక జెక్ ఆటగాడని టెలిఫోనులు, టెలిగ్రాంలు, పత్రికలు ప్రపంచపు నలుమూలలకు చాటినవి.

"మన దేశంలో బయలుదేరే సంతోషం ఎలాగుంటుందో ఊహించాలి" అని అక్కడి జెక్ ఆటగాండ్ర బృందం తమలో తామెంతో ఆనందంతో అనుకున్నారు.

1950 ఆగస్టు 4 వ తేదీని యింత అద్భుత ప్రదర్శనం జరుగుతుందని ఎవరూ నమ్మలేదు. స్వదేశంలో రేడియోలవద్ద, పత్రికల దుకాణాలవద్దగ ప్రజలు వేలకొలది గుమిగూడి ఆనందాశ్చర్యాలతో యీ శుభవార్త విని, తమ కృతజ్ఞతను తెలియజేశారు.

"మన దేశానికి ప్రపంచంలో కీర్తి సంపాదించుటే అవసరమని తోస్తే, తన యావచ్ఛక్తిని యివ్వగల ఉత్తమ ఆటగాడొకడున్నాడు మనలో" అనుకున్నారందరూ.

మర్నాడు ఎమిల్ హెల్సింకీకి తిరిగివచ్చాడు. హెల్సింకీ 'బే' వద్ద నున్న ద్వీపాలలో ఒక ద్వీపానికి ఎమిల్ వినోదానికి వెళ్లేడు. అక్కడ ఫిన్నిష్ కార్మిక

యువజనసంఘం క్లబ్బున్నది. అక్కడే ఆ పిల్లలు ఒక హాస్టలు కట్టుకున్నారు. అక్కడే ఆనందంగా కాలం గడిపేవారు.

ఎమిల్ వారితో పరిచయం చేసుకొన్నాడు. కొత్త స్నేహితులను సంపాదించాడు. ఆతని జీవితాన్నిగూర్చి, తన స్వదేశాన్నిగూర్చి వారితో చెప్పేడు. వారితో వాలీబాల్ ఆడేడు. వారితో 'సానా'లో యీదేడు. సాయంత్రం వారు పాటలు పాడేవారు. ఒక జెక్‌పాట, తరవాత ఒక ఫిన్నిష్‌పాట, మళ్ళీ జెక్‌పాట యీ విధంగా.

ఒక ఆదివారం సుఖంగా గడపిన తర్వాత, మరొక పందెంలో పాల్గొనవలసి వచ్చింది. టంపారీ అనేచోట 5000 మీటర్ల పందెంలో పరుగెత్తేడు.

ఆ పట్నంలో తిరుగుట, అచ్చటి దృశ్యాలు చూచుట అతనికి కొత్త అనుభవాల నిచ్చాయి.

ఈసారి ఫిన్నిష్ పందెగాండ్రతో పోటీచేయవలసి వచ్చింది. 14 నిమిషాల 18 సెకండ్లు పట్టింది అతనికి. దూరపు పందేలలో యింతవరకు పైచెయ్యిచూపిన ఫిన్లాండు నుంచి, ఎమిల్ బలవంతంగా ఆగౌరవాన్ని లాక్కున్నాడు. ప్రతిఫిన్నిష్ ఆటగానికి, పిల్లవానికికూడా ఎమిల్ ఒక "సాటుపెక్క" (మంత్రగాడు) అయిపోయాడు.

ప్రపంచ రికార్డు పరుగు తర్వాత ఫిన్నిష్ వార్తాపత్రికలలో యీ విధమైన వ్రాతలు కనబడ్డాయి:

"ఎమిల్ ప్రవర్తనను బట్టి, ఆత డొక పరుగెత్తే యంత్రమని అనడం ఎంత పొరబాటో బోధపడుతుంది. ఆత డొక మానవమాత్రుడని సాధారణంగా అందరూ మరచిపోతారు. మా ఫిన్నులకు 'సాటుపెక్క'; ఒక్క పందెగాడు మాత్రమేకాదు."

ప్రేగ్ నగరంలో ఆతనికి అఖండమైన స్వాగత సన్మానాలు జరిగినవి. ఆతనిని విజయోత్సాహంతో ఊరేగిస్తూంటే, ప్రజలు దారిప్రక్కల బారుబుతీర్చి జోహారు లర్పించారు.

తిరిగి స్వస్థలం చేరుకున్నపుడు ఆయనమీద పుష్పవర్షం కురిసింది.

# బ్రసెల్సులో యూరోపియన్ పందెములు

ఒక ముఖ్యమైన పందేనికి ముందు, మరొకసారి ఎమిల్‌ను దురదృష్టం వెన్నాడింది. యూరోపియన్ ఛాంపియన్‌షిప్పులకొరకు ప్రెయినింగయ్యేరోదులు ఆసుపత్రిలో ఉండవలసి వచ్చింది. గుండెను పరీక్షించుకొనేరోదులు, ఊపిరితిత్తులను శుభ్రపరచేబదులు మందులు త్రాగుతూ, పథ్యంమీద ఉండవలసివచ్చింది. ఆసుపత్రి

తోటచుట్టూ పరుగెత్తుతూ, అప్పుడప్పుడు డాక్టర్లకు ఆశ్చర్యం కలిగించేవాడు. అయినా యిది ప్రమాదకరమని అనడానికి వీలులేదు.

సోమవారంకూడా ఆతనిని వదలుటకు డాక్టర్లు ఒప్పుకోలేదు. 8 పౌనుల బరువు తగ్గిపోయాడు. విశ్రాంతి బాగా అవసరమనిపించింది. మంగళవారం 8-30 గంటలకు ఆతనిని ఆసుపత్రి అధికార్లు వదలివేశారు. వదలిన గంటకల్లా ఎమిల్ బ్రసెల్సుకు వెళ్లే విమానంలో ఉన్నాడు.

యావత్తు యూరోపునుండి వచ్చిన ఆటగాండ్రందరితో ఎమిల్ హాయిగా కాలం గడిపేడు. సోవియట్ ఆటగాండ్రు, ఆతని పాతస్నేహితులుకూడా అక్కడకు వచ్చేరు. వారితో తిరిగి కలిసికొనుట ఆతనికి ఆనందం కలిగించింది. మా జట్టుకు ముఖ్యంగా జటోపెక్ మూలంగా ఎక్కువ ప్రచారం లభించింది. ప్రకటన పత్రాలలో మాత్రం రీఫ్ ముందుగాను, జటోపెక్ 4 వ వానిగా జయమొందినట్లు బొమ్మలు వేశారు. ఆఖరు 5000 మీటర్ల పందెంలో రీఫ్ జయిస్తాడని అందరి నమ్మకం.

22 దేశాలు యీ ఛాంపియన్‌షిప్పులలో పాల్గొంటున్నాయి. మా జట్టు చాలా చిన్నది; అయినా సాధ్యమైనంత బాగా నెగ్గడానికి ప్రయత్నంచేయుటకు పూనికతో నున్నారు.

నిజంగా అందరూ శక్తివంచనలేకుండా పాటుపడ్డారు. రూడ్కీ అందరికీ ఆశ్చర్యం కలిగించాడు. 3000 మీటర్ల 'స్టీపిల్-ఛేజ్'లో గెలుపొందేడు.

కాని, జటోపెక్ పాల్గొనవలసిన 2 పందేల విషయంలోనే అందరూ చాలా ఆతృతగా వేచివున్నారు.

ఈ విషయంలో ఎవరికీ ఆశాభంగం కలగలేదు.

10000 మీటర్ల పందెం ముందు వర్షం కురిసింది. పరుగుమార్గం మెత్తబడిపోయింది. అక్కడక్కడ నీటిగుంటలు ఏర్పడ్డాయి. యూరపు అన్ని ప్రాంతాల నుండి విఖ్యాత ప్రత్యర్థులు వచ్చినా, యీ పందెం జటోపెక్‌కు సులభంగానే ఉంది. అన్ని ఘట్టాలలో ఒకే వేగంతో పరుగెత్తేడు. పందేనికి ముందు ఆసుపత్రిలోవున్నా, ఆతని శక్తి క్షీణించలేదు.

మన ఆటగాండ్రు ప్రేక్షక స్థానాలలోనుండి, మధ్యవేళలు అరచి ఎమిల్‌కు వినపడేటట్టు చెప్పేవారు. వెలుతురు పోతూ చీకట్లు కమ్ముతూన్నప్పుడుకూడా, ఎమిల్ మామూలు వేగంతోనే పోతున్నాడు. ఈ మధ్యే ప్రపంచ రికార్డు స్థాపించకపోయినట్టయితే యిదే ప్రపంచ రికార్డు అయివుండేది.

వేళ : 29 నిమిషాల 12 సెకండ్లు. ఇంతకన్నా వేగంగా తానే పరుగెత్తేడు.

ఫ్రాన్సునుంచి వచ్చిన మిమోన్ రెండవవాడు. వేళ : 30 నిమిషాల 21 సెకండ్లు; ఫిన్లాండునుంచి వచ్చిన కోస్కెలా 3 వ వాడు; వేళ : 30 నిమిషాల 31 సెకండ్లు. వారి వెనుక వరుసగా స్టోకెన్, ఏరాన్, వేటిన్.

ఆ రోజు 60,000 మందికిపైగా ప్రేక్షకులున్నారు. అంతకన్నా ఎక్కువమంది ఎప్పుడూ హాజరుకాలేదు. 5000 మీటర్ల పందెంలో పరుగెత్తేవారు ఆతనిని ఆత్రుతతో చూస్తున్నారు.

ఎమిల్ పరుగు అందరికి ఒక మహత్తర సంఘటన. అట్టివేగం వారెన్నడూ కనలేదు. బెల్జియన్ పత్రికలు ఆ పందేన్ని గురించి అద్వితీయమని వర్ణించాయి.

ఒక బెల్జియన్ పత్రికయొక్క స్పోర్ట్సు ఎడిటరు, ఎం. వాన్‌డెర్‌బెర్గే, ఆతని విమర్శలో యీ విధంగా అన్నాడు:

"మా కొకప్పుడు ఆశ, ఒకప్పుడు నిరాశ. మేము అరిచాం, గంతులు వేశాం, చప్పట్లు కొట్టేం మా చేతులు నొప్పిపెట్టేట్టు. అలసిపోయి మా స్థానాల్లో చతికిల బడ్డాం. ఇదంతా ఎలా జరిగిందని మాలో మేము ప్రశ్నించుకున్నాం. జటోపెక్ మమ్మల్ని మంత్రముగ్ధుల్ని చేశాడు. బలవంతంగా, నిర్బంధంగా పరుగెత్తుతాడు, జటోపెక్ అనడంలో అర్థంలేదు. పాదాలు సునాయాసంగా జరుగుతాయి; పరుగులో ఒక 'లయ' కనబడుతుంది. ఇతరులలో లేని అంతులేనిశక్తి అతనిలో వుంది; ఈ శక్తిని ఉపయోగించే పద్ధతి అద్వితీయం. ఆతని ప్రత్యర్థులు నిజంగా ప్రత్యర్థులేకారు. ఆతని 'వేళలు' మనుష్యశక్తికి మించినవి. 1950 నుండి ప్రపంచాన్ని సమ్మోహితం చేయగల అనుపమాన పరుగు పందెగాడయిపోయాడు జటోపెక్.

10 కిలోమీటర్లలో విజయం తర్వాత, 5000 మీటర్ల పందెంలో పరుగెత్తేడు. సునువుగా గెలిచేడు, మామూలు వేగంతో. లండన్‌లో చేసిన పొరబాటు యిక్కడ చేయలేదు.

రీఫ్ యింకా ఎక్కువ జాగ్రత్తగా ఉన్నాడు. అదే ఆతని అపజయానికి కారణమయ్యేది. ఏదో కష్టపడి 5 వ వానిగా వచ్చేడు. నిప్పుతో చెలగాటమన్నాయి, బెల్జియన్ పత్రికలు, యితని ప్రయత్నాన్ని గూర్చి.

ఈ మధ్య జబ్బుపడ్డ తర్వాత 5000 మీటర్ల పందేనికి తాను సమర్థుడేనా, అని ఎమిల్‌కు అనుమానం. వారంక్రితం ఆతని కడుపు ఖాళీచేశారు. దానివల్ల ఆతని సంసిద్ధత అనుమానంలో పడిపోయింది. కాని పత్రికలలో జటోపెక్, రీఫ్‌లను గూర్చి చర్చలు ఉధృతంగా ఉన్నాయి. అందుచేత పోటీలో ప్రవేశించక తప్పలేదు.

అదీగాక, రీఫ్ అంత భయపడవలసిన ప్రత్యర్థికాదని ఎమిల్‌కు తెలిసింది. బెల్జియన్ పత్రికలలో ప్రకటనలను పరిశీలనగా చదివిన తర్వాత, ప్రజ లతనిలో చూపిన విశ్వాసంవెనక డంబం ఎక్కువగా ఉందని ఆతను గ్రహించాడు.

జటోపెక్‌ను కలిసినప్పుడు రీఫ్ ఏమీ మాట్లాడలేదు. కాని ఆతని శిక్షకుడు మాత్రం యిలా అన్నాడు:

"లండన్‌లో ఫలితంలాగే ఉంటుంది: 10,000 మీటర్ల పందెం జటోపెక్ గెలుస్తాడు; 5000 మీటర్ల పందెం గేస్టన్‌ది."

ఈ విధమైన వూహాగానాలు, ముందుగాచేసే ప్రశంసలు అనుమానాలకు దారి తీస్తాయి. ఎమిల్ అనుమానించాడు. బెల్జియన్లు ధైర్యంగాలేరని ఎమిల్ గుర్తించాడు.

ఆత్మవిశ్వాసంగలవాడు డాంబికాలకు పోడు. పందెం ప్రారంభానికి ముందు రీఫ్ శిక్షకుడు, అవసరమయితే రీఫ్ పందేన్ని 14 నిమిషాల 03 సెకండ్లలో పూర్తిచేయగల డని డంబాలు పలికాడు.

ఎమిల్ తలపంకించి "యిప్పుడే చూస్తాంకదా!" అన్నాడు.

"మంచిఅవకాశం; నీ అదృష్టం గేస్టన్" అన్నాడు బెల్జియన్ ప్రత్యర్థితో కరచాలనంచేసి, ఎమిల్.

"నీకుకూడా మంచి అవకాశం" అని బదులుచెప్పేశాడు గేస్టన్. అయినా, ఆవేశాన్ని అణచుకోలేకపోయాడు.

అధికారి పందెం ప్రారంభానికి సంజ్ఞచేశాడు. పిస్టల్ పేలింది. పోటీ ప్రారంభమయింది.

మొదటిక్షణంనుంచి పోటీదార్లు అతివేగంగా పరుగెత్తుతున్నారు. అందరికీ ఆవేశంగావుంది. ఇంతవేగం ఎమిల్ ఎప్పుడూ ప్రదర్శించలేదు. రీఫ్ ముందుకు పోయాడు; వాని వెనకనే ఎమిల్. ఆ వేగం నిలబెట్టుకోలేకపోతున్నాడు. రెండు ఘట్టాలవరకూ యీవిధంగా జరిగింది. అప్పుడు ఆకస్మికంగా తన శక్తినంతా వినియోగించి ముందుకు ఒక్కసారి బలంగా పరుగెత్తినాడు. 3వ ఘట్టంలో అందరికన్నా ముందున్నాడు. పరుగుపందెం జరుగుతూన్నంతసేపూ, సభ్య 'వేళల'గూర్చి చెప్పకూడదని, ఏవిధమైన సంజ్ఞలు పందెగాళ్ళకు చేయకూడదని అధికారి ప్రకటన. ఇవి క్రొత్త నిబంధనలు; వానిని అందరూ గౌరవించాలి. లండన్‌లో 5000 మీటర్ల పందెం రీఫ్ గెలిచినప్పుడు, జటోపెక్ ఆఖరిపరుగు యత్నం, ముందున్న రీఫ్‌కు ఎవరో పరుగుమార్గం మధ్యనుండి తెలియజేశారన్న సంగతి జ్ఞప్తియందున్నది.

అందుచేత జటోపెక్ అధికార్ల ప్రకటనలమీదే ఆధారపడి ఉండాలి. ప్రేక్షకులలో వున్న తన స్నేహితులు ఏమైనా సూచిస్తారని ఆశించాడు, ఎమిల్. ప్రేక్షకులందరికి అంతా అయోమయంగా ఉంది. ఏమైనా, ఎమిల్‌కు తనకు కావలసిన భోగట్టా దొరకలేదు.

ఆతని స్నేహితులు రీఫ్‌ను ఉత్సాహంగా ప్రోత్సహిస్తున్నారు. రీఫ్ అందరికన్నా ముందు పరుగెత్తాలని వారి కోరిక. 5వ ఘట్టంలో రీఫ్ మళ్లీ మొదటి స్థానానికి చేరేడు. ఎమిల్‌ను వెనక్కినెట్టి ఆతని శక్తిని ముక్కలుచేయాలని రీఫ్ ప్రయత్నం. బలం క్షీణిస్తూంటే, దూరం తగ్గించుట కష్టమయిపోతూంది.

పరిస్థితి ఎమిల్ గ్రహించాడు; ఇది సంభవించకూడదనుకున్నాడు. అయినా, 10 మీటర్లు ముందుకు పోయాడు రీఫ్. ఎంతో కష్టపడితేనేగాని ఎమిల్ రీఫ్‌ను కలుసుకోలేకపోయాడు.

తాను పరుగెత్తిన పందేలనుగూర్చి ఎమిల్ ప్రసంగించినప్పుడు, ప్రతి క్షణం జరిగిన విషయాలు జ్ఞాపకముంచుకుంటాడు. చాలా సంవత్సరాల క్రితం జరిగిన పందేలను గూర్చిన వివరాలుకూడా చెప్పగలడు. కాని, బ్రసెల్సులో జరిగిన పోటీని గూర్చి వర్ణించలేకపోయాడు. వాని మనోశక్తికి శరీరమంతా లొంగిపోయింది. రీఫ్‌ను

ఏమైనా వదలకపోవుట, ఒక్క క్షణం నిర్లక్ష్యంచేయక పోవుట, ఏమైనా ఓడిపోకుండా ఉండుట; వీనిమీదే ఎమిల్ మనస్సంతా కేంద్రీకరించబడి వుంది.

పందెం జరుగుతూన్నంతసేపు రీఫ్ వెనక్కు తిరిగి చూడలేదు. వెనక్కు చూడడంవల్ల తన అశక్తి బయటపడుతుందని ఆతనికి తెలుసు; అదీకాకుండా, ప్రత్యర్థికి ధైర్యమిస్తుంది. అలా కాకుండా, ఎమిల్‌కన్నా ముందున్నాడు. ఎమిల్ పాదాలధ్వనిగాని, ఊపిర్ల చప్పుడుగాని అతనికి వినబడుటలేదు. ముఖ్యంగా ప్రేక్షకుల కోలాహలంలో అవి అణగిపోయాయి. అందరూ "గేస్టన్! గేస్టన్!" అని అరుస్తున్నారు.

ఆఖరు ఘట్టానికి ముందు ఘట్టంలో, ఒక్కసారి వెనక్కు తిరిగి చూచాడు ఎమిల్ ఎంతదూరంలో నున్నాడని. జటోపెక్ తన మడమలనంటే ఉన్నాడని చూడగానే, తన దృష్టిని తానే నమ్మలేకపోయాడు. ఆ క్షణంలో ఆ ముఖంలో ఆత్రుత, ఆవేదన స్పష్టమయ్యాయి.

ఎంతో కష్టించాడు. ఎమిల్, రీఫ్‌ను వెన్నంటే ఉన్నాడు. రీఫ్ ముఖంలో కనబడ్డ భయం ఎమిల్‌కు విశ్వాసం, ధైర్యం కలిగించాయి.

ఆఖరు ఘట్టం ప్రారంభమవడంతో, ఎమిల్ మంచి తరుణం చూచుకొని, ముందుకు సాగేడు. ఒక బాణం దూసుకుపోయినట్లు, రీఫ్ ప్రక్కనుంచి దాటి పోయాడు. ఎమిల్ తన శక్తినంతా వినియోగించాడు.

క్షణంలో అంతా నిశ్శబ్దం. అప్పుడు 15 మంది - ఎమిల్ జెక్ స్నేహితులు - ఒక్కసారి "ఎమిల్!" అని బిగ్గరగా అరచారు, విజయోత్సాహంతో. ఆ స్థలమంతా తిరిగి "ఎమిల్" అని ప్రతిధ్వనించింది. జటోపెక్ దాడి రీఫ్‌ను ధ్వంసంచేసింది. వేగం తగ్గిపోయింది. కాళ్ళు తడబడ్డాయి. అలసిపోయాడు. ఆఖరు ఘట్టంలో జటోపెక్ రీఫ్‌ను దాటి, 130 మీటర్లు అతనికి ముందున్నాడు.

ఈ సంఘటన అందర్నీ చకితుల్ని చేసింది. వారి కళ్లెదుటే ఎట్టి అద్భుతం జరుగుతూందో ప్రేక్షకులు గ్రహించలేకపోయారు. అప్పుడు బయలుదేరిన విజయ ధ్వానాలన్నీ, జటోపెక్‌కొరకే.

ఒకసారి విజయం హస్తగత మయినతర్వాత, జటోపెక్ దానిని జారవిడవలేదు. ప్రతిక్షణం తనకు, రీఫ్‌కు మధ్యనున్న దూరం అధికమవుతూ వచ్చింది. రీఫ్ దగ్గరకు రాలేకపోయాడు. జటోపెక్ వేగం అధికంచేసి గమ్యస్థానాన్ని దాటిపోయాడు.

మరొకసారి జాతీయ రికార్డు సృష్టించాడు.

స్టాప్ వాచీలు చూపిన వేళ 14 నిమిషాల 03 సెకండ్లు. ఇప్పటికి రికార్డయిన వేళలలో యిది రెండవది.

ప్రేక్షకులు తమ స్థానాలలో నిలబడిపోయి, విరామం లేకుండా జయధ్వానాలు చేశారు. 23 సెకండ్ల తర్వాత రీఫ్ గమ్యస్థానం చేరుకున్నాడు. ఫ్రెంచి పందెగాడు మిమోన్, రీఫ్ సంగతి కనిపెట్టి, ప్రయత్నంచేసి అతనిని దాటి రెండవవానిగా విజయం పొందాడు. బెల్జియన్ రీఫ్ మూడవవానిగా చేరుకున్నాడు.

తన అద్భుత ప్రత్యర్థి రీఫ్ యీ విధంగా కూలిపోవుట ఎమిల్‌కు ఆందోళన కలిగించింది. రీఫ్ గమ్యస్థానం దాటగానే అలసటతో పడిపోయాడు. చైతన్యం పోయినట్టయింది. ఆ సమయానికే ఫొటోగ్రాఫర్లు ఆ విషాద సంఘటనవైపు వారి యంత్రాలను తిప్పేరు.

బహుమాన ప్రదానం తర్వాత, ఎమిల్‌వద్దకు రీఫ్ అభినందించుటకు వచ్చినప్పుడు, ఎమిల్ సుహృద్భావంతో ఆతనిని పలకరించి పరామర్శించాడు.

బ్రసెల్స్ నగరంలోని అభిప్రాయానికి వ్యతిరేకంగా వెళ్ళింది పందెం ఫలితం. పత్రికలన్నీ రీఫ్‌బొమ్మవేసి, రీఫ్‌నుగూర్చి ప్రశంసించుతూ వ్యాసాలు ప్రకటించాయి. ఆతని విజయం తథ్యమని జోస్యం చెప్పినవి. చిన్న అక్షరాలతో, జటోపెక్ ఆఖరు ఘట్టంలో ఒకవేళ గెలవవచ్చునని పత్రికలు ప్రకటించాయికూడా.

రీఫ్ శరీరస్థితి బాగుండలేదని కొందరు అతని ఓటమికి కారణం చెప్పేరు. ఆ అస్వస్థత ఆతని ఓటమి కెంతవరకు కారణమో యీనాడు చెప్పలేం. కాని రీఫ్‌కు అస్వస్థగా ఉండుటమాత్రం యథార్థం. ఎందుచేతనంటే, ఎమిల్‌కుకూడా అదే అభిప్రాయం. అయినా, పందేనికి ముందు ఎమిల్‌కుకూడా స్వస్థతలేదు. అందువల్ల యిద్దరూ ఒకే యిబ్బందితో బాధపడ్డారు.

"సాహసి, జటోపెక్" అనే శీర్షికగల వ్యాసంలో కొన్నాళ్ళతర్వాత రీఫ్ ఆనాటి పందేన్నిగూర్చి వ్రాశాడు. జటోపెక్‌ను దూరంగా వదిలేసి, ఆతని గుండెల్లో అధైర్యంకలిగించే పన్నాగం తనదని రీఫ్ వ్రాశాడు. ఎమిల్ శక్తిని ధ్వంసంచేద్దామని ఆతని ఉద్దేశం. 20 మీటర్లు ఎమిల్‌కన్నా ముందుండగలిగితే జయానికి ఏ యిబ్బందీ లేదనుకున్నాడు.

ఎమిల్ యీతని పద్ధతినే అనుసరించాడు. తిరిగి దెబ్బతీశాడు. ఆ సమయంలోనే రీఫ్‌కు ఓటమి స్థిరమయిపోయింది.

"నా అపజయానికి కారణాలు: జటోపెక్‌యొక్క బలం, సాహసం, శక్తి. 14 నిమిషాల లోపుగానే ఎమిల్ యీ పందేన్ని గెలవగలడని కాలం గడచినకొద్దీ స్పష్టమవుతూంది."

"జటోపెక్ నామీద గెలిచిన గెలుపు ఏ అనుమానానికీ తావీయదు."

"సాహసి, జటోపెక్."

యూరోపియన్ ఛాంపియన్‌షిప్పులనుండి రెండు అఖండవిజయాలతో తిరిగి వచ్చేడు ఎమిల్.

లండన్‌లో సాధించలేనిది, బ్రసెల్స్‌లో సాధించాడు. జెక్‌జట్టు సంతోషంతో యింటికి చేరుకున్నారు. కొన్ని మంచిఫలితాలను సంపాదించారు. నూతన వ్యాయామశిక్షణయొక్క సత్ఫలితాలు మరల స్పష్టమయ్యాయి.

# ఆటల రుతువు - విజయసమాప్తి

బ్రసెల్స్‌నుండి తిరిగివచ్చిన కొద్దికాలంలోనే, అంతర్జాతీయ పోటీలో పాల్గొనడానికి జెక్ జట్టు ఫిన్లాండు వెళ్ళింది. విజయానికి దరిదాపుగా మాత్రమే రాగలిగారు. కాని కొన్ని మంచి ప్రదర్శన లిచ్చారు. ఆఖరు "రిలే" పోటీలో గెలుపువల్లనే ఫిన్నులు అపజయంనుండి తప్పించుకోగలిగారు. ఒక్క "పాయింటు" లో గెలిచారు.

మళ్లీ, ఎమిల్ దురదృష్టవంతు డయ్యాడు. ఈ సంవత్సరమంతా అంతే. దెబ్బతగిలిన కాలితో పోటీలలో పాల్గొనవలసివచ్చింది. ఆరోగ్యంగా లేకుండా, దూరపు పరుగు పందేలలో పరుగెత్తి గెలుచుట ఎంత కష్టమో ఊహించుకోవాలి. రెండు పోటీలలోకూడా అలాగే గెలిచాడు. 5000 మీటర్లు 14 నిమిషాల 05 సెకండ్లలో పూర్తిచేశాడు. ఈ విధంగా తన కెంత శక్తిఉందో ప్రేగ్ నగర ప్రజలకు రుజువుచేశాడు. బ్రసెల్స్‌లో పందెం ఎంత వేగంతో తాను గెలవగలిగాడోకూడా స్పష్టపడింది.

అక్టోబర్‌లో జటోపెక్ నాయకత్వంక్రింద జెక్ ఆటగాళ్లు జర్మన్ డెమోక్రటిక్ రిపబ్లిక్‌కు వెళ్ళి అక్కడి పోటీలలో పాల్గొన్నారు. డ్రెస్డెన్, ఎర్‌ఫర్టులలో ఆటల ఉత్సవాలు, శాంతిస్థాపనకు సంయుక్త ప్రయత్నాలవలెనున్నవి. విజయంకంటె, అక్కడి ప్రజల ఆదరణ, ఎమిల్‌కు సంతుష్టి కలిగించింది యుద్ధంలో ఫాసిస్టుల దుండగాలను మరపించుటకు నిర్వాహకులు చేసిన ప్రయత్నం యిది.

డ్రెస్డెన్‌లో ఉండగా, జర్మన్ రికార్డు సృష్టికర్త రుడాల్ఫ్ హార్బిగ్‌ను ఎమిల్ మరవలేదు. ఈతడు యుద్ధంలో మరణించాడు. అలాంటి విధ్వంసపు యుద్ధం మరల రాకుండా ఆటగాళ్ళు నివారించాలి. జటోపెక్ తిరిగి వచ్చినతర్వాత, డ్రెస్డెన్ ఎలాగుందని అడిగినప్పుడు అత నిలా జవాబు చెప్పేడు :

"హార్బిగ్ స్మారకచిహ్నాని కెదుట నిలబడితే, ఎవరైనా సవినయంగా తల వంచవలసిందే. ఈ పరుగు పందెగాని విజయాలను మించినవి యీనాటికికూడా లేవు. ఆతని అఖండ విజయాలమధ్య యీ విషాద సంఘటన జరిగిందంటే, ఆతనిని స్మరించుకొని "యుద్ధం మరి లేకుండా ఉండుగాక !" అని అందరం ఒక్కుమ్మడి కేకవేస్తాం.

నవంబరులో సోవియట్ యూనియన్ ఆటగాండ్రతో జరిగే కఠినమైన పోటీకి యీ జర్మన్ పందేలు నాందిగా పరిణమించాయి.

# మంచులో యుద్ధం

"ఎవరు గెలిచినా, అందరి సంయుక్తవిజయంగా పరిగణించాలి. శాంతి స్థాపనకు, దేశాలమధ్య సుహృద్భావానికి విజయం తోడ్పడాలి."

ఇరుపక్షాలవారి ఆశయం యిదే.

ప్రేగ్ నగరంలో, యుద్ధానంతరం సోవియట్ ఆటగాండ్రు పాల్గొనుట కిదే మొదటిసారి. అందుచేత యీ గొప్ప వ్యాయామ ప్రవీణుల ప్రదర్శనలు చూద్దామని పట్నం యావత్తూ చైతన్యవంతమయిందంటే ఆశ్చర్యం లేదు.

అప్పుడు అకస్మాత్తుగా అనుకోని విషయ మొకటి జరిగింది. మంచు కురియుట ప్రారంభమయింది. పందెపు మార్గంమీద మంచు కంబళి పరచినట్లయింది. పందెం జరిగే సూచనలు కనబడలేదు. అయినా మనవారు, మన ప్రత్యర్థులు, మన అతిథులు పందెం జరగాలని కుతూహలం ప్రదర్శించారు.

వారి సుహృద్భావం ప్రేక్షకజనంలో నూతనోత్సాహం కలిగించింది. రెండు జట్ల నాయకులు: కనకీ, జటోపెక్‌ల ఆలింగనం ఆ పోటీలోని అంతరార్థాన్ని స్పష్టపరచింది.

చలి ఎక్కువగా వున్నా, కొన్ని అద్భుత ప్రదర్శనలు, కొన్ని కఠినమైన పోటీలు చూడగలిగాం. సోవియట్ పందెగాళ్ళ నోడించుట కష్టసాధ్యమైన పని. వారిని మించుటకు మనవారి ప్రయత్నం. అందుచే మా జట్టుకు కొన్ని అద్భుత విజయాలు చేకూరాయి. చాలా జాతీయ రికార్డులు భగ్నమయ్యాయి. మంచు కురుస్తున్నా ప్రేక్షకులు పోటీలను చూస్తూ వాటి జయాపజయాలలో పాల్గొన్నారు.

రెండవరోజు శీతోష్ణస్థితి యథాప్రకారంగా వుంది. ఆ పరుగుమార్గంలో వున్న మంచును తుడిచివేయాలి. ఆటగాండ్రు పోటీలు ఆపకూడదన్నారు. అందుచేత యథాప్రకారంగా పోటీలు జరిగినవి. క్రీడల చరిత్రలో ఎన్నడూ యీ విధంగా పందేలు జరగలేదు. శీతోష్ణస్థితియొక్క నిర్దయను మనోనిశ్చయం అణచివేసింది. పందేనికి ముందు క్రొత్తగా నిర్మించిన 'స్టౌ'ల దగ్గర ఆటగాండ్రు చేతులు, కాళ్లు వేడిచేసుకొని తయారయ్యేవారు. ఎలాగయినా చివర వరకూ ప్రయత్నించి ఆటలలో పాల్గొన్నారు.

అందుచేత వారి ప్రదర్శనలన్నీ అద్భుతమైనవని చెప్పాలి. వారి శారీరక నైతికశక్తి కవి తార్కాణాలు. వీరు ఎక్కడో యిళ్ళలో తయారయిన ఆటగాళ్లు కారు. ఎట్టి అమానుష పరిస్థితులలోనైనా అద్భుత ఫలితాలను చూపగల ధీరోదాత్తులు. సోవియట్ వీరుడు బులాంషిక్ పరుగెత్తిన "హర్డిల్ రేస్" చాలా అద్భుతమైనది. 14.4 సెకండ్ల వేళలో అద్భుత ప్రదర్శనమిచ్చాడు. ప్రపంచ ప్రఖ్యాతిచెందిన

'డంబాడ్జీ' కూడా అద్భుతమైన ప్రదర్శన నిచ్చింది. 50 మీటర్ల దూరానికి "డిస్కస్" విసరింది.

సోమ్యోసెవ్, వేనిన్‌ల మీద విజయం సులభంగానే చిక్కింది ఎమిల్‌కు. ఆతని జట్టుకు చాలా "పాయింట్లు" సంపాదించాడు.

అంత్య ఫలితం : అతిథులకు 215 పాయింట్లు, ప్రత్యర్థులకు 135 పాయింట్లు. ఇందులో సగం కన్న ఎక్కువ "పాయింట్లు" సోవియట్ స్త్రీలే గెలుచుకొన్నారు.

ఈ పోటీలలో వర్గీకరణ కష్టం. ప్రజలకుకూడా యీ విషయం బాగా తెలుసు. ఈ పోటీలలో ముఖ్యంగా గుర్తించవలసింది అక్కడి సుహృద్భావ వాతావరణం.

# 1951 : క్రొత్త ప్రపంచ రికార్డులు

**1950** వ సంవత్సరంలోని ఫలితాలన్నీ పరిశీలించి, శిక్షణను ఏవిధంగా అభివృద్ధి చేయాలో చర్చించుటకు ఆటగాండ్రందరిని సమావేశపరచారు. యువకుల శిక్షణ విషయమై ఎక్కువశ్రద్ధ తీసుకొనుటకు, మరొక ప్రపంచ రికార్డు సృష్టించుటకు ఎమిల్ నిశ్చయించుకున్నాడు.

ఈ ప్రపంచ రికార్డు ఎంతదూరానికి సంబంధించినదో ఎవరికీ తెలియదు. అందరికీ తెలిసికోవాలని ఆత్రుత. 5000 మీటర్ల హేగ్ రికార్డును భగ్నం చేయుటే ఆతని ఉద్దేశంగా కనబడుతూంది. ఆతని వేళకు అతి దగ్గరగా వచ్చేడు యీ సంవత్సరం ఎమిల్.

వచ్చే సంవత్సరం డిసెంబరులో తన తయారీ ఎలాగుంటుందో చెప్పడం కష్టం. అందుచేని ఎవరితోను ఏమీ అనలేదు ఎమిల్. డానాకే ఆతని మనసులో ఉద్దేశం తెలియలేదు. డానా, ఎమిల్‌ను వేధించుకుంది. "ఎన్ని రికార్డులు యీ విధంగా భగ్నం చేయదలచుకున్నావు ? నీ ఉద్దేశం ఏమిటి ; ఒక్కటైనా చేస్తానంటావా ? లేకపోతే మూడా ?"

కాలం గడచిపోయింది, అనుకున్న దానికంటె వేగంగా. తన శక్తికిమించిన ఆలోచనలు చేస్తున్నట్టు అనిపించింది ఎమిల్‌కు. చలికాలంలో ఎమిల్ తన తోటి ఉద్యోగస్థులతో కాలం గడిపేడు; యింటికి వచ్చేసరికి రాత్రి చాలా ఆలస్య మయ్యేది. ఎన్నోసార్లు తన ట్రెయినింగుకూడా విస్మరించేవాడు. ఇంటివద్ద 'ప్రాక్టీసు' చేసేవాడు. కాని దానివల్ల ఎక్కువ ప్రయోజనంలేదు.

అదీకాకుండా, ఒక దుస్సంఘటన జరిగింది. ఎమిల్ మార్చి నెలలో సెలవు తీసుకొని, డానాతో పర్వత ప్రదేశాలకు పోయాడు. అతనికి అన్నిరకాలైన క్రీడల లోను పరిచయం ఉంది. బైసికిలు త్రొక్కుట, స్కేట్లమీద పరుగెత్తుట, ఈత వీటన్నిటిలో ఆసక్తి చూపేడు. 'స్కేయింగు' అతనికి పరమప్రీతి. డానాకుకూడా చాలా యిష్టం. ఆ పర్వతపు అంచులు ఎత్తుగా ఉన్నవి. నడుస్తూంటే చెట్లు అడ్డుగా ఉన్నవి. వీనిమూలంగా ఎమిల్ కాలుకు దెబ్బతగిలింది. ఒక నెలరోజులు ఆ కాలుకు కట్టు కట్టవలసివచ్చింది.

చివరకు ఏప్రిల్‌లో ట్రెయినింగు ప్రారంభించాడు ఎమిల్. దెబ్బ మానింది గాని, పూర్తిగా కోలుకోలేదు. ట్రెయినింగు ఆలస్యం అయిపోవుటచేత ఫలితాలు ప్రోత్సాహకరంగా లేవు. అతని కాళ్ళు పరుగెత్తుటకు అంగీకరించుటలేదు.

15 నిమిషాల పరిమితిలో పరుగెత్తలేకపోయాడు. మొదటి పందెం ఎంతో కష్టంమీద గెలిచాడు. 3000 మీటర్ల పందెంలో, యువక పందెగాడు 'స్వోరర్', ఎమిల్‌ను దాదాపు ఓడించాడు. జూన్ ఆఖరువరకు 14 నిమిషాల 17 సెకండ్ల వేళను సాధించలేకపోయాడు.

అతని ట్రెయినింగును ఫిల్ముతీసే ప్రయత్నం అతనికి అడ్డుతగిలింది. యువకులకు ఆదర్శంగా జటోపెక్‌ను చూపిస్తూ యీ ఫిల్ము నిర్మింపబడింది.

ఇదంతా అతని ట్రెయినింగుకు ఆటంకాలు కలిగించింది. అతని సెలవు అతనుపయోగించుకోలేకపోవుటేకాక, అతని ట్రెయినింగుకు ఒక స్థలం లేదు; ఒక వేళ లేదు. జటోపెక్‌వంటి ఉత్తమ పరుగు పందెగానికి క్రమశిక్షణ అత్యవసరం.

ఆ వేసవిలో జటోపెక్‌కు ఓటమి సంభవించింది. క్రీడాప్రియుల కెంతో ఆశ్చర్యం కలిగింది. కాని ఎమిల్‌కుమాత్రం ఏమీ ఆశ్చర్యంలేదు.

3000 మీటర్ల పందెంలో సిపోనా ఎమిల్‌ను ఓడించాడు. సిపోనా వెనక 2వ వానిగా వచ్చుట అంతే అనుమానంలో లెక్కకాదనుకోండి. కాని ఎమిల్ విషయంలో యిది కొంత ఆశ్చర్యానికి కారణమయింది. దీనికి కారణమేమని అందరి ఆలోచన. పత్రికలు విమర్శనలు ప్రారంభించాయి. అధికార్లు పరిశీలించుట మొదలుపెట్టేరు. ఫిల్ముతీయుట ఆపుచేశారు. రాత్రిళ్లు ట్రెయినింగు అవసరం లేకుండా, ఎమిల్ ఆఫీసు పనులు ఏర్పాటు చేయబడినవి.

ఇప్పటికే చాలా ఆలస్యమయిపోయింది. జటోపెక్ పాల్గొనవలసిన ప్రపంచ యువజనోత్సవాలు బెర్లిన్‌లో ఆగస్టు ప్రారంభంలో జరుగనున్నవి.

10 రోజుల కఠినశిక్షణ తర్వాత కొంత దారిలోపడ్డాడు. పూర్వపుశక్తిని మరల పొందగలిగానన్న విశ్వాసం కలిగింది. గణించదగిన పోటీలేకుండా ఆ సంవత్సరపు ఉత్తమోత్తమవేళ, 14 నిమిషాల 11 సెకండ్లలో పందెంలో విజయం చేపట్టాడు.

"మైత్రి" అనే సుహృద్భావంతోకూడిన పలకరింపు ఎమిల్ హృదయంలో జర్మన్ యువకులయెడల సద్భావం కలిగించింది. జెక్ జట్టు ఎక్కడకు వెళ్ళినా ఆనందోత్సవాలు జరిపారు అక్కడి ప్రజలు.

ఎమిల్ జటోపెక్ చాల మరువరాని అనుభవాలు పొందేడు. స్టేడియంలో ప్రఖ్యాత ప్రేక్షకులస్థానంలో నున్న జర్మన్ డెమొక్రటిక్ రిపబ్లిక్ అధ్యక్షులు విల్ హెల్మ్ తో పరిచయం కలిగింది ఎమిల్ కు. వారి రెండుదేశాల క్రీడల భవిష్యత్తునుగూర్చి స్నేహపూర్వక సంభాషణ జరిగింది.

వారు యింటికి చేరుట తడవుగా, వారి జట్టులో కొంతమంది హంగరీలో జరిగే అంతర్జాతీయ పోటీలో పాల్గొనుటకు బుడాపెస్టుకు విమానంలో బయలుదేరారు. జటోపెక్ విజయాల ఫలితంగా, వారికి సంపూర్ణ విజయం చేకూరింది. ఎమిల్, తాను పరుగెత్తిన అన్ని పందెములలో సాధారణ వేగమును మించలేదు. అయినా ఆ వేగములే ప్రపంచ పందెగాండ్రలో అసూయ రేకెత్తించునట్టివి.

ఆ తరువాత ఎమిల్ కు కొంత మనశ్శాంతి లభించింది. ఎమిల్ కు మనశ్శాంతి అంటే, ఏ అవాంతరం లేకుండా తన శిక్షణను కొనసాగించుకొనుటే.

సెప్టెంబరుమాసం వచ్చేసరికి, వాగ్దానంచేసిన రికార్డు విషయమై ఆలోచించుటకు ఎమిల్ మొదలుపెట్టేడు. ఎమిల్ ఇంతవర కెప్పుడూ, తా ననుకున్నది సాధించలేక పోలేదు. కాని ఎంత దూరపుపందెంలో పరుగెత్తాలో నిర్ణయించుకోవాలి.

తాను యిప్పుడు బాగా పరుగెత్తుతున్నానని నమ్మకంగానే ఉంది. కాని అయినను, పది కిలోమీటర్లు పరుగెత్తుటకు కావలసిన వేగం అతని కిప్పుడు లేదు. ఈ సంవత్సరం ప్రపంచ రికార్డులకు కావలసిన వేగమునకు దరిదాపుగానైనా తాను రాలేనని అతనికి తెలుసును. ఎమిల్ కూడా మానవమాత్రుడే కాబట్టి, కొన్ని పరిమితులకు లోనుకావలసివుంది. ఉత్తమ ప్రదర్శనలు అదృష్టంమీదగాని, క్షణికమైన ఆవేశంమీద గాని ఆధారపడివుండవని అనేకసార్లు ఎమిల్ రుజువుపరచేడు. దీర్ఘమైన ఆలోచనతో కూడిన సంసిద్ధత ఫలితమే రికార్డుల సృష్టి అని ఎమిల్ కు బాగా తెలుసు. అందుచేత ప్రపంచ రికార్డులను పరీక్షించి, చివరకు 20 కిలోమీటర్ల పందెంపై దృష్టి సారించేడు. హీనో ఏలిన యీ రికార్డుల రాజ్యంలో తాను కొన్ని సవరణలు చేయుటకు నిశ్చయించేడు. వెంటనే దానికి తగిన శిక్షణపొందుటకు ప్రారంభించేడు. రెండువందల మీటర్లు, నాలుగువందల మీటర్లు దూరములు అదే పనిగ పరుగెత్తుటకు ప్రారంభించేడు. ఈసారి పందెం పూర్వంకన్నా ఎక్కువదూరం కలది గనుక, నాలుగువందల మీటర్లు ఎక్కువసార్లు పరుగెత్తి శిక్షణపొందేడు. రోజుకు నలభైసార్లు కూడా అతను పరుగెత్తుతున్నాడు.

ఎమిల్ సాగిస్తూవున్న యీ ట్రెయినింగు కాలంలోనే సైన్యానికి సంబంధించిన పోటీలు ఏర్పడినవి. ఇంతవరకు యింతదూరము పరుగెత్తలేదు కాబట్టి, యీ అవకాశం తీసుకొని తన్ను తాను పరీక్షించుటకు నిశ్చయించుకొన్నాడు. ఈదూరానికి సంబంధించిన రికార్డులు బలహీనంగా ఉండుటవల్ల, వానిని సులభముగ భగ్నమొనర్చుటకు వీలవుతుందని ఎమిల్ భావించేడు. అయినా హీనో ప్రపంచ రికార్డును పడగొట్టుటకు తాను అర్హుడు కానేమోనని అతని భయం. హీనో రికార్డువేళ 1 గంట 0·2 నిమిషముల 40 సెకండ్లు. అందుచేత తన పందెమునకు ఒక పథకం తయారు చేసు

కున్నాడు. 20 కిలోమీటర్ల పందెం 1 గంట 0.2 నిమిషాల 30 సెకండ్లలో పూర్తి చేయుటకు నిశ్చయించేడు. ఎప్పుడు యీ పందెం జరుగుతుందా, దాని ఫలితం ఏమవుతుందా అని, ఎమిల్ ఎంతో ఆతృతగా ఉన్నాడు.

మొదటి ఘట్టాలలోనే గమనం చాలా నెమ్మదిగా ఉందని ఆశ్చర్యపోయాడు. అంతకన్నా వేగంగా పరుగెత్తుదా మనుకున్నాడు. కాని తన పథకానికి భిన్నంగా వెళ్ళకుండా, అపరిచితమైన యీ పందెంలో జాగ్రత్తగా ప్రవర్తించాడు. మొదటి 10 కిలోమీటర్లు పరుగెత్తేసరికి అలసట వస్తుందని భయపడ్డాడు.

పందెం అయిన తర్వాత యీలాగన్నాడు: "మొదటి 10 కిలోమీటర్లు, నెమ్మదిగా పరుగెత్తేను." కాని నెమ్మదిగా అంటే, 31 నిమిషాల 0.6 సెకండ్లలో పూర్తి చేశాడు. అయినా ఎమిల్ తన శక్తినంతను యింకా పూర్తిగా వినియోగించలేదు.

"ఇంకా గమ్యస్థానం 10 కిలోమీటర్లు మాత్రమే ఉన్నప్పుడు, శక్తినంతను ఉపయోగించి పరుగెత్తుటకుగాని, అలసటచెందకుండా పోవుటకుగాని ఏమీ సందేహం లేదు. మొదటిసుట్టంలో ఏమీ అలసట చెందలేదు. ఖులాసాగా పరుగెత్తేడు. అయినా, రెండు జాతీయ రికార్డులను, రెండు ప్రపంచ రికార్డులను సృష్టించాడు.

ఒకగంట పరుగుపందెంలో 19 కిలోమీటర్ల 558 మీటర్లు పూర్తిచేయగలిగాడు. 20,000 మీటర్లు 1 గంట 0.1 నిమిషాల 16 సెకండ్లు పట్టింది. ఆ పందెపు రెండవ భాగం 30 నిమిషాల 10 సెకండ్లు పట్టింది.

ఎమిల్ వేగం ఏ విధంగా వృద్ధిచెందిందో యీ క్రింది అంకెలవల్ల బోధపడుతుంది :

| | | |
|---|---|---|
| 1. | 5000 మీ॥ | 15 నిమిషాల 36 సెకండ్లు |
| 2. | 5000 మీ॥ | 15 నిమిషాల 39 సెకండ్లు |
| 3. | 5000 మీ॥ | 15 నిమిషాల 09 సెకండ్లు |
| 4. | 5000 మీ॥ | 15 నిమిషాల 02 సెకండ్లు |

క్రమమైన శిక్షణే కాకుండా, ఒక పథకం, తన సమర్థతనుగూర్చి పూర్తిగా తెలిసికొనుట, ఒక నిశ్చయానికి రాగలిగినశక్తి ఒక పరుగుపందెంలో అత్యవసరమని యీ పందెం రుజువుచేసింది.

ఇలాంటి విజయంలో ఏ పందెగాడైనా సంతుష్టి చెందుటకు సందేహం లేదు. కాళ్ళు జాచుకొని, శరీరాన్ని వాల్చి, అందరి మన్ననలను సగర్వంగా స్వీకరించేవాడు. కాని ఎమిల్ స్వభావం వేరు.

మా అందరికీకూడా యీ రికార్డులు ఆనందాన్ని కలిగించాయి. ఈ పందేల అంతరార్థాన్ని గూర్చి, జటోపెక్ భవిష్యత్తునుగూర్చి పత్రికలెన్నో విమర్శలు వ్రాసినవి. వారి విమర్శలన్నీ వారి ఉత్సాహానికి ప్రతిబింబాలు.

ఫ్రాన్సు - ఫిన్లాండుల మధ్య అంతర్జాతీయ పోటీ జరిగేరోజున, ఫిన్లాండులో జటోపెక్‌ను గూర్చిన వార్త అందింది. ప్రపంచ రికార్డుదారుల జాబితాలో తనకు

స్థానంలేకుండా జటోపెక్ చేసినాడని హీనో గ్రహించాడు. ఈ విషయమై ఏమంటా వని పత్రికలు హీనోను అడుగుతున్నాయి.

హీనోకు విచారంగాని, అసూయగాని కలగలేదు. అతడు సహృదయుడు. ఎప్పుడో ఒకప్పుడు తనకన్నా సమర్థుడు, తన రికార్డులను భగ్నం చేయునని అతనికి తెలుసు. అత నిట్లా అన్నాడు :

"ఈ విజయాన్ని సాధించినది జటోపెక్ అని విని చాలా సంతోషించాను. అతను ఉత్తముడు. అతనికి నా అభినందనలు."

జటోపెక్ శక్తి సామర్థ్యాలనుగూర్చి వార్తాపత్రికలవారు అడిగినప్పుడు హీనో యిలా గన్నాడు :

"అతనికి ఆశ్చర్యం కొలిపే అంతులేని బలముంది. నమ్మండి; ఒక గంటలో 20 కిలోమీటర్లు పరుగెత్తగల సమర్థత అతని కున్నది."

హీనో వివేకం గలవాడు కాబట్టి, యిలాంటి అభిప్రాయాన్ని యివ్వగలిగాడు. పోటీచేసే పందెగాళ్ళు ఒకరినొకరు దగ్గరగా పరిశీలిస్తారు కాబట్టి, ప్రేక్షకస్థానాల లోని వారికంటె, ఒకరి నొకరు ఎక్కువ బాగా తెలిసికొనగలరు.

హీనో అభిప్రాయం సాహసంతో కూడుకున్నదని ఎమిల్ అనుకున్నాడు; కాని, వాని మాటలుమాత్రం అతనిలో అశాంతిని కలిగించినవి. ఎంతో ఆతృతతో శిక్షణపొందడం మొదలుపెట్టేడు. వచ్చే పందెంమీదనే దృష్టి ఉంచుకున్నాడు. ఇదివరకు వేళను అతిక్రమించా లనుకున్నాడు. అలసటచెందకుండా ప్రశాంతంగా ఒకపద్ధతిలో ట్రెయినింగయ్యేవాడు.

1951 సెప్టెంబరు 29 దగ్గరపడుతూంది. అతని పరుగులచరిత్రలో అదొక ప్రఖ్యాతదినం.

ఈ చరిత్రాత్మక పందెం హూస్టుకాసార్వలోని ఉత్తమ పరుగుమార్గంమీద జరిగింది. దానిమీద ప్రతి అడుగు అతనిలో నూతనోత్సాహం కలిగించింది. మంచి తయారీలోనున్నట్టు అతనికి విశ్వాసం కలిగింది.

ఈ సంవత్సరం అతనికంత శుభప్రదంగా లేదు. అయినా, మొట్టమొదటిసారి అతనికిది అదృష్టదినంగా కనుపించింది. అన్ని పరిస్థితులు అనుకూలంగా కనుపించినవి. అతనికి అపరిమితానందంగా ఉంది.

తన పూర్వపు ప్రపంచ రికార్డు జ్ఞప్తికి వచ్చింది.

ఒక గంటలో 20 కిలోమీటర్లు పరుగెత్తగలడా ఎమిల్, అనే చర్చలు అనంతంగా సాగుతున్నాయి. ఈ లోపుగా ఎమిల్ తన పథకం తయారుచేసు కుంటున్నాడు; ఏ ఘట్టం ఎన్ని నిమిషాలలో పూర్తిచేస్తే, ఒక గంటలో దూరమంతా పూర్తిచేయగలడో లెక్కలు వేసుకొంటున్నాడు. 14 రోజుల క్రిందట పరుగెత్తి నప్పటికంటె యీసారి వేగం హెచ్చించాలి. ఈనాటి తయారీలో, అతని లెక్క ప్రకారం 1 గంట 00 నిమిషాల 24 సెకండ్లలో పరుగు పూర్తికాగలదు. అతని సామ ర్థ్యాన్నిగూర్చి స్నేహితులు ప్రసంగించినప్పుడు,ఎమిల్ చిరునవ్వు నవ్వేవాడు. అంటే

10 కిలోమీటర్లు 30 నిమిషాల చొప్పున రెండుసార్లు పరుగెత్తాలన్నమాట. అది అసంభవం. తన శక్తిని ఉన్నదానికన్న ఎక్కువగా గణించుటకన్న, తక్కువగా భావించుట అతని స్వభావం.

ప్రారంభంలో 17 గురు పోటీదార్లున్నారు; వారందరికి పోటీలో తమ స్థానం నామమాత్రమేనని తెలుసు. అయినా తమ శక్తినంతా వుపయోగించారు. మధ్య దారిలో ఎవరూకూడా పందెం వదలివేయలేదు.

ఈ చరిత్రాత్మకమైన పందెం 4 గంటల 23 నిమిషాలకు ప్రారంభమయింది. ఎమిల్ మొదటినుంచి చాలా పట్టుదలతో పరుగెత్తేడు.

మొదటి కిలోమీటరు 2 నిమిషాల 58 సెకండ్లలో పూర్తిచేశాడు. ఇదివరకు కంటే 6.7 సెకండ్లు వేగంగా పరుగెత్తేడు. రెండవ కిలోమీటరులో 11.5 సెకండ్లు ముందుగా పరుగెత్తేడు.

వేళల ప్రకటనలు ప్రేక్షకులను ఆవేశంతో నింపినవి. ఒక్కొక్క ప్రత్యర్థిని అతిక్రమించి ముందుకు పోయాడు. ఇంక పరుగెత్తేది తానొక్కడే; తన ప్రత్యర్థి కాలం మాత్రమే. ప్రేక్షకులందరూ ఎప్పటిలాగే ఎమిల్‌కి ప్రోత్సాహ మిచ్చారు. జయధ్వానాలు చెలరేగినవి.

సెప్టెంబరు 29 వ నాటి జటోపెక్, సెప్టెంబరు 15 వ నాటి జటోపెక్‌తో పోరాడుతున్నాడు. ప్రతి సెకండు విజయం సాధిస్తున్నాడు. అతి త్వరలోనే పథకాన్ని అతిక్రమించాడు.

మొదటి 5 కిలోమీటర్లు 14 నిమిషాల 56 సెకండ్లలో పూర్తిచేశాడు. 10 కిలోమీటర్లు పూర్తి చేసేసరికి 29 నిమిషాల 54 సెకండ్లయింది. సెప్టెంబరు 15 తాలూకు వేళను 1 నిమిషం 12 సెకండ్లతో అతిక్రమించాడు. ప్రేక్షకుల ఆనందానికి మితంలేదు. ఈ విధంగా పరుగెత్త గలిగితే, నమ్మడానికి వీలులేని వేళలో పరుగు పూర్తిచేస్తాడు. అయితే అది సాధ్యమా? అప్పటి కప్పుడే తన శక్తినంతను ఉపయోగించివేయలేదా? లండన్‌లో ఒలింపిక్సులో 10,000 మీటర్ల పందెం గెలిచి నప్పటి వేళకంటె తక్కువవేళలో, యింతదూరం యీ పందెంలో పూర్తిచేశాడు.

ఎమిల్ యీ ప్రశ్న కిచ్చిన జవాబుకు ద్వంద్వార్థం లేదు. 15 కిలోమీటర్లు 44 నిమిషాల 54.6 సెకండ్లలో పూర్తిచేశాడు. ఈ దూరం యింతవేగంగా యింతవరకు ఎవరూ పరుగెత్తలేదు. ప్రపంచరికార్డులో ఇదొక గుర్తింప దగ్గ దూరమైనట్టయితే, యిప్పటికి ఎమిల్‌దే ప్రపంచ రికార్డువేళ. అధికార్లు 10 మైళ్ళు (16,090 మీటర్లు) ప్రపంచ రికార్డుదూరంగా గుర్తిస్తారు. ఈ దూరం 1936 లో ఫిన్‌దేశస్థుడు ఐసో-హోల్లో 49 నిమిషాల 22 సెకండ్లలో పరుగెత్తి ప్రపంచరికార్డు స్థాపించాడు. ఈ రికార్డును 1 నిమిషం క్రిందికి తీసుకువచ్చాడు ఎమిల్. అతని వేళ 48 నిమిషాల 12 సెకండ్లు.

ప్రేక్షకులు, యీ సమయంలో ఎమిల్ పడే అవస్థను గుర్తించలేకుండా ఉన్నారు. పత్రికలకు వార్తలు సేకరించుతూవున్న రచయితలుగాని, పందేలు నిర్వహిస్తూన్న అధికార్లుగాని ఏమి జరుగుతూందో గ్రహించలేకపోయారు.

16 వ కిలోమీటర్‌లో బాధ ప్రారంభమయింది. ఈ నొప్పికి కారణమేమిటో ఆతనికి తెలుసు. పందేనికి ముందు ఏమైనా తింటే యిలాంటి నొప్పివస్తుంది. పందేనికి ముందు పస్తుండడం అలవాటే. కాని, దూరపుపరుగుల పందేలలో ఆహారం లేకపోవుట బలహీనానికి కారణమవుతుంది. అందుచేత యిలాంటి బాధలు తప్పవనుకున్నాడు.

అలాగే, ఆ నొప్పితోనే సాగిపోతున్నాడు. ఈ నొప్పులు తగ్గిపోవాలని తనకు తానే సమాధానం చెప్పుకొంటున్నాడు.

అయినా నొప్పులు తగ్గలేదు. అలసట ఎక్కువైంది. కాళ్లు ముందుకు సాగడానికి నిరాకరిస్తున్నవి.

ఇంక ఏదోవిధంగా పందెం పూర్తిచేయుట అనేదే ప్రశ్న కాదు. అంతకన్నా ఎక్కువ విషయం ఉంది. 3 వంతుల దూరం పరుగెత్తినవేళ ప్రకారం చూస్తే, 20 కిలోమీటర్లు 1 గంటలోపుగా పూర్తిచేసే అవకాశం వున్నది.

తన శరీరానికి వ్యతిరేకంగా, అలసటకు, నొప్పులకు వ్యతిరేకంగా ఎమిల్ పోరాడవలసివచ్చింది. ఈ అదృశ్యపోరాటం ఏవిధంగా సాగుతూందో ప్రేక్షకులకు తెలియదు. పందెం జరుగుతూంటే బాధలగూర్చి ఎవరితో ఫిర్యాదుజేస్తాడు? పందెం పూర్తిఅయిన తర్వాత బాధలనుగూర్చి అడిగే దెవరు? ఎమిల్ ముఖంమీద కనబడే బాధ తాత్కాలికం కాదు. అది లోపలనుంచి ఆతనిని కష్టపెడుతూన్న నొప్పి. ఆతని మనోబలమే ఆతని కిప్పుడు శరణ్యం. తన శరీరంలోని లోపాలన్నిటిని మనోబలం చేతనే జయించగలుగుతాడు. ఎమిల్ బాధపడుతున్నాడు; చేతులు జారవేస్తున్నాడు; మళ్ళీ పైకెత్తిస్తున్నాడు; నాలిక ఎండుకుపోతూంది; గాలి సరిగా పీల్చుకోలేకపోతున్నాడు. కాని ఎలాగో అన్నీ సర్దుకుంటాయి; అన్నిబాధలను జయిస్తాడు; మరల చిఱునవ్వుతో మనలనందర్ని యథాప్రకారం పలుకరిస్తాడు. ఇదివరకు అనేక పందేలలో యిదే మన అనుభవంకదా!

ఆఖరు ఘటాలు సులభంగా లేవు. చాలా కష్టపడి మరీ యీ రికార్డు సాధించాడు. 17 వ కిలోమీటర్లో కాలి నొప్పి తగ్గింది. కాని ఆయాసం, అలసటమాత్రం యథాప్రకారంగానే ఉంది. ఆ విధంగా చివరవరకు పోరాటం జరిగింది.

చివరి ఘట్టంలో ఎమిల్ మనోబలం, ప్రేక్షకుల ఉత్సాహం మిళితమై అద్భుతమైన ఫలితాన్ని ఆతనికి సంపాదించినవి. ఎమిల్ పడిన బాధకు విజయమే ప్రతిఫలం.

ఒక గంట పరుగు పందెంలో 55 వ నిమిషమున తుపాకీ ప్రేలుస్తారు. దానినిబట్టి పందెగాండ్రకు వేళ ఎంతుందో తెలుసుంది; దానిప్రకారం వారి పరుగు వేగాన్ని సరిదిద్దుకుంటారు.

20 కిలోమీటర్లు పూర్తి చేయుటకు మరొక ఘట్టం ఉన్నది. ఇంకా తుపాకీ పేలలేదు. ఇది సంభవమేనా? గంట కాకుండానే 20 కిలోమీటర్లు పూర్తిచేయవచ్చునన్న ధైర్యం ఆకస్మికంగా ఆతనిలో కలిగింది. దగ్గరకు వస్తూన్నప్పుడున్న మలుపు చేరేడు; శబ్దం వినబడింది.

వేగం అధికంచేశాడు. ఆ ఆఖరు నిమిషం పూర్తిగా ఉపయోగించు కొనుటకు నిశ్చయించాడు ఎమిల్.

ప్రేక్షకుల కరతాళధ్వనులు ఆనందాతిశయంతో నిండినవి. రికార్డుల వరుసను తారుమారుచేస్తాడని అందరూ నిశ్చయించారు. 14 రోజుల క్రిందట 1 గంట పరుగు ముందు పూర్తిచేసి, తర్వాత 20 కిలోమీటర్లు పూర్తిచేశాడు. ఈనాడు దానికి వ్యతిరేకం. 20 కిలోమీటర్లు పూర్తిఅయింది, కాని గంట పూర్తి అయ్యేవరకు పరుగెత్తాలి.

ఆఖరు కిలోమీటరులో అమిత వేగంతో పరుగెత్తినాడు! 2 నిమిషాల 51.8 సెకండ్లు. ఎమిల్ ప్రక్క నుండి పరుగెత్తిపోతూంటే స్టేడియం అధికారి పిస్తోలు పైకెత్తి పందెం పూర్తి అయిందని ప్రకటించుటకు తయారుగా ఉన్నాడు. ఏ క్షణంలో తుపాకీశబ్దం వినబడుతుందా అని చూస్తున్నాడు ఎమిల్. వెనక్కు తిరిగి చూచాడు. ఆశ్చర్యపోయాడు. ఏమి జరిగింది!

ఇంకా 52 మీటర్లు పూర్తిగా పరుగెత్తవలసి ఉంది. అప్పటికిగాని పందెం పూర్తికాదు.

"ఈనాడు నేననుకున్నకంటె ఎక్కువే జరిగింది" అని నిట్టూర్పు విడిచాడు ఆనందంతో.

ఇప్పుడు, యీ ప్రయత్న ఫలితంగా, 3 ప్రపంచ రికార్డులను సాధించాడు.

48 నిమిషాల 12 సెకండ్లలో : 10 మైళ్ళు

59 నిమిషాల 51·8 సెకండ్లలో: 20 కిలోమీటర్లు

60 నిమిషాలలో : 20 కిలోమీటర్ల 52 మీటర్లు

ఫ్రెంచి దేశస్థుడు బూయిన్ ప్రదర్శనం రికార్డులలో రికార్డు అని నూర్మి అంటూండేవాడు. ఇప్పుడు ఎమిల్, హీనో విశ్వసించిన దానికన్న ఎక్కువ అద్భుతంగా పరుగెత్తేడు.

పందెం అయిపోయింది కాబట్టి, ఎమిల్ ప్రశాంతంగా ఆనందంగా ఉన్నాడు.

వేళలగురించి వెంటనే అడిగేడు. 14 రోజుల క్రిందటి ప్రదర్శన వేళకన్న 1 నిమిషం 24 సెకండ్లు తక్కువవేళలో 20 కిలోమీటర్లు పరుగెత్తేడు. ఒక గంట పరుగు దూరం రికార్డుకన్న యిప్పుడు 494 మీటర్లు ఎక్కువ పరుగెత్తగలిగాడు.

1913 లో ఒక గంటలో బూయిన్ 19 కిలోమీటర్ల 21 మీటర్లు పరుగెత్తేడు.

1951 సెప్టెంబరు 15 న జటోపెక్ 19 కిలోమీటర్ల 558 మీటర్లు పరుగెత్తేడు.

1951 సెప్టెంబరు 29 న జటోపెక్ 20 కిలోమీటర్ల 52 మీటర్లు పరుగెత్తేడు.

పూర్వపు రికార్డును 500 మీటర్లలో ధ్వంసం చేయుటకు 38 సంవత్సరాలు పట్టింది. ఆ రికార్డునే భగ్నమొనర్చి అద్వితీయ ప్రపంచ రికార్డును సాధించాడు ఎమిల్.

ఈ సారి యీ పందెపు దూరంలోని 4 ఘట్టాలు యీ క్రింది విధంగా పరుగెత్త గలిగాడు :

| | | | | |
|---|---|---|---|---|
| 1. | 5000 మీటర్లు | 14 నిమిషాల | 57.4 | సెకండ్లు |
| 2. | ,, ,, | 14 ,, | 56 | ,, |
| 3. | ,, ,, | 15 ,, | 01.2 | ,, |
| 4. | ,, ,, | 14 ,, | 57.2 | ,, |

మొదటి సగభాగం 29 నిమిషాల 53.4 సెకండ్లలోను, రెండవభాగం 29 నిమిషాల 58.4 సెకండ్లలోను ఎమిల్ పూర్తి చేశాడు.

ఈ ప్రపంచ వీరునిచేతికి 'మైక్' అందించినప్పుడు, యీతడేనా యిప్పుడు యీ అద్భుత ప్రదర్శన నిచ్చిందని ఆశ్చర్యపడ్డారు ప్రజ లెల్లరు. ఎమిల్ యిలా గన్నాడు :

"మీరు నాకు చేసిన సహాయానికి మీ కందరికి నా కృతజ్ఞత. నా రికార్డు సృష్టికి మీ అందరి సహాయం నాకు లభ్యమైంది. ఈలాంటి పోటీలు, ముఖ్యంగా యువకుల పోటీలు అయినప్పుడు యిదే విధంగా మీ రందరూ హాజరవుతారని ఆశిస్తున్నాను."

ఎంత విస్మయమైన విజయాన్ని తాను సాధించాడో, ఎమిల్ అవగాహన చేసికొనుటకు, ఆతనికి వేళచాలదు. కాని, రేడియోలమీద ప్రపంచపు టంచులకు, వార్త లందించబడినవి. ప్రపంచ వార్తాపత్రికలలో ప్రకటింపబడినది. ఈ వార్తలను చూచి క్రీడోత్సవాలు అనుభవించిన విస్మయావేశాలకు పరిమితిలేదు. ఆలోచించండి: మొదటి 10 కిలోమీటర్లు ఏకాంతంగా పరుగెత్తి, తక్కిన 10 కిలోమీటర్లు ప్రపంచ విఖ్యాతి గన్న పందెగాండ్రతో పరుగెత్తినా ఆతడిదే విజయం. ఆ సంవత్సరంలోమాత్రం 20 కిలోమీటర్ల పందెంలో ఆతని కెదురుగా పరుగెత్తి గెలవగలిగినవాడు లేడని నిర్ధారణగా చెప్పవచ్చు.

ఉదయం వార్తా పత్రికలలో శీర్షికలు.

"ఎథెలిటిక్సు చరిత్రలో అద్భుత ప్రదర్శనం".

సైనికోద్యోగి ప్రపంచ రికార్డు సృష్టికర్త, ఎమిల్ జటోపెక్; యువకులకు అతనికన్న ఉత్తమ ఆదర్శకుడు లేడని మరొకసారి ధృవపరచాడు. తనకు వచ్చిన ఖ్యాతిగాని, తననుగూర్చిన అతిశయోక్తులుగాని ఎమిల్ దీక్షను చెదరగొట్టలేవు. తనకు సహజంగా ఉన్న ముగ్ధత్వాన్ని, వినయాన్ని, స్నేహస్వభావాన్ని ఆటని ప్రపంచ రికార్డులు మార్చలేవు.

ఒక వ్యక్తినిమాత్రం హాస్యం చేయదలచుకున్నాడు ఎమిల్. ఆ వ్యక్తి డానా. తన భర్త ప్రపంచ రికార్డులను స్థాపించాడని ఎంతో గర్వించింది డానా.

"చూశావా! ఒక ప్రపంచ రికార్డు స్థాపించుటకు నేను కంకణం కట్టుకుంటే నన్ను చూచి నవ్వేవు. 'మూడు చేయలేవా?' అన్నావు. జ్ఞాపకం ఉందా! ఇప్పుడు మూడు, నిజంగా 3 ప్రపంచ రికార్డులు సాధించాను" అన్నాడు నవ్వుతూ ఎమిల్.

డానా పాపం ఏంచేస్తుంది. సిగ్గుపడిపోయింది.

# ఒలింపిక్సుకు ఏర్పాట్లు

**1951** లో 3 ప్రపంచ రికార్డులు సాధించిన తర్వాత, ఎమిల్‌కు కొంత విశ్రాంతి అవసరం.

ఒలింపిక్ ఆటలకు తయారవవలసిన అవసరముంది కాబట్టి, పూర్తిగా విశ్రాంతి దొరకలేదు. కొంతకాలక్షేపానికి "స్పీడ్ స్కేటింగు" చేస్తూండేవాడు. ఈ విధమైన శిక్షణ ఎమిల్‌కు ఆనందంగా ఉండేది. "స్కీయింగు" సాధారణంగా చేసేవాడు కాదు. ఏదైనా ప్రమాదం జరుగుతుందేమోనని భయం. దానికి బదులు, మంచులో ఎన్నో కిలోమీటర్లు పరుగెత్తేవాడు. డానాకూడా ఉండేది. పర్వతాల ఎత్తులనుంచి దిగుట, మంచు ప్రవాహాల కెదురు వెళ్లుట మొదలయిన ప్రయాసకలిగించే పనులను చేయుట ఒకఎత్తు; భార్య మంచుగుంతుల దాడికి తట్టుకొనుట మరొకఎత్తు; అన్నిటి కన్నా యిదే బాధాకరంగా వుంచనేవాడు ఎమిల్. డానా గురితప్పని మంచుబంతుల దాడిని ప్రశంసిస్తూ ఎమిల్‌ను ఎరుగని ఆటగాండ్రు, విలాసార్థం ఆప్రాంతంలో పర్యటించే యాత్రికులు ఆతనిచర్యలు వింతగా నున్నవనేవారు.

ఒలింపిక్ జట్టుకు సభ్యులుగా నియమింపబడ్డవారు తమ సామర్థ్యాన్ని పరీక్షించుకొనుటకు జనవరినెలలో సమావేశమయ్యారు. ఒలింపిక్ పోటీలకొరకు అతి కఠినంగా ట్రెయినింగు కావలసివుంది. అదీకాకుండా, యువజనోద్యమంలో శిక్షకుడుగా పనిచేయవలసి ఉంది.

గని కార్మికుల హాస్టలులోని క్రీడల విషయం ఎమిల్ యిదివరకువలెనే శ్రద్ధ తీసుకుంటున్నాడు.

అందరి సమర్థతలగూర్చి చర్చించుకున్నప్పుడు, తాను మంచి తయారీలోనుంటే తన దేశానికి 2 సువర్ణపతకాలను సంపాదించగలనని ఎమిల్ అన్నాడు.

ఇది కొద్దిపాటి విషయం కాదు. అయినా ఎమిల్ అన్నమాట నిలుపుకోగల సమర్థత గలవాడు కాబట్టి, రెండు సువర్ణపతకాలు దేశానికి లభ్యంకావడం నిశ్చయమని అందరి విశ్వాసం.

దూరపు పరుగు పందెగాళ్లు సులభంగా తయారీలోకి వచ్చుట కష్టసాధ్యమైన విషయమని, యీ పుస్తకపు మొదటి అధ్యాయాల్లో చెప్పడింది. జీవితంలోని ఒడు దుడుకులు చెడ్డగా వాని ప్రభావాన్ని కనుపరుస్తాయి. ఎమిల్ తన వాగ్దానపు బరువుతో కృంగిపోతున్నాడు; ఈ వాగ్దానపు వార్త చుట్టు ప్రక్కలకు ప్రాకింది. ఉత్తమ ఆటగాడు కాబట్టి, ధర్మమెరిగిన ఆఫీసరు కాబట్టి ఎమిల్ తన వాగ్దానమును నిలబెట్టుకొనుటకు నిచ్చయించుకొన్నాడు.

ఈ సమయంలోనే ప్రేగ్ నగరంలో జటోపెక్ ఫిల్మును ప్రదర్శిస్తున్నారు. క్రీడోత్సాహులలో యిది చాలా ఆనందం కలిగించింది. ఎమిల్ విజయాలకు సంబంధించిన ఫిల్ము యిది. యువజనోద్యమాలలో ఆతడు పాల్గొన్న ఘట్టాలు చూపబడ్డాయి. తన అనుభవాలను ఎమిల్ యువకులకు అందజేశాడు.

ఈ ఫిల్ము మూలంగా పరుగుపందేలలో అభిమానం లేనివారు, అభిమానాన్ని చూపుట ప్రారంభించారు. పందేలు లేనప్పుడు ఎమిల్ ఏం చేస్తాంటాడో అందరికీ తెలిసికోవాలని అభిలాష. ఎక్కువ కఠినమైన శిక్షణ యీ సమయాన అవసరమని చాలామందికి తెలియదు.

కాని, జటోపెక్ స్థితి ఏమీ బాగుండలేదు. వసంతకాలంలో ఎమిల్ కు ఎప్పుడూ స్వస్థత తక్కువే. ఈ సంవత్సరంకూడా అంతే. ఫారెస్టు రేస్ ఛాంపియన్ షిప్పులో ఎమిల్ గెలిచాడని పత్రికలలో చదివాంగాని, ఎంత కష్టమయిందో ఎవరికి తెలుస్తుంది. దాని దుష్ఫలితా లేమిటోకూడా ఊహించలేం.

పందేనికి ముందు ఎమిల్ చన్నీళ్లస్నానంచేసి జలుబు తెచ్చుకున్నాడు. దీనినంతగా లక్ష్యంచేయక శిక్షణ సాగిస్తూ వచ్చాడు.

జబ్బు చేసిందని ఎప్పుడూ సాకు చెప్పేవాడు కాదు; అందుచేత ఛాంపియన్ షిప్ పందేలకు బయలుదేరాడు.

ఊపిరి పీల్చుట కష్టమయ్యేది. పందెం రెండవభాగంలోనే, అందరికన్నా కొంచెం ముందు పోగలిగాడు. చివరికి గెలిచాడు. కాని దానికి ఫలితం అనుభవించవలసి వచ్చింది. చాలా జబ్బుచేసింది. ఉష్ణం అధికమయింది. కూర్చోలేడు, పడుకోలేడు, అలసట, బాధ. డాక్టరు ఏమీ పనిచేయవద్దన్నాడు; శిక్షణ వద్దన్నాడు; పందేలలో పాల్గొనవద్దన్నాడు. మేనెలలో పందేలలో పరుగెత్తే ఏ పోటీదారూ యింట్లో పండుకొని ఉండడని ఎమిల్ కు తెలుసు. ప్రతిరోజూ కాలం వృధాచేయుట అతనికి తలనొప్పిగా ఉంది. తాను చేసిన వాగ్దానం నెరవేర్చుట ఎట్లా? ఇదే ఆలోచన.

ఇంక పక్కలో పడుకొని ఉండుట దుర్లభం అయిపోయింది. లేచాడు– పారిపోయాడు – వెళ్ళి ట్రెయినింగయ్యాడు. పరుగెత్తడానికి ప్రయత్నించాడు; పరుగెత్తుటవల్ల జబ్బు వదిలిపోతుంది; పరుగెత్తుటవల్ల ఆరోగ్యం కలుగుతుంది.

జటోపెక్ అనుకున్నప్రకారం రోగనివారణ అయింది. ఇది జటోపెక్ కనిపెట్టిన మందు. దీనికి డాక్టర్లతో సంబంధంలేదు.

ఎమిల్ మంచి తయారీలో లేదు. ఇన్‌ఫ్లుయంజా మాత్రం పోయింది. డాక్టర్లు తమ అయిష్టతను ఖచ్చితంగా తెలియజేశారు. ఇంకా అతనికి 'బ్రాంకియల్ కాటరా' ఉందని, గుండె పూర్తిగా ఆరోగ్యంగాలేదని డాక్టర్ల అభిప్రాయం. నిజంగా ఆ రెండు ఒలింపిక్ పతకాలు సంపాదించుట ఎలాగనేదే అతని హృదయంలో ఆవేదన కలిగించింది. శరీరాన్ని లోబరచుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు. అయినా, పూర్వపు సామర్థ్యం అతనిలో కనబడుటలేదు. పోనీ, ట్రెయినింగు అవడానికైనా అవకాశం కలిగింది కదా అని అతని సంతుష్టి.

అతని "వేళలు" ప్రోత్సాహకరంగా లేవు. ఆ జబ్బు యింకా పూర్తిగా కుదర లేదని స్పష్టమయింది.

ప్రేగ్ నగరంలో 5 కిలోమీటర్ల పందెం 14 నిమిషాల 47 సెకండ్లలోను, బ్రటిస్లావాలో 3 కిలోమీటర్లు 8 నిమిషాల 48 సెకండ్లలోను పూర్తిచేయగలిగాడు; భయపడ్డాడు. హెల్సింకీలో ఒలింపిక్సుకు యింక 6 వారాలు మాత్రమే వ్యవధివుంది.

లీప్జిగ్‌లో యువజన క్రీడలలో పాల్గొన్నాడు. ఒలింపిక్ భావాన్ని, శాంతి సందేశాన్ని ప్రసారంచేయుటే దాని ఉద్దేశం.

10 కిలోమీటర్ల పందెంలో ప్రత్యర్థులు హంగేరియన్లు, కోవక్సు, జోహానులు. వారు మంచి తయారీలో ఉన్నారు. వారితో పోటీ జటోపెక్‌కు కష్టమనిపించింది. ఎలాగో గెలుపు సాధించాడు. కాని ఆ 'వేళ' నిరుత్సాహంగా ఉంది. 30 నిమిషాల 0.8 సెకండ్లు.

5000 మీటర్ల పందెంకూడా అంత నిరాశాజనకంగానే ఉంది. హంగరీనుంచి వచ్చిన బీరెస్, పోలెండునుంచి వచ్చిన గ్రాజ్, బల్గేరియానుండి వచ్చిన స్వెసేవ్‌లు చాలా గట్టివారు. వారికి వ్యతిరేకంగా తన యావచ్ఛక్తిని ఉపయోగించవలసివచ్చింది, ఎమిల్. ఇంక గమ్యస్థానం 600 మీటర్లుందనగా మాత్రమే వారిని మించగలిగాడు. అతని వేళ : 14 నిమిషాల 33 సెకండ్లు. వృద్ధి ఏమీ కనబడలేదు. నిర్ధారణ అయిన ఫలితం సంపాదించలేకపోయాడు.

సోవియట్ ఆటగాండ్ర నెమర్కొనుటకు జెక్ జట్టు కీవ్ నగరానికి ప్రయాణ మయ్యారు. సోవియట్ ఆటగాండ్రు ముఖ్యంగా దూరపు పరుగు పందేలలో మంచి సమర్థతగలవారు, అన్ని రంగాలలోను ప్రావీణ్యం చూపించారు. వేళలనుబట్టి చూస్తే, యిదివరకు జటోపెక్ వారినందర్నీ ఓడించినప్పటికంటె, యిప్పుడు సోవియట్ జట్టు ఎక్కువ సమర్థత కనబరచారు.

5000 మీటర్ల పందెంలో జటోపెక్ స్నేహితులు, కెజెన్సెవ్, పాపావ్‌లు. ప్రత్యర్థులు, ఇద్దరూకూడా, మొదటినుండీ ధైర్యంతో పోరాడినారు. ఎమిల్ కూడా ఆవిధంగానే ప్రారంభించాడు. ముగ్గురూ ఒక్కొక్క రొక్కొక్క సారి మొదటివారిగా పరుగెత్తేరు. ఈసారి తన విజయం అబద్ధమనుకున్నాడు ఎమిల్. ప్రత్యర్థులు అతి సమర్థులు; అయినా నిరాశ చెందలేదు; పోరాటం వదల లేదు. ముగ్గురు పోటీదార్లు శక్తివంచనలేకుండా కృషి సలిపారు. కాజన్సేవ్ : 14 నిమి

షాల 13 సెకండ్లు - ఇదొక కొత్త సోవియట్ రికార్డు; పాపావ్ 14 నిమిషాల 17 సెకండ్లు; జటోపెక్ 14 నిమిషాల 22 సెకండ్లు. ఈసారి యీ మూడవస్థానంతో జటోపెక్ తృప్తిపడవలసివచ్చింది. అయినా, పూర్వపుస్థాయికి వస్తూన్నట్టు గ్రహించాడు. హృదయపూర్వకంగా ప్రత్యర్థులను అభినందించాడు. వారి వేళలు, వారి విజయం ఆతనికి ఆనందం కలిగించింది.

10 కిలో మీటర్ల పందెంలో ఒక క్రొత్త ప్రత్యర్థిని ఎదుర్కోవలసి వచ్చింది, ఎమిల్. అనూఫ్రీవ్‌ను గురించి తలచుకున్నప్పుడల్లా, "అద్భుతమైన వ్యక్తి" అనే వాడు ఎమిల్.

ఈతని వయస్సు 26 సంవత్సరాలు. ఈ ఎలుగుల వేటగాడు సైబీరియా నుండి వచ్చినవాడు. అక్కడ స్థానికంగా జరిగిన ఒక యువజనోత్సవంలో యీతని సామర్థ్యం బహిర్గత మయింది.

రెండు సంవత్సరాలలో ఆ ప్రాంతానికి వీరుడుగా తయారయ్యాడు. తర్వాత ఒక సంవత్సరానికి ప్రపంచ వీరులలో ఒక డయ్యాడు.

ప్రారంభంనుంచీ అనూఫ్రీవ్ వేగంగా పరుగెత్తేడు. రెండవ కిలోమీటరు చేరుసరికి 120 మీటర్లు అందరికన్నా ముందుకు సాగిపోయాడు. 5 వ కిలోమీటర్లో జటోపెక్ ఆతనిని అందుకోగలిగాడు. కాని అనూఫ్రీవ్‌కు జటోపెక్ సామర్థ్యం మీద గౌరవంలేదు. ఆతనిని వెనక్కుత్రోసి ముందుకు పోయాడు. అనేకసార్లు ముందుకు, వెనకకు అయినతర్వాత జటోపెక్ 8 వ కిలోమీటర్లో 25 మీటర్లు ముందున్నాడు. అంతకన్నా ఒక్క మీటరుకూడా ముందుకు పోనీయలేగు, అనూఫ్రీవ్.

ఎమిల్ పళ్లుబిగించి పోసాగినాడు. చివరకు విజయం సాధించాడు: అద్భుతమైన వేళ: 29 నిమిషాల 26 సెకండ్లు. అనూఫ్రీవ్ వేళ: 29 నిమిషాల 31 సెకండ్లు - ఇదే జాతీయ రికార్డు.

పందెం పూర్తి అయిన తర్వాత, ట్రెయినింగు పద్ధతులను గురించి, పందెపు అనుభవాలనుగురించి ఎమిల్, అనూఫ్రీవ్‌తో సంభాషించాడు. ప్రపంచంలో తనకు ప్రమాదంగా పరిణమించేది అనూఫ్రీవ్ ఒక్కడేనని ఎమిల్ గ్రహించాడు. తన యువకశక్తిని పరుగులో అన్నిఘట్టాలలో జాగ్రత్తగా పంచాలని, అప్పుడే విజయాలు చేకూరగలవని ఆతడు తెలిసికోవాలి.

కీవ్‌నుండి తిరిగివచ్చిన తర్వాతనే మనశ్శాంతి చేకూరింది; ట్రెయినింగుకు కూడా వేళ దొరికింది. ఒలింపిక్ ఆటలమీదే మనస్సంతా కేంద్రీకరించాడు.

హెల్సింకీలో తన ప్రదర్శనల విషయమై ఆతనికంత ఆశ కనబడుటలేదు. ఆతని స్నేహితులకుకూడా ఆశ ఎక్కువగా లేదు. జటోపెక్ తయారీలో చాల లోపాలున్నవి. ఎమిల్ నిరాశాపూరితు డయ్యాడు; ముఖ్యంగా తన యిటీవలి ప్రదర్శనలు ఆతనిలో నిస్పృహ కలిగించినవి. ఒలింపిక్ పోటీలకు పోకుండావుంటే బాగుంటుందేమోననికూడా ఆలోచించాడు. ఆతని ప్రదర్శనలమీద ఆధారపడిన వారికి ఆశాభంగం కలిగించతగునా? ట్రెయినింగులో చాల శ్రద్ధవహించాడు.

కష్టపడుతున్నాడు. జాతీయ ఛాంపియన్‌షిప్పులకు తయారయ్యాడు. పందేల మొదటి రోజు ఉదయంకూడా విజయంగూర్చి ఎమిల్‌కు నమ్మకంలేదు. ఇప్పుడు ఏం చేయగలడు? హెల్సింకీనుండి రెండు బంగారు పతకాలను సంపాదించుటకు చేయవలసిన దేముంది ?

జాతీయ ఛాంపియన్‌షిప్పులలో ఎమిల్‌ను చూచిన ప్రేక్షక జనం, ఆతని మనోనిశ్చయాన్ని మెచ్చుకున్నారు. పందెం ఆరంభించగానే 'స్వోగర్' ఆతనికి ప్రమాదమైన ప్రత్యర్థి అనుకున్నారు ప్రేక్షకులు. కాని ఎమిల్ సామర్థ్యం ప్రమాదాన్ని పటాపంచలు చేసింది. ఎమిల్ గెలిచాడు. ఆవేశాన్ని ఆశించే ప్రజా సమూహాలు 'స్వోగర్'ను ప్రోత్సహించారు. 'స్వోగర్' వెనకబడిపోయిన తర్వాత, అందరి దృష్టి ఎమిల్‌మీద, ఆతని వేగంమీద, ఆతని 'వేళ' మీద. ఎమిల్ పరీక్షా సమయంలో తేరుకున్నాడు. ఆతని వేళ : 14 నిమిషాల 17.6 సెకండ్లు.

రెండు రోజుల తర్వాత 10 వేల మీటర్ల పందెంలో మరొక విజయం సాధించాడు. వేళ : 30 నిమిషాల 28.4 సెకండ్లు.

జకోస్లావేకియాలో జరిగిన పోటీలనుబట్టి, యీదేశంలో మంచి ప్రవీణులు కలరని స్పష్టమయింది. ఛాంపియన్లు ఒకేరీతిగా ప్రకాశించుట లేదు. వారితో సరిసమానమైన సమర్థత కలవారు యువకులు బయలుదేరారు.

వారిలోని పట్టుదల, దీక్ష, పోరాటంలో అభిలాష, సమర్థత ప్రజా సముదాయంలో ఆనందాన్ని కలిగించినవి; వారిలో ఉత్సాహాన్ని రేకెత్తించినవి. విశ్వాసాన్ని సుస్థాపితం చేసినవి. ప్రపంచవీరులతో తులతూగగలవారని నమ్మకం కలిగింది. ఒలింపిక్ ఆటలలో ఖ్యాతిని గడించుటకు సందేహం లేదనిపించింది. హెల్సింకీలో ఒలింపిక్ ఆటలకు కొద్దిరోజులలో వెళ్ళవలసి ఉంది.

అయితే జటోపెక్ సంగతేమిటి ?

లండన్‌లో జరిగిన పోటీలముందు ఆతని సామర్థ్యాన్ని తలుచుకుంటే, యీసారి ఒలింపిక్ పోటీలకు ముందున్న ఆతని సమర్థత ఆతని విజయాన్నిగూర్చి విశ్వాసాన్ని కలిగించుటలేదు. కాని ఆతనిమీద మనకున్న ఆశలు, ఆతని పట్టుదలగల స్వభావం, క్రీడల శిక్షణాతత్వం ఏ విధంగా ఆతని జీవితంలో ప్రధానభాగమై ఉందో తెలిసికొన్న మీదట, ఒలింపిక్సులో మన ప్రతిష్ఠకు లోటుండకూడదనిపిస్తుంది. ఎమిల్ అవసరసమయంలో మనలను నిరుత్సాహానికి లోనుచేయడు అనే విశ్వాసం వుంది.

# 15 వ ఒలింపిక్ క్రీడోత్సవం - హెల్సింకీ

హెల్సింకీలో జరిగిన ఒలింపిక్ ఆటల ఫలితాలు పత్రికలద్వారా, రేడియో ద్వారా మనకందరకు తెలిసినవే.

ఇదివరకువలెనే యీ అధ్యాయం ఎమిల్ జ్ఞాపకశక్తిమీద ఆధారపడినది. ఒలింపిక్ ఆటలను సన్నిహితంగా అవగాహన చేసుకొన్న ఆనాటి వీరుడు ఎమిల్ స్మృతుల జాబితా యిది.

ఈ ఆటల పోటీలో పాల్గొనే గౌరవం పొందినవారందరూ ఒక వారం ముందుగా ప్రేగ్ నగరంలో సమావేశమయ్యారు. వారి ట్రెయినింగు సక్రమంగా సాగించారు. ప్రతి రంగంలోని పోటీదారులు తమ శక్తినంతను ఉపయోగించుటకు సంసిద్ధంగా ఉన్నారు.

హెల్సింకీలో జరిగే ఊరేగింపు టుత్సవం నమూనా ప్రదర్శనం యిక్కడ జరిపారు. ఫిన్‌లాండు దేశంగూర్చి, అక్కడి పరిస్థితులనుగూర్చి ఉపన్యాసాలు జరిగినవి. అన్ని ఆటల పోటీలలో పాల్గొనేవారు ఒక ఉమ్మడిజట్టుగా తయారయ్యారు. వారందరికి ఒకే భావం, ఒకే ఆదర్శం: వారి శక్తినంతా ఉపయోగించి, అందరి మన్ననలకు, ప్రశంసలకు పాత్రమయ్యే ఫలితాలను సంపాదించుట.

జూలై 8 వ తేదీని యీ కోరిక ప్రమాణరూపంలో అందరితరఫున జటోపెక్ చదివాడు.

"మనదేశం మామీద ఎంతవిశ్వాసముంచి, మమ్ములను గౌరవించిందో మాకు తెలుసు. ఈ ఆటలకు మమ్ములను పంపించిన ప్రజలకు మా వాగ్దానం ఏమంటే ఒలింపిక్ ఆటలలో మా విధ్యుక్తాన్ని హృదయపూర్వకంగా నెరవేర్చుటకు, మనదేశపు గౌరవం, గొప్పతనం నిలుపుటకు మేము కంకణంకట్టుకున్నాం."

అక్కడ చేరిన అతిథులు, మంత్రులు, ఉన్నతాధికారులు, కేంద్ర వ్యాయామ సంఘాధికారులు అందరూ ఆ ఉత్సవాన్ని ఒక పర్వదినంగా చేశారు. ఆ మర్నాడు జట్టులో కొంతమంది బయలుదేరి వెళ్ళారు. ఈసారి వెళ్ళిన ఒలింపిక్ జట్టు, యిదివరకు వెళ్ళిన అన్నిజట్లకన్న పెద్దది. వారి సౌకర్యాలనుగూర్చిన అన్ని ఏర్పాట్లు యింత ఉత్తమపద్ధతిలో ఎన్నడూ జరగలేదు.

ఏడు గంటల విమానయానం తర్వాత, మా జట్టు ఫిన్‌లాండు చేరింది.

ఎమిల్ ఆ మర్నాడు తక్కిన జట్టుతో చేరుకున్నాడు. చాలా రోజుల తర్వాత ఎమిల్ ఫిన్‌లాండు దర్శించాడు. చేరిన వెంటనే ఎమిల్ పరుగుమార్గం వద్దకు వెళ్లాడు. ట్రెయినింగు సక్రమంగాలేకుండా జబ్బువల్ల శక్తి క్షీణించి ఎమిల్ ఒలింపిక్ ఆటలపోటీకి హాజరయ్యాడు.

లోపాలన్నీ కూడదీసికొనుటకు ఎమిల్ చాలా కష్టపడవలసి వుంది. ఒలింపిక్ గ్రామం ఒటేనిమిలో ట్రెయినింగు తీవ్రంగా ప్రారంభించాడు. ఎమిల్ మొదటి రోజు మామూలు 200 మీటర్లు పరుగెత్తేడు; తరవాత 400 మీటర్లు 30 సార్లు పరుగెత్తేడు. అక్కడనుంచి క్రమంగా తగ్గించాడు, తన శరీరాన్ని శిక్షణలో లోబరచుకొనుటకు.

హెల్సింకీలోని జీవితం సుహృద్భావపూరితంగా ఉంది. దానివల్ల ఎమిల్ కొన్ని సత్ఫలితాలను పొందాడు. వాని స్నేహితులు చాలమంది మాస్కో, కీవ్, బుడాపెస్టులనుంచి వచ్చారు. ఇతర ప్రదేశాలనుండి వచ్చిన ఆటగాండ్రుకూడా సోవియట్ జట్టుతో పరిచయంచేయమని, సలహా లివ్వమని ఎమిల్ వద్దకు వచ్చేవారు.

ఇంగ్లీషు పరుగువీరుడు 'పీరీ' తన పడకగదిలో ఎమిల్ ఫోటోను పెట్టుకున్నట్టు, తన ఆదర్శంగా దానిని నిరంతరం తన ఎదుట నిలుపుకున్నట్టు ఆతడు ఎమిల్‌తో చెప్పుట మరువలేదు. పందెం అయిపోయిన తర్వాత విజయసూచకమైన వస్తువును, జ్ఞాపకార్థం తనకు బహుమాన మీయవలసిందని యీ ఇంగ్లీషు ఆటగాడు ఎమిల్‌ను కోరేడు.

ఇతర ఆటగాండ్రతో ఖులాసాగా ప్రసంగిస్తున్నప్పుడుకూడా ఎమిల్ తన సలహాల నిచ్చేవాడు; తన అనుభవాలను చెప్పేవాడు. తనకు తీవ్రమైన ప్రత్యర్థితో నైనా యీ విధంగా ప్రసంగించుటకు జంకేవాడు కాదు.

అందరు పోటీదారులను మిత్రభావంతో చేరదీసి, వారిలో ఆ భావం పురికొల్పుటలో ఎమిల్ ఒక క్రొత్తదారిని తొక్కేడు. ఆతడు మార్గదర్శి అయ్యాడు. తన ట్రెయినింగు పద్ధతులగూర్చి ఎవరితోనైనా, ఎప్పుడైనా ప్రసంగించుటకు కుతూహలం కనబరిచేవాడు ఎమిల్. ఈ విధంగా ఒలింపిక్ ఆటల ఆదర్శానికి ఎమిల్ ఒక స్వరూపమిచ్చాడు. ఈ ఆదర్శం "ఆటగాండ్రలో మైత్రి నేకాక దేశాలమధ్యకూడ మైత్రిని బలపరుస్తుంది."

'కాప్లింగో' అనే పశ్చిమదేశాల ట్రెయినింగు క్యాంపునకు, 'ఒటేనిమి'కి మధ్యనుండే గోడలు కూలబడిపోయాయంటే ఆశ్చర్యమేముంది? మొదటిరోజునే అమెరికన్ వీరుడు ఫూష్, సోవియట్ ప్రత్యర్థులతో పరిచయం చేసుకొన్నాడు. ఈ స్నేహంతో వోడ్కా సేవించుట జరిగింది. దానితోబాటు అమెరికన్, రష్యన్ సంగీతం ఒటేనిమి గ్రామంలో అర్థరాత్రివరకు వినబడుతూండేది.

ఈ క్రొత్త స్నేహం లాంఛనప్రాయం మాత్రమే కాదని, మరుసటిదినం జరిగిన సంఘటనలనుబట్టి స్పష్టమయింది. ఆ రోజు సోవియట్ ఆటగాండ్రు అమెరికన్ల విడిదికి వచ్చారు. ఈ రెండుదేశాల ఆటగాండ్రమధ్య స్నేహం అభివృద్ధికావడం ప్రారంభమయింది. అప్పటినుంచి వేరువేరు ట్రెయినింగుస్థలాలు అదృశ్యమయ్యాయి. ప్రతిఆటగాడు ఎక్కడ వీలయితే అక్కడ ట్రెయినింగయ్యేవాడు అరమరలేకుండా. ఒలింపిక్ శాంతి వాతావరణాన్ని తమతమ దేశాలకు తీసుకుపోవడమే వారి ఆశయం.

శనివారం జూలై 16 వ తేదీని ప్రారంభోత్సవం జరిగింది. ఆ నాడు తెరిపి లేకుండా వర్షం కురుస్తున్నా ఊరేగింపు ఆగిపోలేదు. 69 దేశాలు, 5870 స్త్రీ పురుష ఆటగాండ్రను పంపించాయి. 17 ఆటలలో పాల్గొనుటకు అందులో 1052 మంది 'ఫీల్డు', 'ట్రాక్' పందెగాళ్లు వున్నారు. ఆచారప్రకారం గ్రీకులు మొదట ప్రవేశించారు. ఫిన్నిష్ అక్షరక్రమం ప్రకారం, యితర దేశస్థులు తర్వాత ప్రవేశించారు. ఆతిథ్య మిచ్చువారుకాబట్టి ఫిన్నులు ఆఖరున వచ్చారు.

ఫిన్నిష్ ప్రజా రాజ్యాధ్యక్షుడు ఆటలకు ప్రారంభోత్సవం జరిపాడు; 21 సార్లు ఫిరంగులు పేల్చబడినవి. ప్రపంచానికి 15 వ ఒలింపిక్ ఆటలు ప్రారంభమైనవని ప్రకటించుటకు పావురాలగుంపులు పైకెగసినవి. (ఇంతా చేస్తే యిది 12 వ ఆటలపోటీ మాత్రమే - 1916, 1940, 1944 సంవత్సరాలలో యుద్ధంమూలంగా ఆటలు జరగలేదు, అయినా, యీ సంవత్సరాలుకూడా లెక్కించబడ్డవి).

మూడువేల సంవత్సరాలనుంచీ వస్తూన్న ఆచారాన్నిబట్టి, ఆటలాఖరయ్యే పర్యంతం ఒలింపిక్ జ్యోతి వెలుగుతూనేవుంటుంది.

ఆ జ్యోతి గ్రీక్ ఒలింపస్‌నుండి విమానంమీద తీసుకువచ్చారు. ఫిన్లాండు ఉత్తరభాగంలోనున్న 'పేలస్టంటూరి'లోని జ్యోతిని యిది వెలిగించింది.

అంస్టెర్‌డంనుంచి వచ్చిన యరోజోలా, మొదటి పరుగు పందెగాడు. ఆఖరు వాడు పావోనూర్మి, ఫిన్నిష్‌వీరుడు. ఒకప్పుడు యీతడు 1,500, 10,000 మీటర్ల పందేలలో ప్రపంచ రికార్డులను సృష్టించాడు.

నూర్మి ప్రవేశించగానే ప్రేక్షకులనుండి హర్షధ్వానాలు చెలరేగినవి. తర్వాత మరొక ప్రఖ్యాత ఆటగాడు, హేనీసు కోల్హిమీనన్, ఒలింపిక్ జ్యోతిని ఒలింపిక్ టవర్‌వరకు తీసుకొనివెళ్ళాడు. అప్పుడు హెకిసేలోవీనన్ అందరిచేత ప్రమాణస్వీకారం చేయించాడు. తలలు వంచి, గుండెలు వేగంగా కొట్టుకుంటూంటే ఆ మాటలు స్టేడియం అంతా ప్రతిధ్వనించేటట్లు వినబడ్డాయి. అందరి హృదయాలలో, యీ ఆటలు పూర్వపువానికన్నా ఉత్తమోత్తమంగా జరగాలని పూనికతో ప్రమాణం స్వీకరించారు. ఆనాటి ఉత్సవం అందరి మనసులలో హత్తుకుపోయింది.

మరొకరాత్రి గడించిందంటే ఆటలు ప్రారంభమవుతాయి.

# జటోపెక్ మొదటి విజయం

**10,000** మీటర్ల పందెంలో జటోపెక్ విజయానికి గల అవకాశాలు ఎక్కువని అందరికీ తెలుసు. అయినా, ఒలింపిక్ ఆటలకు వచ్చేముందు ఆతనికి జబ్బు చేయుట, మంచి తయారీలో లేక పోవుట మళ్ళీ అనుమానానికి తావిస్తూంది.

అయితే జటోపెక్‌కుమాత్రం ధైర్యంగానే ఉంది. ఆతను ఫిన్‌లాండు వచ్చుట కిది మొదటిసారి కాదు. స్టేడియం తెలుసు, 'ట్రాక్' పరిచయం ఉంది; అన్నిటి కన్నా హెల్సింకీ ప్రేక్షకులకు తాను పరిచితుడే; వారందరూ, ఆతనిని ప్రోత్స హించేవారే. ట్రెయినింగు పూర్తిగా కాకపోవుట, తన తయారీ తక్కువగా ఉండుట ఆతనికి కొంత ఆందోళన కలిగించింది. అయినా, స్వదేశంలోని తన ప్రజల యెడల తన కెంత బాధ్యత కలదో ఆతనికి తెలియకపోలేదు.

ఈసారి తన బలం సామాన్యంగా ఉంది. ఆతని శక్తి పరిమితమయింది. మేమూన్ ఎంత ఆశగా ఉన్నాడో ఆతనికి తెలుసు; అనుఫ్రీవ్‌ను కూడా ఒక కంట చూస్తూండవలసిందే.

పరుగు ప్రారంభం సాయంత్రం 6.13 గంటలకు. ఎమిల్ రెండవ పంక్తిలో, మార్గానికి లోపలిభాగంలో ఉన్నాడు.

ప్రేక్షక స్థానాలు నిండిపోయాయి. ఫిన్ను జాతికి చెందిన అభిమానవీరుడు పందెంలో ఎవరూ పాల్గొనకపోయినా యిది ఆశ్చర్యమే. దూరపు పరుగు పందెం వారికి ఉత్సాహజనకమే. అదీ కాకుండా జటోపెక్ వంటి అద్భుత పరుగువీరుడు పాల్గొనే పోటీని చూడకుండా ఉండగలిగే దెవరు? ఎమిల్ ఒంటరిగా పరుగెత్తినా, ఆతని పందేలు అంత ఆకర్షణీయంగా ఉంటాయి.

దూరపు పందేలలో పూర్వం ఒలింపిక్‌లలో గెలుపొందిన నూర్మి, కోల్హెమెయినెన్ ప్రఖ్యాత ప్రేక్షకులలో కూర్చున్నారు. లండన్‌లో జటోపెక్ పరుగెత్తిన పందేలను చూచినవారుకూడా ప్రేక్షకులలో ఉన్నారు. ఆనాటి ఆతని ప్రదర్శనం మరువరానిది.

32 మంది పందెగాండ్రు పరుగెత్తుటకు ప్రారంభించారు. ఆస్ట్రేలియన్ పెర్రీ అందరికన్న ముందున్నాడు; వానితర్వాత అనూఫ్రీవ్. 6వ ఘట్టంవరకు ఎమిల్ ఎక్కడో చాలా వెనక ఉండిపోయాడు. ముందున్నవారు ముందుస్థానాల కొరకు, ఒకరితో ఒకరు పోరాడుచుండుటను నిశ్చింతగా వెనకనుంచి గమనిస్తున్నాడు. పెర్రీ వేగం కొరకు అంత తాపత్రయం పడకుండా ఉంటే బాగుండేది. దాని ఫలితం గ్రహించ లేకుండా ఉన్నాడు. తన స్థానానికి ప్రమాదం తెచ్చుకుంటున్నాడని ఆతనికి బోధ పడలేదు. ఆతని ఆరంభ కూరత్వం ఎమిల్‌కు ఆశ్చర్యం కలిగించలేదు; ఎమిల్‌ను భయపెట్టనూ లేదు.

ప్రారంభంలో ఎమిల్ కూడా ఆవిధంగానే చేసేవాడు. మొదటినుండి ముందుండాలని వేగంగా పరుగెత్తుట, చివరకు దుష్ఫలితాన్ని అనుభవించుట జరిగేది. ఇప్పుడు అనుభవం సంపాదించిన ఎమిల్, లండన్‌లోకంటె ఎక్కువ వివేకంగా ప్రవర్తించాడు. శరీరాన్ని జాగ్రత్తగా వాడుటవల్ల ఎంతగా ప్రదర్శనలలో ఫలితాలను పొందవచ్చునో ఎమిల్‌కు బాగా తెలుసు. తన శక్తిని, బలాన్ని జాగ్రత్తగా వాడుకొను పెట్లో అతనికి తెలిసినంత యితరులకు తెలియదంటే అతిశయోక్తికాదనుకుంటా. అందరు ప్రత్యర్థులకన్న ఎక్కువ అనుభవం అతని కున్నది. అదీకాకుండా, యీనాడు తన శక్తిలో ఆవంతైనా వృధాచేయుటకు వీలులేదు. ఈసారి అతను సాధించవలసిన కార్యం అతి కఠినమైనది. మూడు పందేలలో విజయం గాంచాలంటే ప్రతి అడుగు జాగ్రత్తగా వేయాలి.

అనుకున్నట్టుగానే 6వ ఘట్టంసరికి అందరూ అలసిపోయారు. ఎమిల్ తన కార్యక్రమం ప్రకారం పరుగెత్తాలంటే వేగం కొంచెం అధికం చేయవలసివచ్చింది. అప్పటికే 5 సెకండ్లు వెనకబడిపోయాడు. మనస్సులో తన జబ్బును తిట్టుకున్నాడు. దానివల్లనే కొన్ని సెకండ్లు నష్టపడిపోతున్నాడు. పళ్ళు బిగించాడు; స్టాకెన్‌ను అతిక్రమించిపోయాడు. నెమ్మదిగా అందర్నీ వెనక్కు త్రోసివేశాడు.

తన వెనక ఒక్క నీడమాత్రం యింకా కనుపిస్తూంది. అది అనూఫ్రీవ్‌దని మొదట అనుకున్నాడు. కాని అదికాదు. సీరో, సేండోలతో 3వ స్థానంకొరకు అతను వెనక ఎక్కడో పోరాడుతున్నాడు. ఆల్జీరియాకు చెందిన మెమోన్, ఎమిల్ వెనకనున్నాడు. అతను ఫ్రెంచిప్రతినిధిగా వచ్చాడు.

మెమోన్ తన సలహాదార్ల యెవ్వరిమాట వినలేదు. అతని ట్రెయినింగు పద్ధతులన్నీ జటోపెక్ ననుసరించినవే. అతని పరుగుపక్కీనే అనుకరిస్తాడు. అతని వెంట నడిస్తేనే విజయం సంపాదించవచ్చునని అతని నమ్మకం. కాని అతనివెంట వెళ్ళడం ఎంతకష్టమో, పందెంతర్వాత అతను చెప్పేడు. ఎప్పటికప్పుడు వేగాలు మారుస్తూంటాడు. మధ్యమధ్య ఎమిల్ ఆకస్మికంగా ఉపయోగించే వేగం, అతనిని జయించుట దుస్సాధ్యం చేస్తుంది.

మొదట పరుగెత్తిన జట్టు 3 కిలోమీటర్లు 8 నిమిషాల 48 సెకండ్లలో పూర్తి చేశారు. సగం పందెం 14 నిమిషాల 43.4 సెకండ్లలో పూర్తిచేశారు. 13–18 ఘట్టాలు విశేషాలు లేకుండా గడిచాయి. ఎమిల్ మామూలుగా, మెమోన్ వెనక వస్తూంటే, కష్టపడి సాగిపోతున్నాడు. మెమోన్‌ను వదిలించుకోలేకపోయాడు. ఒక ప్రఖ్యాత పత్రికా రచయిత యిలా వ్రాశాడు :

మెమోన్ నిశ్చలంగా ఉన్నాడు. జటోపెక్‌ను దాటిపోవడానికి ఒక్కసారి కూడా ప్రయత్నించలేదు. ఈవిధమైన సహాయం జటోపెక్‌కు అవసరంలేదు. జటోపెక్ తొణకలేదు, బెణకలేదు. మామూలు పద్ధతినే పరుగెత్తుకుపోతున్నాడు. ఇదివరకతనిని చూడనివారు, అతని బాహ్య స్థితినిబట్టి మరొక 10, 20 మీటర్లలో చతికిలబడతాడనుకున్నారు. అతని తల ఒక వైపునుంచి మరొక వైపుకు ఊగిపోతూంది; అతని

ముఖంమీద బాధ స్పష్టంగా కనబడుతూంది. మేకులమీద పరుగెత్తే బైరాగి లాగున్నాడు; తన్ను తా నీవిధంగా బాధ పెట్టుకుంటున్నాడెందుకో? నవీన మేరథాన్ పరుగు పందెగాడా యీతడు; గమ్యస్థానం వరకు పోరాడిపోయి, అక్కడే ప్రాణాలు విడవడానికి! జటోపెక్‌ను ఎరుగనివారు ఆతనికై విచారిస్తారు. బహుశా ఎంతో బాధపడుతున్నాడు కాబోలు; జటోపెక్ పరుగెత్తుటలేదు; తనను తాను తోలుకొని పోతున్నాడు. తుపానుకు వ్యతిరేకంగా ఓడ పోరాడుతున్నట్టుంది, ఎమిల్ పరిస్థితి. పరుగెత్తుటలో అందం, యీ సమయంలో ఆలోచించ దగిందికాదు. సనాతన పద్ధతుల్లో పరుగెత్తాలనే విమర్శకులు కృంగిపోయారు, జటోపెక్ పద్ధతులను చూచి.

జటోపెక్‌ను వదలకుండా, అతనివెంట నంటిపోతూన్న మెమోన్ సాహసానికి అందరూ ఆశ్చర్యపోయి, అతనిని ప్రోత్సహిస్తున్నారు. ఫ్రెంచి పత్రికలు మెమోన్, జటోపెక్‌ల మధ్య గొప్ప పోరాటం జరుగుతుందని జోస్యం చెప్పినవి. ఆ పత్రికలు యధార్థం చెప్పినట్టున్నది. పీకి వెనక్కి పడిపోయింతర్వాతకూడా, మెమోన్ పూనిక తగ్గలేదు. జటోపెక్, మెమోన్‌ల వెనక తక్కినవారంతా ఒకరి ప్రక్క నొకరు, యీగల గుంపులలాగా ప్రవర్తిస్తున్నారు. ఒకసారి నారిస్ అందరికన్నా ముందుకు సాగిపోయాడు. మెమోన్, జటోపెక్‌లకు 60 మీటర్ల సమీపానికి వచ్చాడు.

8000 మీటర్లు అయ్యేసరికి మెమోన్ ఉద్దేశాలప్రకారం పరుగెత్తుతున్నట్లు కనబడింది. 70,000 మంది ప్రేక్షకులకు ఆవేశాన్ని రేకెత్తించింది మెమోన్; జటోపెక్ కాదు. వాతావరణం విస్మయపూరితంగా కనబడుతూంది. ఫిన్నిష్ - జెక్ వారు ఆశ్చర్యా నికి లోనయ్యారు. అప్పుడు జరిగిన సంఘటన జెకోస్లోవక్ స్పష్టిగా కనబడుతుంది. రెండు మీటర్లు వెనుకైపోయాడు మెమోన్; అదే మంచి తరుణం తన ప్రయత్నాని కని, ఎమిల్ అనుకున్నాడు. ఎవరి బలహీనతనైనా పూర్తిగా వెంటనే వినియోగించు కోవాలి. ప్రేక్షకులకు తెలియకుండానే జటోపెక్ వేగంగా పరుగెత్త నారంభిం చాడు. అది మెమోన్ గ్రహించాడు. అది 18 వ ఘట్టం. ఆఖరు 2000 మీటర్లు జటోపెక్ మీటర్లే. మెమోన్ 50 మీటర్లు వెనకబడిపోయాడు; తరవాత 100 మీటర్లు; అతను వేగం అధికం చేశాడు. ఆఖరు 400 మీటర్లు 64 సెకండ్లలో పరుగెత్తేడు. ఇతరుల ఖ్యాతిరేఖలకన్నా ఎక్కువ శోభాయమానంగా ప్రకాశిస్తున్నది జెటోపెక్ తార. ఈ ప్రపంచ రికార్డు సృష్టించిన ఎమిల్‌కు చివరకు విజయం లభించింది.

లండన్‌లోకన్నా, యీనాటి విజయం ప్రజలలో అనుపమానమైన ప్రశంసకు కారణమయింది.

హెల్సింకీలో పరుగెత్తిన అందరి ప్రదర్శనలు అభివృద్ధిని సూచించాయి. 1948 లోని జటోపెక్ యొక్క ఒలింపిక్ రికార్డును మొదటి ఆరుగురు అతిక్రమించారు. ఎమిల్ తన వేళను తానే అతిక్రమించాడు.

29 నిమిషాల 17 సెకండ్లు; కొత్త ఒలింపిక్ రికార్డు. (లండన్‌లో అతని వేళ : 29 నిమిషాల 59.6 సెకండ్లు).

చాలా కష్టపడి పోస్టీ, సాండోలను వెనక్కు_త్రోసి, అనూఫ్రీవ్ 3 వ స్థానం లోకి వచ్చాడు. అయినా వారిమీద గెలుపు 1 సెకండులో 10 వ వంతు అయి ఉంటుందేమో వారి వేళలు :

పోస్టీ (ఫిన్‌లాండ్): 29 నిమిషాల 51.4 సెకండ్లు.

సాండో (బ్రిటన్): 29 నిమిషాల 51.8 సెకండ్లు.

నైస్ట్రామ్ (స్వీడెన్): 29 నిమిషాల 54.8 సెకండ్లు.

ఒలింపిక్ ధ్వజంమీద జెక్ జాతీయపతాకం ఎగురుతూంటే, జెక్ జాతీయగీతం పాడుతూంటే అందరూ ఒక్కసారి గౌరవ పురస్సరంగా లేచినిలిచారు.

లండన్ విజయాన్ని, మళ్లీ యిక్కడ ప్రదర్శించి ప్రపంచదూరపు పరుగు పందేలలో అద్వితీయుడని చాటుకున్నాడు ఎమిల్. హెల్సింకీలో ఆనాడాతడే వీరుడు. స్వదేశంలో అందరూ కృతజ్ఞతతో అతనిని తలచుకుంటున్నారు.

# రెండవ రంగం

ప్రతిరోజూ ఆవేశంతో కూడుకున్న సంఘటనలు. 'డిస్కస్ త్రో' లో పొందిన విజయానికి సోవియట్ స్త్రీలు ఉత్సవం చేశారు. జెకోస్లోకివేయా 'నడక' పందెగాడు డోల్జాల్ కష్టపడి ఒక రజిత పతకం సంపాదించాడు. 'హాప్‌స్టెప్ జంప్' పోటీలో బ్రెజిల్ దేశస్థుడు 'డాసిల్వా' గెలుపొంది, ప్రపంచ రికార్డును సంపాదించాడు. 'స్ప్రింటుస్, జంప్స్' లలో అమెరికన్, తెల్లవారు, నీగ్రోలు పూర్వంనుంచి వస్తూన్న ఆనువాయితీ ప్రకారం గెలుపొందారు. అన్ని రంగాలలోను కఠినమైన పోరాటు ఫలితంగా విజయాలు సాధించబడ్డాయి. అన్నింటికన్నా ఆనంద దాయకమైన విషయం, జయాపజయాలతో సంబంధం లేకుండా ఒలింపిక్ శాంతి వాతావరణం అన్నిస్థలాల్లోకి ప్రాకింది.

5000 మీటర్ల పరుగు పందేనికి 45 మంది పోటీ చేశారు. వీరంతా ముందు మూడు పరీక్షలకు లోనుకావలసి ఉంది. ఈ జట్టుకు నాయకులు రీఫ్, షేడ్, జటోపెక్‌లు; మెమోన్, అనూఫ్రీవ్‌లుకూడా 5 కిలోమీటర్ల పందెంలో పాల్గొన్నారు. పరీక్షలలో ఎమిల్‌తో సరిసమానంగా ప్రావీణ్యం చూపించాడు అనూఫ్రీవ్. వీరు కాక ఇంకా అనేకమంది సమర్థులు విజయకాంక్షతో పోటీలో ప్రవేశించారు.

పోటీకి ముందుజరిగిన పరీక్షలో ప్రపంచ ప్రవీణులుకూడా, ఉత్తమ స్థానాలకు తీవ్రంగా పోరాడారు.

మొదటి పరీక్షలో పాల్గొన్నవారు: రీఫ్, మెమోన్, వెయిపేల్ (ఫిన్ను), ఏండర్సన్ (స్వీడ్), పీరీ (ఇంగ్లీషు), పాపావ్ (సోవియట్), మరొక 8 మంది.

మొదట అమెరికన్ కేపోజాలీ, అందరికన్నా ముందు పరుగెత్తినాడు; తరువాత పీరీ, చివరికి మెమోన్ ముందుకు పోయినారు. మెమోన్ 14 నిమిషాల 19 సెకండ్లలో పరుగు పూర్తి చేసినాడు.

రెండవ పరీక్షలో వేగం హెచ్చుగా వుంది. మొదటి కిలోమీటర్ 2 నిమిషాల 43 సెకండ్లలో షేడ్ పూర్తిచేశాడు. ఈ విధంగా 13 నిమిషాల 45 సెకండ్లలో పూర్తిచేయవచ్చునని ఎమిల్ అంచనా వేశాడు. షేడ్ అందరికన్న 80 మీటర్లు ముందుకుపోయాడు. కాని నాయకత్వం నిలుపుకొనే సామర్థ్యం, శక్తి అతనికి లేదు; అక్కడనుంచి అలసట ఎక్కువైంది; వేగం తగ్గిపోయింది; శక్తి క్షీణించింది; వెనకబడిపోయాడు. 14 నిమిషాల 15.4 సెకండ్లలో ఎలాగో పూర్తిచేశాడు. ఆనాటి కదే ఒలింపిక్ రికార్డు; షేడ్ చాలా ఆనందంగా వున్నాడు. ఈ సారి ఒలింపిక్ రికార్డు తనదే అని విశ్వసించాడు. ఇదంతా ప్రేక్షకుడుగా వున్న ఎమిల్‌కు మంచి పాఠాలు నేర్పింది.

మూడవ పరీక్షలో జటోపెక్, అనూఫ్రీవ్, ఆల్బ్రెట్సన్, ఫెర్రీ (ఆస్ట్రేలియా), చాటవే (బ్రిటన్), స్టాకెన్ (నార్వే), కోస్కెలా, స్టోన్ (అమెరికా) మొదలైన వారనేకులున్నారు.

వీరి మధ్య నిలబడి, "అంత్యపరీక్షకు ఎన్నుకోబడతానా?" అని తనలో తానే నుమానించుటకు మొదలుపెట్టేడు, ఎమిల్.

"నీ విదివరకుకంటె మంచి తయారీలో ఉన్నావు; నీ శక్తిని నీవు తెలిసికోలేకుండా ఉన్నావు" అని సస్నేహంగా స్టోన్, ఎమిల్‌తో అన్నాడు. మొదటి రెండు ఘట్టాలలో యిద్దరూ ఒకరిప్రక్క ఒకరు పరుగెత్తుతున్నారు. అప్పుడు యింక ముందుకుపోవాలని ఎమిల్ అనుకున్నాడు. తనతోకూడా వేగం అధికం చేయ మన్నాడు స్టోన్‌తో, ఎమిల్. కాని స్టోన్ అతనితో సమానంగా పరుగెత్తలేక పోయాడు. పందెం ఒక విధంగా నిర్వహిస్తూన్న జటోపెక్, అనూఫ్రీవ్‌కు సాయం చేయదలచాడు.

"సేషా! మనం ముందుకు పోవాలి."

ఇద్దరూ, ఒకరు ముందు, ఒకరు వెనుక పందెం పూర్తిచేశారు. పందెం జరుగుతూన్నంతకాలం, ఎమిల్ అందరికీ వేగంగూర్చి, వేళలగూర్చి సలహా లిస్తూనే ఉన్నాడు. మొదటి అయిదుగురు, తక్కినవారిని అతిక్రమించి పోయేసరికి, ఏ అయిదుగురు అంత్య పోటీకి ఎన్నుకోబడుదురో నిర్ణయ మయిపోయింది. అంత్య పోటీకి 5 గురుకంటె పోరాడుటకు వీలులేదు. జటోపెక్ 14 నిమిషాల 26 సెకండ్లలో పరుగు పూర్తిచేశాడు.

పోటీ అయిపోన తర్వాత, తన వైఖరిని తక్కినవారు నిరసించారేమోనన్న అనుమానం, ఎమిల్‌కు కలిగింది. అందుచేత ప్లేంక్ (డేన్) వద్దకు తిన్నగా వెళ్ళి

క్షమించమన్నాడు. ఏమీ ఫరవాలేదన్నాడు స్లేంక్; ప్రవీణులతో పరుగెత్తబట్టి కొంత వరకు వేగం అధిక మయిం దన్నాడు. కోస్కెలా, స్టోన్, స్టాకెన్‌వంటి సమర్థులు కూడా అంత్యపోటీకి ఎన్నుకోబడలేదు. ఒకప్పుడు వీరంతా జటోపెక్‌కి తీవ్ర ప్రత్యర్థులు.

పోటీకి ముందు జరిగిన యీ పరీక్షలు, ఎమిల్‌కు కొంత ధైర్యమిచ్చినవి. కాని తన వాగ్దానం ఎంత అవివేకమయినదో యిప్పుడు గుర్తించాడు ఎమిల్. కొంత వేళా కోళంగా, కొంత నిజంగా ఆత డిలా గన్నాడు :

"ఒలింపిక్ పోటీలకు తయారయింది నేనొక్కడనే అన్నట్లు, మరెవ్వరూ విజయాన్ని కాంక్షించనట్లు ప్రవర్తించాను."

ఎంత కష్టమైనా, ఎలాగైనా విజయం సంపాదించుదామని కృతనిశ్చయులై అందరూ వచ్చారని హెల్సింకీలో, ఎమిల్ గ్రహించాడు. తానే, ఒక కంచు పతకంతో తృప్తిపడవలసి ఉంటుందేమోనన్న అనుమానం కలిగింది. నిశ్చల మనస్సుతో పరోక్షంగా రాబోయే ఫలితాలనుగూర్చి ఆలోచన ప్రారంభించాడు.

మెమోన్ యిదివరకు వదలినట్లు యీసారి వదలడు; జయం సాధించుటకు విశ్వ ప్రయత్నం చేస్తాడు.

రీఫ్ అతి వేగంగా పరుగెత్తాడు. రెండు సంవత్సరాల క్రిందట ఎమిల్‌ను సవాలుచేశాడు. ఒలింపిక్ పందేలలో నీ సామర్థ్యం, నా సామర్థ్యం రుజు వవుతా యన్నాడు. అయినా యీ పరీక్షలలో అంతగా రీఫ్ సామర్థ్యం కనబడలేదు. రీఫ్ పత్రికా ప్రతినిధులతో యిలాగన్నాడు :

"జటోపెక్, షేడ్ యిద్దరూ రెండు ఎంజన్లు — వీరితో పందెం సాధారణమైనది కాదు. ఈ రెండు ఎంజిన్లు 'గుడ్సు' బళ్ళను లాగుటలేదు; 'ఎక్స్‌ప్రెస్' బళ్లను నడుపుతున్నవి. వాతావరణం బాగుంటే ఒలింపిక్ రికార్డు 14 నిమిషాలకు తక్కువయ్యే అవకాశంకూడా ఉంది."

ఎమిల్ యింకా ఆలోచిస్తూనే ఉన్నాడు. ఇంగ్లీషు పోటీదార్లలోకూడా తనకు ప్రమాదం తీసుకురాగలిగినవా రున్నారు. ఒలింపిక్ రికార్డు వేళలో పందెం గెలిచిన షేడ్, తన విజయాన్నిగూర్చి నమ్మకంతో ఉన్నాడు. ఇప్పటివరకు తాను చూపిన ప్రావీణ్యాన్నిబట్టి చూస్తే, విజయం తనకే లభించవచ్చు. షేడ్ ఎందుచేత అంత నిర్లక్ష్యంగా ముందుకు సాగిపోయాడు ? ఇది ఎమిల్‌కు బోధపడని విషయం; ఆ తరువాత ప్రత్యర్థుల ప్రయత్నాలను ప్రతిఘటించే శక్తి లేకపోవుటే దీనికి కారణమా? తన శక్తిమీద విశ్వాస మున్నవానికి యిట్టి భయం అనవసరమే!

పరుగు పందేనికి పూర్వపు రోజున చూడదగిన పోటీలు అనేకం జరిగినవి. డిల్లార్డు 'హై హర్డిల్సు' పందెం గెలిచాడు. ఆ నాడు లండన్‌లో వోడిపోయినా, యీసారి విజయం ఆతనికి సంతుష్టి కలిగించింది. నీమెత్ శిష్యుడు, హంగరీ దేశస్థుడు జెర్మక్ 'హేమర్‌త్రో' పందెం గెలిచాడు. ప్రపంచ రికార్డు 60 మీటర్లు భగ్నం చేశా డీతడు. 'షాట్‌పుట్'లో ప్రపంచ రికార్డును అతిక్రమించాడు సోవియట్

పందెగాడు జైబీనా. ఈ విజయాని కాత డొక సువర్ణపతకాన్ని బహుమానంగా సంపాదించాడు.

ఆ రోజు స్టేడియంకు వెళ్ళలేదు, ఎమిల్. వనాల్లో, పైన్ చెట్ల నీడల్లో కాలం గడిపేడు; అయితే పోరాటానికి వెనువీసేవాడు కాదు; మరొకసారి ముందు, వెనుకలు తీవ్రంగా ఆలోచించాడు; మూడవస్థానమైనా సంపాదించుటకు నిశ్చయించాడు. ఫిన్లాండులో అతను పాల్గొన్నవాటిలో యిది 10వ పందెం. అతని అంచనాప్రకారం, యీసారి ఆతనికి విజయం లభ్యంకాదు. అన్ని పరిస్థితులు ఆతని అపజయాన్నే సూచిస్తున్నవి.

ఆతని స్నేహితుల అభిప్రాయంకూడా అదే. ఎమిల్, అసలు పందెంలో పాల్గొనడం మంచిదేనా అనే సంశయంకూడా అందర్నీ పీడిస్తూంది. అంతా అపజయాన్నే సూచిస్తున్నా, పోరాటమంటే ఎప్పుడూ వెనుకంజవేసేవాడు కాదు, ఎమిల్. ఆఖరుకు మూడవస్థానమే తనకు రాసిపెట్టినా, తన యావచ్ఛక్తినీ వినియోగించుటమాత్రం మానదలచుకోలేదు.

ఇదే ఆతని నిశ్చయం. ఈ నిశ్చయంతోనే పందెపు స్థలం చేరుకున్నాడు, చిరునవ్వుతో. కాని తక్కినవారందరూ భయంగా, బెదురుతూ అక్కడకు చేరుకున్నారు.

# శతాబ్దానికి చాలిన పందెం

**5000** మీటర్ల పందెం. పందెం జరిగినంతకాలం ప్రేక్షకులకు ఉత్సాహాన్ని కనబరచుటకు అవకాశమిస్తుంది. తక్కువ దూరాల పందేలలో ఆ అవకాశం లేదు: పరుగు ప్రారంభ మేమిటి, గమ్యస్థానం చేరుకోవడ మేమిటి!

5000 మీటర్ల పందెంలోనే, నిజమైన ఆవేశంతో కూడుకొన్న పోటీలు సంభవం. 1912 లో జరిగిన ఒలింపిక్ ఆటలలో, కోహీల్ మెయినిన్ (ఫిన్నూ), బూయిన్ (ఫ్రెంచి) 16 సార్లు స్థానాలను మార్చుకొన్నారు; చివరకు ఫిన్నూ పోటీదారుడే గెలిచాడు. ఇది స్టాక్‌హోంలో జరిగిన పోటీలలోని చరిత్రాత్మక విషయం.

1920 లో ఏంట్వెర్పులో 20 ఏళ్ళ గిల్లేమాట్ (ఫ్రెంచి), అజేయుడైన నూర్మినుండి జయాన్ని సాధించాడు, ఆఖరు క్షణంలో.

లండన్‌లో గాఫ్టన్ రీఫ్‌నుండి, యీ విధంగానే విజయం సంపాదించుటకు జటోపెక్ ప్రయత్నించి ఫలోన్ముఖు డయ్యాడు.

పందెగాండ్ర జాబితా చూస్తే, చివరవరకు జరిగే పోరాట మిదని స్పష్టమవుతూంది. అందుచేత ప్రేక్షకుల స్థానాలు నిండి, పొర్లిపోతున్న వికూడా.

దూరపు పరుగు పందేలలో ఎన్నడూ జరగని కఠినాతికఠినమైన పందెంగా యిది పరిణమిస్తుందని, పత్రికల జోస్యం. ఈ శతాబ్దంలో యిది అతి ముఖ్యమైన పందెమని, పత్రికా విలేఖర్ల అభిప్రాయం. అందులో పొరబాటుండనుకొనుటకు అవకాశంలేదు.

**1952** జులై **14**: వేళ సాయంత్రం **4.40** గంటలకు. ఒక స్వీడిష్ ఆటల పత్రిక యీ పందెంమీద ఒక జూదం ఏర్పాటుచేసింది. జర్మనులు, అమెరికన్లు, జపానువారు షేడ్ గెలుస్తాడని పందెం వేశారు. పందేనికి ముందు ఎమిల్, షేడ్‌ని కలిసి దాపరికం లేకుండా మాట్లాడేడు. పందేన్ని గూర్చి చర్చించుకున్నారు. మొదటినుంచి వేగంగా పరుగెత్తితే త్వరగా అలసట వస్తుందని ఎమిల్ అభిప్రాయం. గుందర్‌హాగ్గు అభిప్రాయం కూడా అదే.

షేడ్ భయపడుతున్నాడు. ఏవో జవాబులు చెప్పేవాడు. అయినా ఆతని ఎత్తులు వేరు; ముందుగానే వేగంగా పరుగెత్తి తక్కినవారి కెంతో దూరంలో ఉండాలని అతని అభిప్రాయం. అందరిలో ప్రమాదకరమైన ప్రత్యర్థి ఎవరని, షేడ్ ఎమిల్‌ను అడిగాడు.

"రీఫ్ అనుకుంటా; ఎంతో వేగంగా పరుగెత్తుతాడు. కాని నువ్వు అందర్నీ ఆకర్షించిన ప్రత్యర్థివి" అన్నాడు ఎమిల్.

జటోపెక్ ఉద్దేశ మిదే నిజంగా. అయినా ఎవరు గెలుస్తారన్న సమస్యకు జవా బెలా తెలుస్తుంది ముందుగా; నిశ్చయంగా! ప్రస్తుత 'తయారీ' చూస్తే షేడ్‌కే వోటు; కాని యిది కాకపోవుటకుకూడా అనేక అవకాశా లున్నాయి.

పరుగు పందెగాండ్రలో అశాంతి, భయం ఎక్కువ అవుతున్నాయి. ప్రేక్షకులలోకూడా అంతే. ఆనాడు పందేలలో పాల్గొనని పందెగాండ్రంతా ప్రేక్షకులలో చేరేరు.

ఎమిల్ అంటే ప్రజలలో విశ్వాసం అంతగాలేదు. రెండవ బంగారు పతకం కొరకు ఆతడు అవివేకంగా ప్రయత్నిస్తున్నాడని ఒక వార్తా పత్రిక వ్యాఖ్య. కాని, జటోపెక్ విజయం తథ్యమని నమ్మినవా డొక్క డున్నాడు. అనేక పందేలలో ఆతనిని గమనించి, ఆతని అడుగుజాడలలో విజయాలు కాంచినవాడు – మిమోన్. ఆతనికే భయంగాఉంది; సరిగా నిద్రపోలేదు; ఎంతో అలసటగా ఉంది. కాని విజయంగూర్చిమాత్రం ఆతనికి అనుమానం లేదు.

"షేడ్ ప్రమాదాన్ని తీసుకురావచ్చు. జటోపెక్‌ను వదిలించుకొనుటకు, మొదటి కిలోమీటరు **2** నిమిషాల **40** సెకండ్లకంటె తక్కువలోనే పూర్తిచేసేయవచ్చు;

కాని ఎమిల్ సామర్థ్యంలో నాకు నమ్మకమున్నది. ఈ రోజులలో అతనికి వ్యతిరేకంగా ఎవరికీ ఆశాలేశం లేదు." ఇదీ మెమోన్ అభిప్రాయం.

ఎమిల్, పరుగు మార్గం అంచునుంచి 6 వ వానిగా నిలబడ్డాడు, ప్రశాంతంగా నిశ్చలంగా, ప్రారంభ సంజ్ఞలకై ఎదురుచూస్తూ.

"పరుగెత్తండి!" సంజ్ఞ యివ్వబడింది. 15 మంది పరుగు ప్రారంభించారు.

40 మంది రేడియో క్రీడా విలేఖర్లు పందేన్ని వర్ణించుటకు ప్రారంభించారు. లక్షలమంది శ్రోతలు రేడియోలవద్ద చెవులుంచి వింటున్నారు. ఆ స్టేడియంలో ప్రేక్షక స్థానాలలోనివారుకూడా మరికొద్ది క్షణాలలో ఏ విధమైన సంఘటనలు చూడవలసి ఉంటుందో ఊహించుకోలేకపోయారు.

అచంచలమైన ధైర్యంతో, ఒక్కొక్క ప్రత్యర్థిని తనకన్నా ముందుగా వెళ్ళనిచ్చాడు, ఎమిల్. అందరు ప్రత్యర్థులకు ఏ విధంగా పరుగెత్తాలో చెప్పిన సలహా ననుసరిస్తున్నాడు. మొదటి ఘట్టంలో ఆఖరునున్నాడు. జటోపెక్ సలహాను ప్రశంసించిన షేడ్, ఛాటువేను త్రోసుకొని మొదటిస్థానానికి పోయాడు. ఎందుచేత? ఆఖరు ఘట్టపు వేగానికి తట్టుకోలేక యిలాగ చేశాడా?

ఎమిల్ వేగంగా పరుగెత్తుతున్నా, ప్రక్కన జరిగేవన్నీ జాగ్రత్తగా చూస్తున్నాడు. దూరపు పరుగు పందెం బలాన్నే కాక, తెలివితేటలనుకూడా పరీక్షిస్తుంది. 30 మీటర్ల పొడవు వరుసలో 15 మంది పోటీదార్లు పరుగెత్తుతున్నారు. ఇంకా ఎమిల్ ముందుకు సాగిపోవుటకు అవకాశం చిక్కలేదు, అర్ధచంద్రాకారంలో ప్రత్యర్థులందరూ వుండడంమూలాన. వారిని అతిక్రమించాలంటే ఆ అర్ధచంద్రాకారాన్ననుసరించి పోవాలి. దూరం ఎక్కువవుతుంది. మొదటి కిలోమీటరవగానే, మొదటి 5 గురి మధ్యనుంచి ఒక తిన్ననిబాట కనబడింది. ఒక్కక్షణంలో అక్కడ చేరేడు.

మొదటి 5 గురు: షేడ్, మెమోన్, రీఫ్, చాటువే, పార్కర్.

ఎమిల్ పరుగెత్తుతూన్న వేగం ప్రకారం 14 నిమిషాల 10 సెకండ్లలో పందెం పూర్తి అయిపోతుంది. షేడ్ అందరికన్నా ముందున్నాడు. అతని వేగం, ఎమిల్ వేగాన్ని మించింది. మొదటి 2 కిలోమీటర్లు 5 నిమిషాల 37·4 సెకండ్లలో పూర్తిచేశాడు.

పరుగు పందేలలో ఎమిల్ సాహసిమాత్రమే కాదు; మంచి హృదయం గల స్నేహితుడుకూడా. ప్రతిపందెంలోనూ, గడియారాన్ని పరుగెత్తే ప్రత్యర్థితో సరిపోల్చి ఇద్దరూ ఒకే జట్టు అంటాడు, ఎమిల్. మానవసంబంధాలు, నైతికసూత్రాలు, ముఖ్యమంటాడు. అతని ప్రత్యర్థులు, తనతోపాటు పోరాడే స్నేహితులంటాడు. అందుచేత షేడ్, అందర్నీ బలవంతంగా తన వెనక యీడ్చుకొనివెళ్ళేవాడుగా భావించుకోకూడ దన్నాడు. మొదటివాడుగా పరుగెత్తుతూ, ఆ స్థానం వదలకుండా ఉండే నిమిత్తం, ఎంత కఠినంగా, ఎంత అలసటతో పోరాడాలో, ఎమిల్‌కు బాగా తెలుసు. వేగంగా పరుగెత్తేవాని వెనక పరుగెత్తుట ఎంతో సులభంకదా! ముందువాడు వెనుకవారికోరకు ఎంత త్యాగం చేస్తున్నాడో, ఎమిల్ గ్రహించాడు.

బలాన్ని దాచి చివర కుపయోగించి, తన వెనుక నున్నవారు తనను ఎన్నిసార్లు కలుసుకున్నారో, ఎమిల్‌కు అనుభవమే.

2200 మీటర్లదగ్గర షేడ్‌ను తప్పించి తాను అగ్రస్థానానికి వెళ్లాడు, ఎమిల్. ఇది తనకు ప్రమాదమే; అయినా షేడ్‌కు కొంత విశ్రాంతి నిద్దామని ఎమిల్ ఉద్దేశం.

షేడ్ కిది బోధపడలేదు. కొంతదూరం పోయాక, ఎమిల్‌ను తప్పించుటకు ప్రయత్నం చేశాడు. ఎమిల్ వదలలేదు. ఆ స్థానాన్ని తాను నిలుపుకోగలనని తెలియ జేశాడు. షేడ్, ఎమిల్ వైఖరిలోని సహృదయతను బోధపరుచుకోలేక, పెద్దప్రయత్నం చేసి ముందుకు వెళ్లగలిగాడు. ఎమిల్ కొంతసేపు వెనకనే పరుగెత్తుతూ, షేడ్ ప్రక్కనుంచి అతనిని దాటి వెళ్ళిపోతూ, అతని చెవిలో యిలా గన్నాడు:

"హెర్బట్టు, నాతో కలిసి కొంతదూరం పరుగెత్తు".

(ఒకసారి యీ సంఘటనను జ్ఞాపకం తెచ్చుకొని, ఎమిల్ యిలాగన్నాడు. హెర్బట్టు అభ్యంతరం చెప్పలేదు. అప్పటికే అలసిపోయాడు.)

కొన్ని క్షణాలు నిశ్చలంగావుంది. షేడ్ చివరకు బలమైన ప్రయత్నం చేస్తాడేమోనని, ఎమిల్ అభిప్రాయం. ప్రథమస్థానానికి పోరాటం మరొక స్వరూపం దాల్చింది. తక్కిన పందెగాండ్రుకూడా ముందుకు త్రోసుకొని వస్తున్నారు. ఇది స్టాక్‌హోమ్, పారిస్, లండన్ నగరాలలోని పోటీవలె ఇద్దరు పోటీదార్లమధ్య పోరాటం కాదు: 5 గురు పోటీదార్లు ఒక్కసారి గమ్యస్థానం చేరగల సమర్థత చూపిస్తూన్న పందె మిది.

3 కిలోమీటర్లు 8 నిమిషాల 30.4 సెకండ్లలో పూర్తి అయినవి. అకస్మాత్తుగా ఘాటవే, రీఫ్, మెమోన్, ఎమిల్‌కు ముందున్నారు. అందుచేత ఎమిల్ వేగం అధికం చేశాడు. మొదటినుంచి చివరవరకు ఎమిల్ పందేన్ని తన స్వాధీనంలో ఉంచు కున్నాడని, పత్రికా విలేఖర్లు వ్రాశారు కాని, యిది నిజంకాదు. ఈ భయంకర పోరాటంలో ఎమిల్ ఆశలు నీరసమయిపోయాయి. అదొక యుద్ధం. ఆ యుద్ధంలో ప్రతి అంగుళంకొరకు పోరాటం. మరుక్షణంలో వచ్చే మీటరులో ఏం జరుగుతుందో, ఎవరూ ఏమీ చెప్పగలస్థితిలో లేరు.

ఎమిల్ ప్రత్యర్థులు అలసట లేకుండా, అమితమైన ధైర్యంతో కనబడ్డారు. తనకు మూడవ స్థానానికికూడా అవకాశమున్నట్టు లేదు. హడలిపోయి "నా స్థానం 5 వది" అనుకున్నాడు. ఏమైనా ఆఖరు ఘట్టంలో యావచ్ఛక్తిని వినియోగిద్దామని నిశ్చయించాడు.

3200 మీటర్లదగ్గర తక్కినవారిని విదిలించుకొని ముందుకు పోదామని షేడ్ మరొకప్రయత్నం చేశాడు. కాని లాభంలేకపోయింది. మామూలు ప్రకారంగా జటోపెక్‌ను అంటే ఉన్నాడు, మెమోన్. ఆ అవసరమయంలో మెమోన్, జటోపెక్ పద్ధతులమీదనే విశ్వాసముంచి ప్రవర్తించాడు.

3500 మీటర్లవద్ద రీఫ్ తన సమయం వచ్చిందనుకున్నాడు. లండన్‌లోవలె ఒక ప్రబలయత్నం చేశాడు. లండన్ వదలి 4 సంవత్సరాలయింది. ఎమిల్, ఈనాడు

పర్వతంవలె అచంచలంగా ఉన్నాడు. బెల్జియన్ వీరుని ఎత్తులను సాగనీయలేదు. రీఫ్ బలం తగ్గింది. మరొక కిలోమీటరు తర్వాత వేగం తగ్గిపోయింది. ఇంక గమ్యస్థానం 500 కిలోమీటర్లుండవనగా పోటీలోనుంచి విరమించాడు.

కాని అతని స్థానంలో ఒక క్రొత్త ప్రత్యర్థి గోచరించాడు. అతడు ఇంగ్లీషు వాడు, పీరీ. కొన్నిక్షణాలు ప్రథమస్థానంలో ఉండి, తరువాత షేడ్ వెనకనే ఉన్న బృందంలో కలసిపోయాడు. ఎమిల్ యిప్పుడు 6వ వాడు.

4 కిలోమీటర్లు, 11 నిమిషాల 24.8 సెకండ్లలో గడచినవి. ప్రేక్షకుల ఆవేశం అధికమయిపోయింది. ఈ 5 గురిలో ఎవరికి జయం. వీరిలో ఎవరు తన వేగాన్ని అధికం చేయగలరు?

జర్మన్ విలేఖరులు మైక్ లో అరవడం మొదలుపెట్టేరు: "షేడ్! షేడ్!" అని.

ఇంక ఆఖరుఘట్టం ప్రారంభమయింది.

ఎమిల్ తన వాగ్దానాన్ని జ్ఞాపకం ఉంచుకోవలసిన అవసరం లేదు. ఆతని ప్రతి అణువులోనూ విజయం ధ్వనిస్తూంది.

'జటోపెక్' పేరు ప్రేక్షకస్థానాలనుండి వినబడుతూంది. "జటోపెక్! దేశంయొక్క గౌరవం కొరకు, ప్రతిష్ఠకొరకు విజయం సాధించాలి" అని కేకలు బయలుదేరేయి.

బలంగా, శక్తినంతా ఉపయోగించి పరుగెత్త నారంభించాడు. తనకన్నా ముందున్న ముగ్గుర్ని దాటిపోయాడు. అయినా ప్రయోజనం లేదు. కొంచెం వేగం తగ్గగానే, ముగ్గురు అతనిని దాటి వెళ్ళిపోయారు. వారి వరుస యిదివరకువలెనే ఉంది. షేడ్, ఛాటవే, మెమోన్, జటోపెక్, తనకన్నా ముందున్న ముగ్గురూ కొన్నిగజాలు ముందుకు పోగలిగారు. మొదట 2, తర్వాత 4, తర్వాత 6 మీటర్లు వెనకబడి పోయాడు. ఆ క్షణంలో ఆతని అపజయం తప్పదనుకున్నా రందరూ.

కాని ఎమిల్ మాత్రం, పోరాటం వదిలిపెట్టలేదు. గమ్యస్థానం చేరుట కున్న దూర మెంతో ఆలోచించాడు. 300 మీటర్ల దూరముంది. ఏ క్షణం వేగం అధికం చేస్తే విజయం సాధించవచ్చునో లెక్కవేశాడు. నాల్గవవానిగా పందెం గెలుచుటకు ఎమిల్ కు ఎంతమాత్రం యిష్టంలేదు. ఇంకా తనకు బలముండగా ప్రయత్నం వదలడం దేనికి ?

ఆఖరు మలుపు: మరొక 200 మీటర్ల దూరం పూర్తి అయితే, ఈ పోరాట ఫలితం బహిర్గత మవుతుంది. విజయానికిమార్గం శక్తినంతా ఉపయోగించి పోరాడ డమే. ఇంకా ఎక్కువ బలాన్ని ఉపయోగించగలవాడే విజయం పొందగలడు. వెంటనే నిశ్చయానికివచ్చి, సమయం కనిపెట్టి తన యావచ్ఛక్తిని ఉపయోగించాడు.

ప్రేక్షకులు ఊపిరిపీల్చుటకూడా మరచిపోయారు. ఒక్కసారి అందరూ లేచి నిలబడ్డారు. అందరూ ఒక్కసారి కేకలువేశారు.

ఏ పందెంలోనూ, యీ ఘట్టంలో జరుగుతున్న యింత తీవ్రమైన పోటీని ఎవ్వరూ, ఎప్పుడూ చూడలేదు. ఛాతీ ప్రక్కన ఛాతీ, భుజాన్ని తాకి భుజం

గమ్యస్థానందగ్గరకు పరుగెత్తుతున్నాయి. ఒలింపిక్ ఆటలలో యింతటి అద్భుత ఘట్టం ఎన్నడూ ఎవ్వరూ కనలేదు. ఎమిల్ ఒక్కొక్క అంగుళం ముందుకు సాగుతున్నాడు. ఆఖరు ఘట్టపు పరుగు అందరూ అనవసరంగా ముందుగా ప్రారంభించారు. అందుచేత అలసట త్వరగా ఆరంభించింది. ఎమిల్, తన శక్తిని తెలుసుకొని, ఆఖరుపరుగు మొదలుపెట్టి అలసటచెందకుండా సాగుతున్నాడు. తక్కినవా రందరు అలసిపోయి బలహీనమయిపోయారు; వారి కాళ్లు తడబడుతున్నాయి. మెమోన్ ఒక్కడే జాగ్రత్తపడ్డాడు; ఎమిల్‌ను అంటిపెట్టుకొని ఉన్నాడు.

ఒక పెద్దకేక వినబడింది. ఘాటవే కాళ్లు మెలికపడి క్రింద పడిపోయాడు. ఎవరికి తెలుసు, వాని కేస్థానం వచ్చి ఉండేదో? పందెం అయిపోయిన తర్వాత, అతనే చెప్పేడు. తాను పడిపోవుటకు కారణం అలసట అని. ఏమైనా చివరవరకు సాగలేకపోదునన్నాడు. ఘాటవే వెంటనే లేచి పరుగెత్తుట మొదలు పెట్టేడు. కాని ఆలస్యం అయిపోయింది. షేడ్‌కుకూడా ఆలస్యమయిపోయింది. ఆఖరుఘట్టంలో ఫలితం నిర్ణయమయ్యే ఏ పందెంలోను, జటోపెక్ అపజయం పొందడు.

ఆఖరు మీటర్లు! ఎమిల్ గమ్యస్థానానికి అతివేగంగా పోతున్నాడు. మొదటి స్థానంలో ఉన్నాడు; వెనక్కి తిరిగిచూడడు. ఎడమప్రక్కనుంచిగాని, కుడిప్రక్కనుంచిగాని ఎవరూ వచ్చి తనను దాటిపోకుండా చూచుకొంటున్నాడు. ప్రతిఅంగుళం కొరకు పోట్లాడుతున్నాడు; ప్రతిక్షణంకొరకు పోట్లాడుతున్నాడు. ఇంకా 20 మీటర్లు, యింకా 10, యింకా 5, చివరకు ప్రథముడుగా గమ్యస్థానం చేరేడు.

వీరుల యుద్ధం పూర్తి అయింది. ఇంక చెప్పవలసిం దేముంది. ఎవరికి ఎంత శక్తి ఉన్నదో, అంతశక్తినీ అందరూ వినియోగించారు. పూర్వంకంటె అందరూకూడా ఎక్కువ ప్రజ్ఞచూపించారు. గమ్యస్థానం 200 మీటర్లున్నదనగా అందరికీ గెలుచుటకు సమానావకాశాలున్నాయి. అక్కడనుంచి మనోబలమున్నవానిదే విజయావకాశం.

జెకోస్లోవక్ సైనికోద్యోగి ఎమిల్ జటోపెక్, విజయం సాధించాడు. ప్రారంభంనుంచి చివరవరకు వర్ణించుటకు వీలులేని పోరాటం అది. అతని వేళ: 14 నిమిషాల 06.6 సెకండ్లు; ఈ పందేలలో యిదివరకు తాను సాధించిన వేళలకన్న 10 సెకండ్లు తక్కువ. ఆఖరు కిలోమీటరు 2 నిమిషాల 41.8 సెకండ్లలో పూర్తిచేయగలిగాడు. (హేగ్‌లో తన ప్రపంచ రికార్డుపరుగులో ఆఖరు కిలోమీటరు 2 మిషాల 54.6 సెకండ్లలో పరుగెత్తగలిగాడు).

మెమోన్‌ది రెండవస్థానం. అతని ఫ్రెంచిరికార్డుకంటె మెరుగు.

అతనివేళ : 14 నిమిషాల 07.4 సెకండ్లు.
షేడ్ : 14 నిమిషాల 08.6 సెకండ్లు.
ఘాటవే : 14 నిమిషాల 18 సెకండ్లు.
పీరీ : 14 నిమిషాల 23.6 సెకండ్లు.
తక్కినవారు : బీరెస్, ఏండర్సన్, ఆల్బర్ట్సన్, అనోఫ్రీవ్‌లు.

మాకు అపరిమితానందంగా ఉంది. ఎప్పుడూ విజయం మా దవుతుందని ఆశించలేకపోయినాం. జటోపెక్ కూడా ఆశ పెట్టుకోలేదు.

ప్రేక్షకస్థానాల్లో ప్రజలు నిశ్చేష్టులై నిలబడ్డవారు, అలాగే ఉండిపోయారు. మంచి తయారీలో నున్నవాడే కాదు ఎప్పుడూ గెలుపొందగలిగింది. ఈ సారి గెలుపు వివేకంగాను, ధైర్యంగాను పరుగెత్తినవానిది. అందుచేతనే ఎమిల్ అజేయుడయ్యాడు.

ఈ అద్భుత విజయం తర్వాత, ఎమిల్ ఎంతో వినయంతో మైక్‌లో యిలా మాట్లాడేడు :

"నేను పూనుకున్నది నెరవేర్చగలిగినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. నా దేశంకొరకు, నా ప్రజలకొరకు పందెంలో విజయం సాధించానని నా కానందంగా ఉంది."

డానా, యింకా యితర ఒలింపిక్ వీరులు అభినందించిన తర్వాత, ఎమిల్, షేడ్ వద్దకు వెళ్లేడు. షేడ్ తలవంచుకొని, భుజాలు జార్చి నడుస్తూంటే ఫొటోగ్రాఫర్లు నిర్దయగా కెమేరాలను ఉపయోగించారు. తన విచారాన్ని తెలియజేశాడు. తన గురువును తానే ఓడించాను కదా అని మనస్సు బాధగా ఉందన్నాడు, ఎమిల్. షేడ్‌మీద చెయ్యి వేశాడు, పరామర్శించాడు; భవిష్యత్తుకు కొన్ని సలహాల నిచ్చాడు. షేడ్ తలూపేడు; ప్రేమతో కరచాలనం చేశాడు.

షేడ్‌కుమాత్రం చాలా ఆశాభంగం కలిగింది. అతడు జటోపెక్‌ను గెలవగలడని ప్రజల అభిప్రాయం; దాదాపు ప్రపంచంలో సగభాగం అతడే విజయం పొందుతాడంది. ఫలితం చూస్తే 3వ స్థానం — ఇదికూడా అద్భుత ప్రదర్శనమే అన్నివిధాలా ఆలోచిస్తే; అతని శక్తినంతా ఉపయోగించాడు.

పందెం అయిపోయిన తర్వాత, షేడ్‌తో అంగీకారానికి వచ్చిన పద్ధతికి భిన్నంగా, ఎమిల్ పరుగెత్తినాడని ఒక వార్తాపత్రిక వ్రాసింది.

ఈ పందేలలో పోరాటతత్వాన్ని యీ వ్యాసకర్త అర్థం చేసికొన్నాడా అని అడగవలసిఉంది. మొదటి విషయం : షేడ్ మొదటినుంచి సుమారు చివరవరకు మొదటి స్థానంలోనే ఉన్నాడు. ఎమిల్ ఆ స్థానం వదలమని ప్రార్థించినప్పుడు కూడా షేడ్ వదలలేదు. రెండవ విషయం : ప్రతి పందెంలోను విజయం సాధించుటకు పద్ధతులు మారుతూంటాయి. ఆఖరు ఘట్టంలో ప్రయత్నం చేయకుండా, చేతులారా విజయాన్ని జారవిడవమని జటోపెక్‌ను ఎవరు నిర్బంధం చెయ్యగలరు ?

ఈలాంటి విమర్శనలతో ఎమిల్ మనస్సు కలతచెందింది. ఎందుచేతనంటే, క్రీడల శీలమే ఆతనికి ముఖ్యం; విజయం కాదు. షేడ్‌ను వెదకి, ఆతనిని పరామర్శించుటలోనే యిది వ్యక్తమయింది. షేడ్, తన జయాపజయాలకు తానే బాధ్యుడన్న సంగతి తెలిసికోవాలి. తర్వాత ఎమిల్, షేడ్ లిద్దరూ చాలసార్లు కలిశారు; వారి స్నేహం బలమైనదిగా తయారయింది.

ఎమిల్ స్వభావాన్ని ఒక జర్మన్ రచయిత యీ విధంగా విశదీకరించాడు :

"ఎమిల్ జటోపెక్ స్నేహపాత్రుడు. అందరి యెడల ఆదరణ; ఒక మహత్తర వ్యక్తికి ఉండే స్వభావం అతనిలో కనబడుతుంది. అందరు ఆటగాళ్లకు యీ స్వభావ ముండుట అరుదు. జటోపెక్‌కు సృజనశక్తి ఉంది; ఏ పరిస్థితినైనా జయప్రదంగా ఎదుర్కొనగల శక్తి ఉంది. షెడ్ ఒక పథకం వేసికొంటాడు; అది సాగకపోయి నప్పుడు మరొకదాన్ని ఆలోచించి అవలంబించే శక్తి లే దాతనికి.

"ఎమిల్‌కు సహజమైన తెలివితేట లున్నాయి. కాని అదే జయం సాధించదు. అనేకమందికి ఆ మాత్రం తెలివితేటలు లేకపోలేదు. కాని సహజమైన మానవ స్వభావం అతనికున్న కొలతలో యితరులకు లేనంతకాలం ఆతనిని జయించుట దుర్లభం."

ద్వితీయ విజయంతో, హెల్సింకీ ఒలింపియడ్ వీరుడైపోయాడు ఎమిల్. సంభాషణలలో ఆతని విజయయే ముఖ్యాంశం. వందలకొలది పత్రికా ప్రతినిధులు ఆతనితో రెండుమాటలు మాట్లాడుటకు తహతహలాడిపోయారు. అతని ఫోటో గ్రాఫులకు ఎంత గిరాకీయో చెప్పుటకు వీలులేదు.

ఒకప్పుడు ప్రపంచ వీరుడుగా ఖ్యాతిగన్న గుండర్ హేగ్, రెండవసారి ఎమిల్ వద్దకు వచ్చి ఆతని నభినందించాడు. జెకొస్లొవేకియాలో పరిస్థితులగూర్చి ప్రశ్నించాడు, ముఖ్యంగా క్రీడల విషయంలో. ప్రభుత్వ సహాయముందని, మంత్రుల నుండి, ఫ్యాక్టరీలు, విద్యాలయాలు, ఆఫీసులు మొదలైనవాటినుండి అభినందన సందేశాలు తంతిలో వచ్చాయని విన్నప్పుడు, హేగ్ ఒక నిట్టూర్పు విడిచాడు.

హేగ్ మొదట ఏ సహాయంలేకుండా ఏకాంతంగా కృషి సలిపాడు; తరువాత ఆటగాండ్రను లోబరచుకున్న ధనమదాంధుల చేతుల్లో పడ్డాడు. ఆ తరువాత పోటీలకు యోగ్యత లేదన్నారు; తర్వాత బహిష్కరించారు. ఒక్క ఒలింపిక్ విజయం సాధించుటకు ఎంతైనా యిచ్చుటకు సిద్ధంగా ఉన్నాడు. తన అన్ని ప్రపంచ రికార్డులు త్యజించుటకు సిద్ధం.

ఎమిల్ హెల్సింకీలో గడించిన మొదటి పతకం స్వదేశంలో అత్యుత్సాహాన్ని కలిగించింది. ఇంక రెండవపతకంతో ఆనందం మిన్నుముట్టింది. జటోపెక్‌కు అసాధ్యమైంది ఏదీ లేదనిపించింది, వారికి.

ప్రేగ్ పత్రికా రచయిత ఒ. మేసెక్ యిలా వర్ణించాడు: "వేగం, ఓర్మి, సామర్థ్యం, పోరాడే శక్తి, మనోబలం మొదలైన లక్షణాలకు 'జటోపెక్' పేరు పర్యాయపదమైపోయింది. నిఘంటువులలో కొన్నాళ్లు పోతే జటోపెక్ అనేమాటకు యివన్నీ పర్యాయపదాలుగా పేర్కొనబడుతాయనుటకు సందేహం లేదు. కృషిలో ఆనందం, నిష్కల్మషదీక్ష, సాహసం, బాధ్యత యివన్నీ జటోపెక్ లక్షణాలు. ఇవన్నీ కూడా మన జీవితాలలో ప్రధానాంశాలు కావాలి."

ఆ రోజున ప్రజలను ఆవేశపరిచే మరొకవిషయం జరిగింది!

ఎమిల్ విజయం సాధిస్తాడని కొందరికి నమ్మకముంది. కాని బాంబు ప్రేలి ఆకాశానికి ఎగిరినట్టుంది యీ వార్త.

జావలిన్ త్రోలో డానా జటోపెక్, బంగారు పతకాన్ని గెలిచింది.

500 మీటర్ల పందెం తర్వాత విశ్రాంతికై ఎమిల్ ఒటానిమీకి వెళ్ళినాడు. అక్కడ యీ వార్త విని, అమిత ఆనందపరవశుడై యిలా అన్నాడు :

"ఈ బంగారు పతకమే నాకు ఆనందం కలిగిస్తుంది, తక్కినవా టన్నింటికంటె."

# మేరథాన్ పందేనికి ముందు

అన్ని ఆటలలోకి ముఖ్యమైన పరుగు పందేలకు సంబంధించిన వారం పూర్తి కావస్తూంది. ప్రతి రోజూ క్రొత్త విజయాలు, క్రొత్త ఒలింపిక్ రికార్డులు, క్రొత్త ప్రపంచ రికార్డులు; 1500 మీటర్ల పందెంలో లగ్జెంబర్గ వీరుడు జోసీ బార్థెల్ సాధించిన విజయం అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

ఆ పోరాటాలు, ఆ విజయాలు మాత్రమే కాదు; ఆటగాండ్రమధ్య యేర్పడిన సుహృద్భావం అన్నింటికన్నా ఎక్కువ సంతోషం కలిగించింది. పతకాలకోసమే ఆటగాండ్రిక్కడకు రాలేదని, ఉత్తమ ఉద్దేశాలతో వచ్చారని అందరికీ విశదమయింది. ఒకరి నొకరు తెలుసుకుందామని, స్నేహం పెంపొందిద్దామని ప్రపంచంలో అన్ని మూలల ప్రజలు శాంతితో, స్నేహంతో జీవించగలరని నిరూపించుటకు వారు వచ్చారు. ఆ పరుగు మార్గాలలో, ఆ ఆటస్థలాల్లో, ఆ ప్రేక్షకస్థానాలలో, ఆ ఒలింపిక్ గ్రామంలో ఇం తెందుకు? ఆ హెల్సింకీ పట్టణమంతటా వారి ఉన్నతోద్దేశాలకి తార్కాణాలు విరివిగా కనబడ్డాయి.

సోవియట్ ఆటగాడు షేహర్ బకావ్‌నుండి బ్రెజీలియన్ డాసిల్వా అందమైన పువ్వులగుత్తిని స్వీకరించాడు. రిచార్డ్సన్, డెనిసింకోలు పోల్‌వాల్టింగునుగూర్చి చర్చించారు. రిచార్డ్సన్ రికార్డుజెంపు అయిన వెంటనే, డెనిసింకో మొట్టమొదటిసారిగా ఆలింగనంచేసి అభినందించాడు. విజయపీఠంమీద మెమోన్, షేడ్ యిరు ప్రక్కలా ఉండగా వారిమీద చేతులుసాచి నిలబడ్డాడు, ఎమిల్.

హర్డిల్ పందెగాండ్రు లిటూవ్, మూర్ ఒకరి నొకరు కౌగలించుకొని ప్రేక్షకులను ఆకర్షించకలిగారు.

సైనాడుంబార్జి, గిజీలా మార్‌మేయర్ సంతోషంగా ఒకరితో ఒకరు పరిచయం చేసుకొన్నారు.

పీటన్ ఫెల్టర్, కాజెన్‌షేవ్‌లు ఎంతో తీవ్రంగా పోటీచేసి మంచి స్నేహితులయ్యారు.

యుద్ధ పిపాసులు వివిధ దేశాలమధ్య నిర్మించిన అడ్డుగోడలను ప్రపంచయువక బృందం కూలద్రోసింది. ఓటానిమీ గ్రామంలో సోవియట్ మిత్రులకు వీడ్కోలు

చెబుతూ, అమెరికన్లు యిలా అన్నారు: "మన మందరం ఒకే విధంగా ఉన్నామని తెలిసికొని చాలా సంతోషంగా ఉంది!"

"సుహృద్భావంగల మీ అమెరికన్ ప్రజలందరికి మా ప్రణామాలు అంద జేయండి అని సోవియట్ ఆటగాండ్రు జవాబు చెప్పేరు.

ఎక్కడా సాధ్యంకానిది హెల్సింకీలో పూర్తి అయింది. సోవియట్ బృందం నాయకుడు రోమనోవ్, 600 మంది పత్రికా ప్రతినిధులు హాజరయిన సమావేశంలో యిలా ప్రకటించాడు:

"వివిధ జాతుల ఆటగాండ్రు, భిన్నమైన రాజకీయ తత్వాల ననుసరించేవారు, ఒక్కచోట కలసి మెలసి ఉండుటవల్ల ప్రపంచంలోని ప్రజలందరూ స్నేహంగా, శాంతిగా ఉండే ఉద్దేశం కలవారని రుజువైంది."

అన్ని దేశాల ప్రతినిధుల అభిప్రాయం యిదే.

ఈ జీవనం ఎమిల్‌కు చాలా ఆనందం కలిగిస్తుంది. ఆతని నిష్కల్మష హృదయం, ఆతని కెంతమందో స్నేహితులను సంపాదించిపెట్టింది. రెండవ విజయం తర్వాత అందరి అభిమానానికి ఆతడు కేంద్రమయ్యాడు. ఆతనిని గూర్చిన వ్యాసాలకు పత్రికలలో ప్రముఖస్థానం యిచ్చేరు. ఆవేశపూరితమైన శైలిని అవలంబించేవారు వ్యాసకర్తలు. అందరూకూడా టాక్టీషియన్‌గా ఆతనిని మించినవాడులేడని అంగీకరించారు. ప్రతి పందెంలోను, ప్రతిక్షణం ఏం జరగాలో ఆతడు ముందుగా నిర్ణయించేవాడు; అవసరమైతే పథకాన్ని ఒక్కక్షణంలో మార్చగల శక్తి గల దతనికి. ఒక పద్ధతికి కట్టుబడి, తన సామర్థ్యాన్ని, తన బలాన్ని సరిదిద్దుకో గలడు. ప్రత్యర్థిని కనిపెట్టి తన పద్ధతులను మారుస్తూ వుంటాడు. సాధారణ పరిస్థితులలోకన్న ఎక్కువగా పందేలలో తన శరీరంలోని శక్తు లన్నిటిని చైతన్యవంతం, ఫలవంతం చేయుటలో ఆతను ప్రజ్ఞావంతుడు.

ఎమిల్‌ను బాగా బోధపరచుకోనివారు, ఆతనినిగూర్చి అనుచితమైన మాటలను యింకా వాడుట జరుగుతోంది. ఉదాహరణకు: పరుగెత్తే ఎంజిన్ అంటారు అతనిని.

ప్రతి అడుగు ఆలోచించి వేసేవానిని గూర్చి, పథకాలను వెంట వెంటనే విజయవంతంగా మార్పుచేయగల ప్రజ్ఞానిధినిగూర్చి, యీ విధమైన మాటల నుపయోగించుట వివేకమనిపించుకోదు. అందులో, ఎవరిలో ఉత్తమ ఆటగాడికి ఉండవలసిన అన్ని గుణాలు యిమిడి ఉన్నవో, అట్టివానిని గూర్చి యీ విధమైన విమర్శలా? ఆతని ప్రదర్శనలలో మానవాతీతమైన దేమీ లేదు. ప్రకృతి ఆతనికి అసాధారణ యోగ్యతలను ప్రసాదించలేదు. కఠినమైన ట్రెయినింగువల్ల, నిశ్చలమైన మనస్సువల్ల, బాధ్యతను గుర్తెరుగుటవల్ల, తన ప్రత్యర్థులకన్న ఎక్కువగా బాధల నోర్చుకోగలడు. దూరపు పరుగు పందెగానికుండే బాధలన్నీ యీతనికీ ఉన్నవి. ఆతని ముఖమే దీనికి తార్కాణం. ఆతనికీ కండరములు నొప్పి పెట్టాయి; ఆతని డొక్కలో నొప్పి; అందుచేతనే, ఆతన్ని ఎప్పుడూ అనుమానం వెన్నాడే ఉంటుంది. కాని, వీటి నన్నిటిని

ఏ విధంగా ఎదుర్కోవాలో అతనికి తెలుసు. అతని విజయాలు అదృష్టవశాత్తు సంపాదించినవి కావు. మేకుల బూట్లు తొడుక్కొని పరుగు పందేలలో పాల్గొనే వారికి తెలుస్తుంది, విజయానికిదారి ఎంతగా బాధలతో నిండివుంటుందో.

పందెగాడు తన ట్రెయినింగు సమయంలో ఎట్టి యమయాతనకు గురికావలసి ఉన్నదో, అందరికీ తెలియుట కష్టం. అనేకమంది యీ బాధలు భరించలేక వెనక్కు తగ్గుతున్నారు. కాని, ఎమిల్ ఓర్మితోనూ, పట్టుదలతోనూ అన్ని బాధలను జయించి విజయం సాధిస్తాడు.

ఎమిల్ హృదయం సాహస సముద్రం. అట్టి సహృదయుని ఒక యంత్రంతో పోల్చడం ఓర్వలేని తనమేనేమో ?

ఎమిల్ చల్లనికళ్ళు, అతని దయామయమైన ఆత్మ యుద్ధంలో ఉక్కువలె ప్రకాశిస్తాయి. నిర్దయగా తనమీద తాను పెట్టే నిర్బంధాలలోనే అతని బలమంతా ఉందని చెప్పాలి.

5000 మీటర్ల పందేనికి, మారథాన్ పందేనికి మధ్య 2 రోజులు మాత్రమే ఉన్నది. స్వదేశంనుండి, విదేశాలనుండి, అబిసీనియాలోను, బొంబాయిలోను, ఇంకా ప్రపంచపు మారుమూలలలోను నివసించే జక్ దేశస్థులనుండి టెలిగ్రాంలు కురుస్తున్నాయి.

ఈ రెండు రోజులలోను ఎమిల్ తీవ్రంగా తలపోశాడు; తాను మంచి తయారీలో నున్నట్లు విశ్వాసమూ, పూర్తి బలమున్నదనే నమ్మకమూ కలిగి దృఢమైన మనస్సుతో ఉన్నాడు. తన దేశ గౌరవం హెచ్చించుటకు గతంకంటె ఎక్కువ ప్రజ్ఞ చూపించగలడు. అందుకు ప్రబల ప్రయత్నం చేయాలి. ఇదివరకుకన్న బాగా పరుగెత్తగల ననుకున్నాడు. అందుకు శిక్షణ పొందాలి. మనస్సు కుదుటబరచుకొని, మారథాన్ పందేనికి ట్రెయినింగు ప్రారంభించాడు. మరొక్కరోజే వ్యవధి ఉంది.

పందేనికి ఏ వేగంలో పరుగెత్తాలో నిర్ణయించుకోవాలి. అతని స్నేహితులు ఎమిల్‌ను గుర్తించలేకపోయారు. వారు నవ్వి, యిలా అన్నారు: వెనక చక్రం బ్రేక్ మీద కాలుపెట్టేడు ఎమిల్ అని. ఎమిల్ చకితుడు కాలేదు. 42 కిలోమీటర్ల (26 మైళ్ళ 385 గజాలు) పందెంలో చివరివరకుసాగాలంటే సరియైన వేగం అవసరం.

అతని హృదయం, అతని శరీరంకూడా సంసిద్ధంగా ఉండాలి. ఇట్టి విషయంలో జాగ్రత్తగా మాట్లాడాలి. అసలు ఎమిల్‌కు మాట్లాడుటంటే చికాకు. దేశభక్తినిగూర్చి ఎక్కువగా మాట్లాడడు. తన జీవితవిధానంలో ఆ దేశభక్తిని చూపించుటే అతనికి తెలుసు.

మేరథాన్ పందెంలో పాల్గొనుట అతనికి కష్టసాధ్యమైన పని. పరుగెత్తేవారి జాబితాచూస్తే, హేమాహేమీల పేర్లు కనుపిస్తున్నాయి. వారందరూ ఒలింపిక్ ఆటలకొరకు ప్రత్యేకంగా ట్రెయినింగు అయినవారు. ఇలాంటి మేరథాన్ పరుగు పందెగాండ్రతో పోటీచేయుట సులభసాధ్యమైన పనికాదు. ఎమిల్ ట్రెయినింగు భిన్నమైన పందేలకొరకు ఉద్దేశింపబడింది. ఈలాంటి మేరథాన్ పందెంలో ప్రవేశించుటకు ఎమిల్‌కు యిదే ప్రథమం.

ఈలాంటి సమయంలో రెండు ఒలింపిక్ విజయాలను సాధించినవానికికూడా నిద్రపట్టలేదు. ప్రపంచవీరుడుకూడా, పక్కమీద అటూ యిటూ నిద్రపట్టక, అశాంతితో దొర్లుతున్నాడు; లేచి కిటికీలోనుంచి చూస్తాడు; గుండె వేగంగా కొట్టుకుంటూన్నట్టుంటుంది; ఎలాగైనా కొంచెంసేపు నిద్రపడితే బాగుండుననిపిస్తున్నది.

రేపు ఉదయం కఠినాతికఠినమైన చరిత్రాత్మకమైన, అత్యుత్కృష్టమైన పందెం ఎమిల్ కొరకు నిరీక్షిస్తుంది. రేపే మేరథాన్ పందెపు దినం.

# పందేలలోకల్లా పందెం

పరుగు పందేల వారంలో ఆఖరురోజు.

అది ఆదివారం జులై 27, 1952.

హెల్సింకీ ఆటస్థలం ఆఖరుసారి నిండింది. ఈ రోజు లోగడ అన్ని పందేలలోకల్లా ముఖ్యమైన పందెం, మేరథాన్ పందేన్ని చూచుటకు జనం తండోప తండాలుగా వచ్చారు. ప్రపంచంలో దూరపు పరుగు పందేలలో ప్రావీణ్యం, ప్రతిష్ఠ సంపాదించిన వీరులు 68 మంది పాల్గొంటూన్న యీ కష్టతరమైన పోరాటంలో ఎన్ని అద్భుత సంఘటనలు జరుగుతాయో ఊహించలేం. దానికి ముఖ్యకారణం 68 వ పోటీదారు ఎమిల్ జటోపెక్; ఈతడు గత 8 రోజులలో 3 వ సారి దూరపు పరుగు పందెంలో పాల్గొంటున్నాడు. అదీకాకుండా, యింత దూరపు పందెంలో యాతడెప్పుడూ పరుగెత్తలేదు. దూర మేమైతేనేమి, ఎమిల్ యిందులో పరుగెత్తుతున్నాడంటే, యిదొక అద్భుత ప్రదర్శనంగా తయారగుటలో సందేహంలేదు.

ప్రేక్షకస్థానాలలో అనుమానపుకంఠధ్వనులు అక్కడక్కడ వినబడుతున్నాయి. 5 కిలోమీటర్ల దూరాల కలవాటుపడ్డవారు, మేరథాన్ అనుభవజ్ఞులతో పోటీకి సంసిద్ధుడగుట సాహసమని కొందరి అభిప్రాయం. అయినా వారే ఎమిల్, దేనిమీదైనా మనసుంచితే, సాధించితీరుతాడనేవారు.

80,000 మంది ప్రేక్షకులు తామేవిధమైన పందెం వీక్షిస్తున్నారో గుర్తించారు. ఒకవేళ ఎమిల్ ఓడిపోయినా, మానవ సాధ్యమైనదంతా ఆతడు సాధించాడనే చెప్పవలసివుంటుంది. మానవుడు కొన్ని అసాధారణ పరిస్థితులలోకూడ సాధించగల కార్యాలున్నాయని మార్గం చూపించాడు ఎమిల్.

18 వ ఒలింపిక్ ఆటలు ప్రారంభించిన ఆ సెప్టెంబరు దినానికి 2450 సంవత్సరాలు పూర్తిఅవుతాయి. ఒక చిన్న గ్రీకు సైనికబృందం, అతిబలమైన పర్షియన్ సేనల

కొమురుగా సముద్రానికి, మేరథాన్ అనే చిన్నపట్నానికి మధ్యనున్న సమస్థలంలో ఆరోజున నిలబడింది. ఇది క్రీస్తుపూర్వం 490 సంవత్సరంలో జరిగిన రెండవ పర్షియన్ యుద్ధంలోని సంఘటన.

ఆనాడు తలవనితలంపుగా ఆ చిన్న గ్రీకు సైన్యం శక్తివంతమైన విరోధి సేనలను ఓడించింది.

దేశం విరోధి బారినుండి తప్పించుకున్నదని, తన సైన్యంలో అతి వేగంగా పరుగెత్తగల సైనికునిద్వారా, ప్రజలకు సందేశం పంపాడు సైన్యాధికారి. మిల్టియాడెస్‌నుంచి ఏథెన్సువైపు పరుగెత్తివెళ్ళాడు.

ఆ యువసైనికుడు యుద్ధభూమి సందేశహరుని విజయగర్వం, విజయానందం అతని వేగాన్ని అధికం చేశాయి. భయంతో, సంశయంతో క్రుంగిపోతూన్న స్వదేశ స్థితి, ఆతని కాళ్ళకు రెక్కలు తొడిగింది. వాయువేగంతో అలాగే పరుగెడుతున్నాడు.

ఏథెన్సు నగరం చేరేడు. ఏక్రపాలిస్‌నుండి విజయవార్తను ప్రకటించాడు. అమితోత్సాహంతో మాట్లాడినాడు. పట్నమంతా ఆనందంలో మునిగిపోయింది. ఆతని కంఠధ్వని నెమ్మదిగా ఆగిపోయింది. భూమిమీదకు ఒరిగేడు; ఆతని గుండె కొట్టుకోవడం మానేసింది. ఆయాసంవల్ల అసువులు కోల్పోయేడు ఆ వీరుడు.

ఆతని మృతశరీరం సైనిక లాంఛనాలతోను, పువ్వులతోను నిండిపోయింది.

అప్పటికే కొన్ని వందల సంవత్సరాలనుండి గ్రీకులు ఒలింపిక్ ఆటలను నిర్వహిస్తున్నారు. ఆ వీరుని సంస్మరణచిహ్నం ఏర్పాటుచేయాలనే దృష్టి, వారికి ఆ రోజులలోలేదు. కాని వేల సంవత్సరాలు గడచినా ఆ సంఘటన మరపునకురాదు. కొత్త తరాలవారు వచ్చారు. కొత్త మతాలు స్థాపితమయ్యాయి; క్రొత్త నాగరికతలు తలలెత్తినాయి; రాజ్యాలు, దేశాలు అస్పృశ్యమయ్యాయి; అనేకం శిథిలమయ్యాయి. ఆ ప్రఖ్యాత యుద్ధానికి పేరిచ్చిన పట్నం మాయమయింది. కాని మేరథాన్‌నుండి సందేశహరుడుగా పరుగెత్తిన ఆ వీరుని సాహసం చరిత్రలో అమరత్వం పొందింది.

కొన్నివేల సంవత్సరాలు గడిచాయి. భస్మీపటలమయిన, ఒలింపియడ్ చరిత్రను పునరుజ్జీవితం చేసినప్పుడు ఆటల భూమిలో నానాదేశాల ప్రతినిధులు సమావేశమయి సుహృద్భావాన్ని పెంపొందింపజేయాలన్న ఉన్నతాదర్శం పునర్జన్మ పొందినప్పుడు, ఆనాటి సైనికుడు పరుగెత్తిన దూరం ఒక పందెపు కొలతగా ఏర్పాటు చేయబడినది.

పోటీదార్ల శారీరక శక్తికి, సౌశీల్యానికి అన్ని పందేలలోకి యీ పందెం పరీక్షవంటిది. అందుచేతనే ఒలింపిక్ ఆటలకు చివరి హంశంగా దీనిని ఏర్పాటుచేశారు. చారిత్రక, ఆధ్యాత్మిక, నైతిక కారణాలనుబట్టి ఆటలలో దీనికి అగ్రస్థానం వచ్చింది. మానవుని ఆధ్యాత్మికశక్తి పశుశక్తిని గెలిచే అవకాశం ఈ పందెంలోనే కనబడుతుంది.

1896 వ సంవత్సరం ఏప్రిల్ 12 వ తేదీని మొట్టమొదటిసారి ఈ పందెం ప్రారంభమయింది. మేరథాన్ బహిరంగ ప్రదేశానికి, ఏథెన్సు నగరానికి మధ్య దూరం యీ పందెపు దూరంగా నిర్ణయింపబడింది. మొదటి విజయం సాధించిన

గ్రీకు గొల్లవాడు స్పిరిడియన్ లూయీ వంటినిండా ధూళితో, చెమటతో గమ్యస్థానం చేరగానే, గ్రీక్ రాజు అతనిని పరుగెత్తివెళ్ళి కలిసికొని కౌగిలించుకున్నాడు.

ఒలింపియడ్ చరిత్రలో యీ పందెపు విజయుల పేర్లు సువర్ణాక్షరాలతో చెక్కబడి ఉన్నవి:

లూయీ, గ్రీసు 1896 (ఏథెన్సు)
థిటో, ఫ్రాన్సు 1900 (పారిస్)
హైౌన్సు, యు. ఎస్. ఎ. 1904 (సెంటులూయీ)
హేయిస్, యు. ఎస్. ఎ. 1908 (లండన్)
మేక్ఆర్థర్, దక్షిణాఫ్రికా 1912 (స్టాక్‌హోం)
కోలెమెయినిన్, ఫిన్లాండు 1920 (ఏంట్వర్పు)
స్టెన్రాస్, ఫిన్లాండు 1924 (పారిస్)
ఎల్‌క్వాఫి, ఫ్రాన్సు 1928 (ఏంస్టర్డం)
జబాలా, అర్జెంటైనా 1932 (లాస్ ఏంజిలెస్)
సన్, జపాన్, 1936 (బెర్లిన్)
కబ్రేరా, అర్జెంటైనా 1948 (లండన్)

ఇప్పటివరకు యీ పందెంలో గెలిచినవారి వేళలలో ఉత్తమమైనది జపాన్ ప్రతినిధిగా వచ్చిన కొరియన్ సన్‌కు చెందినది. అతనివేళ: 2 గంటల 29 నిమిషాల 19.2 సెకండ్లు. లండన్‌లో జరిగిన గత ఒలింపిక్ ఆటలలో యీ పందెం గెలిచిన కబ్రేరా వేళ : 2 గంటల 34 నిమిషాల 57.6 సెకండ్లు. ప్రతి పందెం, మానవ సామర్థ్యానికి, సద్గుణాలకు ఒక క్రొత్త పరీక్షాసమయం. ఎంతో కఠినమైన ట్రెయినింగయినా, కొందరు ఆయాసంవల్ల, అలసటవల్ల పందెం పూర్తిఅయ్యేవరకు పరుగెత్తలేకపోయేవారు; ఆవేశం, వేడి, ఆయాసంమూలంగా మధ్యదారిలోనే తప్పుకొనేవారు. అందుచేత అనేక విషాదసంఘటనలు యీ పందెపు చరిత్రలో నిండివున్నది. ఇవన్నీ కూడా మిల్టియాడెస్‌యొక్క కథను స్మరణకు తెస్తాయి.

1908 లో లండన్‌లో, స్టేడియంవద్దకు ముందు పందెంలో చేరింది ఇటలీ దేశస్థుడు డొరెండో. కాని, గమ్యస్థానం దాటేలోపుగా అలసటవల్ల, ఆయాసంవల్ల ఎన్నోసార్లు క్రింద కూలిపోయాడు. అతనిని లేవతీయుటకు, అతని చేతులు పట్టుకొని మిత్రులు ఎత్తవలసివచ్చినందున, అతనిని విజయానికి అనర్హుడుగా ప్రకటించారు.

1948 లో బెల్జియన్ దేశస్థుడు గెయిలీ స్టేడియంవద్దకు వచ్చేసరికి, అతని స్థితి చూచి ప్రేక్షకులు నిశ్చేష్టులయ్యారు. గెయిలీ పూర్తిగా అలసిపోయి పడిపోయాడు. లేచి పరుగెత్తుటకు మనోబలంఉన్నా, కాళ్లు స్వాధీనంకాలేదు. అందుచేత కాబ్రేరా అతనిని దాటిపోయేడు. విజయం సాధించాడు. ఎలాగో, గెయిలీ లేచి గమ్యస్థానం చేరుకొనే లోపుగా, ఇంగ్లీషు పందెగాడు రిఛార్డ్సు అతనిని దాటిపోయాడు.

ఇలాంటి ఆశ్చర్యాలు కలిగించే సంఘటనలకొరకు ప్రేక్షకులు వేచి ఉండవచ్చును. అందరు పోటీదార్లు జయప్రదంగా అన్ని కష్టాలను అతిక్రమించి గట్టెక్కాలనే ప్రేక్షకుల కోరిక. కాని యిది ఎంత కష్టమైనకార్యమో అందరికీ తెలుసు. 20, 30, 50 కిలోమీటర్లు నడచే వేగంతో పూర్తిచేయుటే చాలా కష్టం. కాని మేరథాన్‌లో ఆగకుండా పరుగెత్తవలసి ఉంది. ఒక్కక్షణం విశ్రాంతి, ఒక్కక్షణం ఊపిరితీసుకొనేవేళ విజయాన్ని దొంగిలించగలదు. అందుచేతనే పందెపు వేగంతో పరుగెత్తి, చివరవరకు నిలవడగలిగిన పందెగాండ్రంటే, ప్రేక్షకులంత గౌరవం చూపిస్తారు.

అందరూ మంచితయారీలో నున్నారు. యూరప్, ఏషియా, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియాలనుండి ప్రతినిధులు హాజరయ్యారు. ఎవరి ట్రెయినింగు కఠినతమమైనదో, ఎవరి గుండె ధైర్యవంతమైనదో, ఎవరి మనోనిశ్చయం ఏమాత్రం బలహీనత నెరుగదో వానిదే విజయం.

స్త్రీల 'రిలే' పందెం - 4 × 100 మీటర్లు - జరుగుతూంది. ఈ రోజుల్లో స్త్రీలు ఎంతవేగంగా పరుగెత్తుతున్నారో చూస్తే చాల ఆశ్చర్యంగా ఉంటుంది. విజయంకొరకు, గౌరవంకొరకు, స్త్రీలు ఎంతైనా సాహసంచేస్తారు. జర్మను స్త్రీలు విజయంతమకు నిశ్చయమనుకొనేసరికి, ఎక్కడనుంచో ఒక నీగ్రో స్త్రీ వచ్చి టేపును దూసుకుపోయింది.

అదే మొదలు.

మూడున్నరయింది. 68 మంది పరుగెత్తుటకు సిద్ధంగా వున్నారు. లండన్ విజయంవంటిది సాధించుటకు ఆశిస్తున్న అర్జెంటైనా దేశస్థుడు డెల్ఫొ కెబ్రీరా నాయకత్వంక్రింద, ఆ దేశస్థులు ముగ్గురున్నారు. ముగ్గురు ఆస్ట్రేలియన్లు: ముగ్గురు సోవియట్ పందెగాళ్లు; వారి సమర్థత ఎవరికీ తెలియదు. ముగ్గురు అమెరికన్లు; ముగ్గురు బెల్జియన్లు; ఇద్దరు జర్మన్లు; ముగ్గురు జపానీయులు; ముగ్గురు ఇంగ్లీషువారు. వారిలో ఒకడు జిమ్‌పీటర్సు: బ్రిటిషువారి ఆశలన్నీ అతనిమీదే. జెకులు - జటోపెక్, నూరేక్.

పందెగాళ్ళందరూ తయారుగా ఉన్నారు. జపాన్‌వారు చాలా చురుకుగా ఉన్నారు. ఎర్ర బనియన్‌తో 903 వ నెంబరుగల జెకోస్లోవక్ పందెగాడు, అంత నమ్మకంగాలేడు. ఏదో అనిశ్చయంగా ప్రత్యర్థులందర్నీ చూస్తున్నాడు; వారి సామర్థ్యాన్ని అంచనా వేస్తున్నాడు. అనుభవంపొందిన యింతమందిమధ్య జటోపెక్‌కు భయంగా ఉంది.

జటోపెక్ మొదటి వరుసలోనే, బయటిఅంచున నిలబడ్డాడు. అంటే పందెగాండ్ర గుంపులో అదృశ్యమయిపోయాడు. అక్కడ అతనికి చాలా యిబ్బందిగా ఉంది. పందెపు స్థలం సమగ్ర చిత్రం అగపడుట లేకుండాపోయింది. త్వరగా అటూ యిటూ తిరుగుటకు వీలులేని స్థితిలో ఉన్నాడు. ప్రజాభిమానం చూరగొన్న వారందరి నంబర్లు కంఠస్థం చేసికొన్నాడు. వారి నందరినీ తన దృష్టిపథంలోనే

ఉంచుకొన్నాడు. ఇంగ్లీషువారు, ముఖ్యంగా పీటర్సు, అర్జంటేనియన్లు, స్వీడిష్‌వారు, ఇంకా యితరులు — అంత గొప్పవారు కాకపోయినా, వారి దేశపు పతాక ప్రతిష్ఠను నిలుపుటకు కంకణం కట్టుకున్నవారు. ఈ రోజు మొదటినుంచీ ప్రథమ శ్రేణిలోనే ఉండాలి ఎమిల్. ఈ విషయమై ఒక నిశ్చయానికి వచ్చాడు.

3.32 గంటలకు నిర్ణయవేళ; ఆ క్షణం వచ్చింది. అధికారి పిస్టల్ ప్రేల్చేడు. ప్రారంభ సౌంజ్ఞ యివ్వబడింది. పరుగు ప్రారంభమయింది.

బాణంవలె ముందుకు దూసుకుపోయాడు: తా నిన్నాళ్ళు అలవాటు చేసుకొన్న వేగంతో వదలకుండా పోతున్నాడు. కాని ఆకస్మికంగా జాన్సన్ (స్వీడ్), పీటర్సు (ఇంగ్లీషు), జోళ్ళు లేనికాళ్ళతో అస్లాం (పాకిస్థాన్) ఎమిల్‌ను దాటి ముందుకు పోయారు. మేరథాన్ పందెంలో యింత వేగంగా పరుగెత్తుట ఎమిల్‌కు ఆశ్చర్యం కలిగించింది. కాని వెనక పడిపోవుట అతని కంగీకారం కాదు. ముందున్నవారు తన దృష్టిలోనుంచి తప్పిపోకూడదు. తన కిష్టంలేకపోయినా, వేగం అధికంచేయక తప్పింది కాదు. మొదటి 3 ఘంటాలలో ప్రథమ శ్రేణిలోని పందెగాండ్రలోనే ఉన్నాడు, ఎమిల్.

ప్రేక్షకులలోనివారంతా జటోపెక్‌ను ప్రశంసిస్తున్నారు. అతని పేరే ఎక్కువగా వినబడుతూంది. ఎమిల్ తన కృతజ్ఞత తెలిపేడు. వారివైపు పొకసారి చూచి, తల ఊపాడు. ఈ రోజు అందరిదృష్టి అతనిమీదనే ఉంది, అతని కిష్టమున్నా లేక పోయినా. పోటీ ప్రారంభంనుంచి విజయాభ్యర్థిని అభినందించుట ఆచారంకాదు. విశ్రాంతి తీసుకొని మేరథాన్ పందెంలో ప్రవేశించిన అనుభవంగల పోటీదార్లతో పాటు ప్రవేశించిన జటోపెక్ ధైర్యాన్ని ప్రజలు మెచ్చుకున్నారంటే, ఆశ్చర్యంలేదు. అతని వినయం, అతని సాహసం అందరి హృదయాలను ఆకర్షించింది. అందరూ అతని విజయాన్ని కోరుతున్నారు.

అతను గెలుస్తాడా? అది అసాధ్యంగా కనుపిస్తూంది అంటారు కొందరు. ఆ రోజులలో, నూర్మి 1500 మీటర్ల పందెం, క్రాస్ కంట్రీ పందెం 5000 మీటర్లు గెలిచాడు. 5 కిలోమీటర్ల పందెం, 10 కిలోమీటర్ల పందెం గెలిచిన తర్వాత, మేరథాన్ పోటీ గెలుచుటా? అసాధ్యం. అదొక మాంత్రిక సంఘటనగా పరిణమిస్తుంది ఆటల చరిత్రలో.

ఈ లోపుగా స్టేడియంలో ఆఖరు పతకాలకొరకు పోరాటం జరుగుతూంది. కొన్ని ఆకర్షణీయమైన పందేలు జరిగినవి; ముఖ్యంగా రిలే పందేలు. కాని, చాల మంది దృష్టి మేరథాన్ పందెపు ఫలితాలమీదనే ఉంది. ఫలితాలు తెలిపే బోర్డువైపే అందరూ చూస్తున్నారు. ప్రారంభపు ఫలితాలకొరకు అందరూ నిరీక్షిస్తున్నారు.

5 కిలోమీటర్ల దగ్గరకు వచ్చేసరికి, మొదటి రిపోర్టు వచ్చింది. టైపురైటరు వంటిదానిమీద నొక్కుతూంటే, బోర్డుమీద లైట్లు వెలిగి అక్షరాలుగా కనబడుతూన్నవి. దాన్నిబట్టి ప్రేక్షకులకు అప్పటి ఫలితం తెలిసింది. పీటర్సు, 15 నిమిషాల 48 సెకండ్లలో ఆ దూరం పరుగెత్తేడు. అతడే అందరికన్నా ముందున్నాడు. అతని

వెనుకే, అతని దేశస్థుడు కార్సు పరుగెత్తుతున్నాడు. వానివెనుక స్వీడన్‌కు చెందిన జాన్సన్, జటోపెక్, సోవియట్ పరుగుదారులున్నారు. మోస్టాషెన్‌కోవ్ లున్నారు.

అగ్రశ్రేణిలోని పోటీదార్లు హెల్సింకీ వీధులగుండా పరుగెత్తినారు. ఒలింపిక్ ఆటలలో ముఖ్యమైన యీ పందెం చూచుటకు దూరప్రాంతాలనుండి అనేకులు వచ్చారు. పీటర్సు, కార్చెరాలనుగూర్చి వారు విన్నారు. బహుశా విజయం ఆయనే పొందవచ్చు. కాని, వారందరికీ జటోపెక్‌మీద అభిమానం. అందుచేత అతనికే వారి ప్రోత్సాహమంతా. తన దేశస్థులు దూరంగా ఉండటంవల్ల, వీరి అభిమానమే అతనికి ప్రత్యామ్నాయపు ఆనందం కలిగించింది. అకస్మాత్తుగా వీధులలో నిలబడిన ప్రజలలో నుండి జెక్ కంఠధ్వని వినిపించింది. హెల్సింకీ పందెములప్పుడు, పందెగాండ్ల వినోదం నిమిత్తం వచ్చిన యువతీ యువకుల నృత్యబృందంలోనివారే వీధులలో చేరి పాటలు పాడుతూ, జటోపెక్‌కు ఆనందం కలిగించ యత్నించారు. అయినా జటోపెక్ సంతోషంగాలేడు. 5, 10 కిలోమీటర్లు గడచినవి; ఏమైనా యీ దూరాలు దీర్ఘంగా కనబడుతున్నాయి. ఇంతదూరపు పందేలకు జటోపెక్ అలవాటుపడలేదు. ఎక్కువ అలసట చెందకుండా పరుగెత్తాలని అతని ప్రయత్నం. అతని శక్తిని అవంతైనా వృథా చేయకూడదు. ఈ శక్తిఅంతా చివరి ఘట్టాలలో అవసరం. బలాన్ని క్షీణింపజేసే పీటర్సు వేగం జటోపెక్‌కి ఆశ్చర్యం కలిగించింది. కాని యింత వేగం చివరికి ప్రమాదం కలిగించదా? ఎత్తు పల్లాలలోనుండి ఆ వరుసలోనే పరుగు సాగిస్తున్నారు. 10 కిలోమీటర్ల సరికి మోల్మి పట్నానికి చేరుకున్నారు.

ఇంగ్లాండు, బంగారు పతకాన్ని సంపాదించుటకు పీటర్సు మీదనే ఆధారపడి ఉంది. పీటర్సు యిప్పటివరకు ప్రథమ స్థానంలోనే ఉన్నాడు. 10 కిలోమీటర్ల దూరం వచ్చేసరికి 31 నిమిషాల 55 సెకండ్లు పట్టింది. ఇదే రికార్డు వేళ 17 సెకండ్ల తర్వాత జాన్సన్, జటోపెక్‌లు 10 కిలోమీటర్లు దాటారు. కార్సు వారి వెనక పడిపోయాడు. కార్చెరో ముందుకు తోసుకువస్తున్నాడు. తరువాత తక్కినవారు, ఒకరినంటి ఒకరు. ఇప్పటికి అంతిమవరస ఏవిధంగా ఉంటుందో ఊహించవచ్చు.

పోటీదార్ల మధ్యశ్రేణిలో ఫిన్నులు హీటేనెన్, పులాక్కా అగ్రస్థానంలో ఉన్నారు. వారికి మార్గం పూర్తిగా తెలుసు. ముందున్నవారు త్వరగా అలసిపోతారని వారికి తెలుసు. ఎవరికి తెలుసు? ఇంకా ముందువరుసల్లో లేని పేరింకా పేర్కొనబడనివా రెవరో యీ పందేన్ని గెలవవచ్చు! ఇంకా 30 కిలోమీటర్లపైన పరుగెత్తవలసి ఉంది.

తిరుగ్రిలా తర్వాత పందెం కఠినంగా ఉంటుంది. తరువాత కొండెక్కుట, దిగుట పందెగాళ్ళ ప్రాణాలను తీస్తుంది. నెమ్మదిగా జటోపెక్, స్వీడిష్ జాన్సన్, పీటర్సును కలుసుకున్నారు. కలసి పరుగెత్తుట, అనుభవించిన కలసి కష్టం స్నేహాన్ని అభివృద్ధిచేస్తుంది. కష్టతీవ్రత తగ్గుతుంది. పరుగెత్తుతూ ప్రక్కనున్నవానితో మాట్లాడుదా

మని ఎమిల్ ప్రయత్నం. కాని యీ మధ్యనే షీరీ తనతో చెప్పిన విషయం జ్ఞాపకం వచ్చింది: పరుగెత్తుతూ మాట్లాడుట కొందరికి యిష్టం ఉండదు. అందుచేత, జాన్ సన్‌తో, ఎమిల్ మాట్లాడుటకు జంకి ఊరుకున్నాడు. అయినా ఆ స్వీడిష్ దేశస్థుడు జాన్‌సన్ మాట్లాడుట ప్రారంభించాడు. పీటర్సను అందుకోవాలని ఎమిల్‌ను సవాలుచేశాడు. ఇది ఇంకా తరుణంకాదని, అనేక భాషల్లో ఎమిల్ అతనికి బోధ పరచాడు; ఈ విధమైన వేగంతో తనకున్న అవకాశాలను పీటర్స ధ్వంసం చేసికొను చున్నాడని చెప్పేడు. జాన్సన్‌కు స్వీడిష్ భాష తప్ప మరేమీ రాదు. ఎమిల్ చెప్పినది అతనికి బోధపడలేదు. అందుచేత జాన్సన్‌తో ఏకీభవించాడు.

15 కిలోమీటర్లు చేరేసరికి పీటర్సను యిద్దరూ కలుసుకున్నారు.

స్టేడియంకు పీటర్స, జాన్సన్ 47 నిమిషాల 58 సెకండ్లకు ఒకేసారి 15 కిలో మీటర్ల మార్కు దాటినారని వార్త వెళ్ళింది. జటోపెక్ 2 సెకండ్ల తర్వాత దాటాడు.

తరువాత 3 కిలోమీటర్లు ముగ్గురూ కలిసి పరుగెత్తేరు. అప్పుడు పీటర్స కాళ్లలో బలంతగ్గుతూందని ఎమిల్ కనిపెట్టేడు. ఇతర పరుగు పందెగాళ్ళ శక్తినంతను తాను వేగంగా పరుగెత్తి, క్షీణింపజేసినందుకు పీటర్సను నిందించాడు, ఎమిల్. పీటర్సతో యిలాగన్నాడు:

"మాతో రా! ముగ్గురం కలిసి ఉన్నప్పుడు కష్టం మరుస్తాం". పీటర్స ఎంతో కష్టించాడు. కాని వారితో సమానంగా పరుగెత్తలేకపోయాడు. రోడ్డుప్రక్కకు తప్పుకున్నాడు.

ప్రారంభంలో వేగంగా పరుగెత్తి, జటోపెక్‌ను బెదిరిద్దామనుకున్న పీటర్స, తన తప్పును గ్రహించాడు. అతడవలంబించినపద్ధతి తప్పని తెలుసుకొన్నాడు. జటో పెక్ తన వేగాన్ని స్వాధీనంలో ఉంచుకున్నాడు. పీటర్స అధికవేగంతో పరుగెత్తి అలసటచెందిపోయాడు. జాన్సన్, జటోపెక్, పీటర్సమీద సానుభూతితో నెమ్మదిగా పోతే వెనకనుంచి వచ్చేవారు తమను కలుసుకుంటారని, వేగం అధికంచేశారు. 20 కిలో మీటర్లు 1 గంట 04 నిమిషాల 27 సెకండ్లలో పూర్తి చేశారు.

వారి వెనక పీటర్స, కాక్స్, క్రిబీ వచ్చారు.

ఆఖరు ఘట్టంవరకు యిదే వరుస. ఆ ఘట్టం మళుపుగ్గరకు వచ్చేవరకు ఎమిల్ ఆగలేకపోయాడు. ప్రారంభంలో వేగంగా పరుగెత్తుటవల్ల కొంత ఆయాసానికి కారణమయిందని తెలిసికొన్నాడు. దూరం తగ్గుతూండకపోతే, అలసట ప్రారంభించింది దన్నమాట. చివరవరకు సాగగలడా?

అనీ ప్రశ్న ప్రేక్షకులలో. రుటోస్కీలావద్దకు వారిద్దరూ చేరేసరికి, పీటర్స 7 సెకండ్లు వెనకనున్నాడు.

పీటర్స విశ్రాంతి తీసుకుంటున్నాడా, ఆఖరుఘట్టంలో బలమంతా ఉపయోగించుటకు? పరుగెత్తలేక జటోపెక్ నిలబడిపోవడానికి అవకాశం కల్పిస్తున్నాడా? ఇంకా గమ్యస్థానం చాలాదూరముంది. ఇంకా చాలావేళ ఉంది అక్కడకు చేరుటకు.

పందెగాళ్ళ ప్రతిఅడుగుతో పట్నందాపునకు వస్తూంటే, ప్రేక్షకులలో అలజడి అధికమవుతూంది. ఈ పోరాటం అంతమయ్యే సమయం సమీపిస్తోంది.

ఆఖరుఘట్టానికి వచ్చేసరికి, మొదటిభాగం ఎందుకంత సులభంగా ఉందో గ్రహించాడు, ఎమిల్. ఇంతవరకు గాలి వెనకనుండి వారిని తరుముతూంది. ఇప్పుడు ముఖాలమీద విసురుగా కొడుతూన్నది. అలసటతోపాటు, యీగాలి వీరిమీద విరోధం సాధిస్తూంది. ఎమిల్ తన షర్టును ఎత్తగలిగినంత పైకెత్తి, వేడెక్కిన శరీరం చల్లబడుటకు ఉపాయం కనిపెట్టేడు.

చివరమలుపులోకి వచ్చేముందు తాను, జాన్సన్, పీటర్సు, తక్కిన వారందరి కన్న ఎంతో దూరంలో ఉన్నారని అనుకున్నాడు. కాని, మలుపుతిరిగేసరికి దూరమంతగాలేదని గ్రహించాడు. అర్జంటైనా వ్యాసం కలిసింది; తరవాత కాక్సు, ఫెర్నాండెజ్, ఐడెం, ఫ్లోరెస్, బోయిూ, దివాట్కీన్, బుసోటీ, డోబ్రిన్ని వచ్చారు. చాలామంది తమ వాచీలను చూచుకొని వేళ ప్రకారం పరుగెత్తుతున్నారు. ఆఖరుదాడిలో వారుకూడా పాల్గొనేటట్లున్నారు.

తమకు పరిచయమైన ప్రకృతి దృశ్యాల మధ్యనుంచి పోతున్నారు. వాని శోభను, సౌందర్యాన్ని చూచుటకు వేళలేదు. ఆవరించే అలసటను అడుగడుగునా పారద్రోలాలి.

25వ కిలోమీటరువద్ద జటోపెక్ మొదటిస్థానంలో ఉన్నట్లు, అప్పటికి 1 గంట 21 నిమిషాల 30 సెకండ్లయినట్లు ప్రకటించబడినది. వాని వెనుకే జాన్సన్, అతని వెనక పీటర్సు, తరువాత ప్రమాదకరమైన అర్జంటీనియన్లు.

ప్రేక్షకస్థానాల్లో అలజడి అధికంగా ఉంది. ఈ విధంగా మరొక్కగంట జరిగితే మేరథాన్ పందేనికికూడా ఒక రికార్డు ఏర్పడుతుంది. ఈ విజయం ఎవరిది? లండన్‌లోవలె కార్బెరా దాడి ప్రారంభిచేటట్లుంది.

ప్రాథమిక చికిత్స కంట్రోల్ పాయింటువద్ద ఎవరో స్నేహితులు పళ్ళు, పళ్ళ రసం యివ్వబోయారు. జాన్సన్ వద్దనలేకపోయాడు; ఒక గ్లాసు తీసుకొని త్రాగేడు. ఎమిల్ గొంతుకకూడా ఎండిపోయింది. అతనికీ ఫలహారం అవసరమే. కాని త్రాగలేదు. తన కోరికను ఆపుకున్నాడు. ఒకచుక్క ద్రవపదార్థం ఆతని స్వస్థతను పాడుచేస్తుందని ట్రెయినింగు సమయంలో తెలుసుకున్నాడు. త్రాగడం మొదలుపెడితే త్రాగాలనే బుద్ధి పుట్టుతుందిగాని, పరుగెత్తుదామని ఉండదు. మన శరీరవాంఛల తృప్తిలో పడిపోతే మనం వానికి దాసులమయిపోతాం.

అందుచేతనే ఎమిల్ దాహం త్రాగడం మానివేశాడు.

కొండ ఎక్కాడు. సునాయాసంగా దిగేడు. ఒక్కసారి తలత్రిప్పి చూసేసరికి, మిత్రుడు జాన్సన్ ఎంతోదూరం వెనక ఉన్నాడు. ఆతనికొరకు వేచి ఉండాలా; జాన్సన్ సరిగా పరుగెత్తలేకుండా ఉన్నాడు. మలుపు దగ్గర పళ్ళరసం త్రాగుటవల్ల వచ్చిన అపాయాన్ని ఎదుర్కొంటున్నాడు. తనతో ఎంతో విశ్వాసంగా వస్తూన్న

స్నేహితుని వెనకవుంచి వెళ్లిపోవుటకు జటోపెక్‌కు ఎంతమాత్రం యిష్టంలేదు. కాని చేయవలసిందేమీలేదు. ముఖ్యంగా దక్షిణాదివారు, మీదమీదకు వస్తున్నారు.

25వ కిలోమీటర్ చాలామంది ఆశలకు దహనస్థానం. పందెపు విషాద చ్ఛాయలు అలుముకొంటున్నాయి. ఇంగ్లీషువారి అభిమాన పోటీదారు కాక్స్, రోడ్డుప్రక్క మురికిగుంటలో పడిపోతే, ఎత్తి స్ట్రెచర్ మీద తీసుకుపోవలసి వచ్చింది.

25వ కిలోమీటరువద్దకు 1 గంట 21 నిమిషాల 30 సెకండ్లలో జటోపెక్ చేరుకున్నాడు. జాన్సన్ 5 సెకండ్లు ఆలస్యంగా చేరేడు. జటోపెక్‌తో సమానంగా జాన్సన్ వెళ్ళలేడన్న సంగతి స్పష్టమయింది. క్షణక్షణానికి పీటర్సు వెనకబడి పోతున్నాడు.

ఎమిల్ ఒక్కడే ముందు పరుగెత్తుకుపోతున్నాడు. ఇంకా 15 కిలోమీటర్లు పరుగెత్తవలసిఉంది. ఈసారి ఒంటరిగాలేడు. వీధులకు యిరుప్రక్కలా జనసమూహా లున్నవి. అయినా అందరూ అతనిని వదలేసినట్టయింది. అలసట అధికమయి శరీరాన్ని స్వాధీనం చేసుకుంటూన్నట్టయింది. రోడ్డురాపిడికి పాదాలు నొప్పిపెడు తున్నాయి; బొటనవేళ్లకింద బొబ్బలు పొక్కినవి; చిరిగిన ఆతని జోళ్లు కాళ్లలోకి గుచ్చుకుపోతున్నాయి. ఆతని కండరాలకు బలం పోతూంది. వేగం తగ్గించకుండా పరుగెత్తుటకు పళ్లు గట్టిగా బిగించవలసివచ్చింది.

పత్రికా ప్రతినిధుల కారు ఎమిల్‌ను కలుసుకొంది. జటోపెక్, అలసట చిహ్నాలులేకుండా సులభంగా పరుగెత్తుతున్నాడని వారు వ్రాసుకున్నారు.

ప్రజలుకూడా, వీధులలో నిలచి ఎమిల్‌ను చూస్తూ, ఆతను పడే అవస్థలను గమనించలేకపోయారు. బాహ్యంగా ఉత్సాహంగా ఉన్నట్టుకనబడ్డాడు. అతనెంత కష్టపడుతున్నాడో అతనికే తెలియాలి.

30వ కిలోమీటరు. ఒలింపిక్ స్టేడియంలో వేళలుతెలియజేసే బోర్డుమీద యీ విధంగాఉంది.

జటోపెక్ - 1 గంట 38 నిమిషాల 42 సెకండ్లు.

జాన్సన్ - 1 గంట 39 నిమిషాల 08 సెకండ్లు.

పీటర్సు 53 సెకండ్లు వెనుకనున్నాడు; కార్వోనె ముందుకు పోయాడు; కాబ్రెరా కూడా తేడాను తగ్గిస్తున్నాడు. ఫెర్నాండెజ్ అతనితోనే వున్నాడు.

పీటర్సుబలం క్షీణదశకు వచ్చింది. కాక్స్ ప్రయత్నం వదిలేసినప్పుడు, పీటర్సు గెలుస్తాడని ఆశించాడు. కాని పీటర్సు నడక తడబడుతూండడం చూస్తే చివరివరకు సాగేటట్టులేదు. 37వ కిలోమీటర్‌లో ఆతని పని పూర్తి అయింది. కూలబడిపోయాడు; లేవలేకపోయాడు. నిబంధనలకు వ్యతిరేకంగా, ఆతనికి మందిచ్చి పందెంలోకి పంపించారు, అతని స్నేహితులు. కాని మరొక 100 మీటర్లు వెళ్లేసరికి కుప్పలాగ కూలి పోయేడు.

ఎమిల్ పరుగెత్తుతూనే ఉన్నాడు. ఆతని కాళ్ళు పీకుతున్నాయి. ఆతని గుండెలమీద మేకులు కొట్టినట్టయింది. అతను పరుగెత్తుతున్నాడో, లేక అతని కాళ్ళ

క్రిందరోడ్డు అదృశ్యమయిపోతూందో తెలియుటలేదు. ఆయాసాన్ని తగ్గించుకొనుటకు చేతులు వ్రేలాడవేశాడు. నోరుతెరచి గాలిలోనికి పోనిస్తున్నాడు. పిడికిళ్లు బిగించాడు; పరుగెత్తుతున్నాడు.

స్వదేశంలో ప్రజలు వందలు, వేలు రేడియోలవద్దర వార్తలకొరకు వేచి వుంటారని గ్రహించి ఉంటాడు.

దురదృష్టంకొద్దీ విమర్శలు ఆలస్యంగా వచ్చాయి. జటోపెక్ పేరు ఎక్కడైనా వినబడుతుందేమోనని, అన్ని మీటర్లలోను వార్తలకొరకు శ్రోతలు వెదకేరు. ఏ భాషలో వ్యాఖ్యలు వస్తేనేమి, ఆ ప్రియమైన పేరు వినబడితే చాలు; జటోపెక్ పేరు ఆవేశపు టరపుల మధ్య వినబడుతూనేఉంది. మధ్య మధ్య 'ఎమిల్' అని వినబడుతూంది. జటోపెక్ విజయం తథ్యంవలె కనబడుతూంది.

35 వ కిలోమీటరువద్దకు జటోపెక్ వచ్చేసరికి జాన్సన్ 300 మీటర్ల వెనకనున్నాడు. జాన్సన్ స్థానానికి ప్రమాదం తెస్తూన్నది కార్లో. ఇప్పటికి ఫలితం నిశ్చయమయినట్టే. జటోపెక్‌ను ఓడించగల శక్తి ఎక్కడా కనబడదు. అతని వెనుకనున్నవారు చాలా దూరాన్నున్నారని ప్రక్కనుపోయే కార్లోనుంచి వచ్చిన వార్త అతనిలో విశ్వాసం కలిగించింది. ఇప్పుడతనికి బలహీనమనేది లేదు. ఇంక ఉన్నది కొద్దిమీటర్లే కదా!

వీధుల ప్రక్కల బారులుతీర్చిన ప్రేక్షక సమూహం "హైవా, జటోపెక్!" అని కేకలు వేస్తున్నారు.

"టూయినిన్ నూర్మి"— "రెండవ నూర్మి".

హెల్సింకీ పరిసరాలలోని పార్కులను సమీపిస్తున్నాడు, ఎమిల్. ప్రజల అరుపులకు అంతులేదు. ఈ కేకలు అతనికి సాధారణంగా ఉత్సాహమిచ్చేవి. తల నొప్పితో అతని కణతలు బద్దలయిపోతున్నాయి.

ఆ మెత్తనిమార్గం కొంత సౌకర్యంగా ఉంది. అయినా అధికం అవుతూన్న అలసటను అణచడానికి బలంకావాలి.

ఇంటివద్ద మైకులతో, అతని కేమీ సహాయం చేయలేముకదా! పిడికిళ్లు బిగించి, జటోపెక్ మార్గంలో నడుమటకు మంచి తీర్మానాలు చేసుకొంటూ "ఎమిల్, చివరివరకు సాగాలి!" అని కోరుటకంటె చేయగలిగిందేముంది!

ఒక రిపోర్టరు యిలా గన్నాడు: "1,00,000 మంది ప్రేక్షకులున్నారు. అన్ని దేశాల ప్రతినిధులు హాజరయ్యారు. అనేక భాషలలో వారు మాట్లాడుతారు. కాని ఆ క్షణంలో వారి భావాలన్నీ ఒకేవిధంగా ఉన్నాయి. అందరూ జటోపెక్ గెలవాలంటున్నారు. మరెవ్వరినిగూర్చిగాని వారు మాట్లాడరు. ఒలింపిక్ ఆటలలో యింతటి విజయాన్ని సాధించిందెవరూలేరు."

ఈతలలో అంత్యపోటీలు జరుగుతున్నాయి. ప్రకటనచేసే అధికారి, క్షమాపణ కోరుతూ, వల్లని కంఠంతో యిలా గన్నాడు: "క్షమించండి, నేను మరేమీ

మార్లాడలేను. మారథాన్ పందెం వార్తలు ఆవేశం కలిగించేవిగా ఉన్నాయి. ఇక్కడ జరుగుతూన్న దేవీ, జటోపెక్ విజయంతో పోల్చిచెప్పడానికి వీలులేదు."

ఆతని పేరు వదలకుండా ఉచ్చరించే ఆవేశపూరిత కంఠధ్వనులమధ్య, ప్రేక్షక స్థానాలనుండి ప్రతిధ్వనించే విజయ ధ్వానాలమధ్య ప్రపంచపు ప్రశంసలు తొంగి చూస్తున్నాయి. జటోపెక్ పరుగు పందెగాళ్ళందరికీ రాజై కూర్చున్నాడు.

40 కిలోమీటర్లు — ఆఖరు ఘట్టం.

ఎమిల్ వేళ: 2 గంటల 15 నిమిషాల 10 సెకండ్లు.

కార్నోది రెండవ స్థానం: వేళ 2 గంటల 17 నిమిషాల 25 సెకండ్లు. వాని వెనక జాన్సన్, కాబ్రెరా, ఛాయి.

స్టేడియంలో అన్ని పోటీలు ఆగిపోయాయి.

హెల్సింకీ వీధులనుండి బయలుదేరిన కోలాహలంవల్ల మారథాన్ పందెపు ఆఖరు వేళ సమీపించిందని బోధపడింది. కాబోయే విజయుడు దగ్గరకు వస్తూన్నాడు. మేరథాన్ విజయద్వారం ఆతని నాహ్వానిస్తూంది. గమ్యస్థాన సామీప్యం జటోపెక్ అడుగులను తొందరపెట్టింది.

లౌడ్‌స్పీకర్ల ధ్వనుల నతిక్రమించి వెనుకనుండి బ్యాండు వాయిద్యం విని పిస్తూంది. పతక బహూకరణ సమయంలోనే యీ బ్యాండువాయిద్యం సాధారణంగా వినిపిస్తుంది. ఈరోజు ప్రత్యేకంగా పరుగు పందెగాండ్ల చక్రవర్తిని వాయిద్యాలు పలుకరిస్తున్నాయి. విజయాగ్రేసరుని ఆహ్వానించుటకు మారథాన్ సింహద్వారం తలుపులు తెరుచుకుంటున్నాయి. ఆ మహత్తర క్షణం దగ్గరకు వస్తూంది. వేల సంవత్స రాల క్రిందట పరుగెత్తిన చరిత్రాత్మక వీరుని మహత్తర గాథతో పెనవేసుకున్నట్టిది యీనాటి యీమహోజ్వల ప్రదర్శన. ఆ నాడు ఆ వీరుడు "శాంతి సంరక్షింప బడింద"ని సందేశం యిస్తూ అసువులను కోల్పోయాడు. ఈనాడు మరొక క్షణంలో విజయదుందుభుల మధ్య స్టేడియం ప్రవేశిస్తూన్న వీరుడుకూడా ఒక సైనికుడే. ఈతని ఆకాంక్షకూడా శాంతి పరిరక్షణే.

అంతులేని బాధతో పోరాడుతున్నాడు ఎమిల్. ఆతని సర్వస్వం ఒడ్డాడు. తన దేశీయులు ఎంత బలవంతులో, ఎంత మనోనిశ్చయం కలవారో ఎమిల్ రుజువు పరచ దలచుకున్నాడు. అందమైన తన దేశంకోసం, శ్రమశీలురైన తన ప్రజలకోసం, ఉన్నతాదర్శమైన శాంతి స్థాపనకోసం విజయం సాధించాలనుకున్నాడు, ఎమిల్.

ద్వారం తెరుచుకుంది; విజయునికొరకు నిరీక్షిస్తూంది. ప్రేక్షకులు ఆవేశంతో లేచినిలబడిపోయారు.

అంతులేని ఆ ప్రజల హర్ష ధ్వానాల మధ్య జటోపెక్ స్టేడియం చేరుకున్నాడు. రంగులరీపాలు, విజయుడు గమ్యస్థానం చేరుతూన్నట్టు సూచిస్తున్నాయి. ప్రజల కోలాహలపు కెరటాలు స్టేడియం గోడలను దాటి లోపలంతా నిండిపోతూంటే, జటోపెక్ విజయగౌరవంతో లోనికి ప్రవేశించాడు. ఆతడు ఫిన్ దేశస్థుడుగానే భావింప బడుతున్నాడు.

నలుదేశాలనుండి నలుమంది ప్రకటనదారులు, జటోపెక్ పేరును వణకే కంఠాలతో ఉచ్చరించారు. గమ్యస్థానం చేరుట కింకా కొన్నివందల మీటర్లుంది. పోరాటం ఆఖరుభాగంలో ఎమిల్ ముఖంలో ధైర్యం ప్రతిబింబిస్తూంది. అతని జుట్టు తడిసి ముద్దయిపోయింది. చెక్కిళ్లు మాడిపోయాయి; నుదురు పాలిపోయింది.

నిటారుగా నిలబడి కాళ్లు ఝాడించాడు. వస్త్ర తొడలమీదనుంచి జారి పోతూంది; పైకి తీయుటకుకూడా అతనికి ఓపికలేదు.

రెండు అద్భుతవిజయాలు ఆ పందెపుమార్గంమీదే సాధించాడు జటోపెక్. అక్కడే, యిప్పు డతను మిగిలిన బలమంతా ఉపయోగించాలి.

గమ్యస్థానం చేరుటకు ఇంకా 200 మీటర్లు పరుగెత్తాలి. మా భావాలన్నీ ప్రార్థనలుగా మారినవి.

"నువ్వు చివరవరకు సాగాలి, తప్పదు, ఎమిల్! మమ్మలను తలచుకో."

ఎమిల్ పరుగెత్తుతూనే ఉన్నాడు. ఇప్పుడు కణతల నొప్పి, కండరాలలో నొప్పి, పాదాలమీద బొబ్బలు మరచిపోయాడు.

ఫొటోగ్రాఫర్ల కెమెరాల చప్పుడు గట్టిగా వినబడుతూంది. కాని 100000 ప్రేక్షకుల అరుపులలో యిది అణగిపోయింది. ఒక వీరుని ధైర్యాన్ని గురించి ఈ వీరుడే ఏమిటి, మానవాళిలోని ధైర్యగుణాన్ని ప్రసంసిస్తూ బయలుదేరిన ఒక పాటలాగుంది, ఆ లక్షమంది ప్రేక్షకుల కోలాహలం. మానవుని మనోబలం అసాధ్య మనుకున్నదికూడా సాధించగలదని జటోపెక్ ఋజువుచేస్తున్నాడు. ఒకవారం రోజులలో యిది మూడవ అత్యద్భుత ప్రజ్ఞా ప్రదర్శనం.

"జటోపెక్! జటోపెక్!"

ఆశ్చర్యం, కృతజ్ఞత, ప్రశంసలతో ప్రేక్షకుల హృదయాలు నిండిపోయినవి.

పందెం చివరకు వచ్చింది. ఆ తెల్ల టేపు పిలుస్తూంది. ఎమిల్ విజయం సాధించాడు. దేనికొరకు అతను పోరాడుతున్నాడో, అతనికి తెలుసు. అతను సంతోషంగా ఉన్నాడు. చిరునవ్వు నవ్వుతున్నాడు.

నలుదె భాషలలో ప్రపంచ మూలమూలలకు ఈ మరువరాని విజయ గాధ రేడియోద్వారా ప్రసారమవుతూంది.

హర్ష ధ్వానాలు స్టేడియంలో ప్రతిధ్వనులు చేస్తున్నాయి. ప్రకటనాధికార్లు వారి మైక్‌లలోనుంచి మాట్లాడలేకపోతున్నారు. చెప్పిందే చెబుతున్నారు. ఆ ప్రియమైన పేరును మరల మరల ఉచ్చరిస్తున్నారు.

ఇళ్లదగ్గర, మా రేడియోలదగ్గర గట్టిగా అరవలేం; మాట్లాడలేంకూడా. మొఖాలు తిప్పేసుకుంటాం; తలలు వంచుతాం; చెమ్మగిల్లే కళ్ళను కనబడకుండా దాచుకుంటాం. ఒకరివైపు ఒకరం చూడమేమి? దేన్నిగూర్చి మనం సిగ్గుపడాలి? నీ కళ్ళల్లోనూ నీళ్లున్నాయి, నా కళ్ళల్లో, నీ కళ్ళల్లో. మనందరి హృదయాలు హర్షంతో ఆర్ద్రమయ్యాయి. గర్వం, ఆనందం, కృతజ్ఞతతో మనం నిండిపోయాం.

సైనిక ఆఫీసరు, జెక్ పౌరుడు ఎమిల్, మనందరికి బంధువయ్యాడు. ఆ వస్త్రా, ఆ నిక్కరుతోనే తన దేశస్థులదగ్గరకు పరుగెత్తుతాడు. తన దేశానికి తన సందేశాన్ని పంపమని ప్రకటనాధికార్లతో చెప్తాడు. మేమంతాకూడా ఆతనికి ౹లమిచ్చామని ఆతనికి తెలుసు.

ఎవరి సహాయం అక్కర్లేదంటాడు. కరడుగట్టిన అలసటంతా ఒక్కసారి ఆతనిని క్రుంగతీయవచ్చు. ఇంకా కొంచెం ఓపికపట్టాలి.

సోవియట్ స్త్రీ స్ప్రింటర్ యిలా పలకరించింది: "ఎమిల్! నీ పరుగు అద్భుతం."

ఆమె పళ్ళరసం తీసుకువచ్చి యిచ్చింది. కాని తాగకూడదని ఎమిల్‌కు తెలుసు. ఆమె ఒక నారింజపండు యిస్తూంది.

అందరికీ అమితమైన సంతోషం కలిగింది. అందరూ ఆతనిని అభినందించారు. తరువాత అందరి అభినందనలకన్న అందమైనది, డానాయిచ్చిన ముద్దు (దీనికొరకే ఫొటోగ్రాఫర్లు నిరీక్షిస్తున్నారు.)

ఎమిల్ వేళ: 2 గంటల 23 నిమిషాల 03 సెకండ్లు. మేరథాన్ పందెంలో కూడా ఉత్తమవేళను నిర్మించాడు, ఎమిల్. తన ప్రజలకు మరొక అద్భుతమైన బహుమానం యిచ్చాడు.

అర్జెంటైనా దేశస్థుడు కారోన్జ్ రెండవవాడుగా స్టేడియం ప్రవేశించాడు. ఆతనివేళ: 2 గంటల 25 నిమిషాల 25 సెకండ్లు. హర్షధ్వానాలు తుపానులాగ చెలరేగాయి. ఆతనిని అభినందించిన మొదటివ్యక్తి జటొపెక్. ఎమిల్, ఆతనిని కౌగలించుకొని ఆతని చేతిలో ఒక నారింజతొన పెట్టేడు.

జటొపెక్ యీ పందెంలో పాల్గొనకపోతే, ఒక విదేశీయుడు, కారోన్జ్ గెలిచేవాడే.

మూడవ స్థానం స్వీడ్ జాన్సన్‌ది. వేళ: 2 గంటల 26 నిమిషాల 07 సెకండ్లు. తరవాత తక్కిన వారందరూ ఒకరి తర్వాత ఒకరు, అందరూ అనుభవజ్ఞులు, ఖ్యాతి గాంచినవారు. అందరూకూడా ఎమిల్ మనోబలానికి లొంగిపోయారు.

ఛాయి (కొరియా) 2 గంటల 26 నిమిషాల 36 సెకండ్లు; కార్వొనెన్ (ఫిన్) 2 గంటల 26 నిమిషాల 41.8 సెకండ్లు, కార్బెరా (లండన్ విజయుడు) 2 గంటల 26 నిమిషాల 42.8 సెకండ్లు.

డొబ్రొనీ, పులాస్కా, ఇంగ్లీషు పందెగాడు ఐడెం, దక్షిణాఫ్రికావారు హోవార్డ్, లూటె, ఆస్లింగ్ (స్వీడ్) డైరీగాల్ (యు. యస్. ఎ.) కాడలిన్ (చిలీ) వాన్‌డీజాండీ (హాలండు), అస్లెన్ (నార్వే) మిక్కొహిటేనిన్ (1946 యూరోపియన్ వీరుడు) తర్వాత వచ్చినవారు. తరవాత, బెల్జియన్ దేవార్డ్రే, దక్షిణాఫ్రికా దేశీయుడు కేత్, సోవియట్ మాసాషెన్‌కోవ్ వచ్చారు. ఈతని వేళ లండన్‌లో కార్బెరా గెలిచినప్పటివేళకంటె తక్కువ. దీనిని ౹ట్టి పరుగు పరిమాణాలు ఎంతగా అభివృద్ధి అయ్యాయో బోధపడుతుంది.

ఇతరులకు తెలియనీయడంలేదుగాని, ఎమిల్ చాలా అలసిపోయినాడు. ప్రత్యర్థులతో పోల్చిచూస్తే అంత అలసటచెందినట్టు కనబడదు. కాని యిదివర కెప్పుడూ లేని అలసట అనుభవిస్తున్నాడు. అయినా అక్కడనుంచి కదలుటలేదు. ఆ గమ్యస్థానం దగ్గరే, వచ్చే ప్రతి ప్రత్యర్థినీ చూస్తూ వారిని పలకరిస్తూ, వారి అవసరాలు తెలుసుకుంటూ, వారికి వెచ్చనిదుప్పట్లు కప్పుతూ, వారికి పరిచర్యచేస్తున్నాడు. ప్రజ లడిగేప్రశ్నలకు జవాబిస్తున్నాడు. నోటినిండా చిరునవ్వులే. తన ప్రత్యర్థులతో స్నేహంగా మాట్లాడుతూ, ఒలింపిక్ నీతిని ప్రకటిస్తున్నాడు.

"విజయం గొప్పది, అంతకన్నా గొప్పది అందరిస్నేహం."

"జటోపెక్! జటోపెక్!" అనే పిలుపులు లక్షకంఠాలనుండి ఆకాశాన్ని చీలుస్తున్నాయి. అంతులేని హర్షపు కెరటం ఆతనివంకకు అదేపనిగా వస్తూంది. ఎంతోకాలం ఆతనినిగూర్చి మాట్లాడుకోవడానికి, అతని మూడువిజయాలు ప్రపంచ ప్రజలకు ఒక అవకాశం యిచ్చాయి.

విజయపీఠంవద్దకు, మొదటిముగ్గుర్ని ఆహ్వానించినట్టు లౌడ్ స్పీకర్లద్వారా తెలియవచ్చింది. ఆవేశంతో, మా జాతీయగీతం వింటున్నాం. 8 రోజులవ్యవధిలో 224 గంటలలో ఎమిల్ జటోపెక్ ఒలింపిక్ రికార్డు వేళలలో మూడు అద్భుతమైన విజయాలు పొందేడు. ఇప్పటికి జరిగినఒలింపియడ్లలో ఎమిల్ ఉత్తమపోటీదారు.

క్రీస్తుకు పూర్వం 776 వ సంవత్సరంలో స్టేడియం పందెం గెలిచిన గ్రీకు పోటీదారు కోరైబా పేరు ఇప్పటివరకు వింటూనేవుంటాం. పెంటాథ్లన్ పందెం గెలిచిన కోరిస్త పౌరుడు జెనోఫెన్నుగూర్చి కవులు, చరిత్రకారులు పొగడుతూనే ఉంటారు. హెల్సింకీ ఒలింపియడ్లో విజయం గాంచిన జటోపెక్ పేరు క్రీడల చరిత్రలో ఒక సువర్ణాధ్యాయంగా చేరిపోతుందా? తప్పక చేరాలి! మనదేశంలోనే కాదు, యావత్ప్రపంచంలోనూ ఎమిల్ విజయాలు మూడూ, రేకెత్తించిన హర్షధ్వానాలు ప్రతిధ్వనిస్తున్నవి; ఈ మూడింటిలో విలువైనది ఆఖరుది.

పందెగాడుగా యిదివరకెవ్వరూ అందుకోని శిఖరాలనందుకున్నాడు, ఎమిల్. ఉత్తమ వ్యక్తిగా శాంతి ప్రియులైన ప్రజా బాహుళ్యపు హృదయాలను వశం చేసికొన్నాడు.

స్వదేశంలో ఆటగాండ్రేకాదు, కార్మికులుకూడా ఆతనినే ఆదర్శంగా పెట్టుకొని, వారి పనులలో ఉత్తమ పరిమాణాలు తెస్తూ, దేశంలో సామ్యవాద తత్వం వేగంగా ప్రచారం కావడానికి తోడ్పడుతున్నారు. ఆవిధంగా యీ రంగంలోకూడా ఎమిల్ విజయాలు ఫలవంతములైనవి.

# డా నా

మన కథ హద్దులను దాటకుండా, జటోపెక్ భార్య డానాను గూర్చికూడా కొంత తెలిసికోవడం న్యాయం.

కొందరు అనుకున్నట్టుకాక, ఎమిల్‌కు డానా అంటే ఎక్కువ అభిమానం. ఆమె అతని జీవిత భాగస్వామిమాత్రమే కాదు; క్రీడలలోసహకారి. అతనికి సమయానికి ఆత్మవిశ్వాసం కలగచేస్తుంది. ధైర్యం కలగజేస్తుంది. ఉత్తమ విజయాలకు అతనిని ప్రేరేపిస్తుంది.

ఆమె ఒకసారి ఇలా అన్నది:

"ప్రతి పెద్ద పందెంలోను అతని ప్రక్కనే ఉన్నాను నేను. అతని ప్రక్కన భౌతికంగా లేకపోయినా, నా ఆత్మ అతని ప్రక్కనే ఉంటుంది. అతనితోపాటు అన్ని అలజళ్లు, అన్ని యిబ్బందులు, అన్ని బాధలు అనుభవిస్తాను. అతను బాధ బాధపడితే నేనూ బాధపడతాను: అతను పోరాడుతూంటే నాలో ఉన్న మనోశక్తి నంతనూ అతనికి అందిస్తాను.

"నే నాతని ప్రక్కనున్నానని ఎమిల్‌కు తెలుసు; ముఖ్యంగా అతనిలోని బలం క్షీణించి ఆఖరుదశకు వచ్చినప్పుడు, అతని మహత్తర ప్రదర్శనంలో నాకుకూడా భాగముందని అత నన్నప్పుడు నాకు యెంతో సంతోషంగా ఉంటుంది."

చిన్నప్పటినుంచి డానాకు ఆటలమీద అభిలాష. గ్రామర్‌స్కూలులో ఆమె ప్రదర్శనలు అసాధారణమని గుర్తించబడినవి. ఒక్క ఆటలలోనే కాదు, చదువులో కూడా తెలివితేటలు కనబరచేది. 'ఎథ్లెటిక్స్'లో ఇతర పిల్లలను ఓడించేది. వాలీబాల్, హాండ్‌బాల్ ఆటలలో ప్రజ్ఞచూపించేది. బాగా యీదుతుంది. జిమ్నాస్టిక్స్ చేస్తుంది.

అలాగే, లాటిన్ భాషలోను, ప్రకృతిశాస్త్రంలోను అభిలాష ఎక్కువ.

చిన్నతనంలో "అమ్మా! హాండ్‌బాల్ ట్రెయినింగవుతున్నాం. అందుచేత ఆలస్యంగా వస్తాను" అంటూ వుండేది డానా, తల్లితో.

హేండ్‌బాల్‌కు తన జీవితం అర్పిస్తుంది. తనతోటి ఆటగాండ్ర మధ్య ఆమె కున్న ఆనందం మరెక్కడా ఆమెకు లేదు. ఇక్కడ, యీ చిన్న హేండ్‌బాల్ క్లబ్బులోనే ఒక క్రొత్త ప్రపంచంమీద తెర తొలగింది. ప్రపంచమంతా గులాబీ రంగులతో నిండి లేదని, కఠినమైన పని చేస్తేనేగాని కొంత విశ్రాంతికి అవకాశ మేర్పడదని ఆమె మొదటిసారి గ్రహించింది. ఈ వ్యూహం హేండ్‌బాల్ ఆటగాండ్ర నందర్ని సన్నిహితం చేసింది. వారికోసం డానా అగ్నిప్రవేశానికికూడా జంకదు.

ఆటస్థలంలో యీ ఐకమత్యం అందర్నీ ఆకర్షించింది. అజ్ఞాతంలోనున్న హేండ్‌బాల్ ఆటగానిని ముందుకు తీసుకువచ్చింది. హేండ్‌బాల్ జట్టుకు విజయం

తర్వాత విజయం చేకూరింది. డానా, ఆటలో తన శక్తిని రక్షించుకుంటూ, దాడిచేయు గల శక్తికల ధీరవనిత.

ఆమె ఎథ్లెటిక్స్‌కు చాలా ఆలస్యంగా వచ్చింది. అయినా ఆలస్యమనేది లేవనడానికి ఆమె తార్కాణం. ఆమె జావలిన్ చేత ధరించేసరికి 23 సంవత్సరాల వయసు. జావలిన్ విసురుటలో ప్రావీణ్యం సంపాదించేసరికి యింకా ఆలస్య మయింది. హేండ్‌బాల్ జట్టునుండి దూరమయిపోవుట ఎంతమాత్రం ఆమెకు యిష్టం లేదు. అదీకాక వారి గ్రామంలో అవకాశాలుకూడా తక్కువ.

జావలిన్ విద్యలో ప్రావీణ్యం సంపాదించి, పందేలలో విజయం సాధించిన తర్వాతకూడా, హేండ్‌బాల్ ఆటమీదే ఆమె అభిమానం. ఈరోజు ఆమె తన స్వస్థలానికిపోతే ఒకసారి హేండ్‌బాల్ ఆడితేనేగాని, ఆమెకు తోచదు. ఆటలరుతువు లకు మధ్య, యీ ఆట ఆడితే మంచి తయారీలో ఉండవచ్చునని ఆమె అభిప్రాయం.

డానా - ఎమిల్‌ల దాంపత్య జీవితాన్నిగూర్చి ముందు అధ్యాయాల్లో చెప్పే ఉన్నాను. ఎమిల్ ప్రదర్శనలమీద డానా ప్రభావం ఉన్నట్లే, డానా ప్రదర్శనల మీద ఎమిల్ ప్రభావంకూడా ఉంది. సరియైన ట్రెయినింగు లేనిదే విజయాలు సాధించుట కష్టమని ఎమిల్, డానాకు నచ్చచెప్పేడు. మానసికశక్తి ఎంత ప్రధానమో కూడా డానాకు తెలియజేశాడు. ట్రెయినింగులో యీ శక్తియొక్క అవసరం నొక్కి చెప్పేడు. వాతావరణం ఎలాగున్నా, ప్రతిరోజూ ట్రెయినింగు తప్పకూడదు. జీవిత సౌఖ్యాలనుకూడా త్యజించవలసి ఉంటుంది.

ట్రెయినింగు విషయంలోనూ, పోటీల విషయంలోనూ కొన్ని నిశ్చితమైన ఉద్దేశాలుండాలి. ఆ ఉద్దేశాలు వ్యక్తియొక్క సామర్థ్యానికి మించి ఉండకూడదు. ఉద్దేశాలు నెరవేరుతాయన్న విశ్వాసముండాలి. వాని నిర్వహణకు శక్తివంచన లేకుండా కృషిచేయాలి.

"డానా! 40 మీటర్లు విసరాలంటే, అది సాధ్యమనే విశ్వాసముండాలి నీకు."

"డానా! 46 మీటర్లు నీవు విసరాలంటే, అది నెరవేరుటకు నీ యావత్తు మనోబలాన్ని ఉపయోగించాలి."

"డానా 50 మీటర్లకు విసరాలనా నీ ఉద్దేశం. నీ మనస్సులో రోజుకు 100 సార్లు ఆ పరిమితిని దాటి విసరాలి. ఆ భావం నీ యావత్తు మనస్సును నిండి ఉండాలి." ఇలా శిక్షణ గరపుతూ వుండేవాడు, ఎమిల్.

ఒక క్రొత్త కార్యం సాధించే ముందు యిద్దరికీ యిదీ సంభాషణ. ఎమిల్‌కు సాంకేతిక విషయాలు అంతగా ప్రధానం కాదు.

డానా ఎమిల్ అభిప్రాయాన్ని స్వీకరించి, అనుసరించేది. ఎప్పుడూ అలా అనుసరించినందుకు విచారించలేదు. ఆమెకు శిక్షణ ప్రతినిత్యం పరిపాటయింది. ఆమె అద్భుత ప్రదర్శనలు ఎమిల్ సలహాకు నిదర్శనాలు.

డానా జావలిన్ విసరుటలో ఎప్పుడు, ఎలా అభిలాష చూపింది?

అది 1946 వేసవి. వ్యాయామశిక్షణ విద్యాలయంలో యింకా డానా విద్యార్థిని. ఎథ్లెటిక్స్‌లో శిక్షణ కామె నక్కడకు పంపారు. ఇప్పటివరకూ, హేండ్ బాల్ ఆడుతూండేది. ఎథ్లెటిక్స్‌లో ఆమెకు ప్రత్యేక అభిమానం లేదు. ఇక్కడకూడా వీలయితే సాయంత్రం బంతి ఆట ఉంటే ఆమెకు చాలా సంతోషం. ఆమె బంతిని తీసుకొని ప్రత్యర్థుల మధ్యనుంచి దాటుకొని, తప్పించుకొని పోతూంటే ఆమె సౌందర్యం, చాకచక్యం అద్భుతంగా ఉంటుంది. తన జట్టువారు బంతిని తన దగ్గర నుండి తీసుకొనడానికి ఉబలాటపడేవారు గాని వీలులేకపోయేది.

ఒంటరిగా కాలక్షేపం చేయుట ఆమెకు బాగా తెలుసు. బంతి వెంట్రుక వాసిలో చెట్టు మొదలునుండి అవతలకు పంపించుట ఆమె ప్రత్యేకత. ప్రతిసారీ ఆమె దీనిని చేయగలదు. అందుచేత ఛాంపియన్‌షిప్ పందేలలో డానా ప్రమాదకరమైన ప్రత్యర్థినిగా భావించబడేది.

చదువులో చాలా చురుకుతనం చూపింది. డానాలో హాస్యరసంకూడా ఉంది. చాలా పాటలువచ్చు. వినోదకరమైన ఒక క్రొత్త భావాన్ని ప్రచారం చేయుటకు ఆమె తర్వాతనే.

జావలిన్ విసరుటలో ఆమె ప్రావీణ్యం అనుకోకుండా తెలిసింది. ఆమె శిక్షణ కార్యక్రమంలోకూడా ఇదొక అంశమంటారు. డానా ఏ విధమైన భావం కలిగించలేకపోయింది. ప్రావీణ్యం ఉందనిగాని, లేదనిగాని చెప్పలేం. సరియైన ఫక్కీలో జావలిన్ పట్టుకొనగలుగుటే కష్టమైపోయింది. చిన్నని చేతితో జావలిన్ విసరుట కలవాటుకాలేదు (ఇప్పటికికూడా ఆమెలో అదే లోపం).

అది కాకుండా, తన శక్తినంతా ఉపయోగిస్తుంది. సాంకేతిక విషయాలను గురించి ఆమెకు ఆలోచించుటకే వీలులేదు.

అభ్యాసం అయిపోయింది. ఉపాధ్యాయుడు జావలిన్‌ల కట్ట పట్టుకొని పోతున్నాడు. అందులో ఒక జావలిన్ కనబడలేదు. వెనక్కు తిరిగి చూచేసరికి ఏం చూశాడు!

డానా జావలిన్ దొంగిలించింది. దాన్ని తన యిష్టం వచ్చినట్టు విసురుతూంది. ఫౌంటెన్ పెన్ పట్టుకున్నట్టు పట్టుకుంది. చేయివంచి విసురుతూంది. అదృష్టవశాత్తు ఆమె చెవి చీరుకుపోలేదు.

అయినా ఆ ఉపాధ్యాయుడు ఆమెను వారించకుండా చూస్తున్నాడు. ప్రతి సారి 30 మీటర్లదూరంలో గడ్డిలో గుచ్చుకుంటుంది, జావలిన్.

ఇక్కడే భవిష్యత్తులో ఒక ఒలింపిక్ విజయం సాధించే వ్యక్తి బయలుదేరిందన్న మాట.

ఈ హేండ్ బాల్ ఆటకత్తెలో ఒక అసాధారణ ప్రజ్ఞ గుప్తమై ఉందని స్పష్టం.

మొదట, జావలిన్ విసరుటలో శాస్త్రసంబంధమైన జ్ఞాన సంపాదనకు ఆమె కుతూహలం చూపలేదు. హేండ్ బాల్ జట్టు కిదేమి ఉపయోగమనుకుంది. కాని రాను

శాము, యీ ఆటలో ఎక్కువ ప్రజ్ఞ సాధించుట కవకాశముందని గ్రహించింది. అప్పటినుండీ, యీ రంగంలో ఆమె అందరిసలహాను కోరేది, స్వీకరించేది.

త్వరగా ఆమె అసాధారణ బుద్ధిబలం యిందులో ప్రకాశించుట ప్రారంభించింది. ఉపాధ్యాయుడు ఏ విషయంకూడా రెండుసార్లు చెప్పవలసిన అవసరం ఉండేదికాదు.

డానా త్వరగా అన్ని విషయాలు గ్రహించింది. వారి పాఠశాలా క్రీడోత్సవంలో పాల్గొని 34·70 మీటర్లు విసిరి, మొదటి బహుమానం పొందింది.

విద్యాభ్యాసం పూర్తిచేసి ఉత్తమ ఆదర్శాలతో, ఉద్దేశాలతో, సత్సలహాలతో, ఫొటోగ్రాఫులతో, ట్రెయినింగు పథకాలతో, ఒక కొత్త జావలిన్‌తో డానా విద్యాలయం వదిలింది.

ఆమె కున్న తెలివితేటలవల్ల మొదటి ఛాంపియన్‌షిప్పులలో పాల్గొనగలిగింది. ఆమె శిక్షణ అయిపోయిన 14 రోజులకల్లా 35·64 మీటర్లు విసరగలిగింది. నేషనల్ ఛాంపియన్ షిప్పుల రికార్డుకు దగ్గరగా వచ్చింది. రికార్డు: 36·50 మీటర్లు.

ఆ రోజులలో స్త్రీలు యీ ఆటలలో పాల్గొనుట అరుదు. జావలిన్ విసరుట మరీ అరుదు. ఒక అజ్ఞాతస్త్రీ యింతటి ప్రావీణ్యం సంపాదించిందా అని, ఆశ్చర్యంతో ప్రజలు చెవులు నిక్కబెట్టుకొని వినుటకు ప్రారంభించారు.

రాష్ట్రిలలో నివసించుటవల్ల పోటీలలో ఒక సంవత్సరం వెనకబడిపోయింది, డానా. అది ఏలా జరిగిందో పాఠకులు ఊహించుకోగలరు. ఒక జావలిన్ పట్టుకొని ఊరు బయటకు అభ్యాసం నిమిత్తం ఒక యువతి వెళ్ళితే యిరుగుపొరుగువాళ్లు, బంధువర్గం నానామాటలు అనుట ఆచారం. ఆమె ఏదో తప్పుపని, పిచ్చిపని చేస్తూన్నట్టు అందరిభావన. అందుచేత జావలిన్ విసరుటయందు ఎక్కువ అభిలాషలేనివారు, ఆ ఆటను త్యజించుటలో ఆశ్చర్యంలేదు. డానాకు హేండుబాల్ ఆటయందు యింకా మోజుపోలేదు. 40 మీటర్లు విసరినా జావలిన్ గడ్డిలో గుచ్చుకోకపోతే, విసరిన వ్యక్తికి ఎంత విసుగుగా ఆశాభంగంగా ఉంటుందో ఆలోచించండి. గడ్డిలో గుచ్చుకోకుండా భూమిమీద పడివుంటే ఆ విసురు లెక్కలోనికిరాదనే విషయం అందరికీ తెలిసినదే.

ఒకపథకం ఒకరి సలహా లేకుండా శిక్షణకు ప్రయత్నిస్తే దాని ఫలితమింతే.

ఆరోజులలో డానా యీ అభ్యాసం వదిలివేయుటకు ప్రయత్నంచేసింది. 1947 లో ఆమె ఛాంపియన్‌షిప్ గెలిచిన మాటనిజమే గాని, ఆమె ప్రదర్శనం అంత బాగుండలేదు. జావలిన్ 32.36 మీటర్లుమాత్రమే పోయినది. పోటీలలో ఆమె అయిష్టంగా నేపాల్గొన్నది. అప్పుడప్పుడు పోటీలకు ఆహ్వానం అంగీకరించేది. పాయింట్లను గెలుచుటకు ఆమెను ఆహ్వానించేవారు. హైజంపులో, డిస్కస్‌త్రోలో, 100 మీటర్ల పందెంలో రాష్ట్రీయపోటీలలో ఆమె సాధారణశ్రేణికి పైన ఉండేది.

ప్రత్యేకంగా డిస్కస్‌త్రో అంటే ఆమెకు ఎక్కువ యిష్టం ఒకప్పుడు జావలిన్‌కంటే దీనిమీదే ఎక్కువ మక్కువ వుండేది. ఎందుచేతనంటే, డిస్కస్ గడ్డిమీద ఎలాపడినా యిబ్బందిలేదు.

ఒకసారి పోలెండుకు ప్రయాణం నిశ్చయమైనప్పుడు, ఆమె శిక్షణమీదఎక్కువ శ్రద్ధ చూపుట మొదలుపెట్టింది. ఆ పర్యాయం క్రేకోపట్టణంలో మంచి ప్రదర్శన మిచ్చింది. 36.05 మీటర్ల విసరుటతో ఆమె జాతీయ రికార్డుకు కొంచెమే వెనక బడింది. మొదటి అంతర్జాతీయ పోటీలో విజయం ఆమె ఆశలను రేకెత్తించింది.

జయప్రదంగా జావలిన్ విసరుటలో ప్రజ్ఞ చూపించుటకు డానాకు ఒక అవకాశం ఉంది. ఆమె కొన్ని సాంకేతిక లోపాలను సవరించుకొని, ప్రతినిత్యం శిక్షణ పొందవలసివుంది.

హేండ్ బాల్ పట్ల ఆమెకు అభిలాష. చాలా విచారంతో, తన జట్టు మిత్రుల వద్ద ఆమె సెలవు తీసుకుంది. ఆ తరువాత సంవత్సరం లండన్‌లో జరిగే ఒలింపిక్ పోటీలలో పాల్గొనుటకు తయారు కావలసివుంది. 40 మీటర్లు విసరుట దుర్లభమయిన పనికాదు; ఏమయినా అభ్యాసం చేయవలసిన అవసరంమాత్రం ఉంది.

డానా - ఎమిల్‌ల జంట, ఒకరినొకరు ఎక్కువగా తెలిసికొంటున్న సమయం లోనే ఒలింపిక్ పందేలకు శిక్షణను తీవ్రం చేయవలసి వచ్చింది. ఎమిల్ ఆదర్శం, తన దేశానికి ప్రతినిధిగా పోరాడాలన్న కుతూహలం, ఆమెను తీవ్రమైన కృషికి పురిగొల్పాయి.

ఆమెను జయం వరించింది. లండన్ వెళ్లేవారికి పరీక్షలుగా పరిగణించబడ్డ నేషనల్ ఛాంపియన్ షిప్పులలో 40 మీటర్ల దూరం విసరింది. నేషనల్ రికార్డును భగ్నం చేయుటేకాక, లండన్‌కు టికెట్టు సంపాదించింది, డానా.

అదొక అద్భుతమైన ప్రయాణం. విమానంలో డానా, ఎమిల్ ప్రక్కన కూర్చొంది. ఆమె జావలిన్‌లను ఎమిల్ జాగ్రత్తపరచేడు. లండన్‌లో స్త్రీలను పురుషులకు దూరంగా ఉంచారు. అందుచేత ఒకరొకరు అరుదుగా కలుసుకొనే వారు.

డానా, విదేశాలలో పోటీలలో పాల్గొనడం ఇది రెండవసారి. మొదటిది క్రేకో నగరంలో. రెండవది ఈ ఒలింపిక్ పోటీ.

మొదటి తరగతి పోటీలో డానా పాల్గొనుట కిదే ప్రథమం.

ఆమె ఆటలో ప్రారంభదశలో మాత్రమే ఉన్నది. అదీకాకుండా, ఉష్ణ వాయువులనుంచి ఆమె బాధపడింది. అలసిపోయింది. బలహీనంగాకూడా ఉంది.

అయినా అందరూ అనుకున్నకంటే ఆమె బాగానే నిర్వహించింది. ఇదివరకటి ఆమె ఉత్తమ ప్రదర్శనానికి దరిదాపుగా వచ్చింది. 39.64 మీటర్ల దూరం విసరింది. ఆమె 7 వ స్థానానికి వచ్చింది. చివరి ఘట్టంవరకు 4 వ స్థానంలో ఉంది. అంత్య పోటీలో ముగ్గురు ఆమెను వెనక్కు త్రోసేరు.

సోవియట్ పోటీదార్లు హాజరు కాకపోవుటతో, ఇదివరకటి ప్రపంచ రికార్డు స్థాపించిన ఆస్ట్రియా దేశస్థుడు హెర్మ్మాబౌమా బంగారు పతకాన్ని గెలిచాడు. అతనిదే ఒలింపిక్ రికార్డు 45.47 మీటర్లు.

జావలిన్ విసరుటలో అభ్యాసం తీవ్రం చేయాలనే కృతనిశ్చయంతో డానా యింటికి తిరిగి వచ్చింది. ఈసారి ఆమెది 7 వ స్థానం. ఇంక 4 సంవత్సరాలలో ప్రపంచానికి తన ప్రజ్ఞ చూపించుటకు నిశ్చయించుకుంది.

తిరిగివచ్చినవెంటనే జాగ్రత్తగా శిక్షణ ప్రారంభించింది. కొద్దికాలంలోనే జాతీయ రికార్డుపై అభివృద్ధి చూపించింది. సెప్టెంబరు 12న వియాన్నాలో 40.56 మీటర్లు విసిరింది.

1949 ఆటలపోటీలకు క్రమశిక్షణతో తయారయింది; మంచి ఫలితాలకొరకు ఆశించింది. ఈ శిక్షణ ఆమె శక్తిని హెచ్చించింది, అభివృద్ధికి పునాదిపడింది.

ఈ సమయంలోనే జటోపెక్ సహచరిగా ప్రేగ్‌నగరానికి వచ్చింది, డానా. ఇక్కడ అభ్యాసానికి ఎక్కువ అవకాశాలు ఉన్నాయి. మంచి ఉపాధ్యాయులు కూడా ఇక్కడ లభ్యమయ్యారు.

ఆమె శారీరకబలంకూడా వృద్ధికావాలి. చలికాలంలో ఆమె పురుషుల జావలిన్‌తో అభ్యాసం చేసింది. దాని బరువు 1200 గ్రాములు. దానితో వందలసార్లు విసరుట అభ్యాసం చేసుకొంది. దీనివల్ల ఆమె కండరాలు బలిసినవి. అందుచేత 'విసరే వాళ్ళభుజం' అనే జబ్బుతో ఆమెబాధ పడలేదు.

వసంతకాలంలో ఆమె పరుగెత్తుట, ఉరుకుట అభ్యాసంచేసింది. దానితో ఆమె ట్రెయినింగు పూర్తిఅయింది.

అన్నిరంగాలలోను ఆమె నిర్వహణ, సాధన హెచ్చింది. ప్రతి పోటీలోనూ అభివృద్ధి చూపగలిగింది.

ఆ ఆటల ఋతువులో ఆమె కపజయమనేదే లేదు. జాతీయరికార్డును అనేక సార్లు భగ్నమొనర్చింది.

19. VI క్రాకోలో 42 మీటర్లు
16. VII బ్రూనోలో 44.02 మీటర్లు
4. IX కాశీసోలో 45.27 మీటర్లు.

సెప్టెంబరు ఆఖరుకు, బుఖారెస్టులో జరిగిన అంతర్జాతీయ పోటీలో పాల్గొంది. ఆమె పద్ధతికి బాగా మెరుగు వచ్చింది. పరుగెత్తి విసరుట ఆమెకు ఎంతో సులభ సాధ్యమైంది. ఆమె 46 32 మీటర్ల ప్రదర్శనం, ఆమె పరిచితులకెవ్వరికి ఆశ్చర్యం కలిగించలేదు. డానా అత్యుత్తమ ప్రదర్శనంతో ఆ ఆటలకాలం సమాప్తమయింది. సోవియట్ పోటీదార్ల తర్వాత, ప్రపంచ విఖ్యాతులలో 5 వ స్థానం ఆమెకు లభించింది.

1950 ఆటల ఋతువుకొరకు ఆమె ఆశతో ఎదురు చూస్తోంది. బ్రసెల్సులో జరిగే అంతర్జాతీయ పోటీలలో తన ప్రజ్ఞ చూపించదలచింది. కాని దురదృష్టవశాత్తు పరిస్థితులు మారినవి.

ఆ వసంతంలో నల్లసముద్రంమీద, సోచీతీరపు ప్రదేశంలో సోవియట్ క్రీడా సంఘ అతిథులుగా ఎమిల్, డానాలు కొన్ని సుఖదినాలు గడిపారు,

జావలిన్ విసరే సోవియట్ ఉపాధ్యాయునితో ఆమె కక్కడ పరిచయమయింది. ఆమె అతనివద్ద ట్రెయినింగు పద్ధతులలో తరిఫీదయింది. ప్రపంచ రికార్డు సృష్టికర్త స్మిర్నిట్స్కియా చాలా కఠినమైన తరిఫీదు పొందినది. ఆమె బరువులను ఎత్తి విసురుతుంది. తన బలాన్నంతా ఉపయోగించుటకు ఒక యినుప కడ్డీతో శిక్షణ పొందుతుంది. ఈ కడ్డీ ఒకటిన్నర మీటర్ల పొడుగుంటుంది; దాని బరువు 10 పౌన్లు. మోకాలు వంచి, యీ కడ్డీని స్మిర్నిట్స్కియా విసురుతుంది. ఈ విధంగా చేస్తే కాళ్లకు పని ఉండదు. పని అంతా శరీర పైభాగందే. శిక్షణలో ముఖ్యసూత్ర మది. విసిరినప్పుడు సోవియట్ స్త్రీలు తమ శరీరమంతా విసరే మార్గంవైపే నిలుపుతారు. డానాకు ఈ పద్ధతి అనుకూలం కాదు. ఫిన్నిష్ పద్ధతి ఆమె కిష్టం.

1950 ఆటల ఋతువులో ప్రథమ పోటీలలో డానా అంతగా ప్రావీణ్యం చూపలేకపోయింది. పోలండ్‌లో జరిగిన అంతర్జాతీయ పోటీలో ఆమె సులువుగా విజయం పొందింది. 42.22 మీటర్ల విజయం ఆమెకు సంతృప్తి కలిగించలేదు. ఆమె హంగరీ పోటీలో 48.43 మీటర్లు విసురుట అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ఇది ఆమె 'ట్రాక్' దుస్తులలో ఉండగానే మొదటి 'రౌండ్' లోనే జరిగింది. ఆమెకే యిది ఎంతో ఆశ్చర్యం కలిగించింది. జావలిన్ ఎగిరెగిరి 'రికార్డు' మార్కును దాటి గుచ్చుకుంది. ప్రపంచ స్థానాలలో యిది 4 వ స్థానం ఆమెకు లభింపజేసింది.

యూరోపియన్ ఛాంపియన్‌షిప్పులకు, ఆమె ఆశాపూరిత హృదయంతో వెళ్ళింది. కాని, ఆశాభంగం కలిగింది. ఆమెకు జలుబుచేయుటమూలాన బలం క్షీణించింది. అదీకాకుండా, నిర్వాహకులు ఆమెకు 'సప్లయి' చేసిన జావలిన్లు గట్టిగా ఉన్నాయి. 41.34 మీటర్లతో 3 వ స్థానం ఆమెకు లభించింది.

1951 వ వసంతంలో ఆమెకు జబ్బుచేసింది. అయినా పోటీలో గెలిచింది. 48.01 మీటర్లు విసర గలిగింది.

ఒక నెల తర్వాత బుడాపెస్టులో ఒక పోటీలో పాల్గొంది. తాను అత్యుత్తమ తరిఫీదులో ఉన్నదనుకుంది. వాతావరణం, పరిసరాలు ఆమెకు అనుకూలంగా ఉన్నాయి.

ప్రతిసారి ఆమె ప్రదర్శనంలో అభివృద్ధి కనబడింది. ఆఖరుకు ఆమె అద్భుత ప్రదర్శన మిచ్చింది. 49.90 మీటర్లు విసరింది.

ఇది బాంబు ప్రేలినంత పనిచేసింది. సోవియట్ స్త్రీ పోటీదార్లకు భీతికలిగించింది. అంటే, ఆమె ప్రదర్శనం అద్భుతశ్రేణికి ఎగసిందన్నమాట.

ఆమె శిక్షణను యింకా తీవ్రంగా చేయుట మొదలుపెట్టింది. ఒక్కరోజు కూడా ట్రైయినింగు మానలేదు. నవంబరు 1 వ తేదీనుంచి వాతావరణస్థితి ఎలాగున్నా, జావలిన్‌తో ఆమె కనబడేది. ఒక్కసారైనా, నాలుగు గోడలమధ్య ఆమె ట్రైయినింగు అవలేదు. క్రిస్మస్‌లో, పర్వతప్రాంతాలలో కొంత విశ్రాంతి తీసుకుంది. ఫిబ్రవరిలో కొంత బలం చేకూర్చుకుంది. ఆ తర్వాత ఆటల వేళవరకు తీవ్రంగా అభ్యాసం చేసింది. పోటీకి ముందు 3 వారాలుమాత్రం తీవ్రత తగ్గించింది.

శీతకాలంలో శరీరస్థితిని శక్తివంతం చేసికొనేందుకు ప్రయత్నించింది. చిన్న పరుగులు, హైజంపులు ఆమె అనుదిన కార్యక్రమం.

4 కిలోబరువులు విసరుటకుకూడా ప్రయత్నించింది. పర్వతాలలోకూడా ప్రతిరోజూ ఆమె ఇనపకడ్డీలను విసరుట అలవాటు చేసుకొన్నది. ఇవి 30 సెంటీ మీటర్ల పొడుగు, రెండున్నర పౌండ్లబరువుకలవి. ట్రెయినింగు వేళలలో సుమారు 50 సార్లు బలమంతా ఉపయోగించి విసరేది. మామూలుగా పరుగుతో, ఒక్కొక్క సారి 40 మీటర్లు విసరేది.

సాయంకాలం 'పుల్లు ఎక్స్‌పాండర్'తో అభ్యాసంచేసేది. ఈ అభ్యాసంమీద ఎమిల్ శ్రద్ధచూపి సరిగా చేస్తుందో లేదో పరీక్షించేవాడు.

జటోపెక్ యింటి హాలులో ఒక స్వీడిష్ నిచ్చెన, ఎక్కేతాడు ఉన్నాయి. డానా కొరకు ఎమిల్ వీనిని తయారుచేయించాడు. ఆటల కుటుంబంలో చాలా ఉపయోగమైంది.

డానా, ఎమిల్ ఇద్దరూ క్రిస్మస్ సెలవులు పర్వతప్రాంతాలలో గడిపారు. అనవసరంగా ప్రమాదం వచ్చిపడుతుందేమోనని ఎమిల్, 'స్కీయింగ్'చేయలేదు. దట్టమైన మంచులోమాత్రం పరుగెత్తుతూండేవాడు. డానాను పర్వతంమీదనుండి పొడుగాటి తాటితో పైకిలాగి, క్రిందికి దింపుతూండేవాడు. ఇలాగ చేస్తూన్నప్పుడు డానా ఒకసారి క్రిందపడిపోయింది. భుజం ఎముకలు జారిపోవుటవల్ల చెయ్యి వ్రేలాడిపోయింది. అంతగా నొప్పివల్ల కాకపోయినా, ఒలింపిక్ పందేలలో అవకాశం పోయిందికదా అని ఎంతగానో ఏడ్చింది. జావలిన్ విసరేవాళ్ళకు భుజం కదిలిపోయిందంటే ఎంత ప్రమాదమో చెప్పాలా ? అకస్మాత్తుగా డానా నవ్వింది. ఎమిల్‌కు ఆశ్చర్యంవేసింది. దేవుడా, 'యిది ఎడంచెయ్యేకదా !' అనుకుంది. అయినా దీనివల్లకూడా ట్రెయినింగుకు అంతరాయం కలుగుతుంది. కొద్దిరోజులలోనే అనుదిన అభ్యాసంలోకి దిగింది. హెల్సింకీ ఆశలు మళ్ళీ చిగిర్చాయి. పరిస్థితులు సానుకూలంగా ఉన్నాయి. కాని, ఒలింపిక్ అభ్యర్థులు ఎంత జాగ్రత్తగావుండాలో రుజువయింది.

ఫిబ్రవరిలో డానా ప్రత్యేకపు ట్రెయినింగులోకి దిగింది. ప్రారంభంలో జావలిన్ అతి జాగ్రత్తగా విసరేది; వారానికి రెండుసార్లు పురుషుల జావలిన్‌తో అభ్యాసం చేసేది.

ట్రెయినింగ్ సమయంలో 50 మీటర్లు 10 సార్లు అతి వేగంగా పరుగెత్తేది. పరుగుకు, పరుగుకు మధ్య 150 మీటర్లు నడచేది.

ఫిబ్రవరి అంతంలో 'స్టాటు హాఫ్డింగులు' అభ్యాసం చేసింది. ఈ కార్యక్రమం మే నెల అంతంవరకు సాగింది.

ఏప్రిల్లో, డానా 40-50 సార్లు విసరుట అభ్యాసం చేసింది. ఒక్కొక్కటి 40 మీటర్ల పొడవు. 6-10 సార్లు పూర్తి బలంతో విసరేది.

ఏప్రిల్ చివరకు ఆమె సాధారణంగా 45 మీటర్లు విసరేది. కీవ్‌లో 46 మీటర్లే. జాతీయ ఛాంపియన్‌షిప్పులలో 46.62 మీటర్లతో గెలిచింది. ఏదైనా పోటీ

ఉన్నప్పుడు, ట్రెయినింగు కార్యక్రమం మార్చివేస్తుంది. 14 రోజులలో విసురులు 60 వరకు హెచ్చించి నెమ్మదిగా 20 కి తగ్గిస్తుంది.

ఈ విధంగా డానా తన జీవితంలోకల్లా పెద్ద పందెమైన ఒలింపిక్ పోటీకి ట్రెయినింగయింది.

జాతీయ ఛాంపియన్‌షిప్పుల తరవాత, ఆమె కొంచెం అలసిపోయింది. కొంత విశ్రాంతి కోరింది. దక్షిణ బొహీమియాలో హైజంపు ఛాంపియన్ మోడ్రబోవాతో. కొన్నిరోజులు గడపింది. అట్టే ట్రయినింగు కాలేదు. వారు యీత, బోటుషికార్లు, ఆతపస్నానంచేస్తూ కాలం గడపినారు. పూర్తిగా విశ్రాంతి తీసుకొని, క్రొత్త బలంతో డానా హెల్సింకీకి చేరుకుంది. ఆమె ఆటపద్ధతులను మెరుగువచ్చింది. మంచి తయారీలో ఉంది. 1.45 మీటర్లు (4 అడుగుల 9 అంగుళాలు) హైజంపు చేయగలదు; 16 అడుగుల 5 అంగుళాలు 'లాంగ్ జంప్' చేయగలదు. 12 మీటర్లు బరువు విసరగలదు. జావలిన్ 46 మీటర్లు పంపగలదు; ఒక్కొక్కప్పుడు 46.80 మీటర్లవరకు విసరగలదు. ఇదంతా నాలుగురోజులకు పోటీ జరుగుతుందనగా.

ఇది శుభసూచకం. సాధారణంగా ట్రయినింగులోకంటే పోటీలో 4 మీటర్లు ఎక్కువ విసురుతుంది. ప్రతి విసురుకు మనస్సు కఠినంగా కేంద్రీకరించాలి. ట్రెయినింగులో యిది కష్టం. ట్రయినింగులో విసురులు తక్కువదూరం పోవుటకు యిదే కారణం. 50 మీటర్లవరకు విసరగలదని, ఆమెకు విశ్వాసం కలిగింది. అందుచేత 3 వ స్థానం ఆమెకు తప్పకుండా రావచ్చు. ఈ సంవత్సరం సోవియట్ వారంతా 50 మీటర్లు విసరగలిగారు. వారిలో ఒకరిని బహుశా డానా ఓడించగలదు.

శాస్త్రీయంగా చూస్తే, డానా మంచితయారీలో ఉంది. ఈ సంవత్సరం ఆమె ఫక్కీ విషయంలో చాలా కష్టపడింది. లోపాలను సరిదిద్దుకుంది. చాలవరకు ఆమె విసురు ఎడంవైపుకు వెళ్ళిపోతూంది. ఇంకా చెయ్యి వంపేస్తూంది. ఫిల్ముద్వారా ఆమె ఫక్కీ సవరించుకుంది. ఆమె తన లోపాలను తెలుసుకుంది.

చాలా సంవత్సరాలు బొటనవేలు చుట్టుతిప్పి, మొదటివేలితో జావలిన్ పట్టుకొనేది. మధ్యవేలు ఉపయోగించుట ఫిన్నులపద్ధతి. కాని డానా తన పద్ధతిని మార్చవలచుకోలేదు.

ఒకరోజు హెల్సింకీలో, ఒకరిఫరీ ఆమె ట్రయినింగు పద్ధతిని కనిపెట్టి చూచాడు. ఆమె ఫక్కీని అతడు ప్రశంసించాడు. కాని ఆమె జావలిన్ పట్టుకొనే పద్ధతి అతనికి అంతగా మనస్కరించలేదు. డానాకు ఏమి తోచిందో ఎవరూ చెప్పలేరు. ఆ రిఫరీ తనజీతంలో ఎప్పుడూ జావలిన్ విసరలేదేమో కాని అతడు ఫిన్ దేశస్థుడు. ఆమె ఫిన్నిషు పద్ధతి ననుసరించి జావలిన్ పట్టుకొనేది. దాని ఫలితం అద్భుతం. ఆమె ఫిన్నిషు పద్ధతి ననుసరించే విసిరింది. 45 మీటర్ల దూరానపడింది. ఆమె బంగారు పతకాన్ని సంపాదించింది.

# ఒక దివ్య గాథ

అనగా, అనగా...

ఒక విఖ్యాత పరుగు పందెగాడు. జావలిన్ విసరే ఆమెను ప్రేమించాడు. ఆమెకూడా అతనిని ప్రేమించింది. వారిద్దరికి వివాహమయింది.

హెల్సింకీలో ఒలింపిక్ ఆటలమధ్య యీ దివ్య ప్రేమగాథ, యింకా మనో హరంగా వర్ణించబడుతోంది. హాలివుడ్‌లో యీ ప్రేమగాథను ఫిల్ము తీయుటకు కూడా ఎవరూ సాహసించరని, ఒక అమెరికన్ రిపోర్టరు వ్రాశాడు. ఇదంతగా వాస్త వానికి దూరమైనదయినా యిదంతా నిజం; ఆ రోజే, ఆ గంటలోనే...

కాస్త ఆగండి. మనకి అంత తొందరెందుకు. ఈ గాథ వివరంగా చెప్ప దగింది, వినదగింది.

రెండవసారి ఎమిల్ తన మనోబలాన్ని పరీక్షించుటకు బయలుదేరుతూంటే, డానా దుస్తులను మార్చుకొనే గదిలో కొంచెం విశ్రాంతి తీసుకుంటూంది. ఒక మూలకు పోయి, చెవులమీద ఒక ముతకగుడ్డ కప్పుకుంది.

ఆమెకు పందెం చూచుటకు వెళ్లుట యిష్టమే. ఎమిల్ 3వ స్థానంకొరకు ఆశించాడు. కాని కఠినంగా కృషిచేయాలి. ఆమె ప్రేక్షక స్థానంలో ఉంటే, తన జావలిన్ విసరే పోటీసమయానికి ఆవేశం ఎక్కువవుతుంది. కాళ్లు, చేతులు వణకిపో తాయి. 5000 మీటర్ల పరుగుపందెం అయినవెంటనే జావలిన్ విసరేపోటీ ప్రారంభం.

డానామీద చాలా బాధ్యత ఉంది. తన దేశపు కీర్తిని నిలబెట్టి, ప్రజల ఆశలు నెరవేర్చాలంటే ఆమె చాలా కష్టపడాలి. ఈసారి ఎమిల్ పాల్గొనే పందేనికి ఆమె వెళ్ళలేదు. స్టేడియంనుండి హర్ష ధ్వానాలు చెలరేగుతూంటే, తలమీదనుంచి రగ్గుకూడా కప్పుకుంది; తన రాబోయే పోటీమీదే తన మనస్సును కేంద్రీకరించదలచింది.

ఈ సంవత్సరం ఆమె, లోపరహితంగా తరిఫీదయింది. ఈసారి ఆమెకు విజయం తప్పదు. తన జావలిన్లు పట్టుకొని శీతోష్ణస్థితిని ఖాతరుచేయకుండా, ప్రొయి నింగుకని వెళ్తూంటే, ఆమె చేపలుపట్టడానికి వెళ్తూందని అందరూ అభిప్రాయ పడేవారు సాయంకాలాలు అలసిపోయి యింటికి తిరిగివస్తే, ఒక్కొక్కప్పుడు ఎమిల్ వంటచేయవలసివచ్చేది.

ఒక క్రీడల విలేఖరి పిచ్చివిశ్వాసంతో, ఎమిల్ 3 బంగారు పతకాలను, డానా ఒక బంగారు పతకాన్ని గెలుస్తారని వ్రాశాడు. అంత వివేకం మరేదైనా ఉంటుందా! ఈ క్షణంలో ఆ విషయం ఎందుకు జ్ఞప్తికివచ్చింది: అనేక రోజులనుండి ఆమెకు ఆవేశం, అశాంతి ఎక్కువయినాయి. అయినా అలాగే జావలిన్‌లు విసురుతూనే ఉంది. తన పోటీ ఎలా పరిణమిస్తుందోనని ఆమె తనలో తాను ఆశ్చర్యపోతూంది.

ఎందుచేత ఇలా అయిపోతూంది. ఎమిల్ వలె, ఆమెకూడా ఆటలే తన జీవితప్రధానోద్దేశంగా భావిస్తూందా ?

ఉదయం, ప్రారంభపు పోటీలలో సోవియట్ వారు డానాను మించారు. మాడినా 46.23 మీటర్లు, జబీనా 45.95 మీటర్లు విసిరారు. డానా 45.75 మీటర్లు మాత్రమే.

ఈసారి యిదివరకెన్నడూ చూపని పట్టుదల చూపుటకు నిశ్చయించింది. డానా. ఆఖరుదశలో ఎమిల్ పోరాడినట్లు పోరాడుటకు ఉద్దేశించింది. అప్పుడు ఆమెకు 3వ స్థానం వస్తుంది. కాని, గోర్చ్కోవాను మాత్రం ఓడించితీరాలి.

మొదటి విసురులోనే ఆమె బలం, ఆమె మనోబలం పూర్తిగా ఉపయోగించాలి. పోటీ పెక్కుగంటలు సాగుతుంది. ఉత్సాహం తగ్గిపోతుంది; అలసట, ఆందోళన ఎక్కువవుతాయి. మొదటి మూడు ప్రయత్నాలలోనే ఆమె పూనికతో విసరాలి.

అకస్మాత్తుగా స్టేడియంలో కోలాహలం బయలుదేరింది. పెద్ద తుఫానువలె ఉంది. హర్ష ధ్వానాలు. అంతా నిశ్శబ్దం. డానా తన తలమీద కప్పుకున్న రగ్గు లాగి పారేసింది; ఒక్కగెంతు వేసి ప్రేక్షకస్థానాలవైపు పరుగెత్తింది. అప్పుడే జావలిన్ పోటీలకు అభ్యర్థులకు పిలుపువచ్చింది.

ఎవరైనా పరుగుపందెపు ఫలితం చెప్తారేమోనని, డానా నలువైపులా చూచింది. సోవియట్ ట్రెయినర్ మార్కోవ్ కనబడ్డాడు; డానా అతనిని అడిగింది. "ఎమిల్ గెల్చాడ"ని అతను చెప్పేడు. డానాకు యీ సువార్త మొట్టమొదట చెప్పగలిగినందుకు అతను సంతోషించాడు.

డానా కృతజ్ఞత తెలియజేసింది. భర్త విజయం ఆమెకు ఏనుగుబలం ప్రసాదించింది. బలం, ధైర్యం, ఆమెలో పోసినట్టయింది. అడుగు నిబ్బరంగా వేస్తూ నడచింది.

బంగారు పతకం చేత ధరించి, విజయ పీఠంవద్ద అపూర్వ గౌరవం పొంది, మెట్లుదిగి అప్పుడే వస్తున్నాడు ఎమిల్. ఆమె తన భర్తను కలుసుకొంది. డానా అతనిని తొందరగా అభినందించి, తన పోటీస్థలానికి వెళ్ళింది. అంత్యపోటీకి అందరూ సిద్ధంగా ఉన్నారు.

డెన్మార్కునుంచి వచ్చిన కెల్స్బీ అప్పుడే జావలిన్ విసరుటకు తయారుగా ఉన్నది. ఆమె 46.23 మీటర్లు విసరింది.

తర్వాత డానా జావలిన్ ధరించింది. పత్రికా ఫొటోగ్రాఫర్ల కెమేరాలు ఆమెవైపు తిప్పి తయారుగా ఉన్నారు.

"నేను గెలుస్తానని అనుకుంటున్నారా" అని నవ్వింది, ఆమె విసరడానికి తయారుగా నిలచి. ఆమె హృదయంనిండా ఎమిల్ విజయగర్వమే. జావలిన్ గట్టిగా పట్టుకుంది; శిరస్సు పైకెత్తింది; ఎదురుగుండా స్థలమంతా ఒకసారి పరి

కించింది. ఆకస్మికంగా ఎమిల్ మాటలు జ్ఞాపకమొచ్చాయి: "మార్కుకు అవలకు విసురుటకు మానసికశక్తి ఉండాలి."

ఇప్పుడామెకు ఆ శక్తి ఆవహించింది. విజయం సాధించుటయందామెకు విశ్వాసం కలిగింది.

ఒక్క చిన్నపరుగు; వేగం కొంచెం అధికం చేసింది; జావలిన్ వెనుకకు వేసింది; బలమంతా ఉపయోగించింది, జావలిన్ విసరి గాలిలోకి పంపించింది.

డానా, ఆమెకున్న బలం, ప్రావీణ్యం, ప్రజ్ఞ, విశ్రాంతిలేకుండా చేసిన అభ్యాసఫలితం అంతా ఆ క్షణంలో ఉపయోగించింది.

జావలిన్, ఆమె చేతులను వదలి చాలా ఎత్తుగా గాలిలోకి ఎగిరింది. అందంగా క్రిందికి దిగింది. 50 మీటర్ల, మార్కుకు దూరంగా పచ్చగడ్డిని దూసుకుపోయింది.

రిఫరీలు కొలత టేపులతో వచ్చారు. నోటీసుబోర్డుమీద పెద్ద నల్లటి అక్షరాలతో ప్రకటన:

50.47 మీటర్లు - క్రొత్త ఒలింపిక్ రికార్డు.

స్టేడియం హర్షధ్వానాలతో నిండిపోయింది. ఆ అద్భుత ప్రదర్శనకు అంతులేని అభినందనలు ఆమెను ముంచెత్తినవి.

పోటీనిగూర్చి మరి చెప్పవలసిన అవసరంలేదు. ఈ పోటీ 3 గంటల కాలం జరిగింది. ఆమె మరి విసరవలసిన అవసరం లేకపోయింది. మొదటి విసురులోనే యావచ్ఛక్తిని ఉపయోగించింది. కాని డానాకు బలమైన ప్రత్యర్థి చుడీనా ప్రతి విసురులో అభివృద్ధి చూపగలిగింది. ఆఖరు ప్రయత్నంలో 50.01 మీటర్లు విసిరింది.

ఆటగాండ్రందరూ "డానా!" "డానా!" అని కేకలువేయ మొదలు పెట్టారు. "హురా!" "హురా!" అని చుడీనాను ప్రోత్సహించుటకు సోవియట్లు కేకలు వేశారు.

పోటీ అయిపోయిన తర్వాత చుడీనా, జబినా, గోర్చకోవాలు డానాను కౌగలించుకొని అభినందించారు. సోవియట్ శిక్షకుడు యిలాగన్నాడు: "నా శిష్యురాండ్రలో ఒకరు గెలిచినట్టే ఉంది, నాకు.

ఈ విధంగా దివ్యగాథ నిజమయింది:...ఒకరోజే, ఒకగంటే ఎమిల్, డానా యిద్దరూ చెరొక బంగారు పతకాన్ని గెలిచారు. ప్రపంచ ప్రారంభంనుంచి ఒలింపిక్ ఆటలలో, మొట్టమొదటిసారి దంపతులిద్దరూ చేతిలో చేయివేసికొని, ఒకేసారి రెండు విజయాలు సాధించారు.

జెకొస్లొవేకియాలో ఒలింపిక్ విజయం పొందిన స్త్రీలలో యీమె ప్రథమురాలు. ఆమె గౌరవార్థం స్టేడియంమీద జెక్ పతాకం మరొకసారి ఎగిరింది. జెక్ జాతీయగీతం ఆ చల్లని గాలిలో మూడవసారి వీనులకు విందుగా వినిపించింది. ఆమె పట్టుదల, కృషి, మానసిక శక్తి విజృంభించినవి. డానాకు విజయం హస్తగతమైంది.

# ఒలింపిక్ సమాప్తి

**16** వ ఒలింపిక్ ఆటలు సమాప్తమయినవి. చరిత్రదృష్ట్యా, క్రీడలదృష్ట్యా, ఒలింపిక్ ఆశయాలదృష్ట్యా యిదివరకటి ఆటలకన్నా ఉత్తమశ్రేణికి చెందిన వీ యేటి ఫలితాలు. ప్రపంచపు టన్ని దేశాలు పాల్గొన్నవి. మొట్టమొదటిసారి సోవియట్ పందెగాళ్లు పాల్గొన్నారు. వారికికూడా విజయాలు లభించినవి. వివిధదేశాలకు, జాతులకు, రాజకీయ అభిప్రాయాలకు చెందిన అనేకమంది పరస్పరం స్నేహసౌహార్ద్రాలతో ప్రవర్తించి, ప్రపంచశాంతికి శంఖుస్థాపన జేశారు.

ఎమిల్ దే ఎప్పుడూ పరుగులలో ప్రథమస్థానం. ఇతర సమయాలలో తన ప్రజలమధ్య కాలం గడుపుతాడు. ప్రజా రాజ్యమైన చైనానుండి వచ్చిన ప్రతినిధి వర్గాన్ని తన మిత్రులతో కలసివెళ్ళి పలకరించాడు. ఈ వర్గం ఆలస్యంగా వచ్చుట చేత ఆఖరు ఉత్సవంలో పాల్గొని, ఒలింపిక్ సభ్యత్వాన్ని మంజూరుచేసుకొని, వారి సానుభూతిని తెలిపింది.

ఫిన్నిష్ డెమొక్రటిక్ యువకులలో ఎమిల్ ఉపన్యసించాడు. ప్రపంచశాంతి పట్ల తన అభిప్రాయాలను వారికి తెలియపరచాడు.

ఒలింపిక్ వ్యాయామ పోటీలో గెలిచిన సోవియట్ పందెగాడు, చూకారిన్ మాటలుకూడా అందర్ని ఆకర్షించాయి: "ఈ ఒలింపియడ్ అన్నిటికన్నా ఎక్కువైంది. ప్రపంచంలో కార్మికులు, ఆటగాండ్రు, శాంతిగా జీవితాలను గడుపుట కిచ్ఛగిస్తారన్న విషయంలో నా నమ్మకం హెచ్చింది."

ఒలింపిక్ పతాకాన్ని మడతపెట్టేరు. ఒలింపిక్ స్టేడియం నిర్జనమై, శూన్యంగా కనబడింది. ప్రపంచ యువకులు, వీడ్కోళ్ళతో, కరచాలనాలతో తమ మైత్రిని దృఢతరం చేసికొన్నారు. ఒలింపిక్ జ్యోతిని ఆర్పినారు. మిగిలింది బూడిదమాత్రం కాదు. అదొక దివ్యభావం. క్రీడలలో ఉత్సాహం కనబరచిన ప్రపంచ యువకుల హృదయాలలో ఆ జ్యోతి ఆరలేదు. ప్రపంచపు టన్ని అంచులకు ఒలింపిక్ భావాన్ని వారు మోసుకుపోయారు.

ఇదివరకు సగర్వంగా, యిలా గనేవారు: "రెండు ప్రపంచయుద్ధాల తర్వాత కూడా, ఒలింపిక్ భావం సజీవంగా ఉంది."

అదే ఒక గొప్ప విషయం కాదు. యుద్ధాలనుండి బయటపడుటతోనే ఎవరూ సంతుష్టిపడ నవసరంలేదు. అన్నిటికన్న ముఖ్యమైనది అసలు యుద్ధాలను నివారించుట. హెల్సింకీలో జరిగిన యీ ఒలిపింక్ ఆటలు, ఈ ఒలింపిక్ సంస్థను యీ ఉత్తమ ఆదర్శంతో నింపినవి.

ఆటలలో ప్రత్యర్థులు ఒకరినొకరు ఆలింగనం చేసుకొన్నారు. ఈ ఉన్నతాదర్శంలో వారికి గల నమ్మకాన్ని కరచాలనాలద్వారా ప్రకటించారు. ప్రపంచంలో

ప్రజలందరూ ఒక్కటే ప్రవృత్తిగలవారని, అందరూ పరస్పరం ప్రేమించుకొంటారని వారు సంతోషంతో గ్రహించారు.

ఒలింపిక్ శాంతి తత్వం ప్రపంచమంతా యింకా ప్రాకకపోవుట శోచనీయం; ఒక వంక ఒలింపిక్ పందేలు జరుగుతూంటే, కొన్ని ప్రాంతాలలో యింకా యుద్ధం కొనసాగుతూండడం విచారకరమైన విషయం.

హెల్సింకీలో సమావేశమైన యువకులు, యీ పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. ఉత్తమ ఒలింపిక్ ఆదర్శం ఒక్క క్రీడారంగంలోమాత్రమే అసలు కావలసింది కాదు. ఈనాటి యువకులు ఆవేశపు టాకలిని తృప్తిపరచుటకే ఆటలలో పాల్గొనుటలేదు. వారి ఉత్తమ ఆదర్శం ప్రపంచానికి ప్రయోజనకారి అని, దాని నందరూ గౌరవించాలని వారి ఉద్దేశం.

హెల్సింకీలో వారు గడపిన ఆనందమయ దినములు ప్రపంచక్రీడల వీరుల ఉద్దేశాలను ధృవపరచాయి. ఈ ఉద్దేశాలతో వారి స్వదేశాలకు వెళ్ళి, వాటిని ప్రచారంచేయుటకు వారు నిశ్చయించుకున్నారు.

విలువైన అనుభవాలతో, క్రొత్తవిజయాలవల్ల కలిగిన విశ్వాసంతో, ఆనందంతో జెక్ ఆటగాండ్రు స్వదేశానికి తిరిగివచ్చేరు. వారి దేశానికి గౌరవం తెచ్చేరు. వారి సాహసం, ధైర్యం, శాంతిప్రియత్వం అన్నిదేశాలవారిని ఆకర్షించాయి.

"మాకు వప్పజెప్పిన కార్యాన్ని మేము నిర్వహించాం" అనగలిగాడు, జెక్ జట్టు నాయకుడు, సగర్వంగా.

ప్రేగ్ నగర వీధుల్లో వారి ప్రయాణం విజయోత్సవంలా వుంది. హర్షధ్వానాలతో, పుష్పప్రదానాలతో ప్రజలు తమ కృతజ్ఞతను తెలియజేశారు. అందరికన్నా జటోపెక్‌కు ఎక్కువ సన్మానం జరిగింది. క్రీడారంగంలోనేకాక, అన్నిరంగాలలోను యువకులు ఉత్తమ ఆదర్శాలకొరకు జీవించవలసివుందని ఎమిల్ సందేశం యిచ్చాడు.

# కొత్త రికార్డులు

ప్రతిష్టతో, ప్రఖ్యాతితో ఎమిల్ ఇంటికి తిరిగివచ్చాడు. ఇప్పటి కింక విశ్రాంతి తీసుకోవడానికి సమయం వచ్చిందని ఎవరైనా అనుకొనుట కవకాశం ఉంది. కాని అంత సాధించిన వ్యక్తి యింకా ఎక్కువబలం కూర్చుకోవాలి అనుకున్నాడు.

ఎమిల్ పద్ధతి వేరు. బలం విశ్రాంతి వల్లకాదు, యింకా ఎక్కువ కృషివల్ల సంపాదించాలి.

హెల్సింకీలో ప్రపపంచంలోని ఉత్తమ పరుగు పందెగాళ్ళందరినీ ఓడించాడు, ఎమిల్. ఒలిపింక్ రికార్డులను స్థాపించాడు. 5000 మీటర్ల పందెంలో మాత్రం జర్మన్ షేడ్ యొక్క వేళను కొంచెంలోనే అతిక్రమించగలిగాడు. అందుచేత తన వేగాన్ని మరల పరీక్షించుటకు ఉవ్విళ్లూరుతున్నాడు.

ఒపేవాలో జరిగిన 5000 మీటర్ల పందెంలో అక్టోబరు 5 వ తేదీన పాల్గొన్నాడు. వేళలు: మొదటి కిలోమీటరు 2 నిమిషాల 47 సెకండ్లు; రెండవ కిలోమీటరు: 5 నిమిషాల 35 సెకండ్లు; 3 వ కిలోమీటరు: 8 నిమిషాల 23.2 సెకండ్లు, 4 వ కిలోమీటరు: 11 నిమిషాల 17 2 సెకండ్లు.

4 కిలోమీటర్ల వేళలు ప్రకటించబడగానే, స్టేడియం అంతా హర్షధ్వానాలతో నిండిపోయింది.

ఎమిల్ వేగం అధికంచేయుటకు ప్రయత్నంచేశాడు. కాని చేయలేకపోయాడు. అయినా, ఆ ఏటి కదే ఉత్తమవేళ. అతని వేళ : 14 నిషాల 06.4 సెకండ్లు. కాని, తన ఒలింపిక్ రికార్డుకంటె తక్కువవేళ.

ఒకసారి గనక మంచి తయారీలో ఉంటే, దానిని పూర్తిగా వినియోగించాలంటాడు, ఎమిల్.

ఆకురాలు కాలం అతనికి మంచి అనుకూలమైనది. అతని ప్రజ్ఞ ప్రదర్శించుటకు, తక్కువదూరం పరుగు పందేలలో ప్రజ్ఞగల ప్రత్యర్థులుండాలి. అందుచేత పెద్ద దూరాలకే పోటీచేస్తాడు. 15 మైళ్ళకు, 25 కిలోమీటర్లకు, 30 కిలోమీటర్లకున్న ప్రపంచ రికార్డులను భగ్నంచేయ దలచాడు. మొదటి రెండు రికార్డులు, ఫిన్నిష్ మేరథాన్ పరుగు పందెగాడు మిక్కో హైటేనెన్‌కు చెందినవి. ఆఖరిది సోవియట్ దేశీయుడు మాస్కా చెంకోవ్‌ది.

హుస్టాకా అడవి స్టేడియంలో అక్టోబరు 26 వ తేదీని రికార్డులమీద దాడి ప్రయత్నం ఏర్పాటయింది. దురదృష్టంకొద్దీ, వాతావరణం బాగాలేదు. రాత్రంతా వర్షం కురిసింది. తెల్లవారగట్ల 4 గంటలకు కిటికీలోనుండి బయటకు చూచాడు, ఎమిల్. వర్షం పరుగుమార్గంమీద అలాగే కురుస్తూవుంది. చిన్న చిన్న నీటిగుంటలు పెద్ద చెరువులయిపోయాయి.

"ఇప్పుడైనా వర్షం ఆగితే, పరిస్థితులు చక్కబడతాయి." కాని, వర్షం ఆగలేదు. 5 గంటల తర్వాత దేవుడు దయదలచాడు. క్రమంగా వర్షం తగ్గిపోయింది.

ఇంక పరుగుమార్గం బాగుచేయాలి. అసలు మార్గం మంచిది. అదీకాక, మార్గాధికారి సైబీరా ఎంతో కష్టపడి, పందెం ఒకగంటకు ప్రారంభమవుతుందనగా, మార్గమంతా పూర్తిగా బాగుచేయించాడు.

ఎమిల్ గడియారంలాగ పరుగెత్తేడు. తన పథకం ప్రకారం, వేళలలో తేడా లేకుండా పరుగెత్తేడు. ప్రతి కిలోమీటరుకు అభివృద్ధి కనుపించింది. 10 కిలోమీటర్ల

31 నిమిషాల 43 సెకండ్లలో పరుగెత్తేడు. తన రికార్డు భగ్నమొనర్చే పథకంకంటె 18 సెకండ్లు ముందున్నాడు. 17 వ కిలోమీటరులో అతివేగంగా పరుగెత్తేడు. వేళ : 3 నిమిషాల 04.6 సెకండ్లు. ఇప్పటికి 40 సెకండ్లు ముందున్నాడు. ఒకగంట అయ్యేసరికి 18,970.80 మీటర్లు పూర్తిచేశాడు. ఇది అద్భుత ప్రదర్శనం. చాల దేశాలలో యిది జాతీయ రికార్డులను స్థాపించి ఉండేది.

ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్‌వలె పోతున్నాడు. మొదట హాటేనెన్ 15 మైళ్ళ ప్రపంచ రికార్డును భగ్నమొనర్చాలి. ఎమిల్ 15 మైళ్ళ మార్కును 1 గంట 16 నిమిషాల 26.4 సెకండ్లలో దాటేడు. తరువాత రెండవ రికార్డు భగ్నమైంది. జటోపెక్ వేళ : 1 గంట 19 నిమిషాల 11.8 సెకండ్లు; హాటేనెన్ వేళ : 1 గంట 20 నిమిషాల 14 సెకండ్లు.

అన్ని మంచి ఫలితాలు, మూడేసి చొప్పున వస్తాయి. ఎమిల్ ముందుకు సాగిపోతున్నాడు. 3 వ రికార్డుకూడా భగ్నంచేస్తాడనే అందరి నమ్మకం. ఇంకా 5 కిలోమీటర్లు పరుగెత్తవలసి ఉంది. దూరం తక్కువే.

ఎమిల్ సులువుగా పరుగెత్తుతున్నాడు. ఆయాసపడుటలేదు. వేగం ఏమాత్రం తగ్గించకుండా పరుగెత్తుతున్నాడు. కండరాలబాధ లేకపోతే అంతేచాలు. అలాగయితే ప్రపంచ రికార్డులను సంతోషంగా పరుగెత్తగలడు. అదృష్టం: ఈసారి అలాంటి అవాంతరమేమీ లేదు.

ఆఖరు ఘట్టం 16 నిమిషాలలో పరుగెత్తేడు. ఆతని కాళ్లు అతి వేగంగా ఆతనిని తీసుకుపోతున్నాయి. వారి ప్రశంసాపూర్వక హర్షధ్వానాలు ఆతని ప్రదర్శనకే కాదు; ఆతని అందమైన పరుగెత్తే ఫక్కీని ప్రేక్షకులు మెచ్చుకుంటున్నారు. అనేక ప్రాంతాలనుంచి వచ్చిన జనం, ప్రేగ్‌నుండి వచ్చిన ఆతని విధేయులు, కొరియన్ అతిథులు ఆఖరు ఘట్టంలో ఆతనికి అమితమైన ప్రోత్సాహమిచ్చారు. 30 కిలోమీటర్లు పూర్తిచేసినవాడు, యింత వేగంగా ఆఖరు ఘట్టాలలో పరుగెత్తగలడని ఎవరైనా వూహించారా!

పరుగెత్తుతూ, జటోపెక్ తన్ను ప్రశంశిస్తూన్న వారికి కృతజ్ఞతాపూర్వకంగా చేతులూపాడు, తా ననుకున్న కార్యాన్ని సాధించగలిగాను కదా అని. ఆతనిలో సంతోషం పొంగుతూంది. చిఱునవ్వు పెదవులమీద తాండవమాడుతూంది.

ప్రేక్షకు లాతనిపేరు అలాగ అరుస్తూనే ఉన్నారు. ఆఖరు మీటర్లలో ప్రజోత్సాహం కట్టలు తెగింది.

గమ్యస్థానం దాటేడు. 3 వ ప్రపంచ రికార్డు ముక్కలయింది.

హాటేనెన్ రికార్డులు రెండింటిని, ఒక్కొక్క నిమిషం చొప్పున భగ్నం చేశాడు. మాస్కో షెన్‌కోవ్ యొక్క ప్రపంచ రికార్డును ఒకటిన్నర నిమిషాలలో భగ్నం చేశాడు.

ఆతని వేళలు :

15 మైళ్లు : 1 గంట 16 నిమిషాల 26.4 సెకండ్లు.

25 కిలోమీటర్లు : 1 గంట 19 నిమిషాల 11.8 సెకండ్లు.

30 కిలోమీటర్లు : 1 గంట 35 నిమిషాల 23.8 సెకండ్లు.

అతని క్లబ్ మిత్రుడు స్టేనిస్లావ్ జంగ్ వర్తుయొక్క అద్భుత ప్రదర్శనం, ఎమిల్ కలిగించిన ఆనందాన్ని అధికం చేసింది. ఆ రోజునే 800 మీటర్లు 1 నిముషం 48.7 సెకండ్లలో అతను పరుగెత్తాడు. (మొదటి 400 మీటర్లు 53 సెకండ్లలో పరుగెత్తాడు) ఆ మరుసటిరోజు 1000 మీటర్లు 2 నిమిషాల 21.2 సెకండ్లలో పరుగెత్తాడు. ఇది ప్రపంచ రికార్డువేళ.

జటోపెక్ కాక, ప్రపంచస్థాయిలో మరొక పరుగు పందెగాడు జెకొస్లొవేకియాలో బయలుదేరేడు.

# సుందరమైన బహుమానం

జయప్రదమై 1952 వ సంవత్సరం సమాప్తమవుతూంది.

ఆఖరు నెలలు జటోపెక్‌కు సంతృప్తికరంగానే ఉన్నాయి. ఒలింపిక్ ఆటలలో మరే యితర ఆటగాడు చూపని సామర్థ్యాన్ని చూపేడు. స్వదేశంలో ప్రపంచ రికార్డులను భగ్నంచేశాడు. సోదర మానవుల గౌరవాన్ని, నిర్మలప్రేమను చూరగొన్నాడు. యువకులకు ఆదర్శంగా తయారయ్యాడు.

ఒలింపిక్ సంవత్సరంలో, జటోపెక్ క్రీడారంగంలో తన జీవిత పరమావధిని చేరగలిగాడంటే, మానవునిగా ఆతడు ప్రపంచ యువక బృందానికి మార్గదర్శకుడయ్యాడన్నమాట.

ఆటగానిగా, జటోపెక్ చేసిన సేవకు బహుమానంగా దేశంలో అత్యున్నత గౌరవమైన "ఆర్డర్ ఆఫ్ ది రిపబ్లిక్", ప్రభుత్వం, ఆతనికి సమర్పించింది.

ఇంతవరకు యీలాంటి గౌరవం, ఆర్థిక రంగంలో ప్రశంసాపూర్వక సేవ చేసినవారికే బహూకరింపబడినది. ఇప్పుడీ ప్రదానంవల్ల, జీవితంలో క్రీడల ప్రముఖ స్థానాన్ని ప్రభుత్వం గుర్తించినదని స్పష్టం.

ప్రజారాజ్యంయొక్క అభివృద్ధికి జటోపెక్ విజయాలు తోడ్పడతాయని ప్రభుత్వ అభిప్రాయం. ఎమిల్ ప్రదర్శనాలు యువకులకు, వారు అనుసరించవలసిన మార్గాన్ని చూపినవి. కార్మికులలో పనిమీద దృష్టి ఎక్కువైనది.

క్రీడల నైతిక ప్రయోజనాన్ని యీ బహుమానం ప్రకటించింది. నైతిక విషయాలు జీవితంలో ప్రధాన ఫలితాల నొసగునని వేరే చెప్పనక్కర్లేదు.

స్వదేశ ప్రేమ ఎంతటి కార్యసాధనకైనా మార్గదాయక మగునని యీ గౌరవ ప్రదానం రుజువుచేస్తోంది. ఎమిల్, తన శక్తినంతనూ యీ దేశభక్తినుంచే సంపాదించాడు. అలాగే ఆత డొక ఆదర్శ మయ్యాడు. ఎమిల్, ఒక జ్యోతివలె అనేక అద్భుత కార్యసాధనలకు ఇతరులను పురిగొల్పాడు.

పరస్పర ప్రేమకు, సహకారానికి క్రీడ లేవిధంగా తోడ్పడుతాయో, మానవ చరిత్రలో అవి ఎంత ప్రముఖపాత్ర వహించగలవో ఒలింపిక్ ఆటలు రుజువు పరిచాయి.

ఎమిల్ జటోపెక్ మేరథాన్ సింహద్వారం ప్రవేశించి సుఖప్రదమైన భవిష్యత్తుయొక్క విజయాన్ని, నాశనంలేని శాంతిసందేశాన్ని ప్రపంచానికి చాటుటతోకూడా యిది రుజువయింది.

ఈ విధంగా జటోపెక్ ఒక సుందరమైన బహుమానాన్ని పొందేడు. తన కొరకు, సదయహృదయులైన అందరికొరకు యీ గౌరవాన్ని సంపాదించేడు.

# తుదిఘట్టం : 1953 - అజేయుడు

**1953** వ సంవత్సరం ఎమిల్ జటోపెక్‌కు అనుకూలంగా ప్రారంభం కాలేదు. ప్రపంచ రికార్డు పరుగుల పందేలలో పాల్గొనుటకు వీలులేకుండా నొప్పులు బయలుదేరినవి. మామూలుగా నడచుటకుకూడా వీలులేకుండా వచ్చింది. టాన్సిల్స్ ఆపరేటు చేయించుకోవలసి ఆసుపత్రిలో కొన్నిరోజు లుండిపోవలసి వచ్చింది.

బుఖారెస్టులో జరిగిన యువజనోత్సవానికి వెళ్ళినప్పుడు అందరూ అతనిమీద కనికరపడ్డారు. అతనిమీద ఆశలుమాత్రం పెట్టుకోలేదు. ప్రవీణులు చాలామంది అతనికి భవిష్యత్తు లేదన్నారు. అయినా బుఖారెస్టు సమావేశానికి వెళ్ళుట మాన దలచుకోలేదు. ఎమిల్ స్వయంగా అనేకమంది ఆటగాండ్రను ఆహ్వానించాడు. వారందరూకూడా శాంతి, స్నేహాలను ఆటగాండ్రు అభిలషిస్తున్నారని రుజువు చేయుటకు వస్తున్నారు.

పోటీదార్లకు శత్రువు వేడి,థర్మామీటర్‌లో పాదరసంవలె ఎప్పుడూ యింతెగా పైకెక్కలేదు. మొదట సాయంకాలాలే ట్రెయినింగయ్యేవాడు, ఎమిల్. కాని ఆ శీతోష్ణస్థితికి అలవాటయిపోయిన తర్వాత, విశ్రాంతి లే దతనికి. పగలుకూడా ట్రెయినింగయ్యేవాడు.

సోవియట్ దూరపు పరుగు పందెగాడు కుట్స్‌నుగూర్చి మొట్టమొదట వారు కలిసినప్పుడే అనూఫ్రీవ్, ఎమిల్‌తో చెప్పేడు. 5 కిలోమీటర్లు తాను, అనూఫ్రీవ్, 14 నిమిషాలలోపున పరుగెత్తినప్పుడు, కుట్స్‌కు రెండవస్థానం లభించింది. పందేనికి ముందు కుట్స్‌తో ట్రెయినింగయ్యాడు. కాని ఎమిల్‌కు అనూఫ్రీవ్ అన్నా, కోవాక్స్ అన్నా ఎక్కువ గౌరవం.

తీరా పందెం ప్రారంభమయినప్పుడు, అతనికి వీరిద్దర్నిగూర్చే ఆతృత. ప్రేక్షకులు యీ పందెంగురించి కుతూహలంతో ఎదురుచూస్తున్నారు. ఎమిల్ అస్వస్థతగా ఉన్నట్టు అందరికీ తెలిసింది. 30 సంవత్సరాల వయసు దాటినవాడు ఏమీ సాధించలేడని అందరి అభిప్రాయం.

పందెం ప్రారంభం ఆకర్షణీయంగా ఉంది. కుట్స్ ఒక్కసారి ముందుకు అతివేగంతో పరుగెత్తేడు. ఎమిల్ మాత్రం, క్రమబద్ధంగా పథకానుసారం పరుగెత్త సాగేడు. అప్పుడప్పుడు తన ప్రత్యర్థులు కోవాక్స్, అనూఫ్రీవ్ ఎక్కడున్నారోనని వెనక్కి తిరిగి చూసేవాడు.

అనూఫ్రీవ్, కోవాక్స్ మంచితయారీలో లేరు. కుట్స్ త్వరగా అలసిపోతాడనుకున్నాడు, ఎమిల్. కాని కుట్స్ అలసిపోకపోవుటే కాక తనకు, ఎమిల్‌కు ఉన్న తేడాను వృద్ధిచేస్తున్నాడుకూడా. ఎమిల్, దాడికి తయారౌతున్నాడు. 3 వ కిలోమీటరులో అతనిని కలుసుకొన్నాడు. ఎమిల్ తన ప్రక్కకు వచ్చాడని చూడగానే, వేగం హెచ్చించి, తేడా మరల 30 మీటర్లవరకు తీసుకుపోయాడు. కుట్స్ సామర్థ్యం, వేగం తనవాటితో పోల్చిచూచుకొని, మనసులో ఒక లెక్క వేసికొన్నాడు ఎమిల్ అతనంత అజేయుడే అయితే, యీ వేగాన్ని నిలుపుకొన్నట్టయితే, అతనిని కలుసుకోలే ననుకున్నాడు ఎమిల్. కోవాక్స్ తనతోనే ఉండి, చివరికొక్క ప్రయత్నంచేసి తన్ను దాటిపోతాడు; తనది 3 వ స్థానం అనుకుంటున్నాడు ఎమిల్.

రెండున్నర ఘట్టాలింకా గమ్యస్థాన ముందనగా పరిస్థితి యిది. పందెంలో క్లిష్టసమయం వచ్చినప్పుడు ఎమిల్ ఏవిధంగా తన పోరాటపుశక్తిని ప్రదర్శిస్తాడో మనందరికీ తెలుసు. చివరకు యితరులకంటే ఎక్కువ త్యాగం చేయగలడు, ఎమిల్. అయితే చేయవలసిందేమిటి ? ఆఖరువరకూ నేను ప్రయత్నం చేయకపోతే, కుట్స్‌ను కలుసుకోలేను. కోవాక్స్ నన్నెరుగును. నా ఆఖరుపరుగు అతనికి తెలుసు, దానిని తట్టుకోడానికి తయారయి ఉంటాడు. ఒక్క అవకాశం కనబడుతుంది.

గమ్యస్థానం యింకా 800 మీటర్లుందనగానే ఆఖరుపరుగు ప్రారంభించాలి.

పందెంలో పరిస్థితులనుబట్టి పద్ధతులను మార్చుటలో ఎమిల్‌కున్న ప్రావీణ్యం ఎవరికీ లేదు. అనుకోవడానికి, ఆచరించడానికి మధ్య ఎమిల్ విషయంలో వ్యవధిలేదు.

చూడండి; జటోపెక్ మరి లాభంలేదనుకున్నవారు గమనించాలి; 30 ఏళ్లు దాటినవారికి పందేలెందుకు అనేవారు గమనించాలి !

ఎమిల్ వేగంగా పరుగెత్తుతున్నాడు. కోవాక్స్ అతనితోకూడానే వెడుతున్నాడు. వారికి, కుట్స్‌కు మధ్య దూరం తగ్గిపోతూంది.

కోవాక్స్, జటోపెక్ యిద్దరూ ఒక ఘట్టం (400 మీటర్లు) అదేవిధంగా పరుగెత్తేరు. అందరికీ ఆశ్చర్యం కలిగింది. ఇప్పుడు వేగం మరికొంత అధికం చేశాడు, ఎమిల్. కుట్స్ తన వేగాన్ని నిలుపుకోగలడా? లేదు; అతని బలం తగ్గిపోయింది. గమ్యస్థానం కనుపిస్తోంది. ఒక మూలెను దూరం వెనక్కున్నాడు ఎమిల్. మలుపు వచ్చింది. ఎమిల్ వేగం మరీ అధికం చేశాడు; ఇది మూడోసారి, సోవియట్ ప్రత్యర్థిని దాటిపోయాడు. తుపాకులు పేలిస్తే బయలుదేరే శబ్దంలాగ ఆశ్చర్య చకితులైన ప్రేక్షకులనుండి హర్షధ్వానాలు బయలుదేరేయి.

ఎమిల్ జటోపెక్ పందెం గెలిచాడు. ప్రత్యర్థులందరూ యువకులే. వారి మీద విజయం ఆశ్చర్యం కలిగించింది. వారి ట్రెయినింగును బట్టి విజయానికి వారికి ఎక్కువ అవకాశాలున్నాయని అందరూ భావించారు, ఆశించారు. క్లిష్ట పరిస్థితులలో త్యాగం అవసరమైనప్పుడు, ఆత్మబలం అవసరమైనప్పుడు జటోపెక్‌తో పోల్చదగినవారు లేరు.

మరొక ఆశ్చర్యం: ఈ పందెంలో అతను పరుగెత్తిన వేగం యిదివరకన్నదూ లేదు. బ్రసెల్సులో 1950 లోని తన రికార్డుతో సమానంగా ఉంది. వేళ: 14 నిమిషాల 03 సెకండ్లు.

అతని విదేశ స్నేహితులందరూ అతని విజయానికి ఆనందించారు. అందులో ఆస్ట్రేలియన్ స్టీవెన్సు ఒకడు. 8 వారాలు ప్రయాణంచేసి వచ్చాడు, ఎమిల్‌తో 5 కిలోమీటర్లు పరుగెత్తుదామని. ఈ ఆస్ట్రేలియన్ వీరుడు, 5 మీటర్ల రికార్డు భగ్నం చేయుటకు నిశ్చయించాడు. ఎమిల్ 10 కిలోమీటర్ల పందెంలో పాల్గొంటూంటే, ఆతడు రికార్డుభగ్నంలో నిమగ్నుడయ్యాడు.

అతనికి సహాయంచేయుటకు ఎమిల్ అంగీకరించాడు. వారి వేళల కార్యక్రమం కలసి అమలుపరిచారు. తన 10 కిలోమీటర్లకు 29 నిమిషాల 10 సెకండ్లయితే, అతని 5 కిలోమీటర్లకు 14 నిమిషాల 35 సెకండ్లిచ్చాడు. "నా వేగం నీవనుసరించు; ఊపిరి లోతుగా పీల్చు; తేలికగా పరుగెత్తు; ఆఖరు ఘట్టంలో నీ శక్తినంతా ఉపయోగించి పరుగెత్తు."

ఈ ఆస్ట్రేలియన్ యువకుడు ఎమిల్‌కు అతివిధేయుడైన శిష్యుడు సోవియట్ పందెగాండ్ల ప్రారంభకూరత్వం యీతనికి నచ్చలేదు. "అది సరియైన వేగం; నాతోటే ఉండు" అని అతనిని ప్రోత్సహించాడు, ఎమిల్. ఇంక రెండు లాప్‌లు ఉండనగా (800 మీటర్లు), ఆత నిష్టంవచ్చిన వేగంతో పరుగెత్త నిచ్చాడు. ఈ ప్రయత్నం ఫలించింది. ఆస్ట్రేలియన్ రికార్డు భగ్నమయింది.

అలసిపోయినా, సంతోషంగా స్టీవెన్సు ఆ పచ్చికలో కూర్చొని, ఎమిల్ తన మిగిలిన 5 కిలోమీటర్లు ఎలా పరుగెత్తుతున్నాడో, సమ్మోహితుడై కనిపెట్టి చూస్తున్నాడు. ఎమిల్ గెలిచాడు. కాని యిదివరకుకన్న అభివృద్ధి ఏమీ కనబరచలేకపోయాడు, ముఖ్యంగా ఉష్ణాధిక్యంవల్ల.

దూరపు పరుగు పందేలలో తన ఆధిక్యతను ఎమిల్ మరొకసారి రుజువుచేశాడు.

బల్గేరియాలో సముద్ర తీరాన కొంత విశ్రాంతి తీసుకొని, ఎమిల్ ప్రేగ్ నగరానికి తిరిగి వచ్చాడు. హంగేరియన్ కోవాక్స్, జటోపెక్‌తో 5 కిలోమీటర్ల పందెం పరుగెత్తడానికి ప్రేగ్ నగరం వచ్చాడు. ఈమధ్య తనకు కలిగిన అపజయానికి ప్రతీకారం నిమిత్తం వచ్చాడు. స్ట్రిహోవ్ స్టేడియంకు వచ్చిన ప్రేక్షకులలో చాలా మంది సంశయాత్ములున్నారు.

పందెం ప్రారంభంలో యిద్దరు ప్రత్యర్థులూ సమాన ఉజ్జీలుగా విజయకాంక్షతో నిశ్చిత మనస్కులై బయలుదేరినట్లు ప్రేక్షకులు భావించారు.

పందెం ఆరంభంముందు ఎమిల్, కోవాక్స్‌ముందు మోకాలూనినట్టు ఫొటో గ్రాఫు తీశారు. కోవాక్స్ నడుతాడు ఊడిపోతున్నట్టు ఎమిల్ కనిపెట్టేడు. పందెపు పరుగులో యిదెంత ప్రమాదంగా పరిణమిస్తుందో తెలుసుకదా. ఎమిల్ వంగి అతని జోడుతాడు గట్టిగా బిగించాడు. ఇద్దరూ సస్నేహంగా నవ్వుకున్నారు. ఆ తర్వాత పోరాటం ప్రారంభమయింది.

కోవాక్స్ సహజంగా తనదే గెలు పనుకున్నాడు; కాని లొంగిపోయాడు; ఎమిల్ మరల విజయం సంపాదించాడు.

కాని ఎక్కువగా ఉన్న ఆ స్ట్రిహోవ్ స్టేడియం; ఆశ ననుకున్న వేళను సంపాదించలేకపోయాడు. అదే ఎమిల్‌కు కష్టమనిపించింది. ఈ సంవత్సరం యిప్పటివరకూ, 10 కిలోమీటర్ల పందెంలో, చాలామంది పరుగుదార్ల వేళలతో సమానంగా సమర్థించుకోలేకపోయాడు; అద్భుత ప్రదర్శన లేమీ యివ్వలేకపోయాడు.

క్లబ్బు ప్రధాన సభ్యులతో యీ విషయం చర్చించాడు. కఠినంగా ట్రెయినింగవడం మళ్ళీ ప్రారంభించాడు.

ఆకురాలుకాలం అతనికి సత్ఫలితాల నిస్తుంది.

నవంబరు 1 వ తేదీ వచ్చింది. ఆ రోజు సాధారణంగా శీతలంగా ఉంటుంది. మంచు కురుస్తుంది. అనేక కార్లు, గుఱ్ఱపుబళ్ళు, మోటారుసైకిళ్ళు ప్రేగ్‌నుంచి స్ట్రారా బోలిస్లావ్‌కు పోతున్నాయి. ఆకాశం నిర్మలంగా ఉంది. ఇదే ఆటగాండ్రు ఎక్కువగా కోరేది. ఎక్కువ చలిలేదు. అస్పృశ్యమయ్యే వేసవిని సూచించే ఎండే ఆకుల వాసనలు, స్టేడియం అంతా నిండినవి. హుట్‌స్కా స్టేడియం కొరికే చలి గాలులనుండి సురక్షితం చేయబడింది. అనేకవేలమంది ప్రేక్షకులు చేరేరు. ఫ్రెంచి రచయిత యిలాగన్నాడు: "జటోపెక్ పందెంలో పరుగెత్తినప్పుడు, గొల్లవారు, వారి మందలనువదలి కొండలమీదనుంచి దిగి చూడడానికి గుమిగూడుతారు." అలాగుంది ఆనాటిదృశ్యం. బోలిస్లావ్‌నుంచివచ్చిన ప్రేక్షకుల సమూహాలలో కార్మికులు, విద్యార్థులు, సైనికులు, నటులు, చిన్నపిల్లలు అందరికీ ఎమిల్ అంటే ప్రేమే.

15, 20 కిలోమీటర్ల నడకపందెంలో రెండు ప్రపంచరికార్డులను స్థాపించిన జోసెఫ్ డోలేజల్, కార్యక్రమ ప్రారంభోత్సవం జరిపాడు.

10 కిలోమీటర్ల పందెంలో ఉత్తమవేళను సంపాదిద్దామని ఎమిల్ ప్రయత్నం ఎప్పుడూ, వాగ్దానంకంటె ఆచరణ అధికంగా ఉంటుంది. ఎమిల్ విషయంలో 1950లో

ఫిన్లాండులోని ఆతనివేళను ఆగ నతిక్రమించగల శక్తి లేదన్నారందరు. కాని ఈసారి ప్రదర్శనలో ఎమిల్‌ను ఓడించగలిగింది, తానొక్కడే అని స్పష్టమయింది.

మొదటి కిలోమీటరునుంచికూడా ఆనాటి తుర్కు పందెంలోని వేళలకు పోల్చగినట్టే ఉన్నాయి. ప్రేక్షకుల ప్రశంసల కంతులేదు. 7వ కిలోమీటరుతర్వాత ఒక విషాదక్షణం వచ్చింది. ఎంత ప్రయత్నించినా, తన ప్రపంచరికార్డుకు 1 నిమిషం 8 సెకండ్లు వెనకపడిపోయాడు. ఇంత కృషి నిష్ఫలం అని అందరూ భయపడ్డారు. ప్రేక్షకులు కేకలువేశారు. చేతు లెగురేశారు. ఎమిల్‌ను ఓడించ ప్రయత్నించిన ప్రత్యర్థులమీద వారికి అమితమైన ఆగ్రహంకలిగింది. ఎమిల్‌కు ప్రేక్షకులంటే ఎంతో అభిమానం. వారి ఆజ్ఞను శిరసావహించాడు. ఇంకా ఎక్కువగా శక్తి నుపయోగించాడు. అలసటను అణచివేశాడు. ఆయాసాన్ని లక్ష్యంచేయలేదు. 9వ కిలోమీటర్లో కూడా 1 నిమిషం 8 సెకండ్లు వెనకపడే ఉన్నాడు. ఆఖరు కిలోమీటర్లో తన యావచ్ఛక్తిని ఉపయోగించాడు. అతని అజేయమైన మానసికబలంవల్ల జయంపొందేడు.

పందెం పూర్తి అయింది. డాక్టర్లు ఆతని గుండెను పరీక్షిస్తున్నారు. ప్రేక్షకులు ఆతృతగా ఉన్నారు.

నవంబరు 1, 1953 న ఎమిల్ జటోపెక్ తన ప్రపంచ రికార్డును తానే 1 సెకండులో భగ్నమొనర్చాడు. ఇది 10 కిలోమీటర్ల పందెం. ఆతని కొత్తరికార్డు వేళ 29 నిమిషాల 1.6 సెకండ్లు.

ఈ పందెంలోనే మధ్య 6 మైళ్ళ ప్రపంచ రికార్డును భగ్నం చేశాడు. ఈప్రపంచ రికార్డు యిప్పటివరకు యింగ్లీషు పందెగాడు పీరే హస్తగతమై ఉంది. ఆతని వేళ 28 నిముషాల 19.4 సెకండ్లు. ఎమిల్ వేళ 28 నిముషాల 08.4 సెకండ్లు.

ఆతతని అభినందిస్తూ వచ్చిన మొట్టమొదటి టెలిగ్రాం పీరేవద్దనుంచి.

ప్రేక్షకులు మంచి ప్రదర్శనం వీక్షించి సంతోషంతో ఇళ్ళకు మరలినారు.

## బ్రెజిల్‌కు ప్రయాణం

నవంబరులో సాధించిన ప్రపంచ రికార్డులు జటోపెక్ యొక్క ఉత్తమ తయారీని రుజువుపరుస్తున్నాయి. అయినా 1953 శీతాకాలమంతా యిదివరకుకంటె ఎక్కువగా ట్రెయినింగయ్యాడు. 1954 లో బెర్నెనగరంలో జరిగే యూరోపియన్ పందేలకు తరిఫీదవుతున్నాడు. ఈలోపుగా సావపోలోలో కొత్తసంవత్సరపు ముందురోజున ఆనువాయితీగా జరిగే పందేలకు రావలసిందని ఆహ్వానం వచ్చింది. జెకోస్లావాక్ క్రీడాధికార్లందరూ ఆహ్వానాన్ని అంగీకరించమని సలహానిచ్చారు. వారి సలహాను

జటోపెక్ అంగీకరించాడు. స్వదేశంలోను, విదేశాలలోనుకూడా యీ వార్త కొంత ఆశ్చర్యం కలిగించింది. అంతదూరాన జరిగే పందేలకు జటోపెక్ సాధారణంగా వెళ్లే అలవాటు లేదు. దానివల్ల అతని ట్రెయినింగు ఆగిపోతుందని అతని భయం. ఇప్పుడు యీ ఆహ్వానం అంగీకరించుటవల్ల అమెరికా వెళ్ళాలి. ఈ పందెం కొత్త సమస్యలను రేకెత్తించునని జటోపెక్‌కు తెలుసు. కాని సమస్యలను పరిష్కరించుట, కష్టాలను ఎదుర్కొనుట జటోపెక్‌కు చాలా యిష్టం.

ఈ ప్రయాణాన్ని గూర్చి తెలిసింది మొదలు, ఉష్ణానికి (అలవాటుపడుటకు) స్వెటర్లు మొదలైన ఉన్ని దుస్తులను ఎక్కువగా వాడుట ప్రారంభించాడు. అలాగే యింటివద్ద నిప్పుదగ్గర కూర్చొనేవాడు. ఈవిధంగా ట్రెయినింగయ్యే వాడు. పోర్చుగీస్, స్పానిష్ వ్యాకరణ పుస్తకాలు పఠించేవాడు. ఈలాంటి విదేశ స్థలాల దర్శనం ద్వారా ఎన్నో విషయాలు నేర్చుకోవడం ఎమిల్‌కు సరదా. విమానంలో బ్రస్సెల్సుకు తన స్నేహితునితో డిసెంబరు 26 వ తేదీన బయలు దేరిన క్షణంనుంచి కొత్త అనుభవాలను ఆకళించుకొనుట ప్రారంభించాడు. బ్రస్సెల్సునుండి జినివా కండా లిస్బన్‌ను దాటి డాకర్‌కు చేరేడు. ఈక్వేటర్ మీద నుంచి విమానంలో ఎగిరి వెళ్ళేడు దక్షిణఖండపు వింతలను చూస్తూ.

దక్షిణ అమెరికాకు ముఖ్యకేంద్రం సావొపాలో. ఈ "కాఫీ" నగరం యిటీవలనే 400 వ వార్షికోత్సవం జరుపుకుంది. అక్కడి వార్తాపత్రికలలో ప్రకటితమయిన ముఖ్యసమస్య జటోపెక్ రాకనుగూర్చి; వస్తాడా, రాడా? అనీ ప్రశ్న. జటోపెక్ రయోడిజనీరోలో విమానంనుండి దిగగానే, పత్రికాప్రతినిధులేకాక, వందలకొలది ప్రేక్షకులు లాంఛనంగా స్వాగతమిచ్చి సన్మానించారు. ఇంత అభిమానం తనమీద నున్నదా అని ఎమిల్ ఆశ్చర్యపోయాడు. అతని రాకయందింత అభిలాష చూపిన బ్రెజీలియన్ పౌరులు అతనిని పకితునిచేశారు. క్రీడలంటేనూ, జీవితమంటేనూ యిక్కడ ప్రజలుచూపే వైఖరికి నెమ్మదిగా అలవాటుపడ్డాడు. 'హోటల్ ఎంబెసీ'లో అతని కొకగది ప్రత్యేకింపబడింది. అక్కడికి వెళ్ళేసరికి కేబిల్సు, టెలిగ్రాములు కుప్పలుగా వున్నాయి. రిపోర్టర్లు రేడియో విమర్శలను ప్రారంభించారు. కెమేరాల "క్లిక్కు"లు అదేపనిగా వినబడుతున్నాయి. మైక్రోఫోన్ తర్వాత మైక్రోఫోన్ అతని నోటిదగ్గర ఉంచబడుతున్నాయి.

ఆ సాయంత్రమే మరొక సంఘటన జరిగింది. ట్రెయినింగు లేకుండా ఒక్క రోజైనా గడచుట ఎమిల్‌కు యిష్టంలేదు. అదీకాక, పందెపు మార్గం చూడాలని అతని కోరిక. రాత్రి భోజనం అయిన తర్వాత నగరమంతా చీకట్లు కమ్మినప్పుడు అతను ఆస్ట్రియన్ దేశస్థుడు గ్రూబర్ కలసి వీధులలోకి బయలుదేరారు. వారిని చూచుటకు గుంపులు చేరకుండా, వారి వెంట మోటారు సైకిల్సుమీద పోలీసులు బయలు దేరారు. రోడ్లమధ్య 'ఆరెంజి' రంగు దీపాలు, పోలీసు కార్లను మార్గం చేసేవి. వాటి వెనకనే జటోపెక్ పరుగెత్తేడు. సాయంకాలం ట్రెయినింగవుతాదన్న సంగతి కార్చిచ్చులాగ ఊరంతా ప్రాకింది. వార్తా పత్రికలప్రతినిధులు కార్లలో బయలు

దేరారు. ఈ కార్ల దీపాలుకాంతి ఒకదానినొకటి తాకి వింతరంగు లీనుతున్నాయి. గ్రూపర్ వేరుపడిపోకుండా, ఎమిల్ జాగ్రత్తపడ్డాడు. నెమ్మదిగా వెళ్ళి పందెపు మార్గాన్ని చూచుటకు పోతూంటే జరిగినసందడి అతనికి ఆశ్చర్యం కలిగించింది.

పందెం ప్రారంభానికి ముందు, యిలాంటివే అతని అనుభవాలు. తాటిచెట్ల క్రిందనే అతని ట్రెయినింగు. ఇదే ఎప్పుడూ తన అభిలాష. ట్రాక్‌సూట్‌లోనే అతని ట్రెయినింగు. అక్కడి మందు టెండలకు అలవాటుపడాలి. పట్టినపట్టు చెల్లాలని చూచే పత్రికావిలేఖర్లు అతనిని వదిలేవారుకారు. పత్రికలలో అతనొక మొనపుతీగ అనీ, అతని శరీరంలో ఏదో ఒక యంత్రం రహస్యంగా గుప్తంచెయ్యబడిందనీ వ్రాయ బడింది. అతని స్నేహం అందరికీ సునాసనలు వెదజల్లుడి నట్టున్నది. పెద్దలు, పిన్నలుకూడా అతని సాంగత్యాన్ని, సన్నిహితత్వం కోరుతున్నారు. ఈ పందేలను నిర్వ హిస్తూన్న వార్తాపత్రిక యొక్క భాండాగారం అతనిని చకితుని చేసింది.

"ఏగెజీటా స్పోర్టివా" 29 సంవత్సరాలక్రిందట యీ పందేన్ని నిర్వహించుట ప్రారంభించింది. అప్పుడు 60 మంది పోటీచేశారు. పాత సంవత్సరపు ఆఖరు క్షణా లలో ప్రారంభమై, క్రొత్తసంవత్సరపు మొదటి క్షణాలలో ఆఖరగుట యీ పందేనికి గల ఒక వింత ఆకర్షణ. ప్రతిసంవత్సరం పోటీదార్లసంఖ్య ఎక్కువవుతూ వచ్చింది. 1935 లో 4636 మంది పోటీదార్లుండిరి. యూరపునుండికూడా పోటీదార్లు వచ్చారు. 1949 లో హినో పందెం గెలిచాడు. యుగోస్లావ్ మిహాలావోచ్ దే రికార్డు. ఈతడే ఎమిల్‌కు అతి ప్రమాదకరమైన ప్రత్యర్థి.

ఇప్పటి కప్పుడే ఉష్ణానికి అలవాటు పడిపోయాడు ఎమిల్. అయినా పందెం విషయం యింకా సమస్యగానే వున్నది. బ్రెజీలియన్ జాతీయగీతం తర్వాత ప్రారం భం తుపాకీ ప్రేలుడు. ఈ గీతంయొక్క ఆఖరిపాదాలు అనేకసార్లు పాడించుకున్నాడు, ఎమిల్ వాటిని బాగా జ్ఞాపకముంచుకోవడానికి. క్రిందటి సంవత్సరపు ప్రారంభ కార్యక్రమంగూర్చి అడిగి తెలిసికొన్నాడు. ఆసారి పోటీదార్లలో అధికసంఖ్యాకులు ముందుగా బయలుదేరి వెళ్ళారు. అటువంటప్పుడు ఏంచేస్తారు? మళ్ళీ అందర్నీ వెనక్కిపిలిచి ప్రారంభిస్తారా? లేదు. ఏమైనా పందెం ప్రారంభమయినట్టే భావి స్తారు. ఈ సంవత్సరం 2000 మంది పోటీదార్లున్నారు. అటువంటి మందమకొండను వెనక్కి మరల్చుట కష్టసాధ్యం.

ఇది అతని హృదయాన్ని చలింప జేసింది. సంవత్సరాదికి పూర్వం ఆ నగర వీధులలో కోలాహలం చూస్తే, పందెం నెమ్మదిగా జరిగేటట్టు తోచలేదు. పందెం ప్రారంభం రాత్రి 11.45 కి నిర్ణయమయింది.

ప్రారంభోపన్యాస మీయవలసిన నగరాధికారి మేయర్ జటోపెక్‌తో కర చాలనం చేయదలచాడు. జటోపెక్ అంగీకరించాడు. కాని త్వరగా 30 వరుసల పోటీదార్లలోనుంచి ప్రారంభపు వరుసలోకి వెళ్ళదలచాడు; ఒకవేళ అనుకున్నకంటె ముందు పందెం ప్రారంభమవుతుందేమోనని. అట్లాఅయితే అతని వేగం అతనికి కలిగించే ఉపయోగమేమిటి? ఎమిల్‌కి మంచి దూరదృష్టివుంది. మేయర్ ఉపన్య

సిస్తూంటేనే, ఎవరో తుపాకి ప్రేల్చేరు. చాలామంది పరుగెత్తేరు, అదే ప్రారంభపు సంజ్ఞ అని. ఎమిల్ సంశయించాడు. థెయిస్, (బెల్జియన్) హైపాలా, (ఫిన్) వెర్నియర్ (ఫ్రెంచి) పరుగు మొదలుపెట్టేరు. అటూ యిటూ చూసేడు. 2000 మందీ పరుగెత్తుతూన్నట్టు కనపడింది. ఇంక వేచివుండుట అనవసరం. వారి వెనుక తనూ పరుగెత్తేడు. వారిని కలుసుకో ప్రయత్నించేడు. 500 మీటర్లు వెళ్ళేసరికి, అందరికన్నా ముందున్నాడు.

అదొక వింతపందెం; సంవత్సరపు ఆఖరు రాత్రి; పైన సంగులీనే రాకెట్ల ప్రేలుడు; క్రింద కాగితాల తోరణాలు. వివిధజాతుల ప్రత్యేకపు పరిస్థితుల మధ్య ప్రత్యర్థుల నెదుర్కోవడం, ఎమిల్‌కు చాలా యిష్టం. స్పాలో మంచు, ఆల్జీరియాలో బురద, జ్ఞాపకం తెచ్చుకోవాలి. 300 మీటర్లవరకు, పోటీదార్లలో ప్రవీణులు అతనితో సరిగా పరుగెత్తేరు. కాని 800 మీటర్లు వెళ్ళేసరికి అతనికి దరిదాపున ఎవ్వరూ లేరు. ఏకాంతంగా పరుగెత్తుతున్నాడు.

రోడ్డు ప్రక్కల, కిటికీల దగ్గర, బాల్కనీలమీద, ప్రేక్షకులు చేరేరు. అక్కడ బ్రెజీలియన్లు, అర్జెంటీనియన్లు, ఉరుగ్వేన్లు ఉన్నారు. పందెం చూడుటకు అనేక మైళ్లు నడచివచ్చినవారున్నారు. అందులో ముఖ్యంగా జటోపెక్ పరుగెత్తుతూంటే చూచుటకువచ్చినవారే ఎక్కువ. అతని ప్రఖ్యాతి వారినందర్నీ అక్కడకు యీడ్చుకు వచ్చింది. జర్నలిస్టుల అంచనాప్రకారం 800,000 మంది ప్రేక్షకులున్నారు. అందరూ జటోపెక్‌ను హర్షధ్వానాలతో పలకరించారు. క్రొత్త సంవత్సరారంభం. యీ అద్భుత అనుభవంతో మెలివేసుకొని ప్రేక్షకుల హృదయాల నుప్పొంగ జేసింది. కలకాలం వారు యీ సంఘటనను తమ జీవితంలో గర్వంతో జ్ఞాపకముంచుకొనే అవకాశం కల్పించిందీ పోటీ.

55 రేడియోస్టేషన్లనుంచి రిపోర్టర్లు పందేన్ని వర్ణించారు. ఇప్పటికి జరిగిన అన్ని పందేలలోకిదే గొప్పది. కొందరు రిపోర్టర్లు కార్లమీద జటోపెక్‌తో కూడా వెళ్లేరు. అతని పరుగును వివరంగా వర్ణించగలుగుటకు.

జటోపెక్ గమ్యస్థానం మొదటచేరాడు. క్రొత్త రికార్డు సాధించాడు. అతని వేళ: 20 నిమిషాల 30.4 సెకండ్లు. మిహాలోవిచ్ యిదివరకుకంటె వేగంగా పరుగెత్తినా జటోపెక్‌కు 400 మీటర్ల వెనక ఉన్నాడు. అతని వేళ 21 నిమిషాల 32.7 సెకండ్లు. తర్వాత వచ్చినవారు: రాడ్రీగ్స్ (బ్రెజీల్), థెయిస్ (బెల్జియం), నిల్సన్ (స్వీడన్), మిరాండా (అర్జెంటైనా), ఐనో (జపాన్), టయిపాలా (ఫిన్లండు), కార్నేజో (ఉరుగ్వే), నావాస్ (చిలీ).

ప్రజలు యీ విజయాన్ని ఆనందంతో ఆహ్వానించారు. అతడు విజయపీఠం అధిష్టించాలి; ఉపన్యసించాలి; ఇంకా అందరూ గమ్యస్థానం చేరలేదు. చేరిందాకా వేచివుండాలి. పందెం పూర్తికాగానే దుస్తులు మార్చలేక పోవుటచేత జలుబు చేసింది. పెన్సిలిన్ తీసుకొని తరువాతి పందేనికి తయారయ్యాడు.

"ఏగజెటా స్పోర్టివా" పత్రిక 24 పేజీల ప్రత్యేక సంచికను ప్రచురించింది. అందులో 17 పేజీలు యీ పందేనికి సంబంధించినవే. ఇందులో ఎక్కువ పేజీలు జటోపెక్ ప్రశంసలతో నిండినవి. జటోపెక్ అతిథిగా వెళ్ళిన విందులకు కూడా రిపోర్టర్లు హాజరవుతూ వుండేవారు. ఆతనినిగూర్చి తెలిసికొనుటకు అందరికీ ఆత్రుతే. అతనితోపాటు ఫొటోగ్రాఫ్‌లో తమనుకూడా చూచుకొనుటకు ప్రతిపౌరునికీ ఆత్రుతే.

వాతావరణం మారింది. వర్షాలు పడ్డాయి. అయినా యెండలు చల్లబడలేదు. పేసెంబు స్టేడియంలో పందెం ప్రారంభమయ్యేవరకూ వర్షం పడుతూనే ఉంది. ఆ పందెం కృత్రిమకాంతిలో జరుగవలసి వుంది.

ఎమిల్ ప్రత్యర్థులు 3, 5 కిలోమీటర్ల పందేలలో పోటీ చేయవలచారు. అందులో వారికి విజయానికి ఎక్కువ అవకాశాలున్నాయని వారు భావించారు. మొదటిది అర్జంటయిన్ దేశస్థుడు ఘోరర్ గెలిచాడు. రెండవది జుగోస్లేవియా దేశస్థుడు మెహాలోవిచ్ గెలిచాడు. వారిద్దరూకూడా ఎమిల్ వేళలను మించలేదు. ఎమిల్ 10 కిలోమీటర్ల పందెములో పరుగెత్తుతూనే ఉన్నాడు. విజయుడయ్యాడు. నేలంతా బురదగా ఉండుటచేత 30 నిమిషాల 9 సెకండ్లకంటె తక్కువవేళలో పరుగెత్తలేక పోయినాడు. కాని ప్రేక్షకులను సంతుష్టి పరచుటకు చేయవలసినదంతా చేసినాడు. పశ్చిమజర్మనీనుంచి వచ్చిన ఎబర్లీన్ రెండవవాడుగాను, అర్జంటైనానుండి వచ్చిన సుఆరెజ్ మూడవవాడుగాను స్థానం చేరుకొన్నారు.

ఈ పందెంకూడా జటోపెక్‌కు అద్భుతమైన విజయంగా పరిణమించింది. బ్రెజీల్ పౌరులందరికీ జకోస్లోవేకియా పేరు యిప్పుడు బాగా తెలిసింది. ఎమిల్, యితర క్రీడల వీరులవలె జనసామాన్యమునకు అర్థంకాకుండా ప్రవర్తించే ప్రవృత్తి కలవాడు కాడు. ఎవరితోనైనా సంభాషించుటకు అత డిష్టపడును. సామాన్య ప్రజకు దూరముగా తిరిగే ఒక దివ్యవ్యక్తినని ఆతడు తన్ను భావించడు. తానొక సాధారణ వ్యక్తిననీ, కేవలము పట్టుదలవల్ల, మనోబలమువల్ల తనీ విజయాలను సాధించగలిగినానని అతడు అందరికీ స్పష్టపరుస్తాడు. తన దేశముగూర్చి, తన ప్రజలనుగూర్చిన ప్రశ్నలకు సంతోషముతో జవాబులిస్తూవుంటాడు. యూరప్ పటముతీసి, దానిలో జటోపెక్ స్వదేశమును చూపించి పిల్లలు ఆరనికి ఆనందము కలిగించేవాడు. ఎప్పటివలెనే విదేశములకు పందెముల సందర్భంలో వెళ్ళినప్పుడు అచ్చటి ప్రజలనుగూర్చి తెలుసుకొనుటకు ఆతడు కుతూహలపడేవాడు. ఎప్పటివలెనే యీసారికూడా యీ దేశమునకు పందెముల పోటీలో విజయముకొరకే కాక, ప్రపంచములోని ప్రజలందరిలో పరస్పర మైత్రిని పెంపొందించుటకు రాయబారిగా వెళ్ళినట్లు, అతడు భావించాడు.

# ఎమిల్ జటోపెక్ - పరుగు, శిక్షణపద్ధతులు

ఈ పుస్తకంలో జటోపెక్ ట్రయినింగు పద్ధతులను అనేకసార్లు చర్చించుట జరిగింది. ఈ ఆఖరు అధ్యాయంలో యీ పద్ధతులు పూర్తిగా పరిశీలించబడినవి. ఇతర పరుగు పందెగాండ్రు యీ పద్ధతులను అనుసరించదలచుకుంటే, యీ పరిశీలన ఉపయోగించవచ్చును.

అద్భుతమైన ఫలితాలను సంపాదించుటకు జటోపెక్ పద్ధతులే కేవలం ఫలప్రదం అనుకోరాదు. ఇతర పద్ధతులను ఉపయోగించి అద్భుత ఫలితాలను పొందినవారు లేక పోలేదు. స్వీడన్‌వారు "ఫాస్టులెక్" (ఆడుతూ పరుగెత్తుట) పద్ధతిని కనిపెట్టినారు. దానివల్ల అద్భుత ప్రదర్శనాలు యివ్వగలిగారు. గుండర్ హేగ్ యీ పద్ధతికి ఉత్తమ ప్రతినిధి. అతడీనాడు చాలా ప్రపంచ రికార్డులను సాధించాడు. అందులో ముఖ్యమైనవి 5000 మీటర్లు, ఒక మైలు పందెపు రికార్డులు.

స్వీడిష్, జటోపెక్ పద్ధతులలో 'విశ్రాంతి' పద్ధతి ఉపయోగింప బడుతుంది. ఈ పద్ధతి ప్రకారం కొన్నిదూరాలు, అనేకసార్లు పరుగెత్తుట, తర్వాత విశ్రాంతి.

తక్కువ దూరాలు పరుగెత్తి, వేగం సాధించవచ్చు. ఈ దూరాలు ఎక్కువ సార్లు పరుగెత్తి, ఓర్వగలశక్తిని పెంపొందించుకోవచ్చు.

అయితే, స్వీడిష్ పద్ధతికీ, జటోపెక్ పద్ధతికీ గల భేదమేమిటి ?

స్వీడిష్ పద్ధతి అడవులలో, మెత్తని ప్రదేశంలో ఉపయోగిస్తుంది. వేగం, పరుగుదూరం, సర్దుకోవచ్చు. ట్రెయినింగులో ఎక్కువగా అలసిపోకూడదు. అలా గయితే పందెంలో ఫలితం అనుమానమయిపోతుంది.

అడవుల ట్రెయినింగయిపోయిన తర్వాత, పందెపుమార్గంలో అప్పుడప్పుడు పరుగెత్తుతారు.

జటోపెక్ తన ట్రెయినింగు దూరాలు, ట్రాక్‌మీదే పరుగెత్తుతాడు. పల్లె ప్రదేశాలలోను, అడవులలోను పరుగెత్తుతాడు. అతని పద్ధతిలో వేగానికి ప్రాధాన్యం లేదు. 200, 400 మీటర్లు పరుగెత్తుటకు అవసరమైన వేళలను ముందు నిర్ణయించుకుంటాడు. 5000 మీటర్లు 14 నిమిషాల 10 సెకండ్లలో పూర్తిచేయాలంటే, 200 మీటర్లు 34 సెకండ్లలో, 400 మీటర్లు 68 సెకండ్లలో పూర్తిచేయాలి.

ట్రెయినింగులో, వేగానికి ప్రాధాన్యమిచ్చేటట్టయితే, వేళల లెక్క వేరు. పరుగులసంఖ్య తగ్గుతుంది.

200 మీటర్ల విశ్రాంతులు వేగపు నడకలతో గడుపుతాడు, ఎమిల్. తరవాత పందెపువేగాన్ని అనుసరిస్తాడు. విశ్రాంతులలో, నడకవేగాన్ని అవలంబిస్తారు కొందరు. కాని, ఎమిల్ వేగపుపద్ధతినే యిష్టపడతాడు.

ఇంక యీ పద్ధతులలో భేదాలను యీ విధంగా వివరించవచ్చు:

ఫట్లెలెక్ పద్ధతిలో ట్రెయినింగు మీదకంటే, అసలు పందెంమీదనే ఎక్కువ శ్రద్ధ. ట్రెయినింగులో ఎక్కువశక్తిని వినియోగిస్తే అసలు పందేనికి శక్తి తక్కువయి పోతుంది.

జటోపెక్ పద్ధతి దీనికి పూర్తిగా వ్యతిరేకం. ట్రెయినింగులో ఎక్కువశ్రద్ధ చూపిస్తే, అసలు పందెం సులభమవుతుంది. ట్రెయినింగువల్ల మనశక్తి వృద్ధిచెందు తుంది.

ఏ పద్ధతి మంచిదనే విషయం నిర్ణయించుట కష్టం. రెండు పద్ధతులూ మంచి ఫలితాలనిచ్చాయి. ఫట్లెలెక్ పద్ధతి, అన్నిరకాల ఉత్తమ పందెగాండ్రను స్వీడన్‌లో తయారుచేసింది. జెకోస్లావేకియాలో జటోపెక్ పద్ధతికూడా అద్భుతమైన పందెగాండ్రను తయారుచేసింది. అందులో ఒకడు, 1000 మీటర్ల ప్రపంచ రికార్డు సాధకుడు స్టేనిస్లావ్ జంగ్వర్త్. ఇతరదేశాలలో చాలామంది పందెగాండ్రు, ముఖ్యంగా ఎక్కువమంది సోవియట్‌వారు, జటోపెక్ పద్ధతినే అవలంబిస్తారు. ఆస్ట్రియన్ హెమోన్‌ది జటోపెక్ పద్ధతి.

రెండుపద్ధతుల లోపాలు, లాభాలు జాగ్రత్తగా పరిశీలించాలి. ఫట్లెలెక్ పద్ధతిలో, మెత్తని ప్రదేశంలో ట్రెయినింగుకావాలి. దానివల్ల కాళ్లకు బాధకలుగదు. ట్రెయినింగు ఎక్కువసేపు చేయవచ్చును. దానిలో లోపం ఏమంటే, పందెగాని మనోబలం శిక్షణలోనికి తీసుకొని వచ్చుటకు వీలులేదు.

జటోపెక్ పద్ధతిలో మనోబలానికి ఎక్కువ ప్రాధాన్యముంది, ఎక్కువ అవకాశముంది. శరీరం ఆరోగ్యంగా ఉంటే, ట్రెయినింగుకు అలవడితే, ఎంత అలసటనైనా ఓర్వగలదు. జటోపెక్‌కు శరీరంమీద అపరిమితమైన స్వాధీనం వున్నది. అందుచేతనే ఎంత కఠినమైన పనినైనా శరీరంచేత చేయించగలడు.

జటోపెక్ పద్ధతిలో లోపం: 'ట్రాక్' మీదనే ఎప్పుడూ ట్రెయినింగు. దీని వల్ల కాళ్లు బాధపడతాయి. జటోపెక్ ఎప్పుడూ కీళ్ళనొప్పులతో బాధపడేవాడు; కండరాలు నొప్పిపెట్టేవి. గట్టినేలమీద ఎక్కువగా పరుగెత్తుటవల్ల కలిగే ప్రమాదాలివి.

అడవి ప్రదేశం దూరంగా ఉంటే, అక్కడ ట్రెయినింగు అసాధ్యం కదా! ప్రేగ్ పరిసరాల్లోని అటవీ ప్రదేశంలోనే గట్టిగా ఉంటుంది. అందులో ట్రెయి నింగు కావడం అసంభవం. ట్రెయినింగు స్థలానికి ఒక గంట, రోజూ, ట్రెయిన్ మీద ప్రయాణం చేయుట సాధారణ కార్మికునికి సాధ్యంకాదు. జటోపెక్‌కుకూడా అంతే.

జటోపెక్ అడవులలో ట్రెయినింగయితే బాగానే ఉంటుంది. కాళ్లబాధ లుండవు. అతని శక్తికూడా అధికమవుతుంది.

అయితే అతడెందుకలా చేయడు ?

ప్రతిరోజూ తనకున్న పని పూర్తిచేయుటకు కష్టమయిపోతూవున్న సెకండ్లలో 10 భాగాలు పోయినా, యీ పద్ధతి తప్పదు.

సంఘ జీవులం కాబట్టి అనేక వ్యక్తులతో వ్యవహరించవలసి ఉంది. క్రీడలకు జీవితంలో ద్వితీయస్థానం మాత్రమే. ఆ విద్యుక్తాలను నెరవేర్చుటకంటె, కొన్ని సెకండ్లను ఆదాచేయుట ముఖ్యం కాదు.

జటోపెక్ తన పద్ధతిని ఎలా అనుసరిస్తాడు ?

జటోపెక్ ప్రదర్శనాలన్నిటికీ మూలం, అతని ట్రెయినింగు. గాలికాని, వానకాని, మంచుగాని, ఎండగాని, చలిగాని, సంవత్సరం పొడుగునా, ఒక్క రోజైనా మానకుండా, ట్రెయినింగవుతాడు. పల్లెప్రదేశాలకు వెళ్ళినప్పుడు అడవి ప్రదేశాలలోనే అతని ట్రెయినింగు. పొలాల్లో, పొదలలో, రోడ్లమీద పరుగెత్తుతాడు. పట్నంలో ఉంటే - యిప్పుడు ప్రేగ్‌లోనే స్థిరనివాసం -ఏ ఋతువులోనైనా సరే 'ట్రాక్'మీదే ట్రెయినింగు. వాతావరణం బాగుండకపోతే, మిలిటరీజోళ్లు వేసికుంటాడు. లేకపోతే నేలస్థితినిబట్టి టెన్నిసుజోళ్లు, 'స్నీకర్సు'

సాధారణంగా 5 × 200 మీటర్లు పరుగెత్తుతాడు; తర్వాత 20 × 400 మీటర్లు. తర్వాత 5 × 200 మీటర్లు; అన్నీ పందెపువేగంతోనే. కాని, ఋతువునుబట్టి పరుగుల దూరం మారుతూంటుంది. అలాగే వేగంకూడా. శీతకాలంలో వేగం తగ్గుతుంది. 200 మీటర్లు ఎక్కువ వేగంతో పరుగెత్తాడు.

ఒకసారి 400 మీటర్ల దూరాలు 60 సార్లు జటోపెక్ పరుగెత్తుట, నేనొక సారిచూచాను. ఆ దినంగా 24 కిలోమీటర్ల పందెపు వేగంతో పరుగెత్తేదంటే, అదెంత కఠినమైన కార్యమో ఊహించుకోవాలి. మధ్యను నెమ్మదిగా పరుగెత్తే 200 మీటర్లు కలుపుకుంటే మొత్తందూరం 36 కిలోమీటర్లు. ఒక్క ట్రెయినింగులోనే యింత దూరం. అయితే ప్రతిసారి యిలా చేయడు. నెలకు రెండు మూడు సార్లు మాత్రమే. ఆరేడేమీ 'జిమ్నాస్టిక్సు' చేయడు.

ట్రెయినింగు కాలం విషయమై అతనికి అతి సున్నితమైన అభిప్రాయా లున్నాయి. అతని ట్రెయినింగుకు అతనే జడ్జి.

పందెం కాలంవరకూ ట్రెయినింగువదలడు. కఠినమైన పందెం అయితే, చివరి ఒకటి రెండు రోజులు కొంచెం విశ్రాంతి తీసుకుంటాడు.

పందెంరోజున, ప్రారంభానికి 4,5 గంటలముందు భోజనం చేస్తాడు. అవయవాలు స్వాధీనంలో ఉండుటకు, 1500 మీటర్లు పరుగెత్తుతాడు. 20, 30 నిమిషాల విశ్రాంతి తీసుకుంటాడు. పందెంముందు నెమ్మదిగా అటూయిటూ పచ్చికమీద పచారుచేస్తాడు.

పందెంలో, అలసట వచ్చినపుడు వేగం అధికంచేయుట అతనికొక అలవాటు. అతని వేగంలో యంత్రపురీతి లేదు. దూరాన్నుంచి ప్రేక్షకులకు కనబడక పోవచ్చు. వేగం మారుతూ ఉంటుంది. అతని ప్రత్యర్థులు యీ విషయం బాగా చెప్పగలరు.

పందెం అయిపోయిన తర్వాత పచ్చికమీద పచారు చేస్తాడు. అదే సేదదీర్చు కోవడం. ఆ తర్వాత స్నానం చేస్తాడు; వళ్ళంతా బాగా రుద్దుతాడు. మళ్లీ మరుసటి దినం ట్రెయినింగుకు తయారు.

ఆటల డాక్టర్లు డాక్టర్ హర్నాక్, డాక్టర్ స్క్రీమిడ్, ఎమిల్ శారీరక స్థితినిగూర్చి ఇలాగన్నారు : శరీర ఆరోగ్యం బాగుంది. అతని ఊపిరితిత్తులు, గుండె కాయ, మామూలుగా దూరపుపరుగు పరుగెత్తేవారికి ఉండే సైజులోనే ఉన్నాయి. అతని అవయవాలలో నరాలు ఒక ప్రత్యేకలక్షణం కలవిగా ఉండవచ్చు. ఎంత ప్రయాస కలిగించే పందెంలో పాల్గొన్నా అతనికి ఎక్కువ విశ్రాంతి అవసరంలేదు."

'స్టైల్' విషయంచూస్తే ఉత్తరాదివారికున్న అందంలేదు; స్టైల్ కు మెరుగు పెట్టడం అదనపు ప్రయోజనాన్ని యిస్తుందని అతనికి నమ్మకంలేదు. దానివల్ల అతని వేగానికి అంతరాయమని అతని అభిప్రాయం.

జటోపెక్ పద్ధతిని అవలంబించే దెవరు ? శాస్త్రవాదులు, యీ పద్ధతి గుర్తాల ట్రెయినింగు కుపయోగిస్తుంటన్నారు. ఏమైతేనేం, ప్రత్యేకపు యోగ్యతలేమీ లేకుండా, జటోపెక్ ఒలింపిక్ విజయాలను సాధించాడు; ప్రపంచ రికార్డులను సాధించాడు.

విజయానికి అనేకమార్గా లున్నాయని, అతనే ఒప్పుకుంటాడు. కాని, ట్రెయి నింగు, తీవ్రమైన ట్రెయినింగ్, అంతకూమూలం అంటాడు జటోపెక్.

విశ్రాంతి ట్రెయినింగు పద్ధతినిగూర్చి మన నిర్ణయాలు ఏమిటి ?

ట్రెయినింగుకు ఎంత దూరకునేది ప్రధానవిషయం కాదు. ముఖ్యవిషయం, వేగం. నిర్ణయమైన దూరాలు ఎన్నిసార్లు పరుగెత్తుటనేది, ఒక విషయం. తర్వాత, విశ్రాంతియొక్క స్వభావం. ఒక స్ప్రింటరు, 100 మీటర్లు ట్రెయినింగు దూరంగా నిర్ణయించుకోవచ్చు. 2, 3 సార్లు ఆ దూరం పరుగెత్తుతాడు: అతివేగంతో పరుగెత్తు తాడు.

బహుదూరపు పరుగు పందెగాడు 100 మీటర్లు కొంచెం నెమ్మదిగా పరుగెత్తు తాడు. కాని 20-100 సార్లు పరుగెత్తుతాడు.

ప్రపంచ రికార్డులకొరకు ట్రెయినింగయ్యేవా రెవ్వరూ జటోపెక్ పద్ధతి నవలంబించకూడదు. కాని అతని పట్టుదల, ట్రెయినింగంటే ఆసక్తి అలవరచుకోవాలి. దానినుండే అనేకవిషయాలు నేర్చుకోవచ్చు.

నిద్ర : 7-9 ఘంటలు నిద్రపోవాలి. పందెంముందు 10 ఘంటలు నిద్రపోవాలి. జటోపెక్ రాత్రి 9-10 గంటల మధ్య నిద్రపోతాడు; ప్రొద్దున్న 5, 6 కు మధ్య లేస్తాడు.

భోజనం : జటోపెక్ అన్ని వస్తువులు తింటాడు; ముఖ్యంగా పళ్లు, తీపి వస్తు వులు, నిమ్మరసం అతనికి ఎక్కువ యిష్టం. అప్పుడప్పుడు భోజనంతో 'బీరు' తీసు కుంటాడు.

పని : జటోపెక్ తన పనిని 7 గంటలకు ప్రారంభిస్తాడు. 8-9 గంటలు పని చేస్తాడు. 'డ్యూటీ'లో లేనప్పుడు ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం ట్రెయి నింగవుతాడు. పొగ, త్రాగుడు అసలు నిషేధం.

పని లేనప్పుడు, ఎమిల్ చదువుతాడు. సాయంత్రాలు అతను, డానా థియేటర్‌కి లేకపోతే సంగీత కచ్చేరీకి పోతారు. రోజులో కొంతకాలం తనకు, వచ్చే ఉత్తరాలకు జవాబులు వ్రాస్తూ కాలంగడుపుతాడు. క్రొత్త భాషలను నేర్చుకుంటూంటాడు. ప్రపంచ పరిస్థితులనుగూర్చి చర్చిస్తూంటాడు.

ఈ విషయంలో యువకులు జటోపెక్‌ను ఆదర్శంగా పెట్టుకోవచ్చు. శారీరక అభివృద్ధితోపాటు, మానసికాభివృద్ధికూడా అవసరం. అప్పుడే మానవుడు సక్రమంగా అభివృద్ధిగాంచగలడు.

# ప్రపంచ రికార్డుకు జటోపెక్ వేసినబాట

| సం. | వ. | 800మీ. | 1000మీ. | 1500మీ. | 2000మీ. | 3000మీ. | 5000మీ. | 10,000మీ. |
|---|---|---|---|---|---|---|---|---|
| 1941 | 19 | | | 4 : 20.3 | | | | |
| 1942 | 20 | 2 : 35.8 | | 4 : 13.9 | | 9 : 12.2 | 16 : 25 | |
| 1943 | 21 | 1 : 58.7 | 2 : 35.8 | 4 : 01.6 | | 8 : 56 | 15 : 26.6 | |
| 1944 | 22 | 1 : 59.8 | 2 : 37.5 | 3 . 59.5 | 5 : 33.4 | 8 : 34 | 14 : 55 | |
| 1945 | 23 | | 2 : 34.6 | 4 : 01.4 | 5 : 38.6 | 8 : 33.4 | 14 : 50.8 | |
| 1946 | 24 | | 2 : 37.5 | 3 : 57.6 | 5 : 30.4 | 8 : 21 | 14 : 25.8 | |
| 1947 | 25 | | 2 : 33.8 | 3 : 52.8 | 5 : 20.5 | 8 : 08.1 | 14 : 08.2 | |
| 1948 | 26 | | | | | 8 : 07.8 | 14 : 10 | 29 : 37 |
| 1949 | 27 | | | 3 : 57 | | 8 : 19.2 | 14 : 10.2 | 29 : 21.2 |
| 1950 | 28 | | | | | 8 : 16 | 14 : 03 | 29 : 02.6 |

| | | 3000మీ. | 5000మీ. | 10,000మీ. | 15,000మీ. | 10మైళ్లు | 20మై. | 1 గంట |
|---|---|---|---|---|---|---|---|---|
| 1951 | 29 | 8:17.6 | 14:11 | 29:29.8 | 44:54.6 | 48.12 | 59.51.8 | 20,052మీ |
| 1952 | 30 | | 14:06.4 | 29:17 | | | | |
| 1953 | 31 | | 14:03 | 29:01.6 | | | | |

| | | 15 మైళ్ళు | 25,000 మీ. | 30,000 మీ. | మేరథాన్ |
|---|---|---|---|---|---|
| 1952 | 30 | 1 : 16 : 26.4 | 1 : 19 : 11.8 | 1 : 35 : 23.8 | 2 : 23 : 03.2 |

| | | 6 మైళ్ళు |
|---|---|---|
| 1953 | 31 | 28 : 08.4 |

